# ఛత్రారామం


చైనీస్ రచన :

మేరియా యెన్

ఆంగ్ల అనుసరణ :

మేరియాయెన్ - రిచ్చార్డ్ యం. మక్కార్థీ

తెలుగు అనువాదం :

మల్లాది నరసింహశాస్త్రి





యువకర్షక ప్రచురణలు

విజయవాడ-2

# తొలి పలుకు

ఈ పుస్తకంలోని చాలా భాగాలు హాంగ్‌కాంగ్ లోని యూనియన్ ప్రెస్ వారు ప్రచురించిన "అరుణ పతాక చ్ఛాయలో విశ్వవిద్యాలయ జీవితం" అనే చైనీస్ గ్రంథంలో యితఃపూర్వము పొందుపరచబడినవి. ప్రజా ప్రభుత్వం ఆధిపత్యంలోగల ఒక విశ్వవిద్యాలయ స్థితిగతులు ఎట్లావున్నాయో, మాతృదేశమునకు వెలుపలగల చైనీయు లకు తెలియజేయుటకే యీ గ్రంథం వ్రాయబడింది. చైనా భాష తెలియనివారుకూడా యీ గ్రంథంలోని విషయాలు శ్రద్ధగా తెలుసుకొనదగినవని కొందరు విదేశమిత్రులుసూచిం చారు. చైనీయులుగాని పాఠకులు ఆ యా సంఘటనలను తెలుసుకునేందుకు వీలుగా కొన్ని వివరణలనుగూడా చేర్చ వలసిందని వీరు సలహాయిచ్చారు. ఈ మిత్రులలో ఒకరైన రిచ్చర్డ్ యం. మెకార్థీ ఈకథను విస్తృతపరచి ఇంగ్లీషులో తిరిగి వ్రాయుటకు నాకు సహాయం చేశారు. వీరికి, మూల ప్రతిని తర్జుమా చేసినవారికి, సహాయం, సలహాలను అంద జేసిన యితర మిత్రులకీ కృతజ్ఞత తెలుపుకుంటున్నాను. అయితే, యీ గ్రంథంలో వెలిబుచ్చిన అభిప్రాయము లన్నింటికి నాదే పూర్తి బాధ్యతయని మనవి చేస్తున్నాను.

విదేశ పాఠకులకోసం యీ గ్రంథంలో కొన్ని నూతన అధ్యాయాలు చేర్చాము. మావ్‌సే-టూంగ్ నూతన ప్రభుత్వ ఆధిపత్యంక్రింద మా విశ్వవిద్యాలయ పరి స్థితులు ఎట్లా ఉన్నదీ, యుద్ధానంతరం విద్యార్థులు ఏ సమ

స్యలకు ఎదుర్కోవలసి వచ్చిందీ తెలియజేసే నివేదికగా యీ గ్రంథం రూపందాల్చింది. కమ్యూనిస్టులకు ఆనాడు విద్యార్థులు చాలా అవసరం. ఈ విషయం ఎంత ముఖ్యమైనదీ వారి అగమనానంతరం మాత్రమే మేము గ్రహింపగలిగాము.

ఈ గ్రంథంలో ఉన్న విషయాలు ఉన్నట్టుగా వ్రాయడానికి ప్రయత్నించాను. భద్రతకోసం కొందరు వ్యక్తులపేర్లు మార్చాను. అది మినహా మిగతా కథ యావత్తూ అతియథార్థమైనది. 1948 లో పెకింగ్‌లో చదువుతున్న విద్యార్థులలో చాలమంది, చైనీస్ కమ్యూనిస్టులు నరకంలో ప్రవేశించడానికి శాయశక్తులా కృషి చేసినవారే. వీరిలో కొందరు ఆశావాదులు. కొందరు భావిరాజకీయ పరిణామాలను ఆకళింపు చేసుకున్న అవకాశవాదులు. మరి కొందరు సుశిక్షితులైన ఆందోళనకారులు. వీరిని కమ్యూనిస్టు పార్టీ మా మధ్య పాదుకొలిపినట్లు మాకు ఆ తర్వాత తెలిసింది. చైనీస్ కమ్యూనిస్టులకు విద్యార్థులు సహాయం చేయడానికిగల కారణాలను పరిశీలించడానికిగాని, ఎవరినీ దూషించడానికిగాని నేను ప్రయత్నించ లేదు. చైనాలో జరిగిన సంఘటనలకు, యితర దేశాలలో జరిగిన సంఘటనలకు పోలికలు చూపడానికి నేను ప్రయత్నించలేదు. నేను మరో దేశం చూసిఎరుగను. చైనా విద్యార్థులు ఏ ఏ పరిస్థితులకు లోనైనదీ నివేదించటమే నా సంకల్పం. ఈ కృషిలోని మంచి చెడ్డలను నిర్ణయించవలసిన భారం పెద్దలకు వదులుతున్నాను.

— మేరియా యెన్.

# విషయసూచిక:

పాఠకునికి ........

ఈ మహానగరాన్ని పెకింగ్ అని పిలవటమా లేక పైపింగ్ అని పిలవటమా అనేది ఒక సమస్యగా తయారయింది. 1927 లో చైనీస్ రిపబ్లిక్ రాజధాని నాన్ కింగ్‌లో ఏర్పడే వరకూ, సామ్రాజ్యమునకు అనాది సిద్ధమైన రాజధానిని పెకింగ్ లేక 'ఉత్తరాదిరాజధాని' అని పిలుస్తూ ఉండేవారు. తర్వాత దీనిపేరు పైపింగ్ లేక 'ఉత్తరాదిశాంతి' అని మార్చారు.

1949 అక్టోబరు 1 వ తేదీన చైనీస్ కమ్యూనిష్టులు తమ ప్రజారిపబ్లిక్‌ను నెలకొల్పినప్పుడు, నగరానికి తిరిగి పూర్వపుపేరునే వాడేందుకు నిశ్చయించారు. కమ్యూనిష్టు ప్రభుత్వ పరిపాలనను గుర్తించని యితర దేశాలవారు, యిప్పటికీ ఈనగరాన్ని పైపింగ్ అనే పిలుస్తున్నారు. దాదాపు యిరవై సంవత్సరాలు యీ నగరానికి అధికార నామధేయం పైపింగ్ అయినప్పటికీ, అక్కడ పుట్టి పెరిగిన ప్రజలుమాత్రం పెకింగ్ అనే పాత పేరునే ఉపయోగించేవారు. పైపింగ్ అనే మాటతో వున్న వాక్యాలను ఉదహరించినప్పుడు తప్ప మిగతా గ్రంథమం దంతటా యీ నగరాన్ని పెకింగ్ అనే పేరుతోనే నేను వ్యవహరించాను. నికరంగా ఏదో ఒక పేరునే ఉపయోగించవలెననే ఉద్దేశ్యం తప్ప దీనికి వేరే ఏ విధమైన రాజకీయ కారణమూ లేదు.

---

1

# స్వాతంత్ర్యోదయ వేళ

తాను వరించిన ప్రియుని కౌగిలిలోనికి వెళ్ళబోయే రాత్రికి ముందురోజున, పెళ్లికూతురు స్థితి ఏవిధంగా ఉంటుంది?

1949 జనవరి ఆఖరిరోజు. ముతక జాకెట్టు, ముడతలు పడిన ప్యాంటు ధరించిన నేను, పెకింగులో పైటా ఆవరణలో మెయిన్ హాలుకు వెలుపల సైకిలుకు ఆనుకుని నిలబడి గోడను అంటించి ఉన్న ప్రకటన చదువుతూ ఉన్నాను. ఈ దుస్తులలో ఉన్న నేను పెళ్లికూతురుతో ఎట్లా పోల్చుకోగలను? కాని ఒకటిమాత్రం చెప్పగలను. కొత్త పెళ్లికూతురు పొందే ఆవేశము, ఆశ కొంతవరకు నేను పొందాను. నేనూ, నాతో పాటు మిగతా విద్యార్థి కామ్రేడ్స్ నూతన జీవితంలోకి అడుగిడబోతున్నాము; రేపటి రోజున పెకింగ్ నగరం ప్రజా విమోచన సైన్యమునకు స్వాగతం యివ్వబోతున్నది.

దీనికోసం మేము ఎంతకాలంగానో వేచియున్నాము-ఎన్నో సంవత్సరాలుగా ఆశతో యీ శుభసంఘటన కోసం ఉవ్విళ్లూరుతూ ఉన్నాము. అంతర్యుద్ధం మాపాలిటికి తెచ్చిన ఆకలిని, అశాంతిని ధైర్యంతో ఎదుర్కొని, ఎన్నోసంవత్సరాల నుంచి మా విశ్వవిద్యాలయమును సజీవంగా ఉంచేందుకు కృషి చేశాము. దొంగచాటుగా మాకు అందజేయబడే చట్ట విరుద్ధమైన కరపత్రాలను చదువుతూ మా విశ్వాసమును

ఉద్దీపన చేసుకుంటూవచ్చాము. అనేక సంవత్సరాలు గుసగుసలతోను నిరీక్షణతోను గడచిపోయాయి. ఏ ప్రభుత్వములో నయితే మాకునమ్మకము ఆశ అనేవి లేకుండా పోయాయో; ఆ ప్రభుత్వ రక్షణకు నిల్చిన సైనికుల ఫిరంగులకు ఎదురుగా, నాయకుల ఆదేశానుసారం మేము తరలి వెళ్ళవలసివచ్చేది. కొమింటాంగ్ ప్రభుత్వ చిహ్నమైన నీలి ఆకాశము, తెల్లని సూర్యుడు గుర్తుగల టోపీలను ధరించిన సైనికులు వీధులు కాపుకాస్తూ ఉన్నారు. కాని రేపటిరోజున యీ సైనికుల తుపాకులను తొలగించి వేయడానికి ప్రజావిమోచన సైన్యం తరలి వస్తోంది.

రేపటిరోజున ఉత్సాహంతో ఎలుగెత్తి జై జై ధ్వానాలు చేస్తాము. విజయవిహారంతో వస్తున్న మావ్ సేటుంగ్ సైనికులు ఆహారాన్ని, శాంతిని మాత్రమేకాదు; నవచైనా నిర్మాణ మనెడు ఆశాజ్యోతిని కూడా తమవెంట తీసుకుని వస్తున్నారు. విమోచన ప్రజానీకమునుంచి ఉద్భవించే మహత్తర శక్తితో చిన్నా పెద్దా తలలెత్తుకుని నిలబడగలుగుతారు; ప్రపంచంలో తమ ఉనికిని గురించి గర్వంగా చెప్పుకోగలుగుతారు.

పైటాలోని మా స్థాన మెక్కడ? ఎప్పటి విధంగా ముందు వరుసలోనే మేము నిలబడతాము. మా ప్రజలను మేము నడిపిస్తాము—చైనా దేశానికి నాయకుల ఆవశ్యకత కలుగుతోంది. క్రితం సంవత్సరం అనుభవించిన బాధలకు తట్టుకుని యిప్పుడు నాయకులం కాబోతున్నామనే విషయం ఆశ్చర్యమేననిపిస్తుంది. మా దేశాన్ని తీర్చిదిద్దుకోగల చావ, సామర్థ్యము మా తరం వారికి ఎంతవరకు ఉన్నాయో యిందు

మూలంగా ఋజువు అవుతుంది. దొంగచాటుగా చేరవేయ బడిన కరపత్రాల్లో—నాయకత్వం వహించడానికి స్త్రీలు గూడా పాల్గొనే అవకాశం యివ్వబడుతోందని హామీ యిచ్చారు.

రేపటిరోజున ప్రవేశించనున్న విమోచన సైన్యాన్ని గురించి ప్రకటన పత్రంద్వారా నేను అనేక విషయాలు తెలుసుకున్నాను. పశ్చిమద్వారం: హ్సిచిహ్‌మెన్‌ద్వారా మొదటి జట్టునగరంలో ప్రవేశిస్తుంది. ప్రజావిమోచన సైన్యం ప్రవేశించి ఆయుధాలను తీసుకునేంతవరకూ నగరభద్రతను చూడవలసిన బాధ్యత జాతీయ సైన్యానిది. ఇలాంటి లాంచనాలను మేము ఎప్పుడూ ఆశించలేదు. ఫిరంగిగుళ్ల మధ్య వీరోచితమైన హింసాకాండ జరిగి నగరపుగోడలపైన ఎర్రజండాలను ఎగరవేయటం గనక సంభవిస్తే చాలా బాగుండే దనిపించింది.

"ఏయ్! ఆ ప్రకటనను ఎన్నిసార్లు చదువదలచుకున్నావ్. ఊరికే కళ్లతో కబళించి వేస్తున్నావే?"—ఈ మాటలు అన్నది నాసమపాఠి ఫాంగ్. అతనిలో ఉత్సాహం వెల్లివిరిసిపోతోంది. దొంగచాటు వార్తాపత్రికలను అతను వ్రాస్తూ ఉంటాడని నాకు తెలుసును. అతను పార్టీసభ్యుడని గూడా వదంతి ఉన్నది.

"మహత్తరమైన యీ దినంకోసమే మనం ఎదురు చూస్తూ ఉన్నాము..." నా సైకిలు హాండిల్‌బార్ మీద చేతిని ఆనించి అతను యింకా యిట్లా అన్నాడు: "చూడు కామ్రేడ్! నాతోగూడా నువ్వురా. రేపటి ఉత్సవాలకోసం మన మిత్రు

లంతా పురుషుల పడకటెంట్లో చేరి జండాలు తయారు చేస్తు న్నారు."

"జాతీయసైనికులు తొలగిపోయేలోపల – యీ ఆఖరి రాత్రి ఏం సంఘటనలు జరుగుతాయోనని మానాన్న చాలా ఆరాటపడుతున్నాడు. ఈరాత్రి పాఠశాలలో పడుకోవద్దని, ఇంటికి వచ్చెయ్యమని చెప్పాడు."

"ఏవిధమైన సంఘటనలు జరుగవు. తమపని అయి పోయిందని నేషనలిస్టులకు తెలుసు. రాబోతున్న మనసైన్యా లతో వారు సక్రమంగా ప్రవర్తించక తప్పదు. అంతేగాకుండా నిర్ణీతప్రాంతాలలో పోలీసులు డ్యూటీలో ఉండాలని హుకుం జారీఅయింది. రా మరి...మీాస్త్రీలు ఎప్పుడూ అంతే! ప్రతి దానికి ప్రతిఘటించుకోవాలని చూస్తూంటారు." అని ధైర్యం చెప్పాడు ఫాంగ్.

సైకిలెక్కి అతనిని అనుసరించాను. నేను వచ్చితీరాలని పట్టుపట్టినందుకు అతనికి మనస్సులో కృతజ్ఞత తెల్పుకున్నాను. పురుషుల పడకటెంట్లో దాదాపు ముప్ఫైమంది విద్యార్థులు ఉన్నారు. నానా గందరగోళంగాను ఉంది. ప్రతివ్యక్తీ ఏదో ఒక పనిలో నిమగ్నుడై యున్నాడు. కొంతమంది పోస్టరు గీస్తున్నారు, కొందరు నినాదాలు వ్రాస్తున్నారు. జండాకాగి తాలు కొందరు కర్రలకు అంటిస్తున్నారు.

"జరగబోతున్న మహోత్సవానికి యిలాంటి చిన్న జెండాలా" అంటూ ఒక పతాకను అందుకున్నాను. దాని మీాద "ప్రజావిమోచన సైన్యానికి స్వాగతము" అని వ్రాసి ఉన్నది. దానిని నేను ఎరిగున్న ఒక బాలికవైపు ఊగించాను.

"మన నాయకుడు మావ్ సేటుంగుకు పదివేల సంవత్స రాలు" అని వ్రాసిఉన్న ఒక పతాకను ఆమె నావైపునకు తిప్పింది. తన ప్రక్కన నాకు కొంతజాగా చూపింది. నాచేతికి ఒక కత్తెర యిచ్చింది.

బాలురంతా గుమికూడినవైపు చూపిస్తూ ఆమె యిలా అంది. "ఇదుగో, అక్కడ సన్నటిముఖంతో పొడుగాటి కుర్రాడు కనిపిస్తున్నాడే, అతను ట్సింగ్ముహా నుండి యీరోజు మధ్యాహ్నం ప్రతిబంధకాలు తప్పించుకుని యిక్కడికివచ్చాడు. రేపటి కార్యకలాపాలకు మనకుసహాయంచేయడానికివచ్చాడు" ట్సింగ్ముహా విశ్వవిద్యాలయం నగరానికి వెలుపల ఉంది. డిసెంబర్లో పెకింగ్ ముట్టడి ప్రారంభంకాగానే యిది విమోచన సాధించింది. ఇతను విమోచనకారులను ప్రత్యక్షంగా చూచినవాడు. అతను చెప్పేది వినేందుకు మేమంతా నిశ్శబ్దంగా ఉన్నాము.

"విశ్వవిద్యాలయ ఆవరణచుట్టూ తుపాకి ప్రేలుళ్ళతో మేమంతా భయభ్రాంతులమైనమాట నిజం. ఆరోజు వచ్చింది. పాతశాలభవనం చెక్కుచెదరలేదు. ప్రజావిమోచన సైన్యం మమ్మల్ని సోదరులవలె చూచింది. వారిలో చాలావరకు గ్రామాలకు చెందిన సామాన్యబాలురు. వాళ్ళు మంచిఆరోగ్యం గానూ, దృఢంగానూ ఉన్నారు. ఎంతోనమ్రత, స్నేహసౌశీల్యాలు కలిగినవారు. సైన్యవిజ్ఞానదళం మాకోసం కొన్ని నాటకాలను ప్రదర్శించింది. సైనికులు మాకు ఆహారాల్ని అందజేశారు. అన్నివిధాల సహాయంచేశారు. కొంచెం ఓపికపడితే మీరే స్వయంగా అన్నివిషయాలు తెలుసుకుంటారు. ఉండండి,

మీకోతమాషాచూపిస్తాను" అంటూ జేబులు తడిమి కొన్ని అందంగా ముద్రించిన కాగితాలను బయటకు తీశాడు.

"జెన్‌మిన్‌పియావో- ప్రజాబ్యాంక్ నోట్లు!" ఆ డబ్బును అందుకోవడానికి చేతులు పైకిలేచాయి.

"ఇది మొదలు మనం ఉపయోగించేది యీ డబ్బే." అతను చెప్పే ప్రతిమాట ఎంతో ఆసక్తితో మేము వింటున్నాము. అతను మరింత ఉత్సాహంతో "ఈ నోట్లను చూడండి; ఆ ముసలి పెద్దన్న వికృతముఖంతో కూడిన టాయిలెట్ కాగితానికి బదులుగా యీ నోట్లమీద రైళ్లు, ఉత్పత్తి పరికరాలు ఎంత అందంగా చిత్రించబడ్డాయో, ఇవన్నీ నిజంగా ప్రజలవే."

జండాలను తయారుచేయడం పూర్తికాగానే, చాలా కాలంగా నిషేధంలో ఉన్న పాటలను మేము పాడటం మొదలు పెట్టాము. ఈ పాటలను రేపటిరోజున సోల్జర్ కామ్రేడ్స్‌ని ఆహ్వానిస్తూ పాడాలి. ఇప్పటికే చాలా పొద్దుపోయింది. మా తండ్రి నన్నుగురించి ఆదుర్దా చెందటం నాకు ఇష్టంలేదు. అందువల్ల సెలవు తీసుకుని సైకిలెక్కి నిశ్శబ్దంగాఉన్న వీధుల గుండా ఇంటిముఖం పట్టాను.

నగరం యావత్తూ ఎదురుచూస్తూ ఉన్నది. మేమంతా మరుసటిరోజు కొరకు ఎదురుచూస్తున్నాము. ఒక సంవత్సరం క్రితం యీరోజు ఎంతో దూరాన ఉన్నట్లు అనిపించింది. మరీ బాధాకరమైన నిరీక్షణ మరీ ముందుఉన్నట్లు అప్పుడు మాకు తెలుసును. నేను యీ విషయంఎట్లా మరువగలను ? యుద్ధం దగ్గర పడినకొద్దీ ఆకలిని, చలిని ఓర్చుకోవలసి ఉంటుందనీ, కొంతమంది అరెస్టు చేయబడవచ్చుననీ, మరికొంతమంది

చిత్రవధలపాలై మృత్యువాత బడవచ్చుననీ మాకు తెలుసును. పైటా విద్యార్థులంతా ఒక పరిపాలనా వ్యవస్థకు లోబడి మను గడ సాగిస్తున్నారు. వీరిలో చాలామంది ఎదురుతిరగడానికి సంసిద్ధులుగా ఉన్నవారే. ప్రభుత్వం ఎవరితోనైతే పోరు సాగిస్తోందో వారిమీదే మా ఆశలు నిలుపుకున్నాము.

పైటా,-కువ్-లి పై-చింగ్ టా-హుసేహ్ అనే మాటకు సంక్షిప్తస్వరూపం. నేషనల్ పెకింగ్ యూనివర్సిటీ అని దీని అర్థం. పై-చింగ్‌లోని పై అనే మాటకు ఉత్తరదిశ అని అర్థం. టా అనగా పెద్ద లేక గొప్ప అని అర్థం. దీనిని హుసేహ్ లేక బోధనతో జోడిస్తే యూనివర్సిటీ అని అర్థం.

విదేశీ ఆధిపత్యంనుండి స్వాతంత్ర్యం సంపాదించుకోవడానికి మాకు గర్వంగా ఉన్నది. పైటా చైనాలోని ప్రముఖ విశ్వవిద్యాలయం. చైనా దేశ సాంస్కృతిక సంప్రదాయములకు ఇది ఆటపట్టు. దేశమంతటా విస్తరించే ఇరవయ్యో శతాబ్దపు విప్లవానికి ఇది ఒక కేంద్రస్థానము. ఇతర దేశాలలో వయో వృద్ధులు నాయకత్వం వహిస్తారు. కాని చైనా క్రితం యాభై సంవత్సరాలలోనూ రాజకీయ నేతృత్వము వహించుటకు కారకులు యీ విశ్వవిద్యాలయము, మరికొన్ని పాఠశాలల విద్యార్థులే. అయితే అలాంటివారు మాలో చాలామంది లేరు. అందువల్లనే మాకు ప్రాముఖ్యత కల్గినది.

1937 లో జపాన్‌వారు పెకింగ్‌ను పట్టుకొన్నప్పుడు చాలమంది పైటావిద్యార్థులు, అధ్యాపకులు పెట్టే బేడా సర్దుకుని వేలకొలది మైళ్లు అంతర్ముఖంగా ప్రయాణించి ఒక కాందిశీక విశ్వవిద్యాలయ స్థాపనకు ప్రయత్నించారు. యుద్ధా

నంతరము యీ పురుషులు, స్త్రీలు పైటాను మరొకసారి తిరిగి నిర్మించాలని తలంచారు. కాని విజయముతో పెకింగ్‌నకు శాంతి లభ్యముకాలేదు. పెకింగ్ అంటే 'ఉత్తరాది శాంతి' అని అర్థం. జపాన్‌వారు లోబడిన తర్వాత అమెరికన్ మెరీన్ల సహాయంతో నేషనలిస్ట్ సైన్యాలు నగరాన్ని ఆక్రమించుకున్నాయి. మిగతా పరిసర ప్రాంతమంతా జపాన్‌వారిని ఎదుర్కొనిన కమ్యూనిస్టు సైన్యాల హస్తాలలోనే ఉన్నది. వి. జె. దినోత్సవం అనంతరం ఒక సంవత్సరంపాటు పెకింగ్ 'ఎగ్జిక్యూటివ్ హెడ్‌క్వార్టర్స్'కి ఆటపట్టు అయినది. నాన్‌కింగ్‌లోని పురాతన నేషనలిస్టు ప్రభుత్వానికి ఎనాన్‌లోని కమ్యూనిస్టులకు మధ్య సంధి పొసగించడానికి యిక్కడనుంచే ప్రయత్నాలు జరిగాయి. కాని సంధి పొసగలేదు. అమెరికన్‌లు లాభం లేదనుకుని బయటికి వచ్చివేశారు. అమెరికన్ మెరైన్‌లు గృహోన్ముఖు లయ్యారు.

ఆకలితో అలమటించే ఒక దరిద్రగొట్టు నగరాన్ని వెనుకవదలి వారు వెళ్లిపోయారు. బ్రతికి బట్టకట్టడం ఎట్లా అన్నది పెద్ద సమస్య అయింది. యుద్ధం ముగింపుకు వచ్చే సమయానికి ఆహారకొరత తీవ్రం అయింది. ఇక డబ్బుకి విలువ లేనేలేదు. చాలామంది విద్యార్థులకు ప్రభుత్వంనుంచి ధన సహాయం రావలసి ఉంది. అది సమయానికి రావటం అరుదైంది. బాలికల పడకటిండ్లలో వెచ్చదనానికి తగిన సాధన ఉన్నది. కాని పురుషులకు తగినంత బొగ్గు లభ్యమయ్యేది కాదు.

దేశంలో జరుగుతున్న వాటిని తలంచుకుంటే వ్యక్తిగతంగా అనుభవిస్తూ ఉన్న యాతనలు అంత ముఖ్యంగా అగు

పించవు. మేము జపానువారిని నడుం విరగగొట్టాము. కాని విజయం అనేది ప్రజలకు మరింత అరిష్టాన్నే ప్రసాదించింది. న్యాయ సమ్మతమైన వాణిజ్యం అడుగంటింది. అధికారులు—స్టాకింగులు, లిప్‌స్టిక్‌లు, ఫౌంటెన్ పెన్నులులాంటి విదేశీవస్తువు లను దిగుమతి చేయటం ప్రారంభించారు. వాటితో లాభాలు మూటకట్టారు. తామప్రజల సహాయార్థం వచ్చే అత్యవసర వస్తువులను అధికలాభాలకు అమ్మటం ప్రారంభించారు. సోల్జర్లు రికూలాగే వాళ్లను చావమోదటం, దుకాణాలలో దొంగ తనాలు చేయటం మేము చూస్తూఉండేవాళ్లము. ఈ సిపాయిలు మాకు మిత్రులా శత్రవులా? ఉన్నతాధికారులలో లంచ గొండితనం విపరీతంగా ఉన్నదనే వదంతి మేము విన్నాము. చిన్నతరహా అధికారులు పుచ్చుకునే లాంచనాలను మేము కళ్ళారా చూశాము. మిగతా నగరాలనుంచి గూడా అనేక కథలు విన్నాము: "మావాడు క్రితంవారం నాన్‌కింగ్ నుంచి వచ్చాడు. కొందరు పెద్దమనుషులకి అసలు యుద్ధం జరుగు తోందనే సంగతే తెలియదు. వాళ్ల ఆందోళన అల్లా ఒక్క బ్యాంకు అకౌంట్లనుగురించే. విదేశీవస్త్రాలు ధరించిన వేశ్య లతో పెద్దపెద్ద అమెరికన్ మోటారులలో ఊరేగే యీ నిక్షేపరాయళ్లని మీరు కావాలంటే చూడవచ్చును."

"మనం బ్రతికి బట్టకట్టవలెనంటే చైనా దేశంలో మార్పు వచ్చి తీరాలి" అనేది మరొక వైపునుంచి మేమువింటున్నాము. స్వాతంత్ర్య సముపార్జనానంతరం మూడు సంవత్సరములలో పరిపాలకులు, ఆహార విషయంలోగాని యితర సమస్యల విష యంలోగాని చూపించిన చేతకానితనం, అవినీతి ప్రజలలో

జుగుప్స కలిగించింది. ఈ ప్రభుత్వాన్ని పతనంచేసి నూతన నాయకత్వం వైపునకు తలబగ్గక తప్పదనే దృఢ విశ్వాసం ఏర్పడి పోయింది. నూతన నాయకత్వాన్ని అధికారంలోకి తీసుకొని రావడానికి పెటాలో మేమంతా సంసిద్ధులమయ్యాము. తన జీవితం కూడగట్టే సమయంలో పాతప్రభుత్వం శక్తినంతా వినియోగించి రాబోతున్న మార్పులను ఎదుర్కొంటుందని మాకు తెలుసును. సరియైన శిక్షణ, సంఘటిత శక్తులద్వారా మాత్రమే మేము నెగ్గగలము; భవిష్యత్తునందు నమ్మకమున్నవారు, తమను తమ దేశాన్ని సంరక్షించుకోవడానికి ఐక్యత సాధించాలి. మమ్మల్ని సంఘటిత పరచే వారెవరు? పాత లిబరల్స్ అంటే మాకు గౌరవం ఉన్నది. ధైర్యవంతులలోనా వారిలో నాయకత్వం లేదు. వారిలో వారు కలహాలు పెంచుకోవటంతో ఎందునా కొరగాకుండా పోయారు. ఇక కమ్యూనిష్టు మిత్రులు: వారిలో సంఘీయభావం ఉన్నది. సంఘటిత శక్తి ఉన్నది. వారు మాకు నాయకత్వాన్ని, సంఘటనా సత్వాన్ని ప్రసాదించారు. పెకింగ్‌లో దొంగచాటుగా పనిచేస్తున్న పార్టీ బలాన్ని మేము ఉజ్జాయింపుగా ఊహించగలిగాము. ఫలితాన్ని పట్టి ఆశక్తి పార్టీకి గలదని మేము గ్రహించాము. ఇతరులు వాదోపవాదాలతో తలపట్లు పడుతూఉంటే, కమ్యూనిష్టులు క్రియ ద్వారా ముందడుగు వేశారు. చట్టవిరుద్ధ సాహిత్యాన్ని వారు ప్రచారం చేశారు. రాత్రివేళలయందు చీకటి మరుగున గోడల మీద కాగితాలు అంటించి తమ సైన్యాల విజయపరంపరలను ప్రకటించేవారు. స్త్రీయుకులును, నిరసన ప్రదర్శనలను అనేకం చేశారు. విద్యార్థుల ప్రదర్శన అనంతరం రహస్య ఏజెంట్లు

దాడిజరిపితే పట్టుబడినవారిలో ఒక్క కమ్యూనిస్టుకూడా ఉండేవాడు కాదు.

అయితే వారి అభిప్రాయాలు ఏమిటి? క్లిష్టంగా, యాంత్రికంగా, ఇతర నమ్మకాలఎడల వైముఖ్యంగా ఉండవా? ఈ ప్రశ్నకు పార్టీ సభ్యుడని అనుమానించతగిన మిత్రులుచెప్పే జవాబు ఏమంటే– "కామ్రేడ్! నువ్వు కామ్రేడ్ మావ్ వ్రాసిన 'ఆన్ ప్రాక్టీస్' అనే గ్రంథాన్ని చదివి ఉండవని తలుస్తాను. యథార్థపరిస్థితులకు అనుబంధంగా సిద్ధాంతాలు ఉండాలని ఆ గ్రంథం తెలుపుతుంది. మరో దేశంలాగా చైనా లేదు. మన ప్రజలకు అనుగుణ్యమైన విధానాన్ని ఒకదానిని మనం రూపొందించుకోవాలి. కమ్యూనిస్టుల మని మననిమనం పిలుచుకోవటం ముఖ్యమైన విషయంకాదు. మనం అంతా ఒకేలక్ష్యంతో పోరుసాగించలేదా? సమైక్యకృషి మనకుకావలసినది. స్వాతంత్రము, శాంతి, ఈ రెంటియందు నమ్మకమున్న వారంతా కలిసి పనిచెయ్యాలి. ప్రజాబాహుళ్యానికి మేము విమోచన కలిగిస్తాము. చైనాను ఒక నూతన దేశంగా రూపొందిస్తాము."

పాతప్రభుత్వానికి విరుద్ధంగా పనిచేసే రాజకీయ ఆందోళనలకు, అజ్ఞాత కార్యకలాపాలకు పైటా కేంద్రస్థానమయినది. ఆవరణకు వెలుపల ప్రజలు భయాందోళనలకు లోనైఉండవచ్చును, కాని విద్యాలయగోడలమధ్య అమితఉత్సాహ సంచలనంతో నిండిఉండేది. పుకార్లను వ్యాపింపచేశాము. విప్లవ రాజకీయాలనుగురించి చర్చలుసాగించాము. నిషేధగ్రంథాలను, కరపత్రాలను చదివాము, కమ్యూనిస్టులు లోగొన్న ప్రాంతాల

నుండి దూసుకువచ్చిన కథలను వల్లెవేశాము. ఆయా ప్రాంతాలను 'విమోచనప్రాంతాలు' అని పిలవడం ప్రారంభించాము.

1948 ఆకురాలు కాలం వేసవులందు ఆహారపరిస్థితి విషమించింది. పెకింగ్ ప్రజలలో అశాంతి పెచ్చుపెరిగింది. రాజకీయ ప్రదర్శనలు, స్ట్రయికులు- యివే మా ముఖ్యపాఠ్యగ్రంధాలు. ప్రతిప్రదర్శనా మా నాయకులకు మరికొంతమంది అనుచరులను సంపాదించిపెట్టింది. నిరసన ప్రదర్శనలపై పాత ప్రభుత్వం తీసుకుంటున్న అమానుషచర్యలతో కొంతమంది విద్యార్థులు పార్టీసానుభూతిపరులుగా మారిపోయారు. వింత చూడదలచుకుని ప్రదర్శనకువెళ్ళిన విద్యార్థులపేర్లు నల్ల జాబితాలో నమోదుఅయినట్లు వారికి తెలిపేది. ఒకసారి యీ అభాండం నెత్తినపడినతర్వాత వారి నాయకులను అనుసరించక మరొక మార్గమేదీ ?

మా ప్రచారము, ఆందోళన, గోడలమీద వ్రాసిన నినాదాలు, రాత్రివేళల మేము గోడలమీద అంటించే చట్టవిరుద్ధమైన వార్తాపత్రికలు, యింకా మిగతా మా విద్రోహకరచర్యలు, అధికారులకు భయాన్ని, కోపాన్ని తెప్పించాయి. మాకు విరుగుడుగా బి. ఐ. యస్. విద్యార్థివిషయాలసంఘము, కొమింటాంగ్ పార్టీ యువజనసంఘముల సమిష్టిప్రదర్శనను ఒకదానిని ఏర్పాటుచేశారు.

ఈ రెండు సంఘాలు ఇరవైవేల ప్రదర్శకులను సమావేశ పరిచారు. దీనిలో డబ్బు నాశించిన రౌడీలు, ప్రత్యేక ఏజెంట్లు, కుటుంబ సంబంధముగా పాత ప్రభుత్వాన్ని మద్దతు చేయకతప్పని విద్యార్థులు ఉన్నారు. కమ్యూనిస్టు బందిపోటుల

కేంద్ర స్థావరమైన పైటా మీాదకు మూక ఉమ్మడిగా కదలి పోవటానికి 'స్వర్గశాంతి' గేటువద్ద సమావేశమయినారు. ఉద్రేక పూరిత ఉపన్యాసాలు ప్రజాసమూహాన్ని పిచ్చిఎక్కేటట్లు చేశాయి. బారులుతీరి విశ్వవిద్యాలయ ఆవరణవైపునకు కదిలారు. ఆజానుబాహువులు ముందునడవగా రెడ్ హాల్ లోకి పురుషుల పడకటెండ్లలోకి భేదించుకు వచ్చారు. అయితే లోపల ఉన్నవారికి రానున్న అవాంతరం ముందుగానే తెలుసును. అందువల్ల తలుపులకు అడ్డంగా బల్లలతోనూ కుర్చీల తోనూ పేర్చి ఉంచారు.

చేసేదిలేక మరొక పడకటెండ్ల వరుసకువెళ్ళి తలుపులు బ్రద్దలు కొట్టారు. ఇంతా చేసి వారు జొరబడినవి బోధనా తరగతి గదులు. గొంతులో వచ్చి వెలగకాయలు వడ్డట్లు అయి అక్కడనుంచి వారు నెమ్మదిగా తప్పుకున్నారు.

గుంపులోని ఆందోళనకారులు విశ్వవిద్యాలయ పశ్చిమ ద్వారం వైపునకు మళ్లారు. అయితే తలవని తలంపుగా వారు అక్కడ ఒక దుస్సంఘటనను ఎదుర్కొనవలసి వచ్చింది. విశ్వ విద్యాలయ అధికారుల వినతిని పురస్కరించుకొని వచ్చిన మ్యునిసిపల్ సైనికులు తుపాకులను బారుచేసి నిలబడి ఉన్నారు. ప్రజాసమూహం చుంగ్ నాన్ హైలోని ప్రెసిడెంట్ ఆఫీసువైపునకు వెడుతూ 'కల్లోలాన్ని మేము ఎదురిస్తాము! స్త్రియికులు, హింస నశించుగాక!' అని కేకలువేశారు. ప్రెసిడెంట్ ఆఫీసు ముందు ఉపన్యాసకులు కమ్యూనిస్టు విద్యార్థులను హతమార్చాలని ఉద్బోధించారు.

దాడి జాబితాలో తర్వాతది నార్మల్ యూని

వర్సిటీ. నార్మల్ గేటు మూసివేసి లోపల బంధింపబడింది. మాకు కాపలాదార్లు హెచ్చరికలు చేశారు. 'కల్లోలం నశిం చాలి' అనే కేకలతో ప్రదర్శకులు గేటువద్దకు పోగుఅయ్యారు. రాళ్లవర్షంతో కాపలావాళ్లను పారద్రోలారు. తాళాల్ని పగులగొట్టి గేటును ఛేదించివేశారు.

మొదటి గుంపు లోపలికి జొరబడిన వెంటనే పైనుండి ధారాపాతంగా పెద్ద పెద్ద డ్రమ్ములలో భద్రంచేయబడ్డ రాళ్లు, సిమెంట్ వారిపై వర్షించింది. మరోసారి మరోగుంపు ముందుకు రావాలని ప్రయత్నిస్తే వారికీ అదేగతి పట్టింది.

జెండా స్తంభమువద్ద నిలబడిఉన్న నార్మల్ విద్యాలయ బాలికను ఆ జనంలో ఒకడు చూశాడు. "అదుగో అక్కడొక కమ్యూనిస్టు కుక్క ఉన్నది. దానిని హతమార్చండి" అంటూ కేకలుపెట్టాడు. ఆమెను చావచితక కొట్టారు. పాదాలతో తొక్కాలని ప్రయత్నించారు. ఆ జనంలోఉన్న యిద్దరు సేమన లిస్ట్ ఆఫీసర్లు ఆ బాలికను రక్షించాలని ప్రయత్నించారు: "ఆగండి, ఆమె ఒక బాలిక, ఆడవాళ్ళను కొట్టడానికి మనం యిక్కడకురాలేదు" ముఖమంతా రక్తం చిందుతూఉండగా ఆమె తప్పించుకుని లోనికి పారిపోయింది. ఆమె తప్పించుకోవ డంతో జనం మరీ కోపోద్రేకంతో రెచ్చిపోయారు. "వాళ్ళు కమ్యూనిస్టు గూఢచారులే. వాళ్లనిచంపండి" అంటే ఆఫీసర్ల వేపు తిరిగారు. తనని పట్టుకున్నవాడి డొక్కలో ఆఫీసర్ ఒక్క పోటుపొడిచాడు, రెండో ఆఫీసరు పట్టుతప్పించుకునేటట్లు చేశాడు. వారిద్దరూ అక్కడనుంచి పారిపోయారు. పోలీసులు వస్తున్నా

రనేవార్త జనంలో పాక్కింది. దాంతో ఎక్కడివాళ్లు ఆ
నెమ్మదిగా జారుకున్నారు.

జులైలో మరొక దొమ్మి జరిగింది. ఈశాన్యదిశను యింకా యితర ప్రాంతాలలోనూ కమ్యూనిస్టులు విజయం సాధిస్తున్నచోట్లనుంచి అనేకమంది విద్యార్థులు, శరణార్థులుగా పెకింగ్‌కు ప్రతిరోజూవచ్చి చేరుతున్నారు. ప్రభుత్వోద్యోగులంతో షైయుఆన్‌ను ఖాళీచేసి కొంతమందివచ్చారు. అయితే వారికి అవసరమైన సౌకర్యములు ఏవీ అక్కడ కల్పించబడలేదు. వీరిలో కొందరు స్వర్గఆలయం మొదలైన దేవాలయాల్లో నివాసం ఏర్పరుచుకున్నారు. గోడలకు వ్రేలాడే చీలికలు పాలిక లైనవారి మురికి పక్కచుట్టలు, నానా కశ్మలంతో కూడిన పాయిఖానాల కంపులతో, ఆఖరుసారి పెకింగును చూచిపోవాలను కున్న విదేశీయాత్రికులకు మతిచెడినంతపని అయింది. ఇతరులు ఖాళీయిళ్లలోకి జొరబడి కొయ్యసామానులను కిటికీలను విరిచి వంటచెరుకుగా ఉపయోగించారు.

ఈ విద్యార్థుల దారుణస్థితినిగురించి నగర కౌన్సిల్‌లో ప్రస్తావన రాగా, శరణార్థులకు హామీయిచ్చిన పాఠశాలల నిర్మాణమునకు అవసరమైన సొమ్మును పోగుచేయటం అసంభవమైన కార్యముగా కొందరు కౌన్సిల్‌సభ్యులు వాదించారు. అంతేగాకుండా, తమకు మనుష్యులసహాయంకావాలని కౌన్సిల్ మీద ప్రభుత్వం వొత్తిడిచేస్తోంది. సైన్యంలో జేర్చుకునేందుకు వీలుగా యీ పోకిరీ విద్యార్థులను, ఉత్తరచైనా బందిపోట్ల హృదయమార్పు కేంద్రస్థానానికి ఎందుకు తోలరాదు? చదువుకు బదులు సైన్యంలో జేరటమే మంచిది.

అయితే యీ సూచన కౌన్సిల్‌లో వోటింగ్‌కు రాలేదు. అజ్ఞాతవాసులు యిటువంటి అవకాశంకోసమే ఎదురు చూస్తూఉన్నారు. కమ్యూనిస్టులతో పోరుసాగించడానికిగాను విద్యార్థులను సైన్యములోకి తోలుతున్నారని, సైటానాయకులు పుకార్లను వ్యాప్తంచేశారు. జులై 6 వ తేదీన ఒక పిటిషన్ దాఖలుచేయవలసిందిగా నగరకౌన్సిల్‌మీదకు మూడు వేల కాందిశీక విద్యార్థులను పురికొల్పారు. ఈ ప్రదర్శకులు వచ్చేవేళకు కౌన్సిల్‌సభ్యులు ముందుగానే అక్కడినుంచి జారుకున్నారు. విద్యార్థులు చేతికిఅందిన వస్తువునల్లా విరగగొట్టారు. గేటుమీదఉన్న సైనుబోర్డులో అసభ్యపు నినాదాలు. నల్ల రంగుతో పులిమారు. తర్వాత వారు నగరకౌన్సిల్ అధిపతి సువైటుంగ్ గృహంవైపు మళ్ళారు. ఆయన అంతకుముందే తన గృహానికి సైన్యాన్ని కాపలాపెట్టి ఒక స్నేహితుని ఇంటికి పారిపోయాడు. యువసైన్యముయొక్క 208 డివిజన్ సైనికులు, తరలివస్తున్న విద్యార్థి గుంపునకు ఎదురుగా తుపాకులతో బారులుతీర్చి నిలబడ్డారు. వారివద్ద మిషన్‌గన్‌లు, ఒకటాంక్ కూడా ఉన్నది.

సైన్యానికి ఆధిపత్యం వహించిన అధికారులతో విద్యార్థులు సుమారు రెండు గంటలసేపు వాదించారు. కోపం రేకెత్తింది. పోట్లాట ప్రారంభమయింది. వెంటనే తుపాకులు ప్రేలటం మొదలుపెట్టాయి. విద్యార్థులు సందిగ్ధావస్థలో పడ్డారు. గుంపు చెదిరింది. ఎవరిదోవన వారు పరుగెత్తారు. మిషన్‌గన్ ప్రేలుళ్ళు విద్యార్థులను వీధివెంట తరిమికొట్టాయి. కాల్పులు ఆగేలోపల డజన్లకొలదీ విద్యార్థులు నేలకొరిగారు. ఒకఅధికారి

వద్దనుండి పిస్టల్ లాగుకొని ఒక విద్యార్థి కాల్పులు ప్రారంభించాడని అధికార వర్గములవారి ప్రకటన. విద్యార్థుల ఎగతాళి మాటలకు కినిసి ఒక సోల్జర్ కాల్పులు ప్రారంభించా డని, అతనితోపాటు మిగతా సోల్జర్లుగూడా కాల్పులు మొదలు పెట్టారని మరో పక్షంవారు అన్నారు. కాల్పులు ఎవరు ప్రారం భించినా ఆరోజుని 'బ్లడీ జులై ఫిఫ్త్' అని మేం విద్యార్థులం పిలుస్తాం.

ఈ రక్తపాత సంఘటన కమ్యూనిస్టులకి మేలు చేకూ ర్చింది. యువజన సైన్యం చేతుల్లో బలి అయిన కామ్రేడ్లకు శ్రద్ధాంజలి ఘటించడానికీ జులై 9 వ తేదీన పెద్ద ప్రదర్శనా సమావేశం జరగడానికీ వారు మాకు చాలా సహాయం చేశారు. పోలీసులు, సోల్జర్లు క్రోధకావేశములతో ఉన్నప్పటికీ, శాంతియుతంగా సాగుతూన్న విద్యార్థుల ఊరేగింపు జోలికి వారు రాలేదు.

పాత వ్యవస్థ పతనం అవుతూండగా విశ్వవిద్యాలయంలో మా తరగతులకి ఇక ప్రాముఖ్యత ఏమి ఉంటుంది. రాజకీయ కార్యకలాపములు, ప్రదర్శనలతో కాలం సరిపోయేది. ఈ పనులు గాకపోయినా, బయట వీధుల్లో మా మిత్రులు చరి త్రనే మార్చివేయుటానికి సహాయపడుతూ ఉండగా మా బుర్రలను పుస్తకాలలో దూర్చుకని ఊరికే కూర్చోగలమా ?

ప్రభుత్వం వద్దనున్న 'కమ్యూనిస్టు విద్యార్థుల' నల్ల జాబితా మరింత పెద్దదైంది. పైటూ ఉద్రేకంతో అట్టుడికి పోతు న్నది. కాని 1948 చివరిభాగంలో హఠాత్తుగా విశ్వవిద్యా లయమును ఒకవిధమైన ప్రశాంతత అలుముకున్నది. ప్రతిరోజు

కాంపస్‌ను చాలామంది విద్యార్థులు వదిలివెళ్ళటమే యిందుకు ముఖ్యకారణం.

తరగతిలో అధ్యాపకుడు రోల్ కాల్ పిలుస్తున్నప్పుడు వరుసగా కొన్ని పేర్లకు అసలు జవాబే ఉండేదికాదు. ఆయన ఆశ్చర్యంతో తల పైకెత్తి, "వీళ్ళంతా ఏమైనట్లు – ఇవాళ ఏదన్నా స్ట్రయిక్ ఉన్నదా?" అని ప్రశ్నించేవాడు.

"స్ట్రయిక్ లేదు; ఏమీలేదు. వాళ్ళంతా ఇళ్ళకు వెళ్ళారు" అని విద్యార్థులు ఏకకంఠంతో జవాబు చెప్పారు.

"ఇంకా శీతాకాలపు శెలవులు ప్రారంభం కాందే ఇళ్ళకు వెళ్ళారా?"

"అవును...వెళ్ళారు" అంటూ విద్యార్థులు ఒకరిని చూచి ఒకరు ముసిముసి నవ్వులు నవ్వారు.

ఇళ్ళకు వెళ్ళామన్న విద్యార్థుల సంగతి నాకు తెలుసును. నాకు మువాంగ్ అనే మిత్రుడు ఉన్నాడు. జూనియర్ తరగతి చదువుతున్నాడు. చాలా తెలివైనవాడు. అతను పగిలిపోయిన కళ్ళ అద్దాలను ధరించేవాడు. దానిని బాగు చేయించుకోవాలన్నా కొత్తది కావాలన్నా అతనివద్ద డబ్బు ఉండేదికాదు. నవంబర్‌లో–ముక్‌డెన్ కమ్యూనిస్టుల పరమైన సమయంలో అదివరకు గ్రంథాలయంనుంచి తాను తీసుకున్న టాల్‌స్టాయ్ రచన 'సమరము–శాంతి' అనే గ్రంథాన్ని తిరిగి యిచ్చివేయడానికి అతను వచ్చాడు.

"ఆ పుస్తకాన్ని నేను పూర్తిచేయలేదు...ఇప్పుడు నాకు సమయం లేదు" అన్నాడతను.

"ఏమిటి సంగతి?"

మొదట అతను జవాబు చెప్పలేదు. కొంచెంసేపు ఆగి 'ఫరవాలేదు యీ మిత్రుణ్ణి నమ్మవచ్చును' అనుకున్న ట్లున్నాడు. తాము కొనసాగిస్తూ ఉన్న కార్యకలాపాలను బి.ఐ యస్. రహస్య ఏజెంట్లు కనిపెట్టినట్లుగా తమ సంఘానికి సమాచారం తెలిసిందని అతను అన్నాడు.

"మాలో కొందరు వాళ్ళ చిట్టాలలో ఎక్కారు. ఏనాడో వీళ్ళంతా బంధింపబడతారు" అంటూ అతను యీ విధంగా చెవిలో ఊదాడు: "నేను విమోచన ప్రాంతాలకి తప్పించుకుని పోతున్నాను"

"ఏ ప్రాంతం? ఎప్పుడు వెడుతున్నావు?"

"చెప్పలేను. మావాళ్ళు ఎంత త్వరగా ఏర్పాటుచేస్తే అంత త్వరగా వెడతాను"

"నీకు వీడ్కోలు చెప్పడానికి నేను రానా?"

"రాకుండా ఉండటమే మంచిది. ఇదేమీ శెలవలకి ఇంటికి వెళ్ళటంకాదు. మధ్యలో పెకింగ్‌లోనే వేచియుండు. మధ్యలో నన్ను మళ్ళీ చూస్తావు. మేము తిరిగివచ్చి మీకు విమోచన కలిగిస్తాము."

ఆనెల అంతానికి వెయ్యికిపైగా విద్యార్థులు కాంపస్ వదలి వెళ్లారు. రోజులు దగ్గరపడుతూ ఉన్న పాత ప్రభుత్వం చేతుల్లోపడి అరెస్టుకాకుండా ఉండేందుకుగాను కొంతమంది పార్టీసభ్యులు వెనుకకు పిలువబడ్డారు. ఇతరులు పార్టీసభ్యులు కాకపోయినప్పటికీ విమోచనానికి తోడ్పడాలని ఆశించారు. ప్రజావిమోచన సైన్యము ప్రవేశించిన తర్వాత ఏర్పడే

నూతన ప్రభుత్వంలోని ఉద్యోగాలకు తరిఫీయత్ యివ్వాలని వారు ప్రయత్నించారు.

రాజకీయాలను సంపూర్ణంగా అవగాహన చేసుకోవాలని ఒక ప్రొఫెసర్ తనతోటి టీచర్లను ఉద్దేశించి యీ విధంగా అన్నాడు.

"ప్రభుత్వం పతనావస్థలో నున్నదనడానికి వేరే తార్కాణం ఏమి కావాలి! ఎంతమంది విద్యార్థులు పారిపోతారో చూడండి-ప్రభుత్వాన్ని ఎదుర్కొనడానికి ఆయుధాలు దాల్చి వారు నిలబడ్డారు. క్రితం యాభై సంవత్సరాల మన చరిత్రను పరికించండి. భవిష్యత్తులో జరిగే సంఘటనలకు విద్యార్థులు 'వాతావరణసూచిక' అనవచ్చును. కాలానుగుణ్యంగా వారు ముందడుగు వేస్తూనే ఉన్నారు. మనం అనుకున్న గడువుకన్నా ముందుగానే ప్రభుత్వం పతనం చెందటం తథ్యం. కమ్యూనిస్టులు విజయాన్ని సాధించి తీరుతారు".

వార్తా పత్రికలను చదవటం ద్వారా ఆయన యీ విధంగా ఉపన్యసించగలిగాడు. శరత్కాలంనాటికి ఉత్తరదిశనంతా కమ్యూనిస్టులు ఆక్రమించివేసే సన్నాహంలోఉన్నారు. ప్రతి విజయం ఒక ఢంకా బజాయింపుగా వినవస్తోంది. వాయవ్యదిశను నేషనలిస్టు సైన్యాలు మూక ఉమ్మడిగా చిన్నాభిన్నమైనాయి. ఈశాన్యదిశను (మంచూరియా) 58 వ డివిజన్, ఇంగ్‌కోవ్ నౌకాశ్రయాన్ని వదులుకుంది. హూపై, షాన్‌టుంగ్, షాన్‌సి రాష్ట్రాలలోని నగరాలు ఒకదాని తర్వాత ఒకటి ప్రజావిమోచన సైన్యానికి లొంగిపోయాయి.

ప్రభుత్వ నైతిక బలం అధఃపాతాళాన్ని అందుకుంది. 92 వ సైన్యదళం లోబడిపోయింది. సెప్టెంబర్ 24న షాన్ టుంగ్ రాజధానియైన సినాన్‌మీద కమ్యూనిస్టులు విరుచుకు పడ్డారు. అక్టోబర్‌లో మంచూరియన్ కీలకస్థానమైన చిన్‌చేవ్ పతనమైంది. మంచూరియా తూము రాజధానియైన చంగ్‌చున్‌లో బంధింపబడిన 60వ సైన్యదళం లోబడింది. ముక్‌డెన్ పతనం నేషనలిస్టులకు దారుణ వినాశహేతువైనది. ముక్‌డెన్ పతనంతో భాగ్యవంతమైన మంచూరియా యావత్తు కమ్యూనిస్టుల పరమైనది. యువ మిలటరీ మేధావి జనరల్ లిన్‌పియావ్ తన కమ్యూనిస్టు సైన్యాలను టియెన్‌టిసిన్, పెకింగ్‌ల వైపు మరల్చాడు.

మా భవిష్యత్తు అతివేగంగా మా వైపుకు దొర్లుకు వచ్చింది. మంచూరియా, ఉత్తరచైనాల ద్వారా ప్రజాప్రభుత్వ సైన్యాలు దూసుకురావడంతో పెకింగ్‌వద్ద ప్రభుత్వసైన్యాల కలవరం అధికమైంది. ఇంజనీర్లు, ధనికవ్యాపారులు, అధికారులు నగరం నుంచి పారిపోవటం ప్రారంభించారు. విమానాశ్రయం వద్ద రద్దీఎక్కువైంది. నోట్ల ముమ్మరం తగ్గించడానికిగాను ప్రభుత్వం ప్రవేశపెట్టిన బంగారు 'యు ఆన్' విలువ కొద్దివారాలలోనే పదవ వంతుకు తగ్గింది. ఆ తర్వాత అది ఎంతవరకూ దిగజారిందో చెప్పనవసరంలేదు.

నగరంలో కట్టుదిట్టాలు చేస్తూఉన్న పోలీసులు, సోల్జర్లు భీషణాకృతి దాల్చారు. శత్రువుల రేడియో ప్రచారాలు వినటం నేరంగా మాకు హెచ్చరికలు చేశారు. డిసెంబర్ ప్రారంభంలో గోడలకు వెలుపల – విమానాశ్రయాల వద్ద సంగ్రా

మం జరుగుతున్నట్లు మేము పుకార్లు విన్నాము. నగరంలోని నేషనలిస్టు ఫిరంగులు 14వ తేదీన ప్రేలటం మా చెవినపడింది. సింగ్‌హో దాపుకి కమ్యూనిస్టు దళాలు వస్తూవున్నవనే వార్త విద్యుత్ వేగంతో పైటాద్వారా పాకిపోయింది. ప్రజావిమోచన సైన్యం గేట్లవద్దకు వచ్చి వేసింది.

మరుసటిరోజు డిసెంబర్ 15. కమ్యూనిస్టు ప్రప్రథమ ఫిరంగిగుండు పాతగోడల మీదుగా ఎగిరివచ్చి నాన్‌చిజే మీద ప్రేలింది. పైటా స్థాపన పదిహేనవ వార్షికోత్సవ దినమైన డిసెంబర్ 17న మా విమోచన జరగాలని మేము ఆశించాము. ఇంకా మాకు ఆ భాగ్యం లభించలేదు. అయిదు వందల సంవత్సరాల ముట్టడులలో ఆఖరి ముట్టడికి ఎదురు చూస్తూ పెకింగ్ నగరం కూర్చుని ఉన్నది.

ఆఖరి ప్రయత్నంగా అలసిపోయిఉన్న గాడిదలకు చురకలు తగిలించినట్లుగా నగర సంరక్షణ దళాలకుగాను కూలీలు తమ మూపులమీద సరంజామా జేరవేస్తున్నారు. ఉత్తర నగరంమీద మరికొన్ని బాంబులు పేలాయి; నగరంలోని మరో మూలకు తరలివెళ్ళడానికి ప్రజలు తమ వస్తువులను బళ్ళమీద వేసుకుని బయలుదేరారు. నగర దక్షిణదిశనుగూడా బాంబులు ప్రేలటంవల్ల ఉత్తరాదికి తర్లిపోతున్న మరొక కాందిశీకుల గుంపుతో వీరు కలుసుకున్నారు. నగరంలో అన్ని మూలలా పరిస్థితి ఒకేవిధంగా ఉన్నది; నాలుగు గోడల మధ్యా చూపుమేర దూరంలోకి కమ్యూనిస్టులు వచ్చివేశారు.

అర్ధరాత్రివేళ బళ్ళు, సైనిక దళాలయొక్క చప్పుళ్లు సద్దుమణిగినప్పుడు, నేషనలిస్టులు గుడ్డిగా ఆకాశంలోకి ప్రేల్చే

మిషిన్‌గన్ మోతలు పక్కలమీద పడుకున్న మా చెవుల్లో పడుతూ ఉండేవి. భయాందోళనలతో శరణార్థులు తల్లడిల్లి పోయి, అడపాదడపా బాంబులు ప్రేలుతూ ఉన్నా పైటా విద్యార్థులు మాత్రం ఎంతో ఉత్సాహంతో తిరుగుతూ ఉండే వారు. మాకు రేయి అంతం కాబోతున్నది. ప్రజావిమోచన సైన్యముల ఆగమన వేగాన్ని గురించి వార్తలు పడకటిండ్ల లోనూ క్లాసు గదులలోను గుసగుసలుగా విద్యార్థులు చెప్పు కుంటూ ఉండేవారు. ప్రభుత్వ వార్తాపత్రికలన్నీ అబద్ధపు వార్తలను ప్రకటించేవి. "దక్షిణ గోడప్రాంతంలో ప్రభుత్వ సేనలు 3,000 కమ్యూనిస్టులను హతమార్చినవి" యీ వార్త లను చదివి మేము నవ్వుకునేవాళ్ళము. "భయం ఎంత అధిక మైతే ఆడే అబద్ధంగూడా అంత అధికంగా ఉంటుంది" అనుకునే వాళ్ళము.

మిలటరీ జనాభాతో నగరం యావత్తు యింకా రద్దీగానే ఉన్నది. మందుగుండు ఆహార శకటాలను గాడిదలు లాగు తున్నాయి. పాత ప్రభుత్వ శ్వేతభానుని చిహ్నాన్ని ధరించిన పదాతిదళాలు దిమ్మతిరుగుతున్నాయి. కాకీరంగు మిలిటరీ కారులు పైటా చుట్టుపక్కల వీధులలో వెళ్ళే సైకిలు వాలా లను రాసుకుని పోతున్నాయి. డ్రైవర్లు వీధిన పోయేవాళ్ళను కారుకూతలు కూస్తూనే ఉన్నారు.

"సోల్జర్లు ఇక్కడకు వచ్చారు" అనే మాటకు దొంగలు బందిపోట్లు ఇక్కడకు వచ్చారు అనే చైనీయులకు అర్థం అయ్యేది. ఫూసో-ఇ దళాలు సుశిక్షితమైనవని ప్రజలువిన్నారు. కాని పరాజయాలతో తలముక్కలై కక్షతో ఆవేశంతో ఉన్న

వాళ్ళను ఎలా నమ్మటం? నిన్న దోపిడీచేసిన తర్వాత రక్షణ చర్యలు తీసుకోవడంవల్ల ప్రయోజనం ఏమీ ఉండదు. తెలివైన ఇంటివాళ్లు ముందు జాగ్రత్తగా తమ ద్వారములను బంధించివేశారు. ఆర్మీ యూనిట్లమీద ఆధారపడినవారి చిహ్నంగా మరికొంతమంది తమ గేట్లమీద ఎర్ర నీళ్ళను వేశారు. దానితో సోల్జర్లు తొలగిపోతారని వారి అభిప్రాయం. కాని సోల్జర్లు నిక్షేపరాయుళ్ళలాగా వచ్చారు. తమ తుపాకి మడమతో గేట్లమీద దరువులు వేశారు.

ఒక ఇంటి ఆసామి యీ దెబ్బలకు సమాధానంగా "మేమంతా సైన్యంమీద ఆధారపడ్డ వాళ్ళము. పక్క ఇంటికి వెళ్ళండి" లోపలనుంచి జవాబు ఇచ్చాడు.

"తాబేలు కొడుకా! ముందు తలుపుతియ్యి! నీకోసం కమ్యూనిస్టు బందిపోట్లను హతమార్చటానికి మేము వస్తే మమ్మల్ని వీధిలో పడుకోమంటావా! తలుపుతియ్యి, లేకపోతే పగలగొట్టి లోపలికి వస్తాము. త్వరగా తియ్యి, లేకపోతే తుపాకులు పేల్చి తలుపులు తెరుస్తాము."

ఇక లాభంలేదనుకుని ఆసామి నౌకరును రాయబారానికి పంపించాడు. "ఈఇల్లు సూజేలో ఉన్న ఒక రెజిమెంటల్ కమాండర్ది. మీరు మరో ఇల్లు చూసుకోండి" అని నౌకరు ధైర్యంగా బయటికివచ్చి పలికాడు.

"ఈ ఇల్లు సైన్యంమీద ఆధారపడి వున్నదన్నమాట. అయితే మరీ మంచిది. మేముగూడా సైన్యంమీద ఆధారపడ్డవాళ్ళమే. ముందు మేము యీ ఇంట్లో ప్రవేశిస్తాము. తర్వాత మామీద ఆధారపడిన వాళ్లు వస్తారు" అంటూ ఒక

లావుపాటి సోల్జర్ ఎగతాళిగా జవాబు యిచ్చాడు. ఇక మాటలు కట్టిపెట్టి తమ సరంజామా యావత్తుతోనూ సోల్జర్లు లోపల ప్రవేశించారు. అయితే వాళ్ళ సరంజామాలో లేని వల్లా బియ్యము, బొగ్గులు మాత్రమే.

ఆహార పదార్థాలన్నీ సైనికుల పరం అవటంతో తిండి కొరత తీవ్రరూపం దాల్చింది. మా వంటశాలలో పిండిమర చెడిపోవటంతో ఇండియన్ బియ్యం మీదే మేము ఆధార పడవలసి వచ్చింది. కొంతమంది విద్యార్థులకు చైనీస్ రొట్టె స్వల్పంగా లభ్యమయ్యేది. వీటిని నమలి మింగడానికి మా దవడలు పడిపోయేవి.

ఈ బియ్యంతోపాటు కొన్ని కాయగూరలు; అప్పుడ ప్పుడు మాంసము లేక చేపలు సంపాదించడానికి ప్రయత్నించే వారము. ఒకరోజున మా వంటవాడు బజారుకెళ్ళి వాకబు చేయగా, మేము ఆర్డరు యిచ్చిన కాయగూరలు మాంసం కళాశాల హాస్టల్‌కి వస్తూఉండగా దారి మధ్యలో సోల్జర్లు దొంగిలించారని తెలిసింది. ఉప్పులోఊరవేసిన కాయగూరలు, సోయా చిక్కుళ్లు నమిలి మేము తృప్తిపడేవారము.

వీధులలోనూ ప్రజోపయోగ భవనాలముందు అడ్డు కట్టడంతోనూ, విరామం లేకుండా సోల్జర్లు ముందుకూ వెను కకూ గస్తీలు తిరుగుతూ ఉండటంవల్ల ప్రజల రాకపోకలకు అంతరాయంగా ఉంది. దీనికితోడు హాటమెన్‌వీధిలో కలిసే వీధులనన్నింటిని కట్టివేశారు. పట్టణం వెలుపల వదలి వేసిన రెండు విమానాశ్రయాలకి బదులుగా పట్టణ మధ్యలో ఒక విమానాశ్రయం నిర్మిస్తూ ఉన్నారు. చలిలో చమటలు

నోడ్చుకుంటూ యీగలు ముసిరినట్లుగా కార్మికులు యీ నిర్మాణ కార్యకలాపం కొనసాగిస్తున్నారు. అప్పుడప్పుడు కమ్యూనిస్టు ఫిరంగిప్రేలుతలకు జవాబుగా పార్కులలోని ఫిరంగులు ప్రేలాగినప్పుడు పట్టణంలోని ఒక భాగంభాగం అదిరి పోయేది.

రెడ్ హాల్ నీ పురుషుల పడకటిండ్లను కలిపే వీధిమీద అనేక తుపాకిగుండ్లు ప్రేలాయి. ఒక గుండు పడకటిండ్ల భాగానికి తగిలి మా గది ఒకటి నాశనమైనది. ఆ సమయంలో గదిలో ఉండే యిద్దరు విద్యార్థులు బయటికి వెళ్ళిఉండటంవల్ల ప్రాణం దక్కించుకున్నారు. తమ ఆజన్మశత్రువులైన విద్యార్థులలో అలజడి కలిగించడానికి నగర దక్షిణ ప్రాంతంలోని సైనికులే యీ విధంగా చేసినట్లు రుజువుపడింది. ఆ బాంబుముక్కలు విమాన విధ్వంసక తుపాకులనుండి వచ్చిపడి ఉంటాయనీ, ప్రజావిమోచన సైన్యము పైటామీద ఎప్పుడూ బాంబులను వెయ్యదనీ, దగ్గరలో మిలిటరీ లక్ష్యాలు ఏమీ లేకపోవటమే యిందుకు కారణమనీ మా నాయకులు మాకు ఋజువుగా చెప్పారు. అదృష్టవశాత్తు బాంబుప్రేలుళ్లు పగటిపూటనే సంభవించాయి. కర్ఫ్యూ విధించడంవల్లా, దీపాలు లేకపోవటంవల్లా చీకటిలో బయటికి వెళ్ళటం అంటే ప్రాణాంతకమే. గస్తీదళాలు చీకటిలో వెళ్ళే తమ మిలిటరీ కార్లమీదనే కాల్పులు జరిపిన కథలు మేము అనేకం విన్నాము.

విద్యుచ్ఛక్తి, నీటిసరఫరా ఎప్పుడైతే నిలిపివేయబడ్డాయో, అప్పుడే మేము రక్షణ సైన్యాల బారిన పడకుండా కళాశాలను ఎట్లా సంరక్షించుకోవాలో పథకాలు వేసు

కున్నాము. పురుష విద్యార్థులు రక్షణ విధానాలను దృఢతరం చేశారు. స్త్రీ విద్యార్థులు పడకటిండ్ల తలుపులకు అడ్డంగా యిటుకలను పేర్చారు. అవసరమైనప్పుడు తెరవడానికి వీలైన ఒక తలుపుకు అడ్డంగా కుర్చీలు బల్లలు పేర్చాము. ప్రత్యేక ఏజెంట్లు ఏక్షణాన్నైనా వచ్చి తలుపులు పగలగొట్ట వచ్చునని మాకు హెచ్చరికలు అందాయి.

ఆత్మరక్షణ దళాలుగా మా నాయకులు మమ్మల్ని విభజించారు. రాత్రిళ్లు కాపలా కాయటం మేము చేయవలసిన పని. ఎనిమిది మొదలు అర్ధరాత్రి వరకూ ఒక దళం, అర్ధరాత్రి మొదలు నాలుగు గంటలవరకూ ఒక దళం, ఉదయం నాలుగు మొదలు ఎనిమిది గంటలవరకూ ఒక దళం గస్తీ తిరుగుతూ ఉండాలి.

ఫిరంగుల మ్రోతలకి, విద్యుచ్ఛక్తి లేమికి, వీధులలో మామీద వడాలనే సోల్జర్ల దుర్మదవడికి, ఆహార సామగ్రుల తోనూ మందుగుండు సామానులతోనూ యిష్టం వచ్చిన వేగంతో పోయే ఆర్మీట్రక్కుల రొదకి మేము అలవాటు పడి పోయాము. ఇళ్ళ కప్పులమీదుగా ఎగిరి హాటమన్ విమానాశ్రయంలో దిగే రాక్షస విమానాల మ్రోతలకి కూడా మేము అలవాటు పడిపోయాము.

మేము ఆందోళన చెందేదీ ఆశతో ఉండేదీ తాజా పుకార్లమీద ఆధారపడి ఉండేది. జనరల్ ఫూసోయీ లొంబడ దల్చుకున్నాడు. అది నిజంకాదు. రాతిగుండె వాళ్ళు నిజంగా చావదలుచుకున్నారు—అథవా తమ సోల్జర్లను చావమని అడుగుతారు. పోరాటాన్ని శాంతియుతంగా అంతమొందించ

టానికి వీలుగా రాయబారాలు సాగించటానికి మ్యునిసిపల్ కౌన్సిల్ సభ్యులు రహస్యంగా సరిహద్దులను దాటివెళ్ళారనే సమాచారం అందగానే మేము బ్రతుకుజీవుడా అనుకున్నాము. ఎన్‌చింగ్‌నుంచి, సింగ్‌హువా నుంచి కొందరు విద్యార్థులు దూసుకుని వచ్చి తమ విమోచనకారుల పరిస్థితులు యథా పూర్వక రూపం దాల్చటానికి ఏవిధంగా సహాయం చేస్తున్నదీ చెప్పారు. తాము పట్టణంలోకి రావడానికి ప్రజావిమోచన సైన్యం తమకు ప్రోత్సాహం కలిగించిందని వారు అన్నారు. పొలాలగుండా తమ సైకిళ్ళను తోసుకుని వెడుతున్నప్పుడు వారిమీద నేషనలిస్టులు కొన్నిసార్లు తుపాకులు ప్రయోగించారు. దైవవశాత్తు గురితప్పటంవల్ల ప్రమాదం ఏదీ సంభవించలేదని కూడా వారు చెప్పారు.

శాంతి సంప్రదింపులు జరుపుతూఉన్న నాయకులలో ఒకరైన మేయర్ హోని హత్యచేయడానికి ప్రయత్నం జరిగిందనేవార్త పత్రికలోపడింది. ఫిరంగిగుండు ఆయన ఇంటి నడికొప్పుమీద పడట్లుగా ఆ వార్త సారాంశం. కాని 'రాతిగుండె'వాళ్ళు ఏజెంట్లద్వారా టైంబాంబ్‌ను నడికొప్పుమీద ఉంచినట్లు మాకు తెలుసును. బాంబుప్రేలుడు తనకుమార్తెను పొట్టనుబెట్టుకొని తనకు గాయంచేసినా మేయర్ హో నగర శాంతికోసం తీవ్రంగా కృషిసల్పుతూనే ఉన్నాడు.

ఆఖరి పోరాటంకోసం రక్షణదళాలు సర్వసన్నాహాలు చేశాయి. పార్కులలో కొత్తఫిరంగులు వచ్చిచేరాయి. జనవరి 22 న ఉభయపక్షాలవారూ రక్తపాతాన్ని అంతమొందించడానికి అంగీకారానికి వచ్చినట్లుగా మేము చదివాము. 'లోబడుట'

అనేమాట ఎక్కడా ఉపయోగించబడలేదు. పూర్తివిజయం మాదేననే విషయం తెలుసుకోనడానికి అధికారప్రకటన పాఠాన్ని మేము చదవవలసిన అవసరం లేకపోయింది. మేము గెలిచాము; మాకు స్వాతంత్ర్యం ప్రసాదించిన కామ్రేడుల ఆగమనానికి ఓపికతో వేచియుండుట మేము చేయవలసినపని.

మా ఇంటిగేటుముందర సైకిలును ఆపాను, యీ నెలంతా ఎంతో ఉత్సాహపూరితమైనదని నాకు అనిపించింది. ముందురోజులలో జ్ఞాపకం ఉంచుకోవలసినది ఎంతోఉన్నది. రేపటిఉదయం లేవగానే విజయం మా అరచేతిలో అరటిపండు అవుతుంది.

మరుసటిరోజుఉదయం పట్టణములో పశ్చిమద్వారం గుండా ప్రజావిమోచనసైన్యాలు వస్తాయో ఎవరికీ తెలియదు. కళాశాల ఆవరణలో ఎందుకైనా మంచిదని మధ్యాహ్నానికి పూర్వమే మేమంతా సమావేశమైనాము. మేమంతా బారులు తీరి నిలబడ్డాము. క్రితంరాత్రి మేము తయారుచేసిన జెండాలను మా నాయకులు మాకు పంచిపెట్టారు. ఇంతలో పశ్చిమ ద్వారంవద్దనుంచి సైకిలుమీద వార్తాహారుడువచ్చి సైనికదళాల జాడ కానరాలేదని చెప్పాడు. బారులలోనుంచి మేము తప్పుకుని తెచ్చుకున్న భోజనాలు ఆరగించటం ప్రారంభించాము.

ఒకటిన్నరగంటలకి మా నాయకులు "పదండివెడదాం" అన్నారు. తిరిగి బారులుతీర్చి మేము బయలుదేరాము. సైనిక దళాలు రెండుగంటలకు వస్తున్నవార్తను అందరికీ అందజేశాం. నగరంలో పశ్చిమంగావెడుతూ మేమంతా 'ఉత్సాహంతో పాటలు, పదాలు పాడటం ప్రారంభించాము. దుకాణదారులు,

ఇళ్ళవాళ్ళు యీావింత ఏదో తెలుసుకోవాలని బయటికి వచ్చారు 'ప్రజావిమోచన సైన్యం వస్తోంది' అని మేము కేకలు పెట్టాము. మాతోపాటు వాళ్ళలో కొందరు అనుసరించారు.

ప్రజావిమోచన సైన్యం రాలేదు. మేము పాటతర్వాత పాటగా చాలా పాటలు పాడాము. మూడు గంటల తరువాత మా వార్తాహరుడు శరవేగంగా సైకిలుమీద వచ్చివాలాడు; "వాళ్లు వస్తున్నారు. దారిలో ఉన్నారు" అని అరిచాడు. మొదట పీలగానూ తర్వాత గట్టిగానూ పాటల శబ్దం పశ్చిమ దిశనుంచి మాకు వినిపించింది. మాలో ఉద్రేకం ఉత్సాహం వెల్లివిరిసింది. మా దళానికి ముందున్న కుర్రవాడు తన చెయ్యి పైకెత్తాడు. మేము పాడటం ప్రారంభించాము.

"సాగరమును దివిటీపట్టు దీపస్తంభానివి నీవు
సరియైన దారినడపు సరంగువు నీవు
వీర ప్రజావిమోచన సైనికులారా! ప్రజాపుత్రులారా!
మా దిక్సూచిలో మార్గదర్శకులు మీారే
ఎల్లప్పటికీ మీా వెనువెంట మేమువస్తాం
చైనాకి స్వాతంత్ర్య సిద్ధిస్తుంది! సిద్ధిస్తుంది స్వాతంత్ర్యం!"

పెనుకేకతో పాటను ముగించి పశ్చిమం వైపు తిరిగి చూశాము. కాని వీధియింకా ఖాళీగానే ఉన్నది. మళ్ళి మొదలు పెట్టాము.

"సాగరమును వెలుగొందచేయు దీపస్తంభానివి నీవు..." గంభీరపు సంగీతధ్వని మాపాటను ముంచివేసింది. టాపుమీాద రెండు లౌడ్ స్పీకర్లు కలిగిన ఒక ట్రక్కు మా వీధిగుండా

వస్తోంది లౌడ్ స్పీకర్ల లో నుంచి వస్తోన్న సంగీతం కట్టుబడింది. అందులోనుంచి బిగ్గరగా ఒకరి కంఠం యీ విధంగా వినిపించింది "ప్రజావిమోచన సైన్యానికి స్వాగతము! పైపింగ్ లో ప్రవేశించనున్న ప్రజావిమోచన సైన్యానికి సుస్వాగతము!"

మొట్టమొదటగా 'ఆర్మీ పైటర్'ను మేము చూచాము. నడుముకు ఆనించిన 'టామిగన్'ను ఏటవాలుగా పుచ్చుకుని గంభీరంగా అతను అడుగు వేస్తున్నాడు. గంధంరంగు యూనిఫారములను ధరించిన పదాతి దళాలు వెనుక వచ్చాయి. సైనికులు చూపులకి బాగా ధృడంగాను ఆరోగ్యంగానూఉన్నారు. మంచి బింకంగానూ ఉన్నారు. వారి ముఖాలు నున్నగా మెరుస్తూ ఎంతో చక్కగా ఉన్నాయి.

నడుస్తూ ఉన్న దళాల మధ్యకి పైటానుంచి వచ్చిన ఒక బాలిక చేతులో పువ్వులు ఉంచుకుని పరుగెత్తింది. మొదట సిపాయి కోటుకు గుచ్చాలని ప్రయత్నించింది. ఆమె ఆవేశాన్ని చూచిన ఆ సిపాయి ఏ భూతాన్నో చూచినట్లుగా ఆమెను పక్కకు త్రోసివేశాడు. ఆ పిల్ల రెండో సిపాయిని పట్టుకుని ఏవిధంగా నైతేనేం, పువ్వును అతనికోటుకు గుచ్చింది. స్నేహితులంతా చప్పట్లు చరిచి కోలాహాలం చేయటంతో చచ్చే సిగ్గుగా ఆమె అక్కడనుంచి వెనుకకు పరుగెత్తుకొని వచ్చేసింది.

కోటుకి పువ్వులు గుచ్చిన సోల్జర్ ముఖాన్ని నేను పరికించాను. మొదటివాని లాగే అతనుగూడా భయపడ్డాడు. సామాన్య ప్రజలలోనుండి వచ్చిన యీబాలుడు, పట్టణవాసపు పిల్ల ఉత్సాహాతిరేకాన్ని అర్థంచేసుకోగలరా అని నాకు

అనిపించింది. వాళ్ళముఖాల వైపు మరోకసారి చూశాను. చర్మపు టోపీల క్రింద ఎంతో దృఢంగానూ అందంగానూ మెరుస్తూ ఉన్నాయి. ప్రజావిమోచన దళంలోని సైనికులంతా యీవిధంగా ఉంటే అంతకన్న మేము గర్వించతగ్గది వేరే ఏమీ ఉండదు.

తోటి విద్యార్థులంతా ఇదేరకమైన ఉత్సాహాన్ని వెలిబుచ్చారు. అమిత ఆవేశపూరితులైన 'క్రియాఉత్సాహులు' అభ్యుదయవాదులు తమ తమ ప్రియురాండ్రను ఎంతో కాలానికి కలుసుకుంటున్నట్లుగా ఆనందంతో మునిగిపోయారు. వారి కేకలు ఉత్సాహం ప్రక్క వాళ్ళకుకూడా సోకింది. పైటా జనాభాలో ప్రతిఒక్కరూ తమకు సత్తువ ఉన్నంతవరకూ జేజేధ్వానాలు చేశారు.

పదాతిదళం వెనుక రెండు జీపులు వచ్చాయి. ఆ తర్వాత కొంత విరామం. ఇది అవిరామమైన ఊరేగింపుగదా! బహుశః మిగతా దళాలు వీరిని కలుసుకోనలేకపోయి ఉండవచ్చునని నేను అనుకున్నాను. జీపు టాపుమీద నిలబడ్డ ఇద్దరు విదేశీయులు అసందిగ్ధంగా అటూ ఇటూ మా వైపు చూస్తున్నట్లు నేను చూశాను. నా ప్రక్కనున్న పిల్లను కదిల్చాను. "వాళ్ళా? విదేశీయులు. బహుశః వార్తాపత్రికల వాళ్ళు కావచ్చును. లేదా ఇంపీరియలిస్టు రాయబార కార్యాలయం వాళ్లు కావచ్చును. వాళ్ళకు అర్పించడానికి యీరోజున మన వద్ద పత్రపుష్పాలు ఏమీ లేవుగా" అన్నది.

జనంలో విపరీతమైన జై జై ధ్వానాలు చెలరేగాయి. మావ్ సేటుంగ్ బొమ్మలతో జయపతాకలతో ఊరేగింపుగా

వస్తున్న సింగ్‌హువా ఎన్‌చింగ్ కార్మికులకే యీ జయ ధ్వానాలు. మాకంటే ఒక నెలముందుగానే విమోచన చెందిన అదృష్ట మిత్రులవైపు మేము చేతులు ఊగించాము. మమ్మల్ని చూచినట్లుగా వారుకూడా కేకలు వేస్తూ మా వైపు జెండాలు ఊగించారు.

సింగ్‌హువా, ఎన్‌చింగ్ విద్యార్థులు, సోల్జర్లు సిండిన ట్రక్కులు బాండ్ వాద్యదళాన్ని అనుసరించి వస్తున్నాయి. వాటి వెనుక పాతకార్లలో టెలిఫోన్ కార్మికులలాంటి వాళ్లు ఉన్నారు. వాటిమీదనున్న అట్టలపైన "తమ విమోచనను సాధించిన ప్రజలకు శుభాకాంక్షలు" అని వ్రాసి ఉన్నది.

ఇంకా ఏమి వస్తాయో అని మేము ఆసక్తిగా చూస్తున్నాము. పౌర శకటాలతోనే ఆ ఊరేగింపు ఆఖరు. మేమంతా బారులలోనుంచి తొలగి ఊరేగింపువెంట బయలుదేరాము. అంతా అయినతర్వాత వీధిలో సైనికులను అనుసరించి వెళ్లాము. ఒక ప్రజోపయోగ భవన ఆవరణలో ఒక యూనిట్ ఆరాత్రికి కాంప్ చేయడానికి సన్నద్ధమౌతున్నది. మేము సైనికులచుట్టూ గుమికూడాము. తమ సరంజామాను ఆయుధాలను చక్కగా అమర్చుకోవటం మేము చూశాము. వారికోసం మేము పాటలు పాడాము. 'యాంగ్-కో' నాట్య నృత్యాన్ని ప్రదర్శించాము. వారు శ్రద్ధగా తిలకించి ఆలకించారు.

అంతా అయినతర్వాత ఎవరి ఇళ్ళకు వాళ్ళం బయలు దేరాము. ఎంతగా అలసిపోయానో అప్పటివరకూ నాకు తోచనేలేదు. అప్పుడు నాకు కావలసినదల్లా కడుపునిండా తిండి తినడం, నీళ్ళు త్రాగటం, హాయిగా నిద్రపోవటం.

ఇంటికి వెళ్ళి తిండితిని పక్కమీద వాలాను. ఉత్సాహాతిశయాలవల్లా, నడకవల్లా విపరీతంగా అలసిపోయాను. ఇంత అలసట నాకు ఎప్పుడూ కలగలేదు. ఆ కారణంగా నిద్రరావటం కష్టం అయింది. నేను చూచిన సైన్యాలసన్నింటిని గురించి ఆలోచించడం ప్రారంభించాను. పెకింగ్‌లో గడిపిన కొద్దికాలం లోను అనేకులను చూచాను - యుద్ధకాంక్షుల సైన్యాలు, జపాన్‌యొక్క సుశిక్షితమైన సైన్యాలు, అనేక సంవత్సరాలుగా రణరంగాలతో విసిగివేసారి నిస్పృహా ముఖాలు వేసిన నేషనలిస్టు సైన్యాలను నేను చూచాను. ఇక అమెరికన్ సైన్యాల సంగతి చెప్పనే అక్కరలేదు. ఎప్పుడు యీ దేశాన్ని వదలి ఇంటికి పోతామా అనేట్లు ఉండేవారు.

గాలి ఎగరగొట్టిన దుమ్ముతో నా కళ్ళు మంటలు పెడుతున్నాయి. కాళ్లు ఎంతతీపులుగా ఉన్నాయి. ఇలాంటి విషయాలను గురించి మనం తలంచకూడదు. ఎంతో అలసటగా ఉంది. నిద్రపోతే ఎంత బాగుండును. కాదు-తరుచుగా ఒకళ్ళతో ఒకళ్ళం చెప్పుకున్నమాటలు, పథకాలను ఏ విధంగా కొనసాగించాలో, దేశానికి ఎంతటి ఆనందాన్ని కొనితెస్తామో- యీ విషయాల నన్నిటిని గురించి ఆలోచించాలి. ప్రజాప్రభుత్వం మాకు యదార్థమైన ప్రజాస్వామ్యాన్ని ప్రసాదిస్తుంది... మా నాయకులు వ్యక్తిగత పదవులకు లాభాలకు ఆశించారు... మనం ప్రజలను ప్రేమించాలి; ప్రజలకోసం మనం కష్టించాలి... వారు చెబుతున్నారు-అంతకుమించి వారు చెబుతున్నది ఏమిటి? విప్లవోద్యమంలో ప్రముఖపాత్ర వహించేది మా విద్యార్థులేనని వారు చెబుతున్నారు. సామాన్య మానవులవలె

కాకుండా ప్రజాశ్రేయస్సుకి మేము పాటుపడాలని అంటు న్నారు...ప్రజల కోసం కష్టించటంకన్న మంచిపని మరొకటి ఏమున్నది...

నా కనురెప్పల క్రింద యిసుక రేణువులు కదులుతూనే ఉన్నాయి. కాని యిప్పుడు కళ్లు అంతబాధకలిగించటంలేదు. నా శరీరాన్ని అంతటా అలుముకున్న అలసట నా ఆలోచన లకు జోలపాట అయింది. నాకు నిద్రపట్టింది.

## 2

---

## ఒకదారం పోగుకూడా తీసుకోరాదు

ఒక నగరాన్ని ఆక్రమించిన తర్వాత సోల్జర్లు ఏవిధంగా ప్రవర్తిస్తారు? ఆఫీసర్లతోపాటు వచ్చి ఇళ్ళ తలుపులు కొాది తమకు వసతి చూపించమని, తిండి పెట్టమని, అది మా విధ్యుక్త ధర్మమని పీడించుతారా? ఇళ్ళలోకి జొరబడి తామే యజ మానులవలె సంచరిస్తూ బియ్యం బొగ్గులు తస్కరించి యిల్లూ వాకిలీ నానాకశ్మలం చేస్తారా? ముందుగానే జాగ్రత్తపడి కంటికి కనపడకుండా దాచుకొనని వస్తువులను చేబదులు యిమ్మంటారా?

ప్రజా విమోచనదళం యిలాంటి పనులు చేయదని ప్రతీతి. ఫిబ్రవరి 3 వ తేదీన పెద్ద పెరేడ్ జరిగింది. తొమ్మిది గంటలసేపు బారులుతీరిన దళాలు టాంకులు కదిలివెళ్ళాయి.

జపాన్, అమెరికన్ సైన్యాలవద్దనుంచి గుంజుకున్న ఆయుధాలతో వీరు ముందుకు వెళ్ళారు. సురక్షితులై ఉత్సాహ ఉల్లాసాలతో కూడిన సోల్జర్లను చూస్తే మా అందరికి ఎంతో ఆనందం కలిగింది. కాని ఛాందసులైన కొందరి మనస్సులో అనేక ప్రశ్నలు తలలెత్తాయి. వాటికి జవాబులు దొరకాలి. యుద్ధభూమిలోనూ, ఊరేగింపులోనూ యీ సోల్జర్లు తమ అధికారుల ఆజ్ఞలకు బద్ధులై నడవాలని తెలుసును. అయితే సామాన్య ప్రజానీకంపట్ల వారి ప్రవర్తన ఏవిధంగా ఉంటుంది? ఇతర సోల్జర్లవలె వీరు కూలీలను చావమోదుతారా? తన ఇంటిలో సోల్జర్లు బసచేసి ఉండగా ఆడపిల్ల ఏవిధమైన అలంకరణా లేకుండా సర్వసామాన్యంగా కనిపించాలా? వాళ్ళు దొంగతనం చేస్తారా? నగరంలోకి వస్తున్నప్పుడు వాళ్ళ ముఖ కవళికలను చూస్తే అట్లా అనిపించలేదు.

కాని సోల్జర్లు అనేవాళ్ళు తమకు పది కావాలనుకుంటే పది తీసుకొనగలరు. వీరి సత్ప్రవర్తను గురించి వినవచ్చే వార్తలు ఉత్త ప్రచారం అయిఉండవచ్చును. సామాన్య ప్రజలకు సహాయం చేయడమే వారిధర్మమని నేను నమ్మవచ్చునా? మేము విద్యార్థుల మంతా అట్లాగే భావించాము. కాని సోల్జరు ఉన్న గదిలోనికి నా చిన్న చెల్లెలును వెళ్ళనివ్వటం గాని, ఉత్తరం పోస్టుచేయడానికి తపాలా ఆఫీసుకు వెళ్ళినప్పుడు నా సైకిలును కొంచెం చూస్తూ ఉండమని ఏ సోల్జరునో అడగటంగాని నాకు యిష్టం లేకపోయింది.

ప్రజోపయోగ భవనాలముందు ట్రాఫిక్ పోలీసుల ప్రక్క నిలబడి కాపుకాస్తున్న ప్రజావిమోచన సైనికుల ధోరణి

గాని నగరం అంతా పరికించి చూస్తూనే ఉన్నది. "కమ్యూని స్టు బందిపోట్లను హతమార్చండి" అని ఇదివరలో భవనాల గోడలపైన వ్రాసిఉన్న నినాదాలస్థానే ప్రజావిమోచన సైన్యానికి స్వాగతంపలికే నినాదాలు యిప్పుడు వ్రాయబడి ఉన్నాయి. అఖండ ప్రజాశక్తిని ప్రదర్శించే పోస్టర్లు గోడలను అలంకరించాయి. చైనా దేశం యావత్తూ త్వరలోనే విమోచన చెందుతుందని కొన్ని చోట్ల వ్రాశారు. నగర రక్షణ పేరుతో పాత ప్రభుత్వం పేర్చిన కళ్ళేలాన్నంతా గుంపులు గుంపులుగా మనుష్యులు తొలగించివేసి శుభ్రంచేశారు. భవనాలముందు రోడ్ల మొగదల కట్టబడిన అడ్డు తొలగించి వేశారు. నిరుపయోగమైన గోతులను పూడ్చివేశారు. హటమన్ వీధిలో నిర్మింపబడిన విమానాశ్రయాన్ని కట్టడాలను తొలగించివేశారు.

నగర వ్యవహారాలను చక్కబరచడానికి కొత్త మిలిటరీ కంట్రోల్ బోర్డు హుకూములు జారీచేయడం ప్రారంభించింది. ఈ సంఘంలో అధికారులంతా కమ్యూనిస్టులు కారు. పాత ప్రభుత్వ స్టాఫ్ మెంబర్లను తమతమ పదవులలో ఉండమని కోరారు. పాత వార్తా పత్రికలలో చాలా భాగం యథాప్రకారం వెలువడుతూనే ఉన్నాయి. అయితే యీ పత్రికలు లిన్ పియోని జనరల్ నియెహ్ యుంగ్-చెన్‌ని బందిపోట్లు అనడానికి మారుగా ప్రజావీరులని పేర్కొంటున్నాయి. నగరానికి తిరిగి నీరు లభ్యం అయింది. రాత్రివేళల విద్యుత్ దీపాలు జపాన్‌తో యుద్ధం ముగిసినప్పటికంటే కూడా దేదీప్యమానంగా వెలుగుతున్నాయి.

ప్రజావిమోచన సైనికులు ఏ విధంగా ఉంటారో

తెలుసుకోవడానికి త్వరలోనే నాకు ఒక అవకాశం చిక్కింది. పైటా విద్యార్థులం ఒక ఉద్యమాన్ని లేవదీశాము. పరిసర ప్రాంతాలను సంరక్షిస్తున్న సోల్జర్ల ఉపయోగార్థం తువ్వాళ్లు, పళ్ళుతోముకునే బ్రష్‌లు, సబ్బులు, వ్రాసుకునే కాగితాలు, యింకా అనేక అవసరమైన వస్తువులు ప్రోగుచేశాము. ఈ వస్తువులను పంచిపెట్టడానికి కొందరు విద్యార్థులతో పాటు నేను గూడా ట్రక్కులో వెళ్లాలని ప్లాన్ వేసుకున్నాను.

ఏరోజునైతే మేము వెళ్లాలని అనుకున్నామో ఆరోజు ఉదయం లేచేటప్పటికి నాకు గొంతుకనొప్పి జ్వరం వచ్చాయి. క్లాస్‌రూమ్‌లో మేమంతా కలుసుకోవాలని ముందు నిర్ణయించుకుని ఉన్నాము. నా ముఖ కవళికను నా మిత్రుడు చాంగ్ గుర్తించాడు. "మేరియా! యివ్వాళ నువ్వు అదోలా ఉన్నావే. నుదురుతాకి చూడడానికి నీకు ఏమీ అభ్యంతరం లేదుగదా?" అన్నాడు.

"ఓహ్-నీకు జ్వరం తగిలినట్లుగా ఉంది. క్రితం కొద్ది రోజులనుంచి నువ్వు చెందుతున్న ఆవేశమే కారణంకావచ్చును. ఈ చలిగాలిలో టాపులేని ట్రక్కులో పడి రావటం మంచిది కాదు. ఈ బాదరబందీనంతా వదులుకుని శలవపెట్టి హాయిగా ఒకటిరెండు రోజులు యింటివద్ద విశ్రాంతి తీసుకో కూడదా?"

నాతోపాటు అతను గేటుదాకా నడచివచ్చి నా కోసం బండీని పిలిచాడు. "విశ్రాంతి తీసుకో" అని నాభుజం తట్టాడు. బండి బయలుదేరింది. చుట్టుప్రక్కల గోడలమీద పోస్టర్లు, నినాద అక్షరాలూ వెనుకకు వెళ్ళుతున్నాయి.

మా తండ్రిగారి యింటివద్ద బండి ఆగింది. నా బాధ ఏమిటో నాకు తెలిసింది. నా తల తిరిగిపోతోంది. నా కాళ్ళ చుట్టూ బండివాడు దుప్పటి చుట్టబెట్టాడు. నేను సుస్త్రీగా ఉన్నానని అతడు గ్రహించాడు. నన్ను బండిలోనే కూర్చుండ నిచ్చి గేటు గంట ప్రయోగించాడు.

తలుపు తెరుచుకున్నది. ఒక యువ ప్రజావిమోచన సైనికుడు బయటకు వచ్చాడు.

"ఈ కుటుంబంలోని వారికోరకా మీరు అడుగు తున్నది?" నమ్రతగా ఉత్తర దేశయాసతో ప్రశ్నించాడు. నన్నుచూచి చిరునవ్వు నవ్వాడు. "చూచి వస్తాను ఉండండి"

ఆశ్చర్యం నాకు తాత్కాలికమైన బలాన్ని చేకూ ర్చింది. బండిదిగి బాడుగయిచ్చాను. నా రాకను గురించి చెప్పడానికి వెడుతున్న యువసోల్జర్‌ను ఆపాలని అనుకుంటూ ఉండగా లోపలినుంచి మా ఆయా వచ్చింది. తలుపుప్రక్కగా నేను నిలబడి ఉండటం చూచి పెద్దపెట్టున నవ్వటం ప్రారం భించింది.

"భలే భలే! నువ్వా తల్లి! ఆ యువసోల్జర్ వచ్చి ఒక చిన్నారి గృహిణి ఎవరికోసమో వచ్చిందని చెప్పాడులే"

వివాహం కాని వనిత "చిన్నారి గృహిణి" అని పిలి పించుకోవడానికి అయిష్టత చూపుతుంది. కాని నాకు మాత్రం నిజంగా నవ్వువచ్చింది. అమాయిక కర్షక బాలురలో యిటు వంటి వాటివల్లనే ఆకర్షణ ఉందని నాకు అనిపించింది. కన్యాత్వ చిహ్నములైన తోకల్లాంటి జడలు స్త్రీ తలమీద కనుపించ

వచ్చేవాడు గ్రామాలలో పుట్టిపెరిగిన ఆ యువకుడు "చిన్నారి గృహిణి" అనుకోవటంలో ఆశ్చర్యం ఏముంది?

దురదృష్టవశాత్తూ మానాన్న, అమ్మ ఇంట్లోలేరు. నేను మంచం ఎక్కాను. ఆయా ఒక కప్పులో వేడినీళ్లూ రెండు ఆస్పరిన్ బిళ్ళలూ తీసుకొనివచ్చింది. ఆమెను నా మంచంమీద కూర్చోబెట్టుకొని "యీ సోల్జర్లు యిక్కడికి ఎట్లావచ్చారు." అని అడిగాను "పాతప్రభుత్వసోల్జర్లవలె అనుమతితో నిమిత్తం లేకుండా ఇళ్ళల్లో జొరబడి వీళ్ళుకూడా అదేవిధంగా ప్రవర్తిస్తున్నారా?"

"ఒకరోజున ఒక అధికారి మీ నాన్ననుకలుసుకోడానికి వచ్చాడు. మీ ఇంట్లో ఒకగది ఖాళీగాఉన్నదిటగదా అని అడిగాడు. మీనాన్న ఆహ్వానంకోసం వారు ఎదురుచూచారు. ఎలాగయితేనేం, వాళ్ళు యిక్కడికి వచ్చిచేరారు. వాళ్ళు వచ్చినప్పటినుంచి నాకు పనితోసరిపోతోంది. 'అమ్మా త్రాగేందుకు కాసిని వేడినీళ్ళు యిస్తారా? అమ్మా అగ్గిపెట్టె ఒక్కసారి యిప్పించండి' యీవిధంగా ఏదో ఒకపనితో నాకు ప్రొద్దుపోతోంది."

"వాళ్ళు అడగకుండానే కాచిననీళ్ళు అగ్గిపెట్టే నువ్వు యివ్వరాదా?"

"అదే యిక నేను చెయ్యబోయేది" తాత్కాలికమైన అసంతృప్తి ఆమెకళ్ళలోనుంచి తప్పుకున్నది. చిరునవ్వుముఖంలో వెలిగింది. "ఏదోఒకపని వాళ్లు చెబుతూనే ఉంటారు. ఈ బాలురంతా మంచివాళ్ళు, నమ్మకమైనవాళ్లు; డజన్లకొలది సంవత్సరాలుగా నేను అనేకరకాల సోల్జర్లనుచూచాను. కాని

నాలాంటి సామాన్య ప్రజపట్ల ఆదరంతో మాట్లాడే యిలాంటి సోల్జర్లను నేను యింతవరకూ చూడలేదు. చేయడానికి తమకు స్వంతపనులంటూ లేనప్పుడు వాళ్లు నా పనిపాటల్లో ఎంతో సహాయంచేస్తున్నారు దొడ్డిఊడవటం,బొగ్గులుమోయటం..."

"అమ్మా! అమ్మా!"వారు ఆమెను మళ్ళీపిలుస్తున్నారు.

ఆయా ఒక్కదూకుదూకింది. తలుపుతెరిచింది, నిమిషంలో మాయమయింది. గదిలో నేను ఒంటరిగా ఉన్నాను. ప్రజావిమోచన సైనికుల "మూడు నిబంధనలు" "ఎనిమిది ఆశయాలు" నాకు జ్ఞప్తికివచ్చినవి. అన్నింటిలోకి ముఖ్యంగా ఆసక్తి గొలిపేది రెండవనిబంధన: "ప్రజలనుంచి ఒక సూదిగాని దారం ముక్కగాని తీసుకొనరాదు" నాకు "ఎనిమిది ఆశయాలు" కూడా ఎంతో నచ్చినవి. "సోల్జర్లు మంచిగామాట్లాడాలి. వాణిజ్యవ్యవహారాలలో న్యాయంగాఉండాలి. చేబదులు తీసుకున్నది వెంటనే తిరిగి యిచ్చివేయండి. మీవల్ల ఏదన్నానష్టం సంభవిస్తే పరిహారం చెల్లించండి. ప్రజలను తిట్టడం, కొట్టడం చేయకండి. స్త్రీలను అవమానించకండి." నేను చూచినదానిని బట్టి పి. యల్. ఎ. సోల్జర్లు యీనిబంధనలను అక్షరాలా ఆచరణలో పెడుతున్నారు. "ఈ సైన్యం విషయంలో తప్పు పట్టడానికి వీలులేదు" అన్న బాలునివాక్కు నిజం. నా తల నొప్పి తగ్గుతున్నట్లుగా అనిపించింది. కాని కాళ్లు యింకా బలహీనంగానే ఉన్నాయి. మళ్ళీ కళ్ళుమూస్తున్న సమయంలో ఆయా లోపలికివచ్చింది. "ఏంచెయ్యడానికీ తోచకుండాఉంది. నువ్వు చెప్పుతల్లి, వాళ్ళకు బియ్యంబదులుయివ్వమంటావా?"

బహుశః యింట్లో తగినంతగా బియ్యం ఉండిఉండవని నాకు తోచింది. "బదులు తీసుకున్నది వెంటనే యిచ్చి వేయండి" అన్నది నాకు జ్ఞాపకంవచ్చింది.

"ఇవ్వగలిగింది యివ్వు" అని ఆమెతో అన్నాను.

నా నిర్ణయం ప్రకారం చేసేదానికి వలె ఆమెనన్ను అడిగింది. కాని యిప్పుడు ఆ విషయమై నాతో వాదించటా నికి మొదలు పెట్టింది.

"అట్లా ఎలాచేయడం?" ముఖం గంభీరంగాపెట్టి ఏదో ఆరాటపడుతున్న దానివలె యిట్లా అన్నది.

"ఇంట్లోడబ్బు ఏమాత్రం లేనట్లు లైలై యజమానితో యీ ఉదయం చెప్పడం నేను విన్నాను. ఉన్న బియ్యం అంతా వాళ్ళకు యిచ్చివేస్తే యిక మనం తినేదేమిటి?"

"ప్రజావిమోచన సైనికులు తాము బదులు తీసుకున్నది తిరిగి యిచ్చివేస్తారని తెలిసిందేగా—ఏదోవిధంగా కొంతవాళ్ళకి యివ్వు"

"కమ్యూనిస్టులంటే మావిద్యార్థులు పూనుకునివస్తారు" ఆమె మాటల్లో స్వల్పంగా కోపం కనిపించినా మళ్ళీ నవ్వుతూ యిట్లాఅంది "ఇక్కడికి వచ్చిన తర్వాత యీ కుర్రకుంకలు యిరవై అయిదు బుట్టల బొగ్గులు అడిగి పుచ్చుకున్నారు. ఇంతవరకూ తిరిగి యివ్వలేదు"

దూరంగా "అమ్మా" అని వాళ్లు పిలుస్తూ ఉన్నారు.

"మన విమోచనానికి యిరవై అయిదు బుట్టలను వెచ్చించటం ఒక పెద్ద నష్టంకాదులే...నీకు వీలయినంత వాళ్ళకు యివ్వమని నేను అంటున్నాను. వాళ్లు యిందాకటి

నుంచి నిన్ను పిలుస్తూఉన్నారు. నువ్వు మాటుపలుకడానికి గూడా నిరాకరిస్తూ ఉన్నావు. ఇదే మరో సోల్జర్లు గనక అయితేనా నిన్ను యీపాటికి బయటికి లాగి చావమోది ఉండేవారు...ఇకనైనా నువ్వు వెళ్లు"

గ్లాసులో మిగిలిఉన్న నీటిని త్రాగివేశాను వంటినిండా దుప్పటి కప్పుకున్నాను ఇదే నా ఆఖరి నిర్ణయం అన్నట్లుగా గోడవైపుకి ముఖం తిప్పుకున్నాను.

మూడురోజులు మంచంమీద ఉన్నాను. నా ఆరోగ్యం కుదుటబడింది. నీళ్లు తీసుకు వెడుతున్న నెపంతో సోల్జర్లు నివసిస్తూ ఉన్న భాగానికి వెళ్లాను.

తలుపుకి లోపలి వైపున ఒక నలుచదరపు బల్ల ఉన్నది. వేరే కొయ్యసామాను లేదు. నేలమీద కంబళ్లు పరచి ఉన్నాయి. గోడకు ఆనించి గుట్టలు గుట్టలుగా వంటసామగ్రి, బట్టల మూటలు, గుర్తించడానికి వీలులేని ఆయుధసామగ్రి ఆనించి ఉన్నాయి. నేలమీద అయిదు–ఆరుగురు సోల్జర్లు కూర్చుని ఉన్నారు. మొదటి ముగ్గురు నన్ను చూడగానే లేచి నిలుచున్నారు. మొదటి అతను "మీకు శ్రమకలిగించినందుకు విచారంగా ఉన్నది కామ్రేడ్" అన్నాడు. "ఇక మిగతాపని మేము చేసుకుంటాము" అంటూ నా చేతిలోనుంచి కెటిల్ తీసుకుని థర్మోస్ సీసాలలో వేడినీటిని పోయటం ప్రారంభించాడు.

మరొక సోల్జర్ దూది దట్టించిన తన జాకెట్‌ను కిందకు లాగుకున్నాడు. తల క్రిందకువంచుకున్నాడు. గౌరవసూచకంగా ఏంచేస్తే బాగుంటుందా అని ఆలోచిస్తూ చుట్టూ చూసి తిరిగి

కూర్చున్నాడు. "చిన్నారి గృహిణి" అని ఇదివరలో అన్న ఆ కుర్రవాడు మాత్రం యింకా నిలబడే ఉన్నాడు. సిగ్గుతో అతని ముఖం ఎర్రబడింది. నిలుచుని ఉండటమా లేక కూర్చోవటమా అనే సందిగ్ధావస్థలో పడ్డాడు.

తొందర తొందరగా "దయయుంచి కూర్చోండి" అన్నాను.

అతను జవాబు చెప్పకుండా బల్ల వద్దకు వెళ్ళాడు. ఒక పెద్ద పింగాణీ పాత్రను తీశాడు. సగంవరకు నీటితో నింపాడు. అతి నమ్రతగా "కామ్రేడ్ యీ నీళ్లు పుచ్చుకోండి" అంటూ కప్పును నా వైపుకు జరిపాడు. అట్లా అంటూనే తన వెనుక నున్న కుర్చీని ఎవరో లాగివేసినట్లుగా పోయి మిత్రుల మధ్య కూలబడ్డాడు.

హఠాత్తుగా నేను గదిలో ప్రవేశించడంవల్ల వాళ్ళలో యీ అలజడికి కారణమైనది. వారి నమ్రత అమాయకత్వమూ నన్ను కదిలించివేసిట్లుగా వారితో నేను చెప్పలేకపోయాను. వినయపూర్వకంగా యీ మాటలు గొణిగాను.

"కామ్రేడ్స్, మిమ్మల్ని చూడడానికి ఎంతో ఆనం నందంగా ఉన్నది. మీకేదన్నా అవసరమైనప్పుడు అడగడానికి సంశయించకండి. ఇది మీ ఇల్లుగానే భావించండి."

జవాబుకోసం నేను ఎదురుచూశాను. వాళ్ళలో అలజడి కలిగింది. ఒక్కళ్ళూ జవాబు యివ్వడానికి ప్రయత్నించలేదు. వారు మొదటిరోజున నగరంలో ప్రవేశించినప్పుడు ఒక బాలిక పువ్వులు కోటుకు గుచ్చడానికి ప్రయత్నించిన సంఘటన నాకు జ్ఞాపకానికి వచ్చింది. వాళ్ళతో సంభాషణ కొనసాగించ వలె

నన్ను వాంఛ నాలో మాయమైపోయింది. చిరునవ్వు నవ్వి తల పంకిస్తూ ఆ గదినుంచి బయటకు పారిపోయాను. పది అడుగులు వేశానో లేదో, లోపలి నిశ్శబ్దం ఎగిరి చక్కా పోయింది. వాళ్లు మాట్లాడుకోవటం నేను విన్నాను.

దారిలో గుమ్మందాకా ఆయా తీసుకుని వెళ్ళి దిగబెడుతూ ఉన్న మా అమ్మ స్నేహితురాలు శ్రీమతి లీ కలిసింది. ఆవిడ పూర్వకాలపు మనిషి. ఆవిడ భర్త మధ్య తరగతి ప్రభుత్వోద్యోగి. అధికారులు ఆయన జోలికి పోలేదు. చిరునవ్వుతో శ్రీమతి లీ నేను ఎక్కడనుంచి వస్తున్నదీ అడిగింది. నేను నిజం చెప్పాను.

"కాలం ఎట్లా మారిపోయిందో చూశావా! వయస్సు వచ్చినపిల్ల...అందులోనూ చదువుకున్న పిల్ల తనంతట తానుగా సోల్జర్లకు నీళ్ళు అందించటం..." అంటూ శ్రీమతి లీ ఆయావేపు అదోరకంగా చూచింది. ఈసడింపుగా నేను ఆమెవైపు చూచాను. ఆయా సంచీలోని పిల్లిని ఆమె బయటకు వదిలింది "యీ యువసోల్జర్లు ఉన్నారే. వీళ్ళు కొత్తగా పొలాలలోనుంచి బయటపడిన వాళ్లు. వీళ్ళ ధోరణి నిజంగా తమాషాగానే ఉంటుంది. విద్యుత్ దీపాలను అర్థం చేసుకోవడానికి ఎన్నిపాట్లు పడిందీ ఆ కథ నువ్వువినే ఉంటావు. ఈ ఇంట్లో కొందరు సిగరెట్లు త్రాగాలనుకున్నారు. వెలుగుతూన్న బల్బుకు ఒకడు సిగరెట్టు ఆనించాడు. అగ్గిపెట్టెగాని కిరసనాయిలు దీపంగాని అందుబాటులో లేకపోవటంవల్ల వాడు అట్లా చేయవలసి వచ్చింది. బల్బుకు ఆనించిన సిగరెట్టు అంటుకోక పోవడంతో వాడు అగ్గిరాముడు అయిపోయాడనుకో"

పాశ్చాత్య పద్ధతిలో కట్టిన భవనంలో కొందరు సోల్జర్లు బియ్యం కడుగుకునే స్థలంకోసం వెతుకులాడిన కథ నేను యిది వరకే విన్నాను. అదే ఆమె మళ్లా చెప్పింది. వాళ్ళకి నీళ్ళు కనిపించినది ఒక్క 'టాయిలెట్' గదిలోనే. ఇది అంత అను కూలంగా లేదని వాళ్లు అనుకున్నారు. అయితేనేం బియ్యాన్ని అంతా తిరగబోశారు. కాని అధికంగా నీరు కావాలంటే ఏమిటి చెయ్యటం? "అక్కడ వ్రేలాడుతున్న గొలుసును లాగండి" వాళ్లు గొలుసు లాగారు. వాళ్ళముందు బియ్యం గిరుక్కున గుండ్రంగా తిరిగి గుడగుడమంటూ మాయమై పోయింది, వాళ్ళ ఆశ్చర్యానికి అంతంలేదు.

"అంత ముచ్చటైన కథ కాదు. కాని—" ఆమె పక్కుమంది.

"శ్రీమతి లీ, క్షమించాలి. ఇదంతా జరగటం మీరు చూశారా"

"లేదు...అయితే నువ్వు అనేది—"

"ఇది చూచినవాళ్ళతో ఎవరితోనైనా మీరు సంభాషించారా?"

"లేదు కాని యీకథ అందరూ విన్నదే."

"అవును నాకు తెలుసు. ఇది జరిగినట్లుగా చూచామన్న వాళ్ళతో నేను మాట్లాడలేదు. నేనేకాదు ఇతరులుకూడా అంతే. ఇలాంటి అసందర్భపు కట్టుకథలు ప్రచారం చేయటం వల్ల మీరు ఎవ్వరికీ ఉపకారం చెయ్యబోవటంలేదు."

నా మాటకు అడ్డంవచ్చి "వాళ్ళంతా సహృదయులైన

యువకులనీ మంచివాళ్ళనీ నేనూ అనుకుంటున్నాను” అని శ్రీమతి లీ అన్నది.

“మీ యింట్లోగూడా కొందరు సోల్జర్లు ఉన్నారుటగా! వాళ్ళ ప్రవర్తన ఎట్లాఉంది?”

“వాళ్ళంతా చాలామంచివాళ్లు. మేము మామూలుగా కూర్చునేగదిలో వాళ్లు ఉంటున్నారు. వాళ్లు ప్రవేశించడానికి ముందు వాళ్ళ కమాండర్ వచ్చి గదిలోని బల్లలూ కుర్చీలు మొదలైనవి తీసివెయ్యమనీ లేకపోతే అవి పాడైపోయే అవకాశం కలుగవచ్చుననీ చెప్పాడు. ‘అది చాలాకష్టంతోకూడిన పని’ అని మేము అన్నాము. అతను సామాను తొలగించక తప్పదని పట్టుబట్టాడు. గోడలమీదనున్న పాతపటాలుతప్ప మిగతా సరంజామాఅంతా వాళ్ళు తొలగించడానికి చివరికి మేము ఒప్పుకోక తప్పిందికాదు.

“యీ సైనికులు మూడురోజుల్లో అపూర్వమైన చిత్రపటాలను నాశనంచేస్తారని ఎవరు ఆలోచిస్తారు? నిజానికి అవి ఎంత విలువఅయినవో వారికి తెలియదు. కంపెనీ కమాండర్ యదార్థానికి ఎంతో ఆవేశంచెందాడు. ఆ చిత్రపటం ఎంత విలువఅయినదో తెలుసునా అంటూ తనమనుష్యులను చివాట్లు పెట్టాడు.” శ్రీమతి లీ చిరునవ్వుతో యింకా యిలాఅన్నది: “ఫరవాలేదు లేవయ్యా, దానికి నష్టపరిహారం వారు చెల్లించలేరు. ఒకవేళ చెల్లించినా ఆ బొమ్మను తిరిగి సంపాదించటం అసాధ్యం అని మాఆయన అతనితో అన్నారు.” ఏదన్నా నష్టం సంభవిస్తే దానికి మేము ముదరా చెల్లించాలి అని మాకు ఆర్డర్ ఉంది. ఆ ఆజ్ఞను నేను పాలిస్తాను” అని అతను మాతో

అన్నాడు. వాళ్లు యిచ్చిన పరిహారాన్ని మేము పుచ్చుకోక తప్పిండి కాదు.”

“ఇంకా ఏవస్తువులన్నా నాశనంచేయడంగాని తీసుకుపోవడంగాని చేశారా? పురాతనవస్తువులకు ఎంత విలువ ఉంటుందో వాళ్లు అర్థంచేసుకోలేరు. అదే వాళ్ళతోవచ్చిన బాధ” అన్నది ఆయా శ్రీమతి లీతో.

“నిజం చెప్పాలంటే వాళ్లు చాలా జాగ్రత్తగానే ఉంటారు. కాని మేము కొన్ని వస్తువులను నష్టపోయాము.”

“నిజం! ఒక్క సూదిగాని దారం ముక్కగాని ప్రజల వద్దనుంచి తీసుకొనగూడదని వారికి నిబంధన ఉన్నది గదా?” అని సంశయిస్తూ నేను ప్రశ్నించాను.

“సూదులు దారాలు వాళ్లు ఏమీ తీసుకు వెళ్ళలేదు. కాకపోతే మా బొగ్గును కొంత వాడుకున్నారు.”

“దానికిగాను కంపెనీ కమాండర్ ఏదన్నా చేయలేక పోయాడా?”

“ఎవరన్నా తీసుకుంటున్నట్లు కనిపెడితే తప్పకుండా ఆ పనిని ఆపుతాడు. కాని అతను చూడక పోతేనో...ప్రతిసారీ మనం కమాండర్ వద్దకు పరుగెత్తలేము కదా! ఈ కుర్రవాళ్ళంతా బహు మంచివాళ్లు, బుద్ధిమంతులు. సుశిక్షితులైన సైనికులను నేను ఎప్పుడూ చూడలేదు. మా ఆవరణ నంతా తుడిచేటప్పుడు నౌకర్లకు వీరు సహాయం చేస్తున్నారు. దొడ్డి అంతా అద్దంలాగా పరిశుభ్రంగా ఉంచుతున్నారు”—మేము గేటువద్దకు వచ్చాము. మా కన్నా ఆయా ముందుగా వెళ్ళి బండీ నౌకరుదానిని పిలిచింది.

కోలుపోయిన బలాన్ని తిరిగి పుంజుకోవాలని ఇంటివద్ద మరి రెండురోజులు ఉండిపోయాను. ఉత్తరాలను తీసుకునివచ్చే కుర్రవాడు వచ్చాడు. విద్యాలయంవద్ద అతి విచిత్రమైన సంఘటన జరిగినట్లుగా అతను చెప్పాడు. క్రితం కొలదిమాసాలలోనూ పాత ప్రభుత్వంబారిన పడకుండా తప్పించుకుని పారిపోయిన విద్యార్థులు కమ్యూనిస్టు యూనిఫారాలు ధరించి పి. యల్. ఏ తో పాటుగా తిరిగివచ్చారు. గర్వంతో వారి ముఖాలు కళకళలాడుతున్నాయి. మమ్మల్ని చూడడానికి వారువచ్చారు. ఎంతమంది? ఒక డజనుమంది ఉంటారు! వారిలో ముగ్గురు స్త్రీలు. బరువైన దుస్తులలోనుంచి బయటపడి నేను తేలికైన వస్త్రాలు ధరించాను. ఆయాను గేటువద్దకు నా సైకిలు తీసుకుని రమ్మని చెప్పాను. స్కూల్ కి తిరిగివచ్చాను.

దారిలో పోలీసులతోపాటు నిలిచి ఉన్న సోల్జర్లను చూచాను. ముఖాలు గంభీరంగా ధృఢంగా నమ్రతగా కన్పించాయి. మధ్యదారిలో ఆగి ఏదన్నా కొనాలని నేనుముందుగా అనుకోలేదు. సైకిలు మీదనుంచి దిగి దగ్గరలో సోల్జర్ ఉన్న స్తంభానికి ఆనించాను. "కామ్రేడ్! నేను దుకాణం లోపలికి వెళ్ళి కొన్ని సామానులు కొనాలి. నా సైకిలు ఎవరూ ఎత్తుకుని పోకుండా కొంచెం చూస్తూఉంటావా. నేను త్వరగానే పని పూర్తిచేసుకుని వస్తాను" అన్నాను.

నా విద్యార్థి యూనిఫారంవంకా, నాసైకిలువంకా అతను ఒకచూపు చూసి "సరే...అట్లాగే" అన్నాడు.

అయిదారు నిమిషాలు అటూఇటూ పచారుచేసి ఒక భటానీల పొట్లం కొన్నాను. వీధిలోకి వచ్చి సైకిలు వున్న

స్థలం వైపుచూచి నిశ్చేష్టురాలనైనాను. భుజంమీద తుపాకీ ధరించి అతిజాగ్రత్తగా సోల్జర్ కాపాలా కాస్తున్నాడు. అతను డ్యూటీలో ఉన్నాడు. ప్రతి అరనిమిషానికి ఒకసారి మెడసాచి సైకిలు యథాస్థానంలో ఉన్నదీ లేనిదీ తేరపార చూస్తున్నాడు. ఈ దృశ్యాన్నే గనక ఎవరన్నా ఆరునెలల క్రితం ఎవరన్నా చూచి ఉంటే "పాపం! ఆ దురదృష్టవంతుడు తన జనరల్ కుమార్తె సైకిలుని కాపలా కాస్తున్నాడు" అని అనుకునేవాడు.

## 3

## కృషి ఒక ప్రపంచం సృష్టిస్తుంది

విద్యాలయానికివచ్చి చేరాను. విద్యార్థి మిత్రులంతా నన్ను చుట్టుముట్టి జరిగిన వింతలూ విశేషాలు వివరిస్తున్నారు. అవన్నీ వింటూఉంటే పాఠశాలనువదిలి ఒక నెలరోజులైనట్లుగా నాకు అనిపించింది. నగరపరిపాలనకుగాను నూతన అధికారులు ప్రకటించిన విధానాలు ఏవిధంగా తాము పఠించినదీ, నూతన విధానాలను, విమోచన అంతరార్థమును ప్రజలకు వివరించి చెప్పడానికి తాము ఏవిధంగా ప్రచారదళాలను నెలకొల్పినదీ, యూనిఫారాలలో తిరిగివచ్చిన పూర్వవిద్యార్థి సోదరులకు ఏవిధంగా తాము స్వాగతం చెప్పినదీ వారు నాకు వివరించారు. "ఎవరెవరు తిరిగివచ్చారు ? మన చరిత్రతరగతిలో చదువుతూ ఉండేవాడే-మిత్రుడు వాంగ్-షౌదుగ్గా ఉంటాడు. అతనిసంగతి ఏమైంది ?" అని అడిగాను.

"బహుశః అతనుకూడా వచ్చేఉంటాడు. ఎక్కడో

ఉండిఉంటాడని నేను అనుకుంటున్నాను" కాని యథార్థానికి ఎవ్వరికీ తెలియదు. ఇంతలో ఒక తోటివిద్యార్థి "మనఅదృష్టం ఫలించింది, అతను తిరిగివచ్చాడు. అతనివద్దకు వెళ్ళి అడుగు" అన్నాడు.

గేటులోనుంచి వస్తూఉన్న పి. యల్. ఎ యూనిఫారం ధరించిన ఒక సహపాఠిని నేను గుర్తించాను. అతనిముఖం గుర్తుఉందికాని పేరు జ్ఞప్తికిరాలేదు. హిస్టరీడిపార్ట్ మెంట్‌కు చెందినవాడనీ, సన్నగా పాలిపోయినట్లుగా, వితండవాదం మని షిగా నాకు జ్ఞాపకం ఉన్నది.

కలుసుకోవడానికి అతనివద్దకు వెళ్ళాము. మా అందరి తోనూ అతను కరచాలనంచేశాడు. "ఇంతకాలం యెదురు చూడగా మనకు విమోచన సంప్రాప్తించింది. మనరోజు వచ్చింది. వెలుతురు ఉదయించింది." ఇలాంటిభావాలను మేము చాలాసార్లు వినిఉండటంవల్ల మాకు ఆమాటలలో విపరీతమైన అందచందాలు గోచరించలేదు. నేను చిరునవ్వుతో పురాతన మిత్రుడు వాంగ్‌ను గురించి ప్రశ్నించాను.

"ఓ వాంగ్-సింగ్‌టవోనుంచి వచ్చిన ఆజానుబాహువు. తెలివితేటలుగలవాడు. అతనేనా-అతనుగూడా తిరిగివచ్చాడు. ఆర్మీతో ఉన్నాడు. సైన్యంతోపాటు త్వరలోనే అతడు దక్షి ణాదికి పోవచ్చును." అని తలపంకిస్తూ అతను చెప్పుకుపోతు న్నాడు.

"అతని విషయం ఏమిటి?" వాంగ్‌లాంటి సమర్థుడైన వ్యక్తికి ఏవిధమైన దుర్ఘటనా వాటిల్లివుండదని నేను భావిం చాను.

పి యల్ ఎ మనిషి ఉద్దీపితుడై నాడు..."అతనికేం...
ఏం జరగలేదు. మొదట్లో ఏదో కొత్తగా అనిపించింది. దృక్పథం
మారితేతప్ప, శ్రామికవర్గ విప్లవంలో పాల్గొనే బూర్జువా
వ్యక్తుల్లో అనేకలోపాలు వ్యక్తంఅవుతూనే ఉంటాయి. వాళ్ళను
మార్చటమనేది చాలా కఠినమైన పని."

ముక్కు తుడుచుకోవడానికి ఒక్క క్షణం ఆగి మళ్ళీ
అతను ప్రారంభించాడు. మొదట్లో మనమిత్రులు ఉద్యమంలో
జేరినప్పుడు అతను ఏవో మూఢనమ్మకాలతో ఉన్నాడు.
ఇప్పటికీఅంతే. పార్టీ పాతసభ్యులన్నా లీడర్లన్నా అతనికి
సంతృప్తికరంగా లేదు. మా చర్చలలో అతివిచిత్రమైన
ప్రశ్నలు వేసేవాడు. తాను తనమిత్రులు సమస్యలను పరిష్క
రించుకొనడానికి సహాయపడటం లేకపోగా నానా అపభ్రంశం
చేశాడు. సహజంగా ఒకొక్కప్పుడు నిరుత్సాహంగాఉంటాడు.

"మరి నీవిషయం ఏమిటి? ఎల్లప్పుడూ నువ్వు ఆనం
దంగా ఉన్నావా?"

"ఓ ఉన్నాను. ఈరోజుకోసమేగదా మనం క్రితం రెండు
సంవత్సరాలనుంచీ పోరుసల్పడానికి పాటుబడుతున్నది. కొత్త
సృష్టి ప్రారంభమైంది. మనం వెనుకపడటానికి వీలులేదు..."
అతను ఛాతీమీాద చరుచుకున్నాడు. "రోజురోజుకీ నాలోబలం
వృద్ధిపొందుతున్నట్లుగా అనిపిస్తున్నది. ఈ దేశం మనది—
కష్టించి పనిచేయడానికి మనం కంకణం కట్టుకోవాలి. ప్రజల
వైపు నిలబడటానికి నేను నిశ్చయించుకున్నాను. చైనాలోని
యావత్తు ప్రపంచంలోని పీడితప్రజానీకం విముక్తి చెందేంత
వరకూ విద్రోహులతో పోరాడుతాను."

నా భుజాలమీద గట్టిగా చరిచాడు "కామ్రేడ్! నడుం వంచి పనిచేద్దాం. పార్టీని అనుసరించండి. పితృదేశానికి మన అవసరం ఎంతైనా ఉన్నది."

పార్టీని మేము ఎట్లా అనుసరించగలము? మా నూతన నాయకులంతా పెకింగ్ వచ్చారని, లేదా దారిలోఉన్నారని విన్నాము. ఏవిధంగా పార్టీ మాకు నాయకత్వం యివ్వబోతున్నది?

జవాబురావటానికి ఎంతోకాలం పట్టలేదు. యుద్ధకాల కాందిశీక విశ్వవిద్యాలయ దినాలు మొదలు విమోచనా సంప్రాప్తంవరకూ కమ్యూనిస్టుపార్టీ బలపరుస్తూవచ్చిన ప్రజాస్వామ్య యువజనసమితిని, యింకా ఎనిమిది తొమ్మిది విద్యార్థి రాజకీయసంఘాలను రద్దుచేసివేసినట్లుగా ఒకరోజు ఉదయం మేము తెలుసుకున్నాము. నూతనంగా స్థాపించిన యువజన సంఘంలో యీ సభ్యులను విలీనంచేస్తారు. ఇదివరలో పనిచేసిన సంఘాలన్నీ దీనిలో కలిసిపోతాయి.

మరొక విషయం మాకు ఆశ్చర్యచకితుల్ని గావించింది. పైటాలో విమోచనానికి పూర్వం అజ్ఞాతంగా ఉన్న కమ్యూనిస్టుపార్టీ సభ్యులజాబితా ప్రజలకు ప్రకటింపబడింది. అజ్ఞాతంగా మనుగడసాగించిన యీ వందమంది యోధులూ తమ ఉనికిని అతిగోప్యంగా ఉంచగలిగారు! ఇదివరలో కమ్యూనిస్టులని అనుమానించడానికి వీలులేని మిత్రులంతా యిప్పుడు పార్టీ సభ్యులుగా బయటికి వచ్చారు. మాతరగతి విద్యార్థులలో చాలామంది-రాజకీయాలను గురించి నానా గందరగోళంచేసిన వారు నిజంగా పార్టీసభ్యులు కారని తెలిసిపోయింది. మహోషా

అను పేరుగల నా సహపాఠి అతిఆశ్చర్యంతో యిట్లాఅన్నాడు:
"వీళ్ళంతా జండాలు పుచ్చుకుని నినాదాలు చేసుకుంటూ పరుగులుపెడుతూ ఉండేవారుకదా; వీళ్లు పార్టీసభ్యులు కాక పోవటం ఎట్లా సంభవం అబ్బా?"

మా తరగతిలో పార్టీసభ్యులు నలుగురు ఉన్నట్లు మేము తెలుసుకున్నాము. ఒకరోజున వాళ్ళుమమ్మల్ని ఒక నిరామయ ప్రదేశానికి తీసుకువెళ్ళి అజ్ఞాతనాయకత్వం వహించిన పార్టీ ఏవిధంగా విద్యార్థిఉద్యమానికి చేయూతనిచ్చి సహాయం చేసిందో వివరించారు. వారు మమ్మల్ని ప్రశ్నించారు: "మా కార్యకలాపాలను గురించి మీరు విమర్శించాలనుకున్నది ఏమన్నా ఉన్నదా? అజ్ఞాతంగా మేము పనిచేయవలసివచ్చినందుకు మాకు విచారంగా ఉన్నది. పార్టీ తనను తాను కాపాడుకోవలసి ఉన్నది. మా భవిష్యత్ కార్యక్రమాన్ని గురించి మీరేమైనా సూచనలు చేస్తారా? మా సభ్యులపట్టిక చదివింతర్వాత మీరేమని అనుకుంటున్నారు?"

మరొక పార్టీసభ్యుడు యివే విషయాలను తిరిగి ముచ్చటించాడు. "భద్రతకొరకు మా ఉనికిని మేము బహిరంగపరచలేకపోయాము. మా ఉద్దేశాలను మీరు గ్రహించగలరు కదా? నిర్మొహమాటమైన మీ అభిప్రాయాలకు ప్రశ్నలకు మా స్వాగతం. మీకేమైనా అనుమానాలు ఉంటే అడగవచ్చును. నిర్మొహమాటంగా మాట్లాడడంద్వారా మేమంటే మీకుగల గౌరవాభిమానాలు వ్యక్తం అవుతాయి."

యీ విద్యార్థుల వినయవిధేయతలు మాకు ఆనందాన్ని కల్గించాయి. వారి నడవడిక విషయంలో వేలుఎత్తి చూప

డానికి పేలులేదు. వారి నాయకత్వంపట్ల మాకుగల అచంచల విశ్వాసాన్ని మరోసారి వెల్లడించాము. వాతావరణం స్నేహ సమ్మిళితమై ఉండటంవలన పార్టీసభ్యులు సంతృప్తిచెందారు. అప్పుడు మవోపో లేచి నిలబడ్డాడు. "నిర్మొహమాటంగా మా అభిప్రాయాలను వెలిబుచ్చమన్నారు. ప్రశ్నలు అడగవచ్చు నన్నారు. అయితే నాప్రశ్నకి మీరు సమాధానం యివ్వాలి. కొమింటాంగ్ ప్రభుత్వాధిపత్యంలోనున్న యువజన సమితి విద్యార్థి ఉద్యమాన్ని విచ్ఛిన్నంచేయాలని ప్రయత్నించినప్పుడు రాజకీయపార్టీలు సంఘాలు పాఠశాలనుంచి బయటికివచ్చి వెయ్యాలని, ఏ పార్టీ ఆధిపత్యంక్రిందా విద్యార్థులు ఉండరాదని మీరు అందరిని వొప్పించారుగదా—ఈరోజున ఆ విషయమై ఏం చెబుతారు?"

ప్రతివాళ్ళకీ యిది కొంత చికాకు అనిపించింది, కాని పార్టీసభ్యులు మాత్రం ప్రశాంతంగా ఉన్నారు. అటువంటి ప్రశ్న వస్తుందని వారికి ముందుగానే తెలుసును. విద్యార్థులను తమవైపు తిప్పుకోవాలని ప్రయత్నించిన కొమింటాంగ్ ఏజెంట్లను అటకాయించడానికి మాత్రమే అప్పుడు అట్లా చేయవలసి వచ్చిందనీ, విద్యార్థులు రాజకీయాలలో జోక్యంకలిగించుకోక పోవటం తమ అభిమతంకాదనీ వారు వ్యక్తంచేశారు. "ఇప్పుడు శ్రామికవర్గ విప్లవ వ్యవస్థాపనకు మేము కష్టించి కృషిసల్పాము కాబట్టి ప్రజలయొక్క, పితృదేశముయొక్క అభ్యుదయంలో మాకెంత ఆసక్తి ఉన్నదీ విశదం అవుతోంది."

మవోపో అంతటితో విడిచిపెట్టలేదు. "మీరు చెప్పింది సబబుగా ఉన్నట్లే ధ్వనిస్తోంది. కాని నాసంశయం మాత్రం

తొలగిపోలేదు. ఇదివరలో మీరు పార్టీ యూత్ లీగ్ సభ్యు లను వెలుపలకు వచ్చివెయ్యమన్నారు.ఇప్పుడు మీరు పైటాలో పార్టీ యూత్ లీగ్‌లను విస్తృతం చేయాలని తలపోస్తున్నారు. ఇది నాకు కొంత గందరగోళంగా ఉన్నది."

మహోహో అల్పసంఖ్యాకవర్గంవాడు. ముఖ్యంగా యూత్ లీగ్ తన కార్యకలాపాలను విస్తృతంచేయటం ప్రారంభించింది. అంతేగాకుండా అదనంగా అనేకమంది సభ్యులను చేర్చుకునే భారీఉద్యమం ప్రారంభించింది. తరగతులు తిరిగి ప్రారంభం అయినవి. కాని మెంబర్‌షిప్ ఉద్యమం ప్రచార కార్యకలా పాలే తప్ప, 1700 లో ఇంగ్లండును ఎవరును పరిపాలించారో; లేక రెండు రసాయనద్రవ్యాలు కలవటంవల్ల ఎట్టిమార్పు సంభ విస్తుందో తెలుసుకునే ఆసక్తి మాలో చాలామందికి పట్టలేదు. యూత్ లీగ్‌లో మెంబర్లను అధికసంఖ్యలో చేర్పించినంత మాత్రాన చాలామందికి తృప్తికలగటంలేదు. వాళ్ళకి కావల సింది; విప్లవంలో హుటాహుటి పాల్గొనటం. కొంతమంది పాఠ శాలనువదిలి వర్కింగ్ కాడర్ నూతన కేంద్రంలోను, ఉత్తర చైనా విప్లవ విశ్వవిద్యాలయంలోను శిక్షణకుచేరారు. మిగతా వాళ్ళు మిలిటరీ పొలిటికల్ విశ్వవిద్యాలయం, విదేశీభాషల కళాశాల, హార్‌బెన్‌లోని రష్యన్ భాషాపరిషత్తులలో జేరారు. నాన్‌కింగ్, షాంగ్‌హైలను విమోచనంచేయడానికి యాంగ్‌ట్సీ నదివైపు పురోగమిస్తూ ఉన్న ప్రజావిమోచనసైన్యముల శిక్షణ దళములలో చాలామంది ప్రవేశించారు.

ఈ టీములలో జేర్చుకొనబడినవారు దక్షిణదిశగా లిన్‌పియో సైన్యాలను అనుసరించి వెళ్ళడానికిపూర్వం, నగ

రంలో ఒక నెలరోజులపాటు రాజకీయశిక్షణ, సైనికజీవితశిక్షణ పొందారు. మాకు వ్రాయాలంటే వారికి సాధారణంగా టైము చిక్కేదికాదు. వ్రాయటంఅంటూ సంభవిస్తే ఆ ఉత్తరాలు ఎంతో ఉత్సాహపూరితంగా ఉండేవి. కష్టించిపనిచేస్తున్నామనీ యావత్ దేశ విమోచనాకృషిలో తమకు దృఢతరమైనవిశ్వాసం పెంపొందుతోందనీ వారువ్రాసేవారు. వెనుకబడిన మాచేతుల్లో ఒకరినుంచి మరొకరివద్దకు ఆ ఉత్తరం వెడుతూఉన్నప్పుడు మా ఆనందానుభూతికి అడ్డు ఉండేదికాదు.

అయినప్పటికీ— కొత్తజీవితానికి కొందరు అలవాటుపడ లేకపోయారు. సింగ్ మువా విద్యార్థి ఒకనివద్దనుంచి ఉత్తరం ఒకటివచ్చింది. "పాఠశాలలో ఉన్నప్పుడు యీవిధంగాఉంటుం దని నేను అనుకోలేదు. నేను మారిపోయినట్లుగా గుర్తించాను. పాడైపోయిన ఒకయంత్రంవలె ఉన్నాను. నిద్రాహారాలులేవు. కొద్దిగజాలుపరుగెత్తితే ఆయాసంవస్తోంది. భౌతికంగానూ మాన సికంగానూ యీపనికి నేను పనికిరానేమోననిపిస్తున్నది. నన్ను విడుదలచేయవలసిందిగా అర్జీపెట్టుకున్నాను, అది యింతవరకూ ఆమోదింపబడలేదు."

నగరంలో రెండువారాల శిక్షణపొందిన తర్వాత అదృష్టవశాత్తూ ఒక లా విద్యార్థి విడుదల అయ్యాడు. అతను మమ్మల్ని చూడడానికి వచ్చినప్పుడు మేము వేసిన ప్రశ్నలకు కొన్నింటికి సరియైన సమాధానం చెప్పకుండా తెలివిగా తప్పిం చుకోవాలని ప్రయత్నించాడు. శిక్షణపద్ధతిని గురించిన విమర్శల జోలికి అతను పోలేదు. అయినా అతనిని మేము ఒక పట్టాన

వదలలేదు. చివరికి అతను ఒప్పుకున్నాడు. "నా స్నేహితురాలు గనక జేరిఉండకపోతే నేనూ జేరిఉండేవాణ్ణికాను."

మేము నవ్వటం అతనికి చికాకుఅనిపించింది. "ఇందులో నవ్వటానికి ఏముంది. తమ ప్రియురాండ్రను అనుసరించడానికి అనేకమంది టీముల్లో జేరారు...కొత్తవాళ్ళు విపరీతంగా జేరుతున్నారేగాని ఏదీ కట్టుదిట్టంగా జరగటంలేదు. మీకు నిజం చెబుతున్నాను. నా ప్రక్కన పడుకున్నవాడు ఒక దొంగ అని తేలింది. రాత్రిళ్ళు నాకు నిద్రలేదు. ఆ దొంగ నా బట్టలను జోళ్ళను ఎక్కడ ఎత్తుకుపోతాడోనని భయపడ్డాను.

అక్కడ నానారకాల మనుష్యులు ఉంటారు. పైవాళ్ళకి పరిస్థితి తెలుసును. మాతోకూడా ఉన్నకొందరు విపరీత మనస్తత్వవ్యక్తులను పరిష్కరించవచ్చునని వాళ్ళ తలంపు. నూతన విమోచనప్రాంతాలు అజమాయషీ వహించేందుకు ఇలాంటి వాళ్ళకు శిక్షణయివ్వటం అనేది వింతగానే ఉంటుంది. నా మట్టుకు నేను, కాడర్లు దొంగలను సంస్కరించగలరంటే నమ్మలేను. ఈ కాడర్లలో కొందరికి సంస్కృతి అనేది ఏకోశానా లేదని మీకు తెలుసును. ఒక చిన్నవిషయం చెప్పడానికి చెప్పిందే పదిసార్లు చెబుతారు. అట్లా చెబితేతప్ప మాకు అర్థంకాదని వాళ్ళ తలంపు. మేము చంటిపిల్లలం, అజ్ఞాన కృషీవలులం కాము."

అదృష్టవశాన్న కాస్త ఎక్కువచదువు చదువుకున్నవాడు కాబట్టి తానేదో అధికుడుగా భావించి యీ కుర్రవాడు ఇట్లా మాట్లాడుతున్నాడని మేము అనుకున్నాము. "అందరితోపాటు తాను ఒకడు అవడానికి అతను తన గద్దెదిగి రావాలి, కష్టించి

చేసే పనికి, విద్యకు ఎంత తేడాఉందో అతను తెలుసుకోవాలి"
అన్నాడు ఒక అభ్యుదయవాది.

కొద్దిరోజులు పోయినతర్వాత, కమ్యూనిస్టుపార్టీ అగ్ర నాయకులలో ఒకడైన చౌ ఎన్ లై పైటావచ్చి ప్రొఫెసర్లను సందర్శించారనీ, నాలుగు గంటలపాటు వారి కష్టసుఖాలు తెలుసుకున్నారని మేము విన్నాము. వారిఎడ ఆయన అమిత గౌరవం సానుభూతి వ్యక్తంచేశారు. పాతప్రభుత్వం ఆధిపత్యం క్రింద ఆర్థికంగా వారుపడిన బాధలకు జాలిని వెలిబుచ్చారు. విద్యారంగంలో కృషిచేస్తున్నవారికి పార్టీ యితోధిక సౌకర్యాలు కలుగజేస్తుందని హామీ యిచ్చారు. త్వరలోనే వారి జీతాలు పెంచినట్లుగా ప్రకటింపబడింది. నూతనప్రభుత్వంలో పార్టీసభ్యులు తీసుకునేదానికన్నా యీ జీతాలు ఎన్నోరెట్లుగా ఉన్నాయి.

అత్యధికజీతాన్ని పొందాలనుకున్న ప్రొఫెసర్ ఇరవై సంవత్సరాలు ఉద్యోగం చేసిఉండాలి, సర్వీసురికార్డులో 100 గ్రేడ్ స్కోర్ చేయాలి. ఈ గ్రేడును నిర్ణయించేది విద్యార్థులే కాని తోటి అధ్యాపకులుకారు.

నిజమైన ప్రజాస్వామ్యమంటే యిదేనని మేము తలంచాము. మా ప్రొఫెసర్లు ఎట్లా బోధిస్తారో వారికి ఏమితెలుసో మా అభిప్రాయాల్ని వ్యక్తపరిచే అవకాశం చిక్కినందుకు మాలో ఉత్సాహం పెల్లుబికింది. గ్రేడింగ్ ఉత్సవంకోసం మేమంతా ఆవరణలో గుమికూడాము.

బాలట్కోసం కాగితంముక్కలు పంచబడ్డాయి. లీడరు ఒక అధ్యాపకుని పేరు పలికినప్పుడు మేమంతా నిశ్శబ్దంగా

కూడబలుక్కొని మా మార్కులను కాగితంమీద వేశాము. వాలంటీర్లు కాగితం ముక్కలను ప్రోగుచేశారు. లెక్కపెట్టడం పూర్తి అయింతర్వాత విద్యార్థి ప్రతినిధులు సగటుమార్కును ప్రకటించారు. ఈవిధంగా ఒకగంటలో తొమ్మిదిమంది ప్రొఫెసర్లను మేము గ్రేడుచేశాము.

నూతనయుగం నిజంగా ఉదయించింది. ఇదే మాకు యివ్వబడిన హామీ. కొందరు విద్యార్థులు దయార్ద్రహృదయులు. వ్యక్తిగతమైన కక్షలను మరచిపోయి తమ అధ్యాపకులకు న్యాయమైన మార్కులు యిచ్చారు. మరికొందరు అవకాశంచిక్కింది గదా అని తమకోపతాపాలను వెళ్ళగక్కారు.

గ్రేడింగ్ ఉత్సవం పూర్తిఅయిన తర్వాత ఒక ఉపన్యాసకుడు యీ విధంగా అన్నాడు "సోదర విద్యార్థులారా! పాఠశాల అనేది మీదేనని మీకు యిప్పుడు తెలుసును. మనం సాగించవలసిన నిర్మాణ కార్యక్రమం ఎంతైనాఉన్నది-కృషి చేయడానికి యిదేసమయం పదండి" పనిచేయటమే మాకు కావలసినది, అదేమేము ఆశించేదికూడా. విమోచన మొదటి వారాలలో ఉత్పన్నమైన ఆవేశము క్రియారూపంలో బయట పడడానికి ఏదోవిధమైన మార్గం ఉండాలి. విప్లవం అనేది పరిపూర్ణం కాలేదు. అది యిప్పుడే ప్రారంభమైనదని మీకు తెలుసును. మేము అనుకున్నరీతిగా చైనాను తీర్చిదిద్దవలెనంటే చేయవలసిన ఎన్నో సంవత్సరాల నిర్మాణ కార్యకలాపం, శ్రమ మీముందు ఉన్నది.

చదువు సంధ్యలుకాని, ప్రచారకార్యక్రమం కాని, బారులు తీర్చినడవటంగాని, పాటలుపాడటంకాని మాకుచాలవు.

అనేక తరాలుగా కాయకష్టంచేస్తూ ఉన్న చైనా దేశపు సామాన్య ప్రజానీకంలోని కర్షకుడు, కార్మికుడు సైనికుడు-వీళ్ళదీ యీరోజు. ప్రపంచవ్యవస్థను నెలకొల్పునది కార్మికుడే-అనే ఏంగెల్సు సిద్ధాంతాన్ని కమ్యూనిస్టు గ్రంథాలనుచదివిన మాబోటివాళ్ళం తెలుసుకున్నాము. కార్మిక కర్షక కామ్రేడు లకు తోడుగా ఉన్న ఇంజనీర్లుగానూ, అధ్యాపకులుగానూ, రచయితలుగానూ మానసిక శిక్షణను మేము పొందటంలేదా? చైనీస్ విద్యార్థులు, పండితులు దూరదూరంగా ఉంటారనీ, గర్విష్టులనీ కొందరు ఆరోపణలుచేస్తూ విమర్శించటం మాకు తెలుసును. కాని యిప్పుడుగూడా అట్లాగే అనటం అన్యాయం. ఒక పార్టీసభ్యుడు ఏంగెల్సు సిద్ధాంతాన్ని యీవిధంగా వివరించాడు "మానసిక కృషికన్నా ముందు ప్రారంభమైనది శారీరక కృషి. కాబట్టి రెండవది మొదటిదానిమీద ఆధారపడి ద్వితీయస్థానాన్ని ఆక్రమిస్తున్నది. శారీరకకృషికన్నా మానసికకృషి అగ్రస్థానం వహిస్తుందనే బూర్జువా సిద్ధాంతాన్ని మనం సంపూర్తిగా విస్మరించాలి. అన్నింటికన్నా అద్వితీయమైనది శారీరకకృషేనన్న విషయం మనం గ్రహించాలి".

మాలో చాలామందికి శరీరకష్టం అలవాటులేదు. కాని జపాన్‌తో సాగించిన సుదీర్ఘపోరాటంలో మాలో చాలామంది, ముఖ్యంగా కాందిశీక విశ్వవిద్యాలయాలలో జేరిన విద్యార్థులు, కఠినమైన కాయకష్టానికి అలవాటుపడ్డారు. కాబట్టి కాయకష్టం చేయటంలోని ఆధిక్యతను మేము గుర్తించాము. కర్షకుల కార్మికుల అనుభూతుల్ని మేము చవిచూచాము. ఫూపోయీ సైన్యం విడిచివెళ్ళిన కల్మశాన్ని తుడిచి పరిశుభ్రంచేయడానికి

వార్తాపత్రికలు మమ్మల్ని ఆహ్వానించినపుడు,హృదయపూర్వక ఉల్లాసంతో మేము నగరాన్ని పరిశుభ్రపరిచే దళాలుగా ఏర్పడ్డాము.

పార్టీ సభ్యులే ప్రథమ స్వయంసేవకులు. తర్వాత సంత కాలు చేసినవారు జాబితాల మొదట్లో తమ పేర్లు ఉన్నట్లు గుర్తించారు. ఆ తర్వాత స్త్రీ విద్యార్థినులను జేర్చుకోవడానికి తీవ్రకృషి జరిగింది. స్త్రీలు సంతకాలు చేయడంతో పురుషులు వెనుకంజ వేసేందుకు వీలుకాకుండా పోయింది. పడకటిళ్ళ లోనూ భోజనాల గదుల్లోనూ లౌడ్ స్పీకర్లు ఎలుగెత్తి యీ విధంగా చాటాలి "సమరాన్ని పూర్తిగావించండి. కాంపస్ శుభ్రంచేయడానికి సహకరించండి. కృషి, సిద్ధాంతాన్ని ఆచ రణను సమైక్యం చేయండి".

పని ప్రారంభం అయ్యేరోజు ఉదయమే మేమంతా సమావేశమై హాజరు చెప్పేవారము. పనిచేయవలసిన ప్రాంతా నికి బారులుతీర్చి పతాకతోరణాలతో వెళ్ళేవాళ్ళము. ట్రింబెలు విమానదాడి రక్షణనిర్మాణాలలోను విపరీతంగా చెత్తాచెదారం పేరుకుని ఉన్నది. పలుగులు పారలు యిచ్చేవరకూ బారులు లోనే నిలబడి వుండేవాళ్ళము. అవి అందినతోడనే చిన్నచిన్న గుంపులుగా చీలేవాళ్ళము. మాబానర్లను చెత్తగుట్టలపైన నాటాము. ఒక్కొక్క గుంపుకి కృషిలక్ష్యాలు ఏర్పాటు చేశారు. ఆ లక్ష్యాన్ని సాధించడానికి మాలో మేము పోటీలుగా కృషిచేయడానికి ప్రథమ అవకాశం చిక్కింది. హుకుం జారీ అవటంతోటే చెత్త మట్టి గుట్టలమీద దాడిసాగించాము. మా వ్యక్తిగతగౌరవం, గుంపుగౌరవాలకు యిది పరీక్షాసమయం.

కొందరు విద్యార్థులు మట్టిని పెళ్లగించారు. కొందరు దానిని తట్టలలో నింపారు. మరికొందరు ఆ మట్టిని గోతులలో విసిరి వేశారు. ఇతరదళాలను మేము గెలిచేయటం ప్రారంభించాము. ఒక కుర్రవాడు ముచ్చెమటలు కారుతూఉండగా ఎంతో కష్టించి పనిచేస్తున్నాడు. మా గుంపునాయకుడు మమ్మల్ని హెచ్చరించాడు. "మీరంతా ఆవాంగ్‌ని చూడండి. నిజమైన కృషివీరుడు అంటే అతనే." చేతులు గీసుకుపోయి బొబ్బలు ఎక్కినవారు ఒక్కక్షణంలో తమ గాయాలకు అయొడిన్ పులుముకుని నారు, క్షణంలో పనిలో మునిగిపోయారు.

పని పూర్తిఅయింది. చెమటలు దిగజారుతూ అలసి సొలసి మేమంతా బారులుగా నిలబడ్డాము. మా చైర్‌మన్ యీవిధంగా ప్రకటించాడు. "కామ్రేడ్స్! కృషిసంగ్రామంలో మనం విజయం సాధించాము. ప్రతిఒక్క గుంపు, నిర్ణయించిన లక్ష్యంకన్నా అధికంగాకష్టించి సాధించినది. ప్రతితరగతికి పారి తోషికంగా ఒక బానర్ యివ్వాలనిఅనుకుంటున్నాం." మేమంతా ఉత్సాహంతో జేజేధ్వానాలు చేస్తూండగా ఆరోజు కృషిఫలి తాలను అందుకునేందుకు మా ప్రతినిధులు ముందుకువెళ్ళారు.

మరుసటిరోజున తన కృషివీరులను యెన్నుకునేందుకు ప్రతి డిపార్ట్‌మెంటూ సమావేశమైనది. టీమ్ కాప్టన్‌లచే అభ్యర్థులు అంతకుపూర్వమే నిర్ణయించబడ్డారు. కొన్ని పొర పాట్లు జరిగాయి. చాలా కష్టపడి పనిచేసిన కొందరు విద్యా ర్థులు అడుగున పడిపోయారు. అధికఆసక్తితో కృషిచేసిన చాలామంది విద్యార్థులు నోటుచేయబడ్డారు. బాలట్ జరిగిన తర్వాత నూతనకృషి, వీరులు ఉపన్యసించవలసిందిగా మేము

కోరాము. అందరూ సమానంగా కష్టించగా తమకే యీ గౌరవం దక్కటం అనేది కొంత చికాకు కల్గించిందంటూ వారు యీవిధంగా అన్నారు: "యీ మహత్తర కృషిలో మరింత శక్తిసామర్థ్యాలను చూపించేందుకు మనం ప్రయత్నించాలి."

వ్యవసాయ ఉత్పత్తికృషిలో పాల్గొనవలసిందిగా మాకు ఆహ్వానం వచ్చింది. అప్పుడు మాకు కర్షకుల జీవితాన్ని చవి చూడగల అవకాశం చిక్కింది. ప్రప్రథమంగా యిందు ఎకనామిక్స్ డిపార్ట్‌మెంట్ విద్యార్థులు పాల్గొన్నారు. వారు తిరిగి వచ్చినతర్వాత, కర్షకుల జీవితాలను గురించి తాము ఏ విషయాలు తెలుసుకున్నదీ, పొలాలలో స్వచ్ఛమైన గ్రామీణ వాయువులను ఆస్వాదిస్తూ తాము ఏవిధంగా ఆరోజురోజంతా ఉల్లాసంగా గడిపిందీ వారు తెలియజేశారు.

ఆ తర్వాత మేమంతా ట్రక్కులలో పొలాలకివెళ్లాము. మండుటెండలో పని ప్రారంభించాము. యూనిఫారాలు ధరించిన విద్యార్థులు పొలాలలో పనిచేయటం అక్కడివారికి వింత గొల్పింది. పని కొంత అయింతర్వాత ట్రక్కువద్దకు చల్లటి మంచినీరు త్రాగటానికి వెళ్ళాము. ఒక యువకర్షకుడు ధైర్యం తెచ్చుకుని మావద్దకు వచ్చాడు.

"మీరంతా ఎక్కడనుంచి వస్తున్నారు?" అంటూ అతి వినయంగా అడిగాడు.

"పెకింగ్ విశ్వవిద్యాలయం విద్యార్థులం. అక్కడ ఉన్నాయే-ఆ ట్రక్కులలో యిక్కడికి వచ్చాము. కృషి ఆధిక్యమును తెలుసుకోవడానికే మేము వచ్చింది" అని సగర్వంగా చెప్పాము.

అతను ట్రక్కు వేపు తేరిపారచూస్తూ "వాటిల్లో నేను ఎప్పుడూ ఎక్కలేదు" అన్నాడు.

మా కృషికి ప్రతిఫలంగా మేము అనేక ఆనందాలను పొందగలిగాము. ట్రక్కులో పాటలుపాడటం, పని అయిం తర్వాత ఆటలుఆడటం, పొలాల వృక్షాల వింతసువాసనలు బహుమతిగా లభించాయి. సామాన్యప్రజాజీవితవిధానంలో పాలు పంచుకోడానికి అవకాశంచిక్కింది. పైటా భోజనశాలలో ప్రవేశించినతోడనే మా కృషిని ప్రశంసిస్తూ లౌడ్ స్పీకర్లు పలికాయి. అన్ని మూలలనుండి జైజై ధ్వానాలు చెలరేగాయి.

మా కృషి డబ్బురూపేణా ఎంత విలువఉంటుందో నాకు తెలియదు. బహుశః మమ్మల్ని తీసుకువెళ్లి తీసుకువచ్చిన ట్రక్కుల గ్యాసొలైన్ ఖర్చుకి కూడా బహుశః సరిపోయేది కాకపోవచ్చును. కాని ఒక్కవిషయం: కష్టించి పాటుపడే ప్రజాసామాన్యానికి మేము సహోదరులమనీ, నూతనయుగ నిర్మాణకృషి, భాగస్వాములమనీ మాకు అనుభవమైనది. వ్యక్తిగత స్వలాభాలకు యిది అతీతమైనది. కార్మికులు నూతన ప్రపంచనిర్మాణం కొనసాగిస్తున్నారనేమాట నిజమని యీ అనుభవాలు రుజువుచేశాయి.

*

## 4

# విద్యార్థి వేతనాల కార్యక్రమం

విమోచనానంతరంకూడా ఆహారసమస్య తీవ్రంగానే ఉంటుందని ఎవ్వరు అనుకున్నారు? యుద్ధానంతరం పరిస్థితులు మరింత దుర్భరమయ్యాయి. శరీరపోషణకు అవసరమైనఆహారం దొరకటం మాట అలాఉండగా అదివొక రాజకీయ ఆయుధంగా రూపొందివది; మా రాజకీయహక్కులకు చిహ్నమయినది. పాశ్చాత్యదేశాలలోని విద్యార్థులకన్నా మా దేశంలోని విద్యార్థులకు అధిక రాజకీయ బాధ్యతలు నెత్తిమీద ఉన్నాయి. మొత్తం జనాభాలో మా సంఖ్య చాలా స్వల్పమే. 1950లో చైనాలో జనాభా 45 కోట్లు. వీరిలో విశ్వవిద్యాలయ విద్యార్థులు 1,34,000 అంటే ప్రతి 10,000 పైచిలుకు ప్రజలకు ముగ్గురు విద్యార్థులున్నారన్నమాట. మిగతా 9,997 ప్రజలకు లెక్కప్రకారం ప్రాతినిధ్యంవహించేది యీ ముగ్గురు విద్యార్థులే.

1919 మే 4న ఒక సంఘటన జరిగింది. అప్పటి చైనా ప్రభుత్వంనుంచి జపాన్ ఇరవైఒక్క కోర్కెలను కోరింది. దానిని ప్రతిఘటిస్తూ వందలకొలదీ పెకింగ్ విద్యార్థులు నిరసన తెలిపారు. ఆనాటినుంచి చైనీస్ విద్యార్థులు దేశరాజకీయ చైతన్యానికి తాము ప్రాతినిధ్యం వహిస్తున్నట్లు భావించారు. ఇలాంటి చైతన్యమే 1919 నుంచి అత్యవసరమైనది. ప్రజా చైతన్యంపట్ల ఏ ప్రభుత్వానికి యిష్టంవుండదు. కాబట్టి అధికా

రుల కోపతాపాలను ఎదుర్కొని మా హక్కులను స్వాతం త్ర్యాన్ని సంరక్షించుకోవలసిన అవసరం ఏర్పడింది. ఇలాంటి ప్రయత్నాలలో మేము విజయం సాధించామనే చెప్పాలి.

పాఠశాలలో చదువుతున్న రోజుల్లో మాలో చాలా మంది విద్యార్థులు ప్రభుత్వసహాయంమీద ఆధారపడిఉన్నారు. నిజపాముట్టడి అనంతరం కాందిశీక విద్యార్థుల సహాయార్థం 1938లోనో 1937లోనో యిది ప్రారంభమైనది వి. జె. డినో త్సవ అనంతరం యీ సహాయ కార్యకలాపాన్ని కట్టిపెట్టాలని ప్రభుత్వం తలంచింది. కాని ఆర్థికపరిస్థితి అధ్వాన్నంగా ఉండ టంవలన పాఠశాలల మనుగడకు సహాయ కార్యక్రమం కొన సాగించక తప్పలేదు.

ఆర్థికంగా స్తోమతలేని విద్యార్థులకు ప్రభుత్వంచేసే సహాయం మా ప్రాథమిక హక్కుగా భావించాము. ఇందుకు విరుద్ధంగా ఏ ప్రయత్నంజరిగినా మా హక్కునకు భంగపాటు కల్గించటమేనని మేము తలంచాము. ఏ ప్రభుత్వమైతే తమకు సహాయం చేస్తున్నదో ఆ ప్రభుత్వాన్ని విమర్శించడానికి, వీలైతే దానిని పతనంచేయడానికి తమకుహక్కు గలదని మా తరగతి విద్యార్థుల ఉద్దేశ్యం. ప్రభుత్వాన్ని అధికసహాయం చేయమని కోరవలసిందిగా మా నాయకులు మమ్మల్ని హెచ్చ రించారు. అటువంటి సహాయం నిరాకరింపబడినప్పుడు స్ట్రయిక్ చేయమనికూడా ఉద్ఘోషించారు.

విమోచనానంతరం అయిదు ఆరు వారాలవరకూ ఊరే గింపులతోనూ, మీటింగులతోనూ, లేబర్ గ్రూపులతోనూ మాకు కాలం గడచిపోయింది. మాకు ఎటువంటి తిండి పెడు

తున్నారో గూడా మేము పట్టించుకోలేదు. నగర పరిపాలనను చేపట్టిన మిలిటరీ ప్రభుత్వం యథాప్రకారం విద్యార్థులసహాయ కార్యక్రమాన్ని కొనసాగిస్తూనే ఉన్నది. అయితే యిందులో ఒక చిన్నమార్పు ఉన్నది. పూర్వపు గోధుమపిండికి బదులు జొన్నలరూపంలో యీ సహాయం అందజేయబడుతున్నది.

ఈ మార్పు విషయమై ప్రథమంలో మేము అంతగా పట్టించుకోలేదు. బరువునుపట్టి ధాన్యం మాకు అధికంగానే లభిస్తోంది. జొన్నలకన్నా గోధుమపిండి విలువ అధికం. కాబట్టి ధనరూపేణా విలువకట్టితే మాకు ముట్టవలసినదానికన్నా తక్కువ ముట్టుతున్నది. ఇతర పదార్థాల ధరలు నిర్ణయించడానికి వీలుగా జొన్నలకి ఒక నూతన ప్రమాణ విలువను కమ్యూనిస్టులు ఏర్పరచారు. "సామాన్య ప్రజలు దేనినైతే ఆహారంగా వాడతారో దానితోనే ప్రభుత్వసహాయం చేయడం సబబేనేమో" అని ఒక బాలిక అన్నది. వినడానికి ఆ మాట బాగానే ఉన్నది.

పాఠశాల ఆవరణ వెలుపల ధరలు నెమ్మదిగా పెరుగుతున్నట్లు మాకు కర్ణాకర్ణిగా తెలిసినది. విమోచనానంతరం బయటప్రాంతాలనుంచి ఆహారధాన్యాలు విరివిగా సరఫరా కావడంతో ధరలుతగ్గాయి. నేషనలిస్టు సోల్జర్లు విపరీతమైన పరిమాణాల్లో దాచిఉంచారన్న ధాన్యమంతా ఏమైనదా అని మాకు ఆశ్చర్యంవేసింది. దీనిలో 150,000 పౌనులు నిరుద్యోగులకు పంచిపెడుతున్నట్లుగా కమ్యూనిస్టులు ప్రకటించారు. ఒక కుర్రవాడు లెక్కలుకట్టి చెప్పేటంతవరకు ఇదేదో చాలా పెద్ద మొత్తంగానే మాకు అనుపించింది. పంచిపెట్టబోతున్న పౌనుల

సంఖ్యను అతను బుషెల్స్‌లోకి మార్చాడు. ఇంతలో షాంగ్‌హైని, నాన్‌కింగ్‌ని విమోచనం చేయడానికి యాంగ్‌ట్జే వైపు తర్లి వెడుతూఉన్న సైన్యాలఉపయోగార్థం ధాన్యంలో చాలా భాగం పంపివేయబడ్డట్టు తెలుసుకున్నాను.

పార్టీ మీటింగులనుంచి తిరిగివచ్చిన కమ్యూనిస్టువిద్యార్థులు ఆహారకొరత తాత్కాలికమైనదని మాకు ధైర్యం చెప్పారు. ధరలు పెరుగుదలకు పట్టణానికి వెలుపలఉన్న కర్షకులే కారణమని వారు నిందించారు.

ధరల ఎక్కువ తక్కువలనుగురించి విద్యార్థులకేమీ బాధలేదు. భోజనవసతి సౌకర్యాలను ప్రభుత్వం కలిగిస్తోంది. ఇక మిగతాఅవసరాలనేవి చాలా తక్కువ. వాటికి కావలసిన డబ్బుసంపాదించటం కష్టమైనపనికాదు. ధరలు పెరిగిపోతున్నాయంటూ మా తల్లిదండ్రులు, షాపుకీపర్లు, హోటలుపనివాళ్లు, బళ్ళవాళ్లూ ఆరోపణలు చేయటంమాత్రమే మాకు తెలుసును. పాతప్రభుత్వం రోజులలో ఉన్నంత నోట్లముమ్మరం యిప్పుడు లేకపోవటం ఒక సుగుణం.

ఉత్తరచైనాలో నీటిఎద్దడి గోడ్డలిపెట్టు అయింది. సమయానికి వర్షాలుపడలేదు. పెకింగ్‌నకు చుట్టుపక్కలనున్న కర్షకులకు విపరీతమైన పంటనష్టంసంభవిస్తుందని పుకార్లు నగరమంతా వ్యాపించాయి. 'నియమం' అనేమాట పాఠశాలలలో అమితంగా వినవస్తోంది. వార్తాపత్రికల సంపాదకీయాలను పార్టీ సభ్యులు వల్లించటం ప్రారంభించారు. వ్యక్తిగతంగా పొదుపును అలవరుచుకోవాలని హెచ్చరించారు. "అనేక సంవత్సరాలుగా సైన్యంలో కష్టించి త్యాగాలుచేసివచ్చి ఫ్యాక్టరీలలోను, పాఠ

శాలలలోనూ ప్రభుత్వంలోనూ పనిచేస్తూఉన్న మన కామ్రేడ్సును చూడండి. విజయంతాలూకు ఫలితాలు కొంతవరకన్నా వారు అనుభవించేటట్లు అవకాశం యివ్వగలవారు ప్రజలే" పార్టీసభ్యుల సత్ప్రవర్తనలోనూ, మంచి అలవాట్లలోనూ ఏవిధమైన మార్పూ లేదు. తమ మనుగడకు ఎంతవరకూ అవసరమో అంతవరకే వారు ప్రజలవద్దనుంచి ఆశిస్తూ ఉన్నారు. ప్రభుత్వ కార్యాలయాలలోనూ పాఠశాల ఆవరణలలోనూ పనిచేస్తూఉన్న కాడర్లు నియమితకాలంకన్నా అదనంగా పని చేస్తూ ఉన్నారు. అందరితోపాటు మెస్సులలో భోజనం చేస్తు న్నారు. సమయం అనేది మిగులుతే పార్టీ కార్యకలాపాలకు వెచ్చిస్తున్నారు.

కొంతకాలం తర్వాత, విద్యార్థులకు ప్రభుత్వంచేసే సహాయ కార్యక్రమసమస్యనుగురించి షైటాలో విద్యార్థినాయకులు ఉపన్యాసాలు యివ్వటం ప్రారంభించారు. విమోచనకు ఆరునెలల పూర్వంనుంచే కమ్యూనిస్టుప్రాంతానికి తప్పించుకుని వెళ్ళిన విద్యార్థులనుగురించి ప్రస్తావిస్తూ, వెనుక ఉండిపోయిన విద్యార్థులుసహితం తమ మిత్రుల లక్షణాలను అలవరచుకోవాలని సూచించారు. "పూర్వ సాంఘికవ్యవస్థలో విద్యార్థులు సహజంగా అభ్యుదయకాములు. ప్రభుత్వంనుంచి విద్యార్థులు సహాయం అభిలషించడం ప్రశ్నించడానికి వీలులేని హక్కు.

ఆరోజుల్లో కొమింటాంగ్ ఆధిపత్యంలోఉన్న మనం సహాయకార్యక్రమపోరాడం, ప్రదర్శనలు జరపడం, అధికారుల ఆఫీసులు ముట్టడించటం, వీథుల్లో ఊరేగింపులు జరపడం,

యివన్నీ గూడా ఆ ప్రభుత్వాన్ని పతనంచేయడానికి జరిపినవే"
అని ఒక ఉపన్యాసకుడు ఉద్ఘాటించాడు.

ఒక చిరునవ్వునవ్వి, మళ్ళీ ప్రారంభించాడు-

"ఈరోజున పరిస్థితులు మారాయి. మన ప్రజలు బాధలు అనుభవిస్తున్నారు. పాతప్రభుత్వం తెచ్చిపెట్టిన అరిష్టాలను హతమార్చడానికి కృషిజరుగుతోంది. నిజంగా ఆహారమే గనక అవసరంగాకపోతే, ప్రజలవద్దనుంచి ధనం తీసుకోవటం, వారి భారాన్ని అధికంగావించటం మనం ఎట్లాచెయ్యగలము?

కామ్రేడ్స్! ప్రజలకు సేవచేయాలనీ, చెమటోడ్చి కష్టజీవులు ఉత్పత్తిచేసిన గోధుమ జొన్నలను వ్యర్థపరచరాదనీ మనం దీక్షవహించాలి. మీరు ఆహారం తీసుకునేటప్పుడు దానిని పండించిన వానిని జ్ఞాపకంచేసుకోవాలి. ఎంత అవసరమో అంతే మీరు ఉపయోగించాలి. విద్యార్థులం గదా అని విచ్చలవిడిగా ఆరగించరాదు. అది ప్రజాద్రోహమే అవుతుంది. పాత ప్రభుత్వ సహాయవిధానానికి మారుగా కొత్తసమయ కార్యక్రమం తలపెట్టడం బాగుంటుందని చాలామంది సూచించారు. ఆ విధంగా చేయటం బాగుంటుందని ఉద్దేశ్యం. పైటా విద్యార్థులమైన మనం నూతన సహాయపద్ధతిని కోరుదాం. మనందరికీ యిది ఒక కఠినమైనపరీక్ష. మీరు నిజంగా బీదవారైతే తప్ప ప్రభుత్వసహాయం అర్థించకండి. న్యాయబుద్ధితో ఆత్మగౌరవంతో యీ విషయమై ఆలోచించండి. ఈ పరీక్షలో మీరు దిగ్విజయం సాధిస్తారని నా విశ్వాసం."

జేజేధ్వానాలుచేసి గదులకు చేరుకున్నాము. విద్యార్థుల ఆత్మగౌరవానికి భంగకరమైన పాతప్రభుత్వ సహాయవిధానానికి

మారుగా యిప్పుడు స్కాలర్‌షిప్పులు ఇవ్వడం జరగబోతున్నదని వార్తాపత్రికలలో ప్రకటింపబడింది. ఇవి ఎ. బి. సి అని మూడు గ్రేడులలో ఉంటాయి. ఎ గ్రేడువారికి క్షౌర ఖర్చులు మొదలైన చిల్లరమల్లర ఖర్చులు కలిసివస్తాయి. బి గ్రేడ్ వారికి తిండిఖర్చులు ముడతాయి. సి తరగతివాళ్ళు తమ కాళ్ళమీద తాము నిలబడాలంటే సొంతసొమ్ము కొంత చేర్చుకోవలసి ఉంటుంది.

మాలో చాలామంది బి గ్రేడ్ స్కాలర్‌షిప్‌లు అడగవచ్చునని అనుకున్నాము. ధనికకుటుంబాలకు చెందిన విద్యార్థులు గూడా తమ తల్లిదండ్రులు విమోచనపొందని ప్రాంతాలలో ఉండటంవలన తమనుతామే పోషించుకోవలసి ఉన్నది. కాబట్టి ప్రతివిద్యార్థి ఏదోఒక దరఖాస్తుపత్రాన్ని అందుకున్నాడు. దరఖాస్తు ముఖాన్ని చూడగానే "మీకు ఇది ఒక పరీక్ష" అన్న ఉపన్యాసకునిమాటలు జ్ఞప్తికివచ్చాయి. మా పుట్టుపూర్వోత్తరాలనుగురించీ కుటుంబాలను గురించి అందులో అనేక ప్రశ్నలుఉన్నాయి. మీ కుటుంబంలో ఎందరుఉన్నారు? వారి పేర్లు, ప్రస్తుత నివాసస్థలం, ఉద్యోగం కొమింటాంగ్ లేదా యితర రాజకీయపార్టీలలో ఎప్పుడైనా సభ్యులుగా ఉన్నారా? అధికారపదవులలో ఎప్పుడైనా ఉన్నారా? అయితే ఎక్కడ? వారిలో ఎవరు ప్రస్తుతం సంపాదిస్తూ ఉన్నారు? ఎంత? నువ్వు ఎన్నడన్నా ఉద్యోగంచేశావా? ఎంతసంపాదించేవాడవు? మీకు ఏ గ్రేడు స్కాలర్‌షిప్ కావాలి?

ఈ దరఖాస్తుల ప్రశ్నావళినిచూచి కొంతమంది మిత్రులు వెనుకంజవేశారు. మిగతావాళ్ళం పూర్తిచేసి తరగతి

ఛయిర్‌మన్‌కు అందచేశాము. ఒక వారంరోజులతర్వాత మా నాయకులు, దరఖాస్తులు పైకి పంపించడానికి పూర్వం వాటి బాగోగులు చర్చించడానికి త్వరలోనే తరగతుల్లో సమావేశం కావాలని ప్రకటించారు.

యోచనా సంఘర్షణతో ప్రథమ పరిచయం మాకు యీ బహిరంగసమావేశాలలో సంప్రాప్తమైనది. ఒక వ్యక్తి యొక్క పురాతన మూఢవిశ్వాసాలను, బహిరంగ, గ్రూపు విచారణలద్వారా సంస్కరించే నూతన పద్ధతులను గురించి మేము వినిఉన్నాము. దోషులుగా గాకుండా దోషారోపకులుగా మేము వ్యవహరిస్తామని భావించాము. ఇది హఠాత్తుగా సంభవించిన ఒక నూతన అనుభూతి. కొంతభయాందోళనతో మేము మీటింగునకు హాజరు అయ్యాము.

నేను వెళ్ళిన మీటింగ్‌లో మా చైర్‌మన్, ప్రతిదరఖాస్తునూ సమగ్రంగా పరిశీలించి చూచే అవకాశం మా కామ్రేడ్స్‌కి యివ్వవలసిందిగా కోరాడు. తనముందు బొత్తిలో నుంచి ఒక దరఖాస్తు పత్రాన్ని తీశాడు. అది చాంగ్ అనే సహాధ్యాయునిది. ఆదరఖాస్తునుంచి తెలిసినవిషయాలు చాంగ్ తండ్రి షాంగ్‌హైలో ఒక విద్యుదుత్పత్తి కేంద్రంలో ఇంజనీరుగా ఉన్నాడు. ఒక సోదరుడు అమెరికానుంచి తిరిగివచ్చి మోటార్ కార్ పరికరాల అంగడికి యజమానిగా ఉన్నాడు. ఇతను బూర్జువాల కుటుంబీకుడని వేరుగా చెప్పనక్కరలేదు.

ఈ విషయాన్ని చాంగ్ గ్రహించాడు. అతను లేచి నిలబడ్డాడు. ఈ దరఖాస్తును పంపించినప్పటినుంచీ నేను యోచిస్తూనే ఉన్నాను. దరఖాస్తు చేయటం తప్పిదంగా నేను

గ్రహించగలిగాను. మన ప్రజలు చాలా బాధలు అనుభవించారు. మన ప్రజలవద్దనుంచి ధనం స్వీకరించరాదనే నిర్ణయానికి నేను వచ్చాను. నా దరఖాస్తును త్రోసివేయవలసిందిగా కోరుతున్నాను".

హాలులో సమకూడిన వారంతా కరతాళధ్వనులు చేశారు. యువజనసమితి, పార్టీసభ్యుల మందహాసాలకు తల వంకిస్తూ చాంగ్ కూర్చున్నాడు.

ఛైర్‌మన్ మరో దరఖాస్తును చదివాడు. ఆ దరఖాస్తుదారు అభ్యుదయవాది. అతను లేచి యిట్లా అన్నాడు: "నా ఆర్థికపరిస్థితి ఏమీ బాగాలేదని తోటి విద్యార్థులకందరికీ తెలుసును. నా బంధువులు యిక్కడ పెకింగ్‌లో ఉన్నారని గూడా వారికి తెలుసును. నా ఖర్చులకి కావలసిన పైకమంతా వారివద్దనుంచి నాకు రాదు, కాని ఎక్కడో గుమాస్తాగానో ట్యూటర్‌గానో పనిచేసి ఆ డబ్బును నేను ఆర్జించగలను. కాబట్టి నా దరఖాస్తును గూడా తొలగించవలసిందిగా కోరుతున్నాను."

విపరీతమైన కరతాళధ్వనులు చెలరేగాయి. యువజన సమితి సభ్యుడొకడు లేచాడు. "ఛైర్‌మన్! మీరు మరొక దరఖాస్తు పత్రం చదివేముందు నేను రెండుముక్కలు చెప్ప దలచుకున్నాను. ఈ పరీక్షను విద్యార్థులు ఏవిధంగా ఔదల దాలుస్తున్నారో దీనివల్ల విశదమవుతోంది. ప్రజలయెడ తమకు గల ధర్మాలను గుర్తించకపూర్వం యీ యిరువురు కామ్రేడ్స్ తమ దరఖాస్తులను పంపించారు. ఇప్పుడు తమంతటతాముగా వైదొలగి యితరులకు మార్గదర్శకులయ్యారు. కళాశాల విద్యను

అభ్యసిస్తూఉన్న మాలో ఒక్కరుగూడా బీదకుటుంబాలకు చెందినవారుకారు. కార్మిక కర్షకుల జీవనప్రమాణానికన్నా మా పరిస్థితి బాగా మెరుగైనది. వ్యక్తిగతంగా నాకు ఏవిధమైన సహాయమూ అవసరం లేదు. నాకంటే బీదవారైన ప్రజలముందు చేతులుజాచి నేను ముష్టిఎత్తలేను" కరతాళధ్వనులు మిన్నుముట్టాయి.

మూడవదరఖాస్తు కుమారి వెన్‌కి చెందినది. ఆమెకు సహాయం కావలసిఉన్నమాట నిజమని మా అందరికీ తెలుసును. కాని యీ ఉపన్యాసాలు అన్నీ వినడంతో ఆమె సంధిగ్ధావస్థలో పడింది. దరఖాస్తులుపెట్టని యిద్దరువ్యక్తులచేత మాట్లాడించడంద్వారా సమావేశకర్తలు యిటువంటి బోనును ఏర్పాటుచేసి తర్వాత వచ్చేవాళ్ళని యిరకాటకంలో పెట్టారేమో! సహాయం కోరదల్చుకోనివాళ్ళు ప్రజలపట్ల గౌరవ ప్రతిపత్తులు చూపుతున్నారు. అయితే సహాయం అర్థించేవాళ్ళకి అటువంటిభావన లేదనా? బూర్జువాలకు చెందినవాళ్ళు తమదరఖాస్తులను తమంతటతామే తొలగించివేయవలసిందిగా కోరారుగదా? పెకింగ్‌లో బంధువులు ఉన్నవాళ్లు సహాయానికి వారినే అర్థిస్తారుగాని ప్రజలను కోరరుగదా? తమ ఖర్చులనిమిత్తమై చిన్నఉద్యోగాలు చేసేవాళ్ళ మాట ఏమిటి?

కుమారివాంగ్ ధైర్యంగా మాట్లాడింది. "నాదరఖాస్తు విషయమై ముందు, ఆ తర్వాతగూడా చాలా జాగ్రత్తగా యోచించాను. గత్యంతరంలేకనే నేను సహాయం అర్థించవలసి వచ్చిందని నా సహాధ్యాయులకుగూడా తెలుసును. మా కుటుంబం చుంకింగ్‌లో ఉన్నది. వారికి నాకు సంవత్సరంనుంచీ

ఉత్తరప్రత్యుత్తరాలు లేవు. మా తండ్రి పనిచేసేస్థితిలో లేడు. పెళ్ళిళ్లుకావలసిన యిద్దరు చెల్లెళ్ళను పోషిస్తున్నాడు. యుద్ధములో మా అన్న ఏమైపోయాడో తెలియదు. ఉత్తరచైనాలో నాకు సహాయంచేసే బంధువులు ఎవ్వరూ లేరు. ప్రజల ధనం మీద నాకేమీ అధికారం లేదని తోస్తోంది. కాని ఒకసంవత్సరంలో పట్టభద్రురాలిని కావాలనిఉంటే సహాయాన్ని నేను అర్థించక తప్పదు"

కుమారివెన్ దరఖాస్తునిగురించి మేము చర్చ ప్రారంభించాము. ఎవరికితోచిన ఆరోపణలు వారు చేశారు. "విద్యార్థులలో సహజంగాకనిపించే రాజకీయచైతన్యం యీమెలో కనిపించదు. స్వలాభంకోసమే చదువు అని ఆమె అభిప్రాయం. నూతన వ్యవస్థలో ఆమెకు ఆసక్తి ఉన్నట్లు తోచదు."

ఆమెను బలపరుస్తూ మాలో కొంతమంది లేచినిలబడే వాళ్ళమే. కాని మా దరఖాస్తులగతి ఏమౌతుందోననే భయంతో ఆపని మేము చేయలేకపోయాము. ఒక కమ్యూనిస్టు మిత్రుడు యీవిధంగా అన్నాడు : "కామ్రేడ్స్! కుమారివెన్ విషయంలో ప్రజలు దయచూపగలరు. అయితే ఆమె తన దరఖాస్తును బి నుంచి సి గ్రేడుకు మార్చుకోవలసిందిగా కోరుతున్నాము. ఆమె తన ధోరణిని త్వరలోనే మార్చుకోగలదని ఆశిస్తున్నాను. సి గ్రేడ్ గ్రాంటుకి సిఫార్సుచేస్తున్నాము."

యువజనసమితి, పార్టీల మిత్రుల దరఖాస్తుల విషయంలో యింత తర్జనభర్జనలకి అవకాశంలేకుండా చేయడానికి ప్రయత్నంజరిగింది. చర్చకివచ్చిన ఆదరఖాస్తుదారులని బలపరచడానికి నాలుగువైపులనుంచి జనం లేచేవారు. "మన

కాప్రేడ్ దరఖాస్తుతో తన చరిత్రనంతా పూసగుచ్చినట్లు దాపరికంలేకుండా వ్రాశాడు. అతను దుర్భరదారిద్రంలో ఉన్నాడు. విమోచన ప్రారంభంనుంచీ తన సమయాన్నంతా ప్రజాక్షేమానికే వినియోగిస్తున్నాడు. కష్టపడిచదువుతున్నాడు. దేశశ్రేయస్సునే కాంక్షిస్తున్నాడు. ఇటువంటివారికోసమే యీ సహాయ కార్యక్రమం."

అన్నిదరఖాస్తులు పూర్తికావడానికి ఇలాంటివి ఎన్నో సమావేశాలు జరిగాయి. ఈ పరీక్షలకి తట్టుకోలేక ఎంతో మంది దరఖాస్తులను ఉపసంహరించుకొన్నారు. కొందరు గ్రేడ్ తగ్గించుకున్నారు. అసలు దరఖాస్తే చేయనివారికి యోగ్యతా పత్రాలు లభించాయి.

బ్రతికిబయటపడ్డ దరఖాస్తుదారులు డిపార్టమెంటల్ పరీక్షకి తట్టుకోవాలి. ప్రతిసారి దరఖాస్తుదారుని పేరు గ్రేడుచదివి మిగతావారి అభిప్రాయం అడుగుతారు. ఏ విద్యార్థి అయినా నిర్భయంగా సూచనలుచేయవచ్చును. ప్రతివాది యిందుకు జవాబు చెప్పుకోవలసి ఉంటుంది. ఉద్రేకాలు తెచ్చుకుని మాటకు మాటఅంటే ఆ దరఖాస్తు బుట్టదాఖలు అవుతుంది ఈ వాదోపవాదాలకు ఆడపిల్లలయితే కళ్ళలోనీరు తుడుచుకుంటూ కూర్చునేవారు. బాలురైతే ముఖం కందగడ్డలు చేసుకుని నిశ్చేష్టులై నిలబడిఉండేవారు. కుటుంబాలను వదిలివచ్చామనీ, కష్టించి చదువుతున్నామనీ, తమ చదువుసాగడానికి ప్రభుత్వ సహాయమే ఆధారమనీ వారు వాదించగలవారే. ప్రతిబంధకాలలో చాలావరకు తప్పించుకొని గమ్యానికి దగ్గరగా రావటం వల్ల తప్పక సహాయం లభిస్తుందని వారి ఆశ. ఒకానొకరోజున

హృదయపూర్వకంగా తమ శక్తిసామర్థ్యాలనన్నింటినీ ప్రజల కోసమే వినియోగిస్తామని వారు హామీగూడా యిచ్చారు— కాని యీ మాటలు ఎన్నో నెలల క్రితమే అని ఉండవలసినవి.

చాలామందివిషయంలో యివి నిర్ణయకారణాలు కాక పోయినా పరీక్షలలో ఎక్కువమార్కులు సంపాదించడం ఎంతో సహాయకారి అయింది. రాజకీయ అభిప్రాయాలనుగురించి ఎంత ముట్టడిజరిగినా బీదకుటుంబాలలోనుంచి వచ్చినవారికీ, చదువులో రికార్డులు సాధించినవారికీ గ్రాంట్లులభించినవి. బహు శః యీ గ్రాంట్ల ద్వారా వారిమనస్సులను ప్రజలవైపునకు తిప్ప వచ్చునని అభిప్రాయం అయిఉండవచ్చును.

రెండవ రౌండుకాగానే దరఖాస్తులు మూడవ పరీక్షను ఎదుర్కొనవలసివచ్చింది. యీమాటలు పరీక్షచేసేది విశ్వ విద్యాలయ విచారణాసంఘం. ఇంతకుముందుజరిగిన నిర్ణయాలు సమంజసంగా లేవనీ తిరిగి పునర్విచారణ జరపాలనీ యీ సంఘం వారు ఆదేశించారు. ఈ బాధంతా తిరిగి పడలేని చాలామంది విద్యార్థులు తమ దరకాస్తులను ఉపసంహరించుకొన్నారు. లేదా గ్రేడులు తగ్గించుకున్నారు.

ఈమూడు అంచెలు గడిచింతర్వాత దరకాస్తు ఫలితా లను పరీక్షాఫలితాలవలె ప్రకటించారు. మాలో సగంమందికి ఏదో గ్రేడ్ సహాయం లభించింది. వీరిలో చాలామందికి మధ్య తరగతి బి గ్రేడ్ యిచ్చారు. ఇద్దరేసి వ్యక్తులకి 'పరస్పర సహాయ' గ్రాంట్లు కొన్ని యిచ్చారు. ఒక ఎ గ్రేడ్ ఒక బి గ్రేడ్ దరకాస్తుదారులు కలసి తమకువచ్చే ఆదాయాన్ని చెరి సగం పంచుకోవాలి. మీటింగులలో ఏదో ఉద్యోగం, సద్యో

గం చేసుకొంటామని చెప్పిన చాలామందికి సి గ్రేడ్ లభించింది.

ఈ పరీక్షలకు తట్టుకుని సహాయం లభ్యమయిన యావన్మంది విద్యార్థులకూ పట్టరాని ఉత్సాహంకలిగింది పూర్వపు సహాయకార్యక్రమంకన్న దీనిలో ఏదో ఉదాత్తత కనిపించింది. ఎ బి గ్రాంట్లను పొందినవారికి జీవనానికి ఏవిధమైన లోటూ ఉండదు. బహుశః మా భవిష్యత్తు పీటిమీద ఆధారపడి ఉంటుంది. గ్రాంట్లను పంచటంలో ప్రస్ఫుటమైన ప్రజాస్వామ్యమునుగురించి నికృష్టమైన పురాతనపద్ధతికన్నా నూతన సహాయ విధానానికిగల ఆధిక్యమునుగురించి మా నాయకుల అభిప్రాయములను మేము చిలుకపలుకులుగా అప్పగించసాగాము.

తమ దరఖాస్తులు త్రోసివేయబడిన విద్యార్థులు గొణుగుడు ప్రారంభించారు. ఒక కాటన్‌మిల్లు యజమాని కుమారునికి బి గ్రేడ్ యివ్వటం వారు నిరసించారు. నూతన ప్రభుత్వాన్ని బలపరుస్తూఉన్న కొద్దిమంది బూర్జువా వ్యాపారులలోనూ వీని తండ్రి ఒకడవటంవల్ల, తన కాళ్ళమీద తాను నిలబడాలనీ తండ్రివద్దనుంచి సహాయం కోరకూడదని తలంచటంవల్లా అతనికి గ్రాంట్ లభించిందని జవాబువచ్చింది.

నూతన విధానంపట్ల యిలాంటి విమర్శలు వస్తాయని మాకు తెలుసును. ఒక విద్యార్థి "నేను వీధుల్లో తిరిగి బిచ్చమైనా ఎత్తుతాగాని యికముందు ఎన్నడూకూడా ప్రభుత్వ సహాయాన్ని అర్థించ తలుచుకోలేదు" అన్నాడు.

# 5

## ఆహార సమస్య

షైటాలో బాలికలు తమ అందచందాల విషయమై అంతగా పట్టించుకునే వీలుండేదికాదు. షాంగ్‌హై, హాంగ్ కాంగ్‌లాంటి నగరాలలో ఉండే చాలామంది స్త్రీలు తిండితిన టం సినిమాలకి వెళ్ళటం యిళ్ళలో ఆట ఆడటంతప్ప చేయడానికి వేరేపని ఏమీలేదు. వీధులలో కనిపించే నున్నని బొద్దుపాటి విదేశీ స్త్రీలలాంటి చైనా బాలికను చూడటం బహు అరుదు. ప్రజాసహాయ కార్యకలాపాలు ఏవిధంగా పనిచేస్తున్నాయో తెలుసుకునే అవకాశం చిక్కిం తర్వాత మా శరీరాలను నాజూ కుగా ఉంచుకునే విషయమై ఆరాటపడటం మానుకున్నాము.

సహాయ కార్యక్రమం ప్రవేశపెట్టిన తర్వాత పాఠశా లలో తలపట్లు పట్టుకునే రెండువర్గాలు ఏర్పడినవి. ఒకవర్గం వారు ప్రభుత్వం ఆహారాన్ని ఒక రాజకీయ ఆయుధంగా ఉపయోగించి విద్యార్థులను తమ అదుపులోనికి తీసుకున్నదని రహస్యంగా అక్షింతలు వేశారు. మరొక వర్గంవారు ప్రభుత్వ చర్యలకు తమ హర్ష ఆమోదాలను ప్రకటించారు.

ఈ భేదాభిప్రాయాలు బహిరంగంగా బయటికిరాలేదు. ఏవిధమైన సహాయమూ లభించని వారు తమ ఆరోపణలను అనుంగుమిత్రుల చెవుల్లో రహస్యంగా ఊదారు. గ్రాంటుల విషయమై అసంతృప్తి పాఠశాల యావత్తూ అలుముకొన్నది. దాని ప్రభావఫలితం మాకు యిచ్చే ఆహారంలో కనిపించటం

ప్రారంభించింది. బొత్తిగా నాసిరకం తిండి పెట్టడం ప్రారంభించారు.

మాలో తగినంత శక్తి, పుష్టి కలుగకపోవడానికి కారణం చాలమంది విద్యార్థులు రెండుసార్లే భోజనం చేయటం కారణమై ఉండవచ్చును. మధ్యాహ్న సాయంకాల భోజనాలు మెస్ హాలులో పెట్టేవారు. ఉదయ భోజనానికి నియమిత సమయం అంటూ లేదు. ప్రతి నెలా మాకు ముప్పై ఉదయ భోజన టిక్కట్లను యిచ్చేవారు. వీటిని ఉదయం ఏడు తొమ్మిది గంటలమధ్య మార్చుకోవచ్చును. ఆరున్నర గంటలకు జొన్న అంబలి త్రాగడానికి గంట మ్రోగేది. కొద్దిమంది విద్యార్థులు మాత్రమే వెళ్ళేవారు. ప్రతిరోజూ జొన్న అంబలే. ఉప్పులో ఊరవేసిన కాయగూరలు యిచ్చినా అంబలి అంటే విరక్తి పుట్టింది. నిద్రలేచి కాలకృత్యాలు తీర్చుకుని పుస్తకాలు సంచీ భుజాన వేసుకొని ఉసూరుమంటూ తరగతులకి వెళ్ళేవాళ్ళము. ఎదురుకుండా వీధిలో పదిపన్నెండు చిన్న ఫలహారశాలలు ఉన్నాయి. వాటిలో రకరకాల పదార్థాలు అమ్ముతారు. ఎనిమిదన్నర గంటలయింది. కడుపులోపల ఆకలి చురచుర లాడిస్తోంది. జేబులో పర్సు ఖాళీగా ఉంటే పొట్ట గూడా ఖాళీగా ఉండనుకోవలసిందే.

జేబులో డబ్బులుగనక ఉంటే ఒక్క అడుగులో నువ్వు వీధిలోని ఫలహారశాలలో వాలవచ్చును. కావలసిన రకరకాల వస్తువులు తినవచ్చును.

విమోచనకు పూర్వం – పాఠశాల భోజనం ఎడల అసంతృప్తి కలిగిన విద్యార్థుల సౌకర్యార్థం చుట్టుపక్కల

6)

ప్రాంతాలలో అనేక రెస్టారెంటులు బయలుదేరాయి. పాశ్చాత్య కేకులుగూడా యిక్కడ లభ్యమయ్యేవి. పుష్కలంగా డబ్బు ఉన్నవారు తమవెంట ఒకరిద్దరు మిత్రులనుగూడా ఆహ్వానించి తమతో తీసుకువెళ్ళేవారు.

భోజనానికీ భోజనానికీ మధ్య బఠానీలు నములుతూ ఉండేవారు. అవి వస్తువులకన్నా యివి కారుచౌక. పైగా ప్రతి వారికి నచ్చేవి. పళ్ళకి కొంత పనికల్పించేవి. ఆకలి చురచురను ఉపశమింప జేశేవి.

1947, 48 ప్రాంతాలలో ఆహారం విషయంలో కొంత మార్పూ, అభివృద్ధి కనపరుస్తే మేము అంత చిరాకుపడవలసిన అవసరం ఉండేదికాదు. ఈ లక్ష్యాలను సాధించడానికి కమ్యూనిస్టులు యిప్పుడు ఎంతవరకూ ప్రయత్నిస్తున్నారో నాకు తెలియదు. బహుశః సీటికొరత, సైనికావసరాలు యిందుకు ప్రతిబంధకమై యుండవచ్చును. విమోచనానంతరం ఆహార ఆరోగ్య సమస్యలు తక్షణం పరిష్కరింప బడతాయని 1948 లో ఉపన్యాసాలు చెప్పిన అభ్యుదవాదులే 1949 లో పొదుపరితనం, అలవర్చుకోండని హెచ్చరికలు చేశారు. 1949 ఆకురాలు కాలం ప్రారంభం కాగానే మా మెస్‌లోని ఆహారంలో కొంతమార్పు కలిగింది. మేము అలవాటు చేసుకున్న గోధుమపిండి బియ్యాలకు బదులు ముతక జొన్నలు బియ్యంపిండి వచ్చాయి. దీనితో రొట్టెలు, కేకులు చేసి వడ్డించేవారు.

"ప్రజల ఆహారపదార్థాలు వ్యర్థం చేయకండి" అంటూ యువజన సమితి హెచ్చరికలు వినరావడంతో మేము ప్రాతః కాల భోజనానికి హాజరుకావటం ప్రారంభించాము. ప్రాతః

కాల భోజనానికి మేము యింకా జొన్న అంబలే త్రాగు తున్నాము. దానికి తోడుగా ఊర వేసిన కాయకూరలు యిచ్చే వారు. యదార్థానికి జొన్న అంబలి చాలామందికి ఎంతో యిష్ట మైంది. 'జొన్న అంబలి రోజూ త్రాగటం అంటే చాలాకష్టమే. కాని మిగతా వాటికన్నా యిది గొంతుకలోనుండి తేలికగా దిగ జారుతుంది' అని వ్యాఖ్యానించింది ఒక మిత్రురాలు. నియమాన్ని అలవర్చుకోండని నూతన ప్రభుత్వం హెచ్చరికలు చేయడంతో బాటు మా మధ్యాన్న భోజన పదార్థాలు అతి దిగ నాసిగా తయారవుతూ ఉన్నాయి. నిజానికి మేము ఆహార నియమాన్ని అవలంబించామని చెప్పక తప్పదు. మాంసము లభ్యంకాకపోవటం వల్ల ప్రోటీనులకు మేము కొవ్వుమీద ఆధారపడవలసి ఉన్నది. కాని మాకు అది కరువై పోయింది. కాలం గడుస్తున్నకొద్దీ మేము ఉడకవేసిన కాబేజీ, ఆకు కూరలు, చిక్కుళ్ళు తినడంతో తృప్తిపడవలసి వచ్చేది. ఎండు చేపలు కంటికి కానరాకుండా పోయినవి.

మాకు యిచ్చే ఆహార పరిమాణంలో మార్పులేదు. పొట్టనింపుకోవడానికి మాత్రమే ఇది ఉపయోగపడేది. అయితే రుచీ పచీ లేకపోవటంవల్ల మా ఆకలిని చంపడానికి యిది ఎంతో తోడ్పడేది. వంటయిళ్ళనుండి విద్యార్థులు తమ గదు లకు వచ్చి గోధుమ కేకులకోసం బఠాణీలకోసం పెట్టెలు తడిమే వారు. అందినంతవరకూ ఆదరాబాదరా తినివేశేవారు. నియమ నిష్టలతో కొన్ని నెలలు గడిచేసరికి బలవర్ధక పదార్థాలు భుజించకపోవటం వల్లనూ ఆరోగ్యం సన్నగిల్లుతున్నదని మాకు అనుమానమూ, భయమూ గూడాకలిగినాయి. కొన

గలిగిన సామర్థ్యం ఉన్నప్పుడు విదేశీ వెన్న, జున్నూ కొని భోజనానంతరం మా గదుల్లో రహస్యంగా చేరి రొట్టెలకు పట్టించి తినేవాళ్ళము.

ఆరోగ్యాన్ని గురించి మేము ఆందోళన చెందటం మొదలుపెట్టాము. మామూలు తరగతులుకు తోడుగా రాజకీయ తరగతులకీ సభలూ సమావేశాలకూ హాజరవవలసి ఉన్నందువల్ల అదనంగా శ్రమపడవలసి వచ్చేది. యూత్ లీగ్, పార్టీ సభ్యులు కానివారు సహితం యీ కార్యక్రమాల్లో పాల్గొనక తప్పదు. మేమంతా చిన్నవాళ్ళం. భవిష్యత్తునందు గల అవిరళమైన ఆశతో ఏదోవిధంగా కాలాన్ని నెట్టుకుని పోగలమని ఆశించవచ్చును. కనిపించకుండా అంటిపెట్టుకుని ఉంటే సుస్తీలు అంకురిస్తూ ఉన్న క్షయవ్యాధిగల విద్యార్థులకు యీ పరిస్థితులు ఏవిధంగానూ సహాయం చేయలేవు.

పెకింగ్ నందు జూన్‌లో ఒకరోజు మధ్యాహ్నం విపరీతమైన ఎండకాస్తోంది. మధ్యాహ్న భోజనానంతరం కాస్సేపు విశ్రాంతి తీసుకోవచ్చునుగదా అని హాస్టల్‌కి వచ్చాను. చి. ఎన్. టి. ఎన్ – ఫాంగ్ గదివద్ద ఆగి రెండుసార్లు తలుపు తట్టాను. జవాబుకు ఎదురుచూడకుండా మా మిత్రురాలి గదిలో ప్రవేశించాను.

టియెన్-ఫాంగ్ కుర్చీలో దిళ్ళకు ఆనుకుని కూర్చుంది. చెమటలు దిగజారుతూ ఉన్న నుదురుమీద తడి రుమాలు కట్టబడిఉన్నది. ఎంతో అలసిపోయినట్లుగానూ పాలిపోయి

నట్లుగానూ ఉన్నది. వచ్చింది ఎవరో చూడడానికి తల ప్రక్కకు త్రిప్పింది.

"పెద్దరాజకుమార్తెవలె దిళ్ళకు ఆనుకుని కూర్చున్నావే" అని హాస్యంగా అన్నాను. ఆమె జవాబు చెప్ప లేదు. యింత సానుభూతిలేదేమా అన్నట్లు నా వైపుచూచింది.

తలుపు మళ్ళీ తెరుచుకుంది. చరిత్ర తరగతిలో చదువు తున్న ఒక విద్యార్థి లోపలికివచ్చాడు. అతను 'అభ్యుదయ వాది.' విలింగు సర్కిల్‌లో నాయకుడుగా ఎన్నికఅయినవాడు. చెమటలుబడుతూన్న తన సహపాఠివైపుచూస్తూ యిట్లా ప్రశ్నించాడు. "మిస్‌చెయెన్! 'వర్గవిభేధాలు' అన్న గ్రంథం నువ్వు చదవటం పూర్తిఅయిందా? మిగతా మన సహాధ్యా యులు ఆ పుస్తకాన్ని చదవాలనుకుంటున్నారన్న విషయం నీకు తెలుసుగా" అని కట్టెవిరిచి పొయ్యిలో పెట్టినట్టు చాలా నిర్లక్ష్యంగా అడిగాడు.

"ఎవరికైనా అవుసరమైతే ఆ పుస్తకాన్ని నువ్వు తీసుకు వెళ్ళవచ్చును" అని టియెన్-ఫాంగ్ జవాబు యిచ్చింది.

"అయితే నువ్వు చదవటం పూర్తిచెయ్యలేదన్న మాట? నాలుగురోజులనుండి ఆ పుస్తకం నీ వద్దనే ఉన్నదే."

"అవచ్చు. అయినా యీ నాలుగురోజులనుంచీ నేను సుస్తీగా ఉన్న విషయం అబద్ధం కాదు."

"ఆ పుస్తకం ఎక్కడ ఉంచావు. మరొకరైతే రెండు రోజుల్లో చదివివేసేవాళ్ళు."

ఆమెకళ్ళు చెమ్మగిల్లినవి. సమర్థిస్తూ నేను మాట్లాడా లనుకున్నాను. ఇంతలో ఆమె జవాబునిచ్చింది. "ఏ రోజు

కా రాజు నా ఆరోగ్యం కుదుటపడుతుందని అనుకుంటూ వచ్చాను. ఆ పుస్తకం అలమారాలో ఉంటుంది. దయయుంచి నువ్వే చూసుకో" అంటూ కన్నీళ్ళతో అతనివైపు చూచింది.

పుస్తకాన్ని తీసుకుని అతను వెళ్ళిపోయాడు. తలుపు మూతబడడంతోటే ఆమె ఏడుపు ప్రారంభించింది. కన్నీరు తుడుచుకోవడానికి తడితువ్వాలు ఆమెకు అందించాను.

"అసలు నీకు సుస్తీ ఏమిటి?" అని ప్రశ్నించాను.

తువ్వాలుతో ముఖం తుడుచుకుంటూ ఆమె అన్నది. "ఈ యుగం ఎంత బాధాకరమైనదో ప్రజలు అనటం నేను విన్నాను. ఇప్పుడు ఆ రోగమే నాకు వచ్చింది. ఇది మూల వ్యాధి. ఇటీవల తింటూవున్న నిస్సారమైన తిండివలనే యిది నాకు సంక్రమించింది. ఎంత బాధగానూ సిగ్గుగానూ ఉన్నదో చెప్పలేను. ఎవ్వరికీ నా గోడు చెప్పుకోవటం యిష్టంలేదు. నా సుస్తీని గురించి నాయకులు నమ్మలేకుండా వున్నారు."

"వాళ్ళమాటల కేంలే. మూలశంక అతి బాధాకరమైన వ్యాధి. బలవర్ధకములైన కొవ్వు, సాత్వికాహారములను తీసుకుంటే నయం అవుతుందని నేను విన్నాను." నా ఉపదేశం ఆమె హాస్యంగా భావిస్తుందేదేమోనని నాకు అనుమానం కలిగింది.

"నిజమే. ఆ విషయం నాకు తెలుసును. రెండువారాల క్రితం అమెరికన్ ఆర్మీ వదిలివెళ్ళిన జున్ను డబ్బానొకదానిని బజారులో కొనుక్కొని వచ్చాను. మూత ఊడతీస్తున్నప్పుడు చూచిన మిత్రులు కళ్ళు ఉరమటమేగాకుండా నానామాటలు అన్నారు."

పుష్టికరమైన ఆహారం లభ్యం కాకపోవటం విద్యార్థులలో అనేక వ్యాధులకు కారణమైంది. విమోచనకు పూర్వం జరిగిన వైద్యపరీక్షల్లో నూటికి పదిమంది విద్యార్థులకి క్షయ వ్యాధి ఉన్నదని తేలింది. ఆ తర్వాత ఆ సంఖ్య పెరిగింది. వ్యాధి ముదిరినవారు కొంత కాలంవరకూ చదువు కట్టిపెట్ట వలసి వచ్చింది.

మిగతా విద్యార్థులలో కన్నా పార్టీ, యువజన సమితి సభ్యులలోనే వ్యాధి తీవ్రత అధికంగా ఉన్నది. విజయసాధనకు వారు అనేక కష్టాలను అనుభవించవలసివచ్చింది. చైనీస్ కమ్యూనిస్టుపార్టీ యొక్క అనేక కాడర్లకు యీ వ్యాధిసోకింది. తమ సౌకర్యాలననుసరించి ఆరోగ్యంగురించి వారికి లక్ష్యంలేదు. ఆ విషయంలో వారిని మెచ్చుకోవలసిందే. అనేక ముఖ్యమైన విషయాలు ఉండగా తమ ఆరోగ్యాలనుగురించి ఆరాటపడటం వారికి యిష్టంలేదు. ఈ వ్యాధి సోకినకొందరు యువవిప్లవకారులు దానిని తమబాడ్జ్‌గా భావించారు. వ్యాధియెడల తమ వైముఖ్యాన్ని బహిరంగంగా ప్రదర్శించేవారు. దగ్గుతో యమయాతన అనుభవించేవారేగాని డాక్టరును చూడటానికిగూడా యిష్టపడేవారు కారు.

వ్యాధుల జాబితాలో తరువాత స్థానం ఆక్రమించేవి అజీర్ణ సంబంధమైనవి. ముతక ఆహారం, దీర్ఘకాలపని, నిద్ర లేమి యీవన్నీగూడా వ్యాధికి కారణములు. వీటికితోడు నిద్ర రాకపోవటం, నరాల నిస్సత్తువ విద్యార్థులకు సంక్రమించే మరిరెండు సామాన్య వ్యాధులు. వ్యాధిగ్రస్తులుగా బాధపడే వారిని చూస్తే పార్టీసభ్యులకు కొంత కంటకంగా కనిపించేది.

1950లో నూతన ప్రభుత్వం పరిస్థితిని గ్రహించి విద్యార్థుల ఆరోగ్య విషయంలో ఆసక్తిని చూపటం ప్రారంభించింది. విద్యార్థుల స్థితిగతులనుగురించి దర్యాప్తు జరిగింది. బోధనాసమయాన్ని తగ్గించివేశారు. విద్యార్థులు ప్రభుత్వానికి 'జాతీయ మూలధనం' అవటంవల్ల యీవిధమైనచర్య తీసుకోవలసివచ్చి ఉంటుంది.

ఆహారాన్ని గురించి ఆరోగ్యాన్ని గురించి సాధారణంగా మా గదుల్లోనో లైబ్రరీలోనో మిత్రులమధ్య చర్చలు గుసగుసల రూపంలో జరుగుతూ ఉండేవి. విమోచనకు పూర్వం పదెనిమిది మెస్ గ్రూపులు వేర్వేరుగా ఉండేవి. ఎవరికి యిష్టమైన గ్రూపులో వారు చేరేవారు. 'యదార్థ ప్రజాస్వామ్యము' పెంపొందించడానికి రూపొందిన సమిష్టి జీవనసిద్ధాంతం' ప్రకారం ఒక నూతన పద్ధతిని అవలంబించవలసిందిగా విమోచనానంతరం మా నాయకులు మమ్మల్ని ఉద్బోధించారు. విద్యార్థుల తరగతి సంవత్సరాన్ని అనుసరించి సీట్లు ఏర్పాటు చేయబడ్డాయి. యీ పద్ధతి ప్రకారం ఒకే తరగతిలో చదువుతున్న విద్యార్థులలో ఒకేచోట భోజనం చేస్తారు. దీనివల్ల ఎంతో లాభం ఉన్నది. ప్రకటనలు, హుకుములు, అధికారవినతులు, యింకా యితర విషయాలు ఆయా తరగతి సంఘాల ప్రతినిధులద్వారా భోజనశాలలో అందజేయబడేవి. ఏదన్నా విషయాన్నిగురించి, చర్చ, వోటింగ్, తీర్మానం అవసరమైతే సమయం వ్యర్థంకాకుండా ఆపని అక్కడేపూర్తిచేసేవాళ్ళము.

రాజకీయాలనుండి తప్పించుకుని తిరగాలనుకునే విద్యార్థులకి యీ పద్ధతి నచ్చలేదు. పూర్వపురోజుల్లో అందుకు అవ

కాశం ఉండేది కాని యిప్పుడు తప్పనిసరిగా రాజకీయాలలో పాల్గొనక తప్పించికాదు.

ఈ కొత్త పద్ధతి ప్రారంభమైన మొదటివారంలో ఒక రోజున భోజనాలుచేస్తూ ఉండగా మా మిత్రుడొకడు అంత కంతకూ దిగనాసిపోతూన్న ఆహారమునుగురించి యీ విధంగా ప్రస్తావించాడు "పూర్వప్రభుత్వపురోజుల్లో విమోచనరాగానే శుభ్రమైన తిండి దొరుకుతుందని ఉపన్యాసాలలో చెప్పే వారు. ఇప్పుడు మనం తింటున్న దాంట్లో నాకు మార్పేమీ కనిపించటంలేదు."

మా టేబిల్ లీడర్ ఏ విధమైన చిరాకుపడకుండా అందుకు కారణాలు చెప్పాడు. "మనప్రభుత్వం యిప్పటికీ ఒక యుద్ధాన్ని ఎదుర్కొంటూ ఉన్నది. ప్రభుత్వంలోనూ, యూని యన్‌లలోనూ, యితర సంఘాలలోనూ పనిచేస్తూవున్న కామ్రేడ్స్ భుజిస్తున్న ఆహారాన్నే మనంగూడా భుజిస్తూ ఉన్నాము. మనం ఆరోపణలు చేయవచ్చునని అతని మాట ల్లోని యథార్థానికి మేమంతా ఒప్పుకున్నాము. చైనీస్ కమ్యూ నిస్టుపార్టీ సభ్యులందరికీ ఆహారాన్ని సరఫరాచేసే మూడు వంటిళ్ళ' విధానం మాకు తెలుసును. మాకు సరఫరాచేసే 'వంటిల్లునుంచే పార్టీ కార్మికులలో చాలామందికి ఆహారం లభి స్తుంది. బాధ్యతాయుతమైన కార్యక్రమాలు నిర్వహించేవారు 'మధ్యరకం వంటిల్లు'మీద ఆధారపడతారు. వీరికి రకరకాల పదార్థాలు అధికంగా లభిస్తాయి. అనారోగ్యవంతులై బాధ్య తాయుత పదవుల్లో ఉండే బహు కొద్దిమంది 'చిన్నవంటిల్లు' మీద ఆధారపడతారు. తిరిగి అదే పదవులను ఆశించే విద్యా

స్థితులు ఆహారాన్ని గురించి ఆరోపణలు చేయటం నిజంగా వైపరీత్యమే.

తమ కోపతాపాలను వెళ్ళగక్కుకునేందుకు చాలా మందికి 'ఆహారం' వీలు కలిగించేది. మేము ఆశించినట్లుగా పరిస్థితులలో మార్పు కలుగలేదు. తిండికొరత పూర్వంనుంచి ఉన్న సమస్యయే. ప్రభుత్వం నీటి ఎద్దడిని ఎదుర్కోవాలి, సైన్యాలకు తిండిపెట్టాలి, ధరలమున్మురం అరికట్టడానికి తగినసమయంలో విడుదలచేయటానికి వీలుగా ధాన్యాన్ని నిలవచెయ్యాలి – అని మాలో మేము సమర్థించుకోవచ్చును. మరుసటిసంవత్సరం 1949 వేసవి అంతంలో విపరీతమైన వరదలవల్ల గాలులవల్లా పంటలు నాశనమైనాయి. క్షామప్రాంతాలకు తగ్గించడానికి పొదుపు ఉద్యమం తీవ్రతరం చేయాలని మాకే తోచింది. ఈ కారణాలూ, నూతన జాతీయప్రభుత్వ నిర్మాణంకోసం పలు ప్రాంతాలనుంచి నాయకులు రానున్నారనే వార్తలూ మాలోని నైరాశ్యాన్ని కొంతవరకూ కప్పివేశాయి.

---

# 6

## శరీరాలంకరణ

"ఇంకా బాగా ఎర్రగానే ఉన్నాయి."

మా స్నేహితురాలు తన బుగ్గలను చేరుమాలుతో రుద్దుతూ ఉండగా నేను యీ మాటలను అన్నాను.

మాలో చాలామందికి ప్రతిదినం పెదవులకు రంగు వేసుకునే అలవాటు లేదు. ఇతరులను ఆకర్షించే రంగులు, పౌడర్లు, క్రీములు మొదలైన వాటినికూడా వాడేవాళ్ళము కాము. మేకప్‌వల్ల స్త్రీ తన సౌందర్యాన్ని యినుమడింప చేసుకోగలదని పైటాలోని పురుషులు చాలమంది బాలికలు బహిరంగంగా వెల్లడించారు. కాని సౌందర్య ద్రవ్యాలను ఉపయోగించే స్త్రీ విద్యార్థులు తామేదో కానిపని చేస్తున్నట్లుగా తలంచేవారు. ఈ పాపకార్యం చేస్తున్న తలంపు – కొంత మంది విద్యార్థినులు అలంకరించుకోనాలనే ఉబలాటానికి ఆటంకం కలిగించలేదు.

నా స్నేహితురాలు ఒకామెకు తన ముఖానికి రంగు వేసుకొంటే ఎట్లా వుంటుందో చూచుకోవాలని సరదా. అందువల్ల నన్ను ఆహ్వానించి గది తలుపులు వేసేది. మొదట ముఖానికి పౌడరు అద్ది, దానిమీాద బుగ్గలకు రంగుపూసి అది అంతటా వ్యాపించేందుకు ప్రయత్నించేది. అతి జాగ్రత్తతో

పెదవులకు రంగు వేసెడి అద్దాన్ని అందుకుని అందులో తన ముఖాన్ని పరీక్షగా చూచేది.

"అంత బాగా లేదుకదూ ?"

"రంగును కొద్దిగా తుడిచివేస్తే బాగుంటుంది" అని నా సలహా.

చేరుమాలుతో నెమ్మదిగా ముఖం తుడిచి "ఇప్పుడు ఎట్లా ఉంది. అసలు నేను ముఖానికి రంగు వేసినట్లు నువ్వు గుర్తించగలవా ?"

"బుగ్గలమీద ఆ రంగు యింకా తగ్గాలి."

ఆమె అద్దంలో మరొకసారి పరకాయించి చూచుకొని "తుడిచివేస్తే అసలు రంగు వేయనట్లుగానే ఉంటుందిగా" అన్నది.

ఈ ప్రయోగాలతో ఏ పురుషులనైతే మేము ఆకర్షించాలని అనుకునేవాళ్ళమో వాళ్ళకు ఫలితాల్ని చూచేందుకు అవకాశం తరుచు చిక్కేదికాదు. అది పైటా సాంప్రదాయం కాదు. మా పాఠశాలలో పురుషులు స్త్రీలు అతి నిరాడంబరమైన దుస్తులు ధరించేవారు. విమోచనకు పూర్వంగూడా విద్యార్థులు యూనిఫారాలు ధరించేవారు. ఒక్క శీతకాలంలో మాత్రం కొందరు విద్యార్థులు అమెరికన్‌లు వదిలివెళ్ళిన ఓవర్ కోట్లు మొదలైనవి ఉపయోగించేవారు.

ఉత్తర చైనాలో విపరీతమైన చలిగా ఉంటుంది. అందువల్ల తలకు చేతులకు తొడుగులు అవసరం. పైటాలో అనేక రకాల తొడుగులు దొరికేవి. వీటిని విద్యార్థులు ధరించేవారు.

పురుషులకన్న స్త్రీలే తమ దుస్తుల విషయంలో ఎక్కువ శ్రద్ధ తీసికునేవారు. వేసవిలో లేత నీలిరంగు నూలు దుస్తులను కాలిజోళ్ళను ధరించేవారు. కొంతమంది బాలికలు విదేశరకం లంగాలు - లేసులు పూసలులేని రంగురంగుల గౌనులు ధరించేవారు. లోపల వేసుకునే దుస్తులను సాధారణంగా మేమే కుట్టుకునేవాళ్ళము.

శీతాకాలం రాగానే సులువుగా అటూ యిటూ తిరగడానికి వీలుగా దూదిఉన్ని దట్టించిన పొట్టి దుస్తులు ధరించేవాళ్ళము. వి. జె. దినోత్సవ అనంతరం మాలో చాలామంది దూది దట్టించిన చైనీస్ జాకెట్లు విదేశరకం పొడుగులాగులు ధరించటం ప్రారంభించాము. ఈ ఫ్యాషన్ 1947 శీతాకాలంలో షాంగ్‌హైనందు ప్రారంభం అయింది. అమెరికన్ సైన్యాలు వదిలివెళ్ళిన దుప్పట్లతో బాలికలు తమ చొక్కాలు తామే కుట్టుకునేవారు. శీతాకాలం రాగానే పురుషులు స్త్రీలుగానూ స్త్రీలు పురుషులుగానూ మారిపోతారని యెవరో వ్యాఖ్యానించటం నేను విన్నాను. శీతాకాలపు చలిని ఎదుర్కోవడానికి పురుషులు గౌనులు ధరించటం స్త్రీలు పాంట్లు తొడగటం ప్రారంభిస్తారు. కాళ్ళకి మేజోళ్ళు, దానికిపైన గొర్రె చర్మంతో లోపలివైపున కుట్టినజోళ్ళు ధరించి నేను క్లాసుకి వెళ్ళేదాన్ని.

ఉత్తరాదినుంచి, మంచూరియా సైబీరియానుంచి వచ్చే అందమైన చర్మాలు పెకింగ్‌లో చౌకగా దొరుకుతాయి. మేము వాటిని ధరిస్తే ఎంతో సౌకర్యంగా ఉండేది. ఇవి మరీ కారు చౌకకాదు, కాస్త భాగ్యవంతులైన వాళ్ళకి మాత్రమే యివి

లభ్యమయ్యేవి. విద్యార్థులలో చాలామంది అన్ని ఋతువు లలోనూ నూలు వస్త్రాలతోనే తృప్తిపడవలసివచ్చేది.

బాలురు పాశ్చాత్యపద్ధతిని పొట్టిగా క్రాప్ చేయించు కొనేవారు. వేసవిలో చాలామంది దేశీయులకు తలలు బోడి గుళ్ళు చేయించుకోవాలని తలంపయినా అటువంటి తలలు పైటూలో అంతగా కానవచ్చేవికావు. అటువంటి వాళ్ళెగనక కనిపిస్తే విద్యార్థులు ఎగతాళి చేసేవారు.

శిరోజాలను అలంకరించుకోవటం బాలికలకు సరదా. చాలామంది తమ జుట్టు ఉంగరాలు ఉంగరాలుగా వంపులు తిప్పుకునేవారు; లేదా నిలువుగానూ పొట్టిగానూ కత్తిరించుకునే వారు. వయస్సుకు చిన్నవాళ్ళు తోకల్లాగా రెండుజడలు వేసేవారు. కొందరు రిబ్బన్లుకట్టి చెవులకుపైగా రంగుప్లాస్టిక్ పిన్నులు పెట్టుకునేవారు. కొందరు జుట్టును దువ్వి మధ్య ముడి వేసి ముందుకో వెనుక్కో వదలి వేసేవారు.

సౌందర్య పోషక వస్తువులను ఉపయోగించడమూ అనేది నిజంగా ఒక సమస్యే. చాలమంది బాలికలకు తమ అందమైన వదనాలను ప్రజలు పొగడాలని ఆశ ఉంటుంది. బాలురు తమగదుల్లో మమ్మల్ని గురించి మాట్లాడుతూ ఉంటా రనీ పెదవులకు రంగూ ముఖానికి పౌడరు నిత్యం వేసుకునే బాలికలను ఎంతో మెచ్చుకుంటారనీ మాకు తెలుసును. ఆ విధంగా స్త్రీ కనిపించినప్పుడు చాలామంది పైటూప్రజలు, తమకు ఏవిధమైన ఆసక్తి కలగనట్లుగా నటించడమేకాకుండా ఆమె పైవేషాన్ని గురించి బహిరంగంగా అనిష్టతను ప్రక టించేవారు.

సహజమైన సౌందర్యాన్ని ప్రతివారూ మెచ్చుకుంటారు. మా గదుల్లో యీ విషయాన్ని గురించే మేము ముచ్చటించే వాళ్ళం. "రంగు అధికమైతే త్వరగా తెలిసిపోతుంది. మరీ తక్కువైతే రంగు వేసుకున్న ప్రయోజనం ఉండదు." అని మాలో మేము అనుకునేవాళ్ళము. కనుబొమలకు యింపు సొంపు చేకూరడానికి చెదురుమదురు వెంట్రుకలను పెరికి వేసేవాళ్ళము. కనుబొమలను కత్తిరించడానికి ఎంతో నేర్పూ ఓర్పూ కావాలి. కత్తిరించినట్లు కనిపెట్టడం చాలా సులభం. అందువల్ల ఆ విధంగా చేయడానికి మేము ధైర్యం చేయలేక పోయాము. అదే కారణంగా గోళ్ళు రంగు వేయడానికి కూడా మేము సాహసించలేకపోయాము.

ఆభరణము ధరించటం అనేది, యిప్పుడు సమస్య కాదు. పూర్వపురోజుల్లో ధరించే దుస్తుల రంగులనుబట్టి ఆయా రకాల నగలు ధరించాలని ఉబలాటం ఉండేది. కాని విమోచనానంతరం యీ సమస్యకు తావు లేకుండా పోయింది. విద్యార్థులంతాకూడా యూనిఫారాలు ధరిస్తూ ఉన్నారు. విమోచన ప్రాంతాలకు పారిపోయి యిప్పుడు విజయంతో తిరిగివచ్చిన విద్యార్థులు యీ కొత్తఫ్యాషన్ వెంట తెచ్చారు. యూనిఫారాలకి తోడుగా నడుములకి తుపాకులు వ్రేలాడ వేసుకోవటం ఫ్యాషన్ అయింది. ఈ తుపాకులు మాకన్న బాలురకే అధిక ఆసక్తిని కలిగించేవి. యూనిఫారం ముడతలు పడి ఎంత అధ్వాన్న స్థితిలో ఉంటే తిరిగి వచ్చిన విద్యార్థి అంత వీరుడుగా తలంచేవాడు. కమ్యూనిస్టు తత్వంలో నిజంగా యిది ముఖ్యమైన అభిప్రాయమని నేను తలంచను.

యూనిఫారములన్నీ నూలుతో తయారయినవే. ఈ లెనిన్ యూనిఫారాలు తొడుకున్నవాళ్ళను చూస్తే ఎరువు దుస్తులను ధరించినవాళ్ళలా కనిపిస్తారు. ఎవరికొలతలనుబట్టి వారికి కుట్టినవి కాకపోవడమే యిందుకు కారణం. శీతాకాలంలో వదులుగా వ్రేలాడే దుస్తులను దగ్గరగా చుట్టుకొని పోయే వాళ్ళని చూస్తే గాలిపోయిన బంతుల్లాగా కనిపించేవాళ్ళు. త్వరలోనే మాలో చాలామంది లెనిన్ సూట్లు ధరించడం ప్రారంభించారు. చౌకగా లభించటం ఎక్కువకాలం మన్నటం వీటిఆదరణకు ముఖ్య కారణాలు.

విమోచనానంతరం ప్రథమోత్సాహంలో చాలామంది యీ సూట్లు ధరించారు. విద్యార్థులకు నూతన పద్ధతి సహాయ కార్యక్రమం అమలుజరుప బోతున్నట్లు ప్రకటన వెలువడగానే అందరూ తమ పాతపద్ధతి దుస్తులను దాచివేసి కొత్తరకం దుస్తులను వాడటం ప్రారంభించారు. ఈదుస్తులను ధరించుట వల్ల కాలంతోబాటు మనంగూడా మారామని బాహాటంగా వెల్లడించుకోవచ్చును. లేకపోతే మన నిజాయితీని గురించి నాయకులు శంకించే అవకాశం కలుగుతుంది. కాబట్టి ఏవిధమైన విమర్శలకు తావులేకుండా అందరితోపాటు దుస్తులు యూని ఫారాలు ధరించటం అలవాటైపోయినది.

"ఈ భూస్వామ్య తోకలను కత్తిరించండి" అని ఎవరో హాస్యానికి అన్నారు. అప్పటి ఆవేశంలో జడలున్న పిల్లలంతా తమ తోకలను కత్తిరించివేసి చెవులదాకా గిరజాల జుట్లు పెట్టుకొన్నారు. పెద్దపెద్ద తలకట్లు ఉన్న స్త్రీలుకూడా కాలాను గుణ్యంగా తమ జుట్టును మార్చుకోక తప్పిందికాదు.

ముఖాలకు పులుముకునే రంగులు వేసుకునే పౌడర్లు అదృశ్యమైపోయినవి. అయితే, గతంలో కూర్చుని ముఖాలకు రంగు వేసుకునే అలవాటువున్న వారుమాత్రం తమ అలవాటును కొనసాగిస్తూనే వచ్చారు. రంగులను వేసుకుంటున్నట్లు బయట ఎక్కడా చెప్పవద్దని తమ అంతరంగిక మిత్రులను కోరేవారు. శీతకాలంలో చర్మం పగలకుండా మేమంతా కోల్డుక్రీం ఉప యోగించే వాళ్ళము.

ప్రభుత్వ సెలవదినాల్లోను, యాంగ్ - కో నృత్యంచేసే టప్పుడూ రంగులను పౌడర్లను ఉపయోగించడానికి ఏవిధమైన ఆంక్ష ఉండేదికాదు. రంగస్థల నటీనటులవలె ప్రదర్శకులను రకరకాల దుస్తులు ధరించమని, చక్కగా అలంకరణ చేసు కోమని ప్రోత్సహించేవారు. ఆ సంధర్భములో స్త్రీలతో పాటు పురుషులు పోటీ పడి అలంకరించుకొనేవారు. ఇది ఒక విధ మైన కళారాధన. యాంగ్-కో నృత్యము గ్రామిక రైతు జనానికి చెందినది కాదా? ఈ నృత్యానికి రంగురంగుల దుస్తులు ధరించటం భూర్జువా పద్ధతి కాదా? మరి? రంగులు, పౌడరు, రకరకాల దుస్తులు వాడటం శ్రామిక జీవుల అభి ప్రాయమేనా? ఇవన్నీ చూస్తూ ఉంటే ప్రజలలో నిజమైన మార్పు ఎంతవరకు వచ్చిందా అని నాకు సందేహంగా ఉండేది.

నాకు ఒక స్నేహితురాలు ఉన్నది. అందమైన వస్తువు లంటే ఆమెకు చాలయిష్టం. ఒకరోజున ఒకసిల్కుగుడ్డను కొనుక్కొని వచ్చింది. గదిలోకి తీసుకువెళ్ళి వాటికి చుట్టుకుని ఎంతో మురిసిపోతోంది. ఆ సిల్కుని ధరించటంవల్ల తాను ఎట్లా ఉన్నదీ ఆమె నన్ను అడుగుతోంది. ఇంతలో ఆమె

స్నేహితుడు లోపలికివచ్చాడు. అతను చాలాకాలంగా యువజనసమితి సభ్యుడు. చదువుసంధ్యలలో ఆరితేరినవాడు. అతని అభిప్రాయాలు ఉదాత్తంగా ఉంటాయని పార్టీ సభ్యులు అతన్ని ఎంతో గౌరవంగాచూస్తారు.

సిల్కుగుడ్డను, ఆమె కళ్ళలోని ఆనందాన్ని అతను చూచాడు. ఏ విధమైన సంకోచమూ లేకుండా ఆమె అతన్ని అడిగింది.

"ఈసిల్కు ఎట్లాఉంది? నేనుధరిస్తే అందంగాలేదూ?"

ఆ గుడ్డవైపు అతను పరకాయించి చూచాడు. ఆ తర్వాత అందమైన ఆమె ముఖంవైపు చూస్తూ మాటాడకుండా నిలబడిపోయాడు. అతను ఆమెను ప్రేమిస్తున్నాడని ఎంతోకాలంనుంచీ మా అందరికీ తెలుసును.

జవాబు లేకపోవడంవల్ల కోపంవచ్చిందేమోనని ఆమె సిల్కుగుడ్డను విప్పివేసింది. నేను దానిని అందుకుని ఆమెకు దగ్గరగా ఉండి మిత్రుణ్ణి ప్రశ్నించాను.

"ఎట్లావుంది ? నీకు నచ్చిందా లేదా ?"

అతను సందిగ్ధావస్థలో పడటం నేను గ్రహించాను. జవాబు చెప్పకుండా ఉండటంచూస్తే నాకు చికాకుకలిగి మళ్ళీ అడిగాను. "ఇంతకీ నీకు నచ్చిందా లేదా చెప్పవేం ?"

అతని చేతిలోని పుస్తకాల సంచిని బల్లమీద పడవేశాడు. కుర్చీమీద కూర్చుని ముఖం చిట్లిస్తూ యిట్లా అన్నాడు. "ఇలాంటి వాటిని గురించి ఆలోచించడానికి ఎవరికి సమయం వుంది...మీ స్త్రీలు..." ఏమి అనడానికి అతనికి తోచలేదు. తన చేతిగడియారం వంక చూసుకున్నాడు. సైం

ఎంతని అడిగితే మళ్ళీ అతను గడియారంవంక చూడవలసి ఉంటుందని నాకు తెలుసును. బల్లమీదవున్న పుస్తకం, కాయితాలను త్రిప్పాడు. అందులో ఒక్క అక్షరం అతను చూడటం లేదని నాకు తెలుసును. "మనుషుల విషయం ఆలోచించడానికి మాకు సమయం ఎట్లా చిక్కుతోంది" అంటూ తనమిత్రురాలి వైపు, సిల్కు గుడ్డవైపు దృష్టిని సారించాడు.

నాకు చికాకు కలిగినా అతనంటే హఠాత్తుగా సానుభూతికూడా కలిగింది. మనస్సులో ఆ సిల్కు అందాన్ని మెచ్చుకోవాలనే అతనికి ఉంది. అయితే ఆమెలో అణగి మణగిఉన్న బూర్జువా అభిప్రాయాలని పారద్రోలవలసిన బాధ్యత తనమీద ఉన్నట్లుగా తలంచాడు. లేచి, వేడి మంచి నీళ్ళు త్రాగి మళ్ళీ కూర్చున్నాడు." శ్రామికవర్గ విప్లవంలో పాల్గొనడానికి మనం ఛోటా బూర్జువా శక్తులుగా ఆహ్వానించ బడిన సంగతి నీవు మరచిపోకూడదు—"

అతనిమాటకు అడ్డువెడుతూ. "కాబట్టి మనలో పాతుకుని ఉన్న బూర్జువా అభిప్రాయాలను పారద్రోలాలి" అన్నాను. ఈ నినాదాలు నాకు కంఠతః వచ్చును.

వాదానికి దిగబోతున్నట్లు అతను నా వైపు తీక్ష్ణంగా చూచాడు. అతనికి ఆ అవకాశం నేను యివ్వలేదు. "మీ సిద్ధాంతాలు అన్నింటిలో నేను ఎల్లప్పుడూ ఏకీభవించలేను. ఛోటా బూర్జువాలు సౌందర్యాన్ని ఆరాధించటం, అందమైన వస్తువులు ధరించటం నిజమే. సామాన్యప్రజలకి సౌందర్యం అన్నా అందమైన వస్త్రాలన్నా యిష్టంలేదని నువ్వు అనగలవా? మిగతా తరగతులతోపాటే ఛోటా బూర్జువాలు

కూడా మానవాభ్యుదయానికి అధికంగా కృషిచేశారు. తాత్వికత, కళారంగాల్లో శ్రామికవర్గాలకన్నా వీరే అధికంగా పాటుపడ్డారు. శాస్త్రజ్ఞులు, వేదాంతులు, సంగీతజ్ఞులు, రచయితలు, చిత్రకారులు - వీరిలో చాలామంది ఛోటా బూర్జువా తరగతికి చెందినవారు కాదా? సౌందర్యారాధన సత్యాన్వేషణ - యివిగూడా ఛోటాబూర్జువా అభిప్రాయాలేనా?”

“అతను కోపంతో నా మాటకు అడ్డుపడాలని ప్రయత్నించాడు కాని నేను లక్ష్యపెట్టలేదు. నేను ఒక్కవిషయం నిన్ను అడగదలుచుకున్నాను; తాత్వికుల, శాస్త్రజ్ఞుల కళాకారుల నిరంతర అన్వేషణ అనేవి ఛోటా బూర్జువా అభిప్రాయమేనా? వీరందరినీ నాశనం చేసి వేయవలసిందేనా?”

ఆ సమయానికి అతని మిత్రురాలు తన సిల్కుగుడ్డను మంచంమీద జారవిడిచింది. కుర్చీవెనకాల నిలబడి అతని భుజాలు తట్టుతూ “నువ్వు చాలా పెద్దపెద్ద విషయాలలోకి జొరబడుతున్నావు. మనకి తగినంత సమయం చిక్కినప్పుడు వీటినిగురించి చర్చించుదాము” అంటూ అభిమానంగా అతని వైపు చిరునవ్వుతో చూసింది.

నేను మళ్ళీ కాలుదువ్వబోయాను. ఇంతలో ఆమె అడ్డువచ్చి “నీ ధోరణి కొంచెం కట్టిపెడతావా? నువ్వు చెప్పేదాంట్లో నిజంవుందని నాకు తెలుసును. ప్రస్తుతం మరో విషయం ఏదన్నా ముచ్చటించుకుందాము” అన్నది.

నేను సంధికి సిద్ధపడ్డాను. లేకపోతే మా వాగ్వివాదం పెద్దయుద్ధంక్రింద మారేది. అయితే ఒకటి - ఏ చర్చవల్లా ఏకాభిప్రాయం కలుగకపోవచ్చును. ఎందువల్లనంటే కమ్యూ

నిస్టులు అతనిని ఒక గాడిలో వదిలారు. అతను ఆ గాడినుంచి ప్రక్కకు తొలగలేదు.

ఆమె ఆ సిల్కు గుడ్డతోనే తయారయిన దుస్తులను ధరించి విదేశ ఆగంతకుల గౌరవార్థం ఏర్పాటు అయిన అనేక పార్టీలకు అతనితో హాజరయింది.

కొద్ది నెలలు అయింతర్వాత పెకింగ్ నగరానికి విదేశాలనుంచి అనేకమంది అతిథులు రావటం ప్రారంభించారు. వీరిలో చాలా మంది రష్యానుంచి, తూర్పుయూరప్ ప్రజా స్వామ్యాలనుంచి వచ్చారు. ఈ గౌరవ అతిథులకు స్వాగతం పలకడానికి విద్యార్థులంతా బారులు తీర్చబడేవారు. వారు విందులారగించి ఉపన్యాసాలు యిచ్చి వెళ్ళేవారు. అలాంటి ఉత్సవ సందర్భాలకు ఎంతో ముందుగానే నాయకులు విద్యార్థులంతా శుభ్రమైన దుస్తులు వేసుకోవాలని హెచ్చరించేవారు. ఈ ఉత్సవాలలో మా సోవియట్ పెద్ద అన్నలు మామీద చల్లటి చిరునవ్వులు వర్షించేవారు. దానిలో కొంత ఛోటా భూర్జువా పొగడ్త లేకపోలేదని నా విశ్వాసం.

ఒక చలనచిత్రంలో భాగంగా పైటా విద్యార్థుల జీవితాన్ని గురించి స్టేట్ సినిమా స్టూడియో సోవియట్ సినిమా దళం సహాయంతో ఫిలిం తీస్తూ ఉన్నది. నిత్యం మేము వాడే వాటికన్నా అందమైన దుస్తులతో చక్కగా తయారు కావాలని మా నాయకులు హెచ్చరించారు. సోవియట్ ఆగంతకులు వచ్చి మమ్మల్ని చూచినప్పుడు కొంత నిస్పృహ చెందారు. అయితే మా గౌరవాన్ని వారు కాపాడవలసి ఉంది. సమిష్టి విద్యార్థి జీవితాన్ని గురించి వారు కొంత చిత్రీకరించారు.

ప్రత్యేకంగా క్లోజప్పులను తీసేటప్పుడు మంచిదుస్తులను ధరించిన అందమైన అమ్మాయిలనే వారు ఎన్నుకున్నారు. కొన్ని నెలల నుంచీ మూలపడి ఉన్న మంచి దుస్తులను ధరించడానికి అవకాశం చిక్కినందుకు మేము పొంగిపోయాము.

1950 వేసవిలో ప్రపంచశాంతిని గురించి చుంగ్‌షాన్ పార్కులో సమావేశం ఒకటి జరుగబోతున్నదనీ, విద్యార్థులంతా మంచి దుసులు ధరించి హాజరుకావాలనీ మాకు హెచ్చరిక జరిగింది. "హాజరయ్యే విదేశ అతిథులు అందమైన మన చైనీస్ దుస్తులను చూడాలని అభిలషింపవచ్చును" అంటూ ఒక విద్యార్థితో నేను అన్నాను.

దానికి అతనుయిచ్చిన జవాబు: "బూర్జువాలను కూలద్రోయటం ప్రజల జీవనప్రమాణాన్ని అధికం చెయ్యటం విప్లవంయొక్క లక్ష్యాలు. మనకు విమోచన ప్రాప్తించి సంవత్సరం అయింది. పూర్వంకన్నా యిప్పుడు మనం మంచి దుసులను ధరిస్తున్నామని ప్రపంచానికి తెలియజెయ్యాలి. అంతే కాదు, యీ సమావేశాన్ని ఫిలిం తీయబోతున్నారు. ఇతర ప్రజాస్వామ్య దేశాలలోనూ, విమోచన చెందని యితర ప్రాంతాలలోనూ వీటిని ప్రదర్శిస్తారని మీకు తెలియదా?"

ఈ జవాబు నేనొక విషయాన్ని గ్రహించడానికి ఉపకరించింది. మా స్కూలుకి అనేకరకాల సోవియట్ పత్రికలు సరఫరా చేయబడుతున్నాయి. సోవియట్‌రష్యాలో సామాన్య ప్రజలకు సంతుష్టిగా తిండి, శుభ్రమైన వస్త్రాలు లభిస్తున్నట్లుగా వీటిలో చూపుతున్నారు. ఈ చిత్రాలలో యథార్థత ఎంత ఉన్నదా అని నా అనుమానం. ఈ దేశంలోవలెనే

అక్కడకూడా ప్రత్యేకం ఎంచుకున్న మనుష్యులతో ఆ చిత్రాలు తీశారేమో!

సోవియట్ పత్రికలు, సోవియట్ అతిథులతో పాటు సోవియట్ వస్త్రాలుగూడా పెకింగ్ జేరాయి. ఒకేరకమైన దుస్తులను ధరించిన రష్యన్ కామ్రేడ్స్ తమకి తమ భార్యలకి రకరకాల దుస్తులు ఖరీదు చేయడానికి హాంగ్ కాంగ్ షాపుల మీద దాడిచేయటం మేము చూచాము. ఇప్పుడు మేము సోవియట్ దిగుమతి వస్త్రాలకోసం దుకాణాలలో చూస్తూ ఉన్నాము. ఆ వస్త్రాలరంగులు అంత అరమరికగా ఒక్కొక్క ప్పుడు ఉండవు. ఆ రంగుల ఏర్పాటుచూస్తే బూర్జువా ధోరణి గానే మాకు కనపడేది. కాని వాటిల్లో ఏవిధమైన అంద చం దాలు లేవు. పాశ్చాత్య సూట్లనుధరించిన రష్యన్ ఇంజనీర్లను శాస్త్రజ్ఞులను గుంపులు గుంపులుగా మేము వీథుల్లో చూస్తూ ఉండేవాళ్ళము. వాళ్ళు బూర్జువాల వలెనే మాకు కన్పించే వారు. రష్యా చేసినపని ఏమిటంటే—పాత బూర్జువాల స్థానంలో కొత్త బూర్జువాలను తీసుకొని వచ్చింది.

కొంతమంది బాలికలు నూతన వస్త్రాలు కొన్నారు. ధరలు అధికంగా ఉండటంవల్లా, అందంగా లేకపోవటం వల్లా మాలో చాలామందిమి వాటికిదూరంగానే ఉన్నాము. 'రష్యన్ వస్త్రాలతో తయారయిన దుస్తులగురించి నీ అభిప్రాయం ఏమిటి?' అని ఒక మిత్రుణ్ణి తమాషాకోసం నేను ప్రశ్నిం చాను. అతను జాగ్రత్తగా ఆలోచించి "అవి మన్నికగలవి అని నువ్వు ఒప్పుకోవాలి" అని జవాబు యిచ్చాడు.

———

7

## జీవిత పెత్తందార్లు, రాజకీయ సారధులు

విమోచనకు పూర్వం పైటా విశ్వ విద్యాలయమునకు సంబంధించిన అనేక భవనాలు నిర్మాణం జరిగింది. ఆర్ట్సు, లా, సైన్సు, ఇంజనీరింగ్, మెడిసిన్, వ్యవసాయ కళాశాలలు మొత్తం ఆరు కళాశాలలు వేర్వేరు ఆవరణలలో ఉండేవి. వాటిలోనే విద్యార్థుల వసతిగృహాలుకూడా ఉండేవి. ఏ కాలేజీ ప్రత్యేకత ఆ కాలేజీకి ఉండేది. చూడగానే అది ఏ కాలేజీయో చెప్పివేయవచ్చును. వైద్య విద్యార్థుల వసతి గృహాలు పరిశుభ్రంగా ఉండేవి. ఇంజనీరింగ్ విద్యార్థులవి ఏ విధమైన ఆడంబరము లేకుండా వరుసలలో ఒకేరకమైన రూపుతో ఉండేవి. వ్యవసాయ కళాశాల మనకు కనుపించదు. అది ఎక్కడో దూరంగా గ్రామీణ ప్రాంతంలో ఉన్నది. ఆ కళాశాల విద్యార్థుల వసతిగృహాలు విశాలంగా నిశ్శబ్దంగా ఉంటాయి.

పట్టభద్రులు కాబోయేవిద్యార్థులు ఉండే జేడ్ ఫ్లవర్ వీధిలోని గృహాలు గంభీరంగా ఉంటాయి. సువాన్-ఉ గేట్‌లోని ఫోర్త్ ఫిఫ్త్ కోర్టులలో మిగతా విద్యార్థులు క్రిక్కిరిసి ఉండేవారు. ఈ భవనాలకి ఏ విధమైన ప్రత్యేకత కనిపించదు. పశ్చిమబజారులోని సైన్సు మేజర్ల గదులు బారులు తీరి డజన్లకొద్దీ ఉంటాయి. శాస్త్ర సిద్ధాంతాలవలె యీ గదుల్లో సజీవ చైతన్యం ఏమీ కనిపించదు.

థర్డ్ కోర్టు అనేది ఆర్ట్సు, సాంఘికశాస్త్ర విద్యార్థులకి కేంద్రస్థానము. ఇక్కడ భవనాలన్నీ ఎన్నో సంవత్సరాల క్రితమే పాశ్చాత్యపద్ధతిలో కట్టారు. దీనిలో పురుష విద్యార్థులు ఉండేటందుకు పదిభాగాలు చేశారు. పైటూ సువాసనలు యిక్కడినుంచి వెదజల్లబడేవి.

పాతసాంప్రదాయాలను పుణికి పుచ్చుకున్న థర్డ్ కోర్టు అతి పురాతనమైనది. చెంగ్ వంశీయుల పరిపాలనలో యిక్కడ 'ఇంపీరియల్ స్కూల్ ఆఫ్ ట్రాన్స్‌లేషన్' ఉండేది. ఆ విషయాన్ని తెలియజేస్తూ యిప్పటికీ అక్కడ ఒకరాతిఫలకం ఉన్నది. గేటుముందుగా ఒక చిన్న పిల్లకాలువ ప్రవహిస్తూ ఉంటుంది. చాలామంది విద్యార్థులు దీనిని 'పెద్దబురదగుంట' అనిపిలుస్తూ ఉంటారు. దీనిగట్లమీద నానాముంకీ పేరుకుంటూ ఉంటుంది. నీటిమీద పురాతనవృక్షాల కొమ్మలు కమ్ముకుని ఉంటాయి. థర్డ్ కోర్టు అధికారి ఆఫీసు ఎత్తుగా రాతి ఆర్చి మీద ఉన్నది. అక్కడ కూర్చుని మనం 'ఖాళీగోడల పట్టణం జిత్తులు' పాటపాడుకోవచ్చును. ఆ పాటలోని కథ ఏమంటే : పూర్వం ఒకసారి ఆ నగరాన్ని శత్రువులు చుట్టుముట్టారు. నగరానికి రక్షణ సన్నాహం చేసుకునే అవకాశం లేకుండా పోయింది. అప్పుడు తెలివిగల చు-కె లియాంగ్ నిర్భయంగా గోడనెక్కి వేణువుఊదుతూ దాడి సన్నాహంలో ఉన్న శత్రువులను లోపలికి దయచేయండని వేళాకోళంగా ఆహ్వానించాడు. దీంట్లో ఏదో కీలకం ఉందని ఆ శత్రువులు తోకముడతపెట్టారు. థర్డుకోర్టు ఆఫీసునుంచి, హాస్యాలాడుకునే విశ్వవిద్యాలయా

గార్డులను, నేలను తుడుస్తున్న పనివారలను మనం చూడవచ్చును.

ఒక మూలగా పఠనాలయం వున్నది. ఉచితంగా యిక్కడ వార్తాపత్రికలను చదువుకొనవచ్చును. దీనిని ఆనుకునే విద్యార్థి సంక్షేమ కార్యాలయం వున్నది. ఇక్కడ బఠాణీలు కొనుక్కుని నెమ్మదిగా తింటూ ఏ పత్రికనో చదువుతుంటూ కూర్చోవచ్చును.

ఫర్గుకోర్టులో తొంభై చిన్న చిన్న గదులు ఉన్నాయి. ఒక్కొక్క గదిలో యిద్దరు విద్యార్థులు ఉండేందుకు మాత్రమే వీలుంటుంది. మిగతాగదులు చాలా పెద్దవి. వీనిలో తొమ్మిది మంది విద్యార్థులు ఉండవచ్చును. చాలా గదుల్లో అయిదు ఆరుగురు విద్యార్థులు ఉంటారు. ఒక్కొక్క విద్యార్థికి ఒకొక్క దీపం, ఒకబల్ల, ఒకకుర్చీ, ఒక శయ్యామంచం, ఒక పుస్తకాల అలమరా యిస్తారు. కాని యింకా ఎంతో శయ్యాసామాగ్రిని విద్యార్థులు సంపాదించేవారు. వస్తువులను అమర్చుకోవడానికి గదుల్లో బాగా ఉన్నంతవరకూ యిటువంటి విషయాలను గురించి అధికార్లు చూసీ చూడనట్లుగా ఊరుకునేవారు. కొన్ని గదుల్లో దుస్తులను పెట్టుకునే పెద్ద పెద్ద అలమరలుకూడా ఉండేవి. తమ ఫర్నిచర్‌ను గురించి ఆ విద్యార్థులు గొప్పగా చెప్పుకునేవారు.

ఫర్గ్‌కోర్టులో నువ్వొక విద్యార్థిగా కాసేపు భావించు. గదిలోపల సామానులమీద పడకుండా అతి జాగ్రతగా నువ్వు నడచివెళ్ళి పుస్తకాల సంచిని మంచంమీద పడవెయ్యాలి. వేసవిగనక అయితే నీ బూట్సులను, మేజోళ్ళను, పాంటును

షర్టును తీసివేసి బేసిన్ పుచ్చుకుని స్నానాలగదివేపు వెడతావు. చన్నీటి జల్లులతో తడుస్తూ నీ మిత్రులు ఇంగ్లీషు చైనీస్ పాటలు పాడటం నువ్వు వింటావు. ఆ పాటలు వింటూ ఉంటే శ్రమలు తొలగిపోతాయి.

అదే శీతకాలం గనక అయితే, బేసిన్‌కి బదులుగా కుర్చీని తీసుకుని నువ్వు గదిమధ్యలో స్టౌ దగ్గర జారగిల బడతావు. చైనా మొదలు పెగ్గూ వరకూ ప్రచారంలోగల కథలను నువ్వు యిక్కడ వింటావు. స్టౌలో స్పిరిట్ తక్కువై తగినంత వేడి నివ్వకపోతే మనసారా తిట్టి, జోళ్ళను విసిరివేసి మంచాన్ని అధిరోహించి శీతలయుద్ధం ప్రారంభిస్తావు – అంటే నీ గదిలో ఉన్నవారితోబాటు నువ్వుగూడా వరుసక్రమంలో వణకటం ప్రారంభిస్తావు. లేకపోతే మిగతావాళ్ళ కోలాహలం చెవులబడకుండా దిండులో తలను దూకుస్తావు. భోజనసమయం వరకూ నిద్రతీస్తావు. గంటకొట్టగానే మెస్ హాల్లో ప్రవేశిస్తావు. థర్డుకోర్టులోని విద్యార్థులంతా ఒకేచోట కలుసుకునే సమయం యిదే.

భోజనానంతరం నీకు ఆటవిడుపే. జేబులో డబ్బులు గనక ఉంటే ఏ సినిమాకో వెడతావు. డబ్బులు లేకపోతే టంగ్-యాన్ బజారులో దుకాణాల కిటికీలవంక తేరిపార చూస్తూ నడుచుకుంటూ వెడతావు. శరత్కాలంలో చీకటి పడేవరకూ బంతి ఆట ఆడతావు. బృందగానాల్లో పాల్గొంటావు; లేదా భాగ్యవంతుడైన ఏ మిత్రుని యింటికో గ్రామఫోను రికార్డులు వినడానికి వెడతావు. లేకపోతే చదువుకుంటావు, స్కూల్ పని చేస్తావు, కబుర్లు చెబుతావు, పేకాట

ఆడతావు, లేదా పెందరాళే నిద్రకు మంచాన్ని ఆశ్రయిస్తావు. అదే గదిలో అనేక తీరుల వ్యక్తులు నీకు కనిపిస్తారు. ఒకతను చదువుకుంటూ ఉంటాడు, ఒకతను దీర్ఘంగా ఆలోచిస్తూ ఉంటాడు, ఒకతను కునికిపాట్లుపడుతూ ఉంటాడు, ఒకతను చిలిపి కజ్జాలకు కాలుదువ్వుతూ ఉంటాడు. టుంగ్, లీయిద్దరు కాంటీనుగురించి అతి తీక్షణంగా చర్చిస్తారు. ఆడంస్మిత్, కారల్‌మార్క్సులకు జోకి సాటిరారని చాంగ్ తెగనాడుతాడు. వాంగ్, బెర్నార్డ్‌షా చదువుతూ ఉంటాడు. చాంగ్ చైనీస్ ఫ్లూట్‌వాయిస్తూ ఉంటాడు.

పరస్పర సహనం, పరస్పరతూష్ణీ భావం – విచిత్రమైన 'పరస్పర గౌరవానికి' కారణభూతమైనవి. పైకి ఎవ్వరూ యితరులని గౌరవిస్తూ ఉన్నట్లు కనబడరు.

అర్ధరాత్రి దాటేదాకా అంతులేని యీ గందరగోళం కొనసాగుతూనే ఉంటుంది. అప్పుడు అందరునిద్రలకు ఒకరి తర్వాత ఒకరుగా మంచాలను ఆశ్రయించడంతో ఛర్డ్‌కోర్టులో నిశ్శబ్దం నిండిపోయింది. ఎక్కడో దూరంగా వినవచ్చే దుకాణదార్ల కేకలుతప్ప వేరే శబ్దం ఏమీ వినిపించదు.

గ్రేమాన్‌షన్‌లో పైటూబాలికలు నివసిస్తూ ఉంటారు. గదులు పరిశుభ్రంగా ఉంటాయి. ఒకొక్క గదికి రెండు మంచాలు, రెండు చిన్నబల్లలు, రెండు కుర్చీలు, ఒక అల్మారా ఉంటాయి. సౌకర్యాలకి గ్రామాన్‌షన్ పేరు పొందింది. కిటికీలకు అద్దాలు తీగజల్లెడలు అమర్చిఉంటాయి. గదులను వెచ్చదనం చేసే సాధనాలుకూడా ఉన్నాయి. శీతాకాలంలో వెలుపల మంచు ధారాపాతంగా పడుతూ ఉండేది

గాక రేడియేటర్ మీటరు నొక్కితే చాలు గదంతా వెచ్చదనంతో నిండిపోతూంది. పై తరగతుల్లో చదువుతున్న విద్యార్థులకి ఒక్కొక్కరికి ప్రత్యేకం ఒక్కొక్క గది ఉంటుంది.

పదేసిగదులకు ఒక టాయిలెట్ ఉంటుంది. దీనిని పరిశుభ్రంగా తుడిచి అద్దంలాగా ఉంచుతారు. స్నానాలకు వేడి నీరు పుష్కలంగా లభిస్తుంది. ప్రతిపదుగురకు ఒకదాసీ మనిషి ఉంటుంది. నేలను తుడవటం, త్రాగడానికి వేడినీళ్ళు తయారు చేయడం ఆమెవిధులు. ప్రతినెల కాస్తోకూస్తో బక్షీస్ పడేస్తూ ఉంటే బల్లలు తుడవటం, గుడ్డలు ఉతకటం, బజారువెళ్ళటం మొదలైనపనులుగూడా ఆమె చేస్తుంది.

విద్యార్థులదృష్ట్యా యివన్నీ సౌకర్యాలే. 1957 లో టర్కీనుండి ఒక విదేశ విద్యార్థి గ్రామాన్షన్‌కి వచ్చింది. విశ్వవిద్యాలయ అధికారులు సుగతావాటికన్నా వెలుతురు వచ్చేడి పెద్దది అయిన ఒక ప్రత్యేకగదిని ఆమెకు యిచ్చారు. ఆమె గదిని చూడగానే ముఖం చిట్లించుకొని ఆంగ్లంలో యిట్లా అంది: "ఇది బొత్తిగా జైలుఖానాలాగా ఉన్నది. నేను మా దేశానికి తిరిగి వెళ్ళిపోతున్నానని పైటా అధ్యక్షుడు డాక్టర్ హుసిహ్‌తో చెప్పండి."

నౌకర్లను పెట్టే బేడా తీసుకురమ్మని చెప్పి ఆమె హోటల్‌ను వెతుక్కుంటూ వెళ్ళిపోయింది.

పూర్వపురోజుల్లో గనక అయితే గ్రామాన్షన్‌ను ఒకవిధంగా బంధిఖానా అనే చెప్పవచ్చును. రాజుగారి ఉంపుడు కత్తెలను కావలా కాచినట్లుగా స్త్రీ విద్యార్థినులకు కాపలా ఉంచేవారు. 1948 లో జరిగిన సంప్రదింపుల ఫలి

తంగా యీ విషయంలో మేము విజయాన్ని సాధించాము. బాలికల వసతిగృహాల మీద గల కట్టుదిట్టాలను సడలించారు.

ఇప్పుడు విద్యార్థులు, ఆగంతకులు బాలికా వసతిగృహాలకు వెళ్ళి రావచ్చును. ఈ రాకపోకలకు నిర్ణీత సమయాలు వున్నాయి. రాత్రి వేళల్లో ఎవ్వరూ బయటికి పోవడానికి వీలు లేదు. బయటివారు లోపలికి రావడానికి వీలులేదు.

అంతా పాశ్చాత్య నవీన పద్ధతులని అధికారులు బడాయీలు చెప్పుకునే సింగ్ మూనా, యెన్ చింగ్ లలో కాకుండా పైటాలో బాలికలు తమ హక్కులకై పోరాడి విజయం సంపాదించటం నిజంగా విచిత్రమైన విషయమే. మేము వ్యక్తిత్వవాదులము, అందుకు మేము గర్విస్తాము. ఆగంతకుల నిమిత్తమై మేము కోరిన అధిక స్వేచ్ఛా ప్రతిపాదనలను, కమ్యూనిస్టు అజ్ఞాత కార్మికులు రహస్యంగా ప్రోత్సహించినటుల ఆ తర్వాత మాకు తెలిసినది. ఇదిగనక సాధిస్తే తాము దాగుకొనడానికి మరింత సులువు ఏర్పడుతుందని వారి తలంపు. సభలు, సమావేశాలు ఏర్పాటు చేసుకొనే నిమిత్తమై మిత్రులను కలుసుకోవడానికి బాలికల గదులు సురక్షితమైనవని వారి ఉద్దేశ్యము. కమ్యూనిస్టు ఆందోళనకారులను గురించి పోలీసులు, సోల్జర్లు వెతుకులాడు తున్నప్పుడు వారు గ్రామాన్ షన్ లో హాయిగా దాగుకొనవచ్చును.

ఆగంతకులకు అవకాశంలభించటంతో నిర్ణీతమైన ఆయా సమయాల్లో గ్రామాన్ షన్ కిటకిటలాడిపోతూ ఉండేది. ప్రతి గదిలోనూ గుంపులు గుంపులుగా బాలురూ బాలికలూ కూర్చుని ఉంటారు. మరికొంతమంది వసారాలలో పచార్లు

చేస్తూ ఉంటారు. కొంతమంది ఆవేశంతో రాజకీయాలు చర్చిస్తారు. కొందరు కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ ఉంటారు. కొందరు కిరసనాయిల స్టౌమీద ఏ ఫలహారమో చేసుకుంటూ ఉంటారు. చాలామంది బతాసీలను నములుతూ కబుర్లు చెబుతూ ఉంటారు. ఎక్కడన్నా ఒక్కొక్క గదిలో ఒక విద్యార్థి, విద్యార్థిని ఏకాంతంగా కూర్చొని చిలకా గోరువంకల్లాగా కబుర్లు చెప్పుకుంటూనో, చదువుకుంటూనో, వ్రాసుకుంటూనో కనిపిస్తారు. అటువంటి దృశ్యం నీ కంటబడినప్పుడు క్షమార్పణ చెప్పుకుంటున్నట్లు హఠాత్తుగా ప్రక్కకు తప్పుకుంటావు.

ఈ విధమైన స్వేచ్ఛ, విద్యార్థులు విద్యార్థినులు కలుసుకునేందుకు ఎక్కువ అవకాశాలను యిచ్చింది. అసభ్యప్రవర్తనకు కూడా ఎక్కువ అవకాశాలను కల్గించి ఉండవచ్చును. పైగా బాలికలు రాజకీయాలలో ఎంతముందు అడుగు వేసినా సంప్రదాయ సిద్ధమైన కట్టుబాట్లనుమాత్రం కోల్పోలేదు; తమను తాము చులకన చేసుకోవటం వారికి యిష్టంలేదు. చెదురు మదురుగా కొంతమందిని మినహాయించవచ్చును. చెడిపోదల్చుకున్నవాళ్ళను నిర్బంధంలో ఉంచినా బాగుపడరు.

విమోచనకు పూర్వం గ్రామూన్‌మన్ ఒక పెద్ద అద్దె కొంపలాగా ఉండేది. అయితే కొన్ని నిబంధనల ననుసరించి, అద్దె ఉండేదికాదు. జాగా గనక ఉంటే విద్యార్థినుల మిత్రులు బంధువులు వచ్చి వారితోబాటు ఎంతకాలమైనా ఉండవచ్చును. అలా వచ్చేవారి సంఖ్య శీతాకాలంలోనూ వేసవిలోనూ అధికంగా ఉండేది. అప్పుడు గదులు చాలావరకూ ఖాళీగా

ఉండేవి. విమోచనానంతరం యీ విషయంలో గట్టి ఆంక్షలు విధించారు. విద్యార్థినులమధ్య రహస్య ఏజంట్లు దాగుకొనకుండా నిరోధించడానికి గాను - వచ్చిన వ్యక్తి పైటా విద్యార్థిని అయినాసరే కాకపోయినాసరే, వసతిగృహ సెక్షన్ లీడర్ అనుమతిని సంపాదించాలి. ఆమె ఒక ఫారం పూర్తిచేయాలి. అందులోని ప్రశ్నలకు జవాబుగా, తన హోదా పుట్టు పూర్వోత్తరాలూ, వచ్చి ఉండడానికి కారణం ముఖ్యమైన వివరాలన్నీ యివ్వాలి. పైగా, ఇద్దరు వసతిగృహ పైటా బాలికలు ఆ వచ్చిన వ్యక్తి గురించి హామీగా ఉండాలి.

విద్యార్థులకు ఆహారం సరఫరా చేయడానికిగాను వీధిలో ఉన్న అంగళ్ళను ఎత్తివేయటం మినహా విమోచనానంతరం వసతిగృహాల రూపురేఖల్లో వేరే భౌతిక మార్పు ఏమీరాలేదు. విద్యార్థులు త్వరగా నిద్రలేచి వసతిగృహ వంటశాలల్లోనే భోజనం చేసేటట్లు ప్రోత్సహించాలనే ఉద్దేశ్యంతో అధికార్లు అంగడి వాళ్ళను లేవగొట్టారు. కాని, థర్డ్‌కోర్టు, గ్రామాన్‌షన్, యింకా యితర విద్యార్థి గృహాలలోని జీవన విధానంలో అనేక మార్పులు వచ్చాయి.

వసతి గృహాలలో విద్యార్థుల వలెనే విద్యార్థినులు కూడా తమకు ఏ గదికావాలో, తమగదిలో సహాధ్యాయులుగా ఎవరు ఉండాలో తేల్చుకోవడానికి లాటరీ విధానం అవలంబించే వాళ్ళు. కాని యిప్పుడు, విద్యార్థులలో వర్గచైతన్యాన్ని అధికం చేసేందుకు ఒకే తరగతిలో చదువుతున్న వారందరినీ ఒకే చోట చేరుస్తున్నారు. విద్యార్థి నాయకులు జాబితాలు తయారుచేస్తారు. ప్రతిభాగానికి ఒక పార్టీ మెంబరు, ఒకయువజన

సమితి సభ్యుడు. ఒక అభ్యుదయవాది ఉండేటట్లు ఏర్పాటు చేస్తారు. ఏ గదిలో ఎవరెవరు ఉండాలో వారే నిర్ణయించటం వల్ల విద్యార్థుల యిష్టానిష్టాలతో ప్రమేయం లేకుండా చేసి వేశారు. ఈ పద్ధతి ప్రకారం పరస్పర విభేదాలుగల విద్యార్థులు సహితం తప్పనిసరిగా ఒకేగదిలో ఉండవలసి వచ్చేది.

ప్రతి అంతస్తుకి ఒక లైఫ్ మేనేజర్‌ని ఏర్పాటు చేశారు. సమిష్టి జీవన విధానాన్ని పెంపొందించటం యీాయన చేసేపని. మేము ఏ సమయంలో నిద్రలేవాలో, ఎప్పుడు నిద్రపోవాలో, ఎవరితో భోజనం చేయాలో, ఎప్పుడు పాఠాలుచదవాలో లైఫ్ మేనేజర్లు బోధించటం మొదలుపెట్టినప్పుడు మాలో విపరీతమైన అసంతృప్తి చెలరేగింది. ఆ తర్వాత లైఫ్ మేనేజర్లు, మేము ఏ సినిమాలు చూడాలోగూడా చెప్పటం ప్రారంభించారు. ఇక మాకేవిధమైన వ్యక్తిత్వమూ లేదనీ మిగతా మందతో పాటు పోవడమేననీ మాలో చాలామందికి తెలిసిపోయింది.

పొదుపు ఉద్యమఫలితంగా పాఠశాల పరిపాలకులు బొగ్గు సరఫరా తగ్గించివేశారు. చలిరోజుల్లో విద్యార్థుల వసతి గృహంలో సగటున ఇరవైఅయిదు కట్టెల బొగ్గు కావలసి వచ్చేది. ఇప్పుడు ఎనిమిది కట్టెలకు తగ్గించివేశారు. మా గదుల్లోని రేడియేటర్లు వేడిగావున్నట్లు కన్పించినా తగినంత వెచ్చదనాన్ని యిచ్చేవికావు. పొదుపు ఉద్యమం పేరుతో గదుల్లోని అరవైవాట్ బల్బులను తీసివేసి యిరవైఐదు వాట్ బల్బులను తగిలించారు. వసతి గృహప్రాంగణంలో జరిగే నూతనవ్యాయామ క్రీడలలో పాల్గొనడానికి మేము తెల్లవారుఝామునే లేవడం ప్రారంభించాము. దీనిలో యిష్టమున్నవారే పాల్గొన

వచ్చును. కాని పాల్గొనని విద్యార్థులను అభ్యుదయ భావాలు లేనివారుగా యితరులు విసుర్సిస్తారనే భయం ఒకటి ఉన్నది. మైదానంలో ఉదయంఏడుగంటలకు కసరత్తు ప్రారంభమయ్యేది. ఆరోజు రోజంతా ఒకనూతన చైతన్యం ప్రస్ఫుటితమయ్యేది. స్నానాలు చేసేవాళ్ళు-"తూర్పుదిశ ఎర్రబారింది. బాలభానుడు ఉదయిస్తున్నాడు. చైనాదేశం మావ్ సే-టుంగును ప్రసాదించింది" అని బృందగానాలు ఆలాపిస్తూనేవుంటారు. 1948 నాటికన్నా రాజకీయ చైతన్యం ఇప్పుడు బాగా ఉధృతమైనది. విద్యార్థుల రాజకీయ కార్యకలాపాలు బాహాటంగా బహిర్గతమైనాయి. అధికారాన్ని కూలద్రోయటం యెలాగా అన్న ఆరాటం పోయింది. ఇప్పుడు అధికార వాక్యాలను మేము వింటున్నాము. కమ్యూనిస్టు విద్యార్థులతోబాటు పురోగమించడానికి మిగతా విద్యార్థులుగూడా మార్క్స్, లెనిన్, స్టాలిన్, మావ్ సే-టుంగ్‌ల గ్రంథాలు అధ్యయనం చేస్తున్నారు. నువ్వు ఏదైనా చదువుకుంటూన్నప్పుడు ఆ చదువుతున్న పుస్తకం ఏమిటా అని విద్యార్థి నాయకుడొకడు భుజంమీద నుంచి తొంగి చూస్తాడు. నీ చేతిలో వున్నది ఏ జాతీయ పుస్తకమోగనక అయితే యికముందు అటువంటివి నువ్వు చదవగలనని ఆస పెట్టుకోనవసరం లేదు. అతను చిరునవ్వుతో అడ్డంపడతాడు. "ఆ పుస్తకం అంత బాగా లేదుకదూ? నీ అభిప్రాయం ఏమిటి? దానిలో భావాలు యధార్థాలని నీ ఉద్దేశ్యమా? నువ్వు తీసుకున్న రాజకీయ గ్రంథాలు యింకా చదవలేదా?" అంటూ డొంకను కదల్చటం ప్రారంభిస్తాడు.

నువ్వుగనక నేర్పుగా జవాబు చెప్పకపోతే కమ్యూనిస్టుల 'నైతిక దెబ్బలు' ఒక వరసన నీ నెత్తిన వర్షిస్తాయి. నిజమే, యిదంతా నీ మంచికోసమే. కాని చాలా చికాకు కల్గిస్తాయి. విద్యార్థినాయకుడు వచ్చిన సమయంలో అదృష్టవశాత్తు నీ చేతిలో ఏ కమ్యూనిస్టు గ్రంథమో ఉన్నదనుక్కో, అప్పుడు నీ జోలికి రాకుండా అతను తప్పుకుపోతాడు. అదే పుస్తకాన్ని విసుగుపుట్టినప్పుడు ప్రక్కకు జారవిడుస్తున్నట్లు అతను చూశాడో యిహ క్రాస్ పరీక్ష మొదలుపెడతాడు. "నీ ఉద్దేశ్యం ఏమిటో చెప్పు. శ్రామికవర్గ విప్లవంలో నీవిశ్వాసాన్ని యీ గ్రంథంవృద్ధి చేయలేదా" ప్రజాస్వామ్య నియంతృత్వం అంటే ఏమిటో జ్ఞానాభివృద్ధి అయ్యేట్లు చేయలేదా! ఎన్ని కొత్త సంగతులు..." ఈ విధంగా బుర్ర మర్దన అయిపోతుంది.

విరోధికి ఏమీ ప్రయోజనంలేదు. వాళ్ళు చెప్పిన విషయాలనే తిరిగి వప్పగించటం కన్నా ఉత్తమమార్గం మరొకటి లేదు. స్వంతంగా ఆలోచిస్తానని పట్టుబట్టడంలో తెలివిలేదు. ఎందువల్లనంటే నువ్వు చదివిన పుస్తకాలు, విన్న ఉపన్యాసాలకు మించి ఏ అభిప్రాయాన్ని వెల్లడించినా అది వాదోపవాదాలకి దారి తీయడం, నీకు పరాజయం సంభవించడం తథ్యం. స్వయంగా ఆలోచించడం అనేది అర్థం పర్థంలేని ఆలోచనలతో సమానమని వారి ఉద్దేశ్యం. నిన్ను అడిగిన ప్రశ్నలకు నువ్వు ఏదో సమాధానం చెప్పాలి. జవాబుచెప్పకపోవటం క్షంతవ్యం కాదు.

శీతాకాలంలో ఒక రోజున కిటికీ ప్రక్కన కూర్చుని అల్లిక అల్లుతున్నాను. కిటికీలోనుంచి వెచ్చని సూర్య కిరణాలు శరీరాన్నంతా కౌగిలించుకుంటున్నాయి. ప్రక్కనే బల్లమీద టెర్రీ ఒడిలో మెత్తని స్వెట్టుకు మనస్సుకి ఎంతో ఉల్లాసంగా ఉంది. అల్లికదారంతో చేతులు చకచకా కదిలిపోతున్నాయి. బయట తలుపును ఎవ్వరో తడుతున్నారు. "లోపలికి రండి" అని కేకలు వేశాను. విమోచనకు పూర్వం నామీద కొంత ఆసక్తి చూపిన అభ్యుదయవాది లోపలికి వచ్చాడు.

"మళ్ళీ అల్లిక మొదలుపెట్టావా? ఎప్పుడూ గదిలో తలుపులు బంధించుకు కూర్చుంటావు. నువ్వు బయటికి ఎందుకు రావు?"

అతను దగ్గరగా వచ్చాడు.

"నూతన ప్రజాస్వామ్యంలో మనం అవలంబించవలసిన ఆర్థిక విధానాలను గురించి క్రింద అంతస్తునందు మిస్‌లీ గదిలో మేమంతా చర్చలు జరుపుతున్నాము. పాల్గొనడానికి నీకు ఆసక్తిగా వుంటుంది."

మంచంమీద పడుకుని ఏ నవలో చదువుకుంటూ కాలం గడపటం అంటే నాకు మహాయిష్టం.

వేసవి సూర్యుడు అతి నిర్దాక్షిణ్యంగా ఉన్నాడు. తెరలు దగ్గరకు లాగి నువ్వు ఫ్యాన్ దగ్గరగా పెట్టుకున్నావు. యదార్థానికి దుస్తులను తీసివేసి మంచంమీద కూర్చుని ఉన్నావు. జుట్టు వదులుగా ఉన్నది. నీలో నీవు ఏదో పాడుకుంటూ ఉన్నావు. తలుపు చప్పుడైంది. నువ్వు ఒక్క గెంతు వేసి దుస్తులు మీదకప్పుకుని, చేతులతో తలను దువ్వు

కుంటావు. ఆ యువకుడే మళ్ళీ వచ్చాడు. గదిచుట్టూ తేర పార చూశాడు. మడతలు పడ్డ దుప్పటిని, దిండును, ప్రక్కనే బల్లమీద తెరవకుండా పడివున్న రాజకీయ గ్రంధాన్ని చూస్తాడు. చిందర వందరలైన జుట్టును, నిద్రమత్తులో వున్న ముఖాన్ని పరకాయించి చూస్తాడు.

కూర్చొని ఎంతో నమ్రతగా చూస్తూ "నీతో ఒంట రిగా మాట్లాడాలని అనుకుంటూ ఉన్నాను. కూర్చో." అంటాడు.

ఒకకుర్చీ తెచ్చుకొని అతనికి దగ్గరలో కూర్చుంటావు. అతను న్యాయాధికారి ముఖభంగిమతో ప్రారంభిస్తాడు. మీకుటుంబ పుట్టుపూర్వోత్తరాలను గురించి మాకు తెలుసు నని నువ్వు గ్రహించేవుంటావు. నీతండ్రి ఒక ఛోటాబూర్జువా, సామాన్య భూస్వామ్య వర్గంలోనివాడు. మీ బంధువులను 'దయగల భూస్వాములు' అనవచ్చును. వారిలో పాతవిశ్వా సాలు యింకా ధృఢంగానే ఉన్నాయిగాని తొలగిపోలేదు. మీతల్లిగూడ అంతే. పూర్వసాంప్రదాయ మనిషి. ఆమె శ్రామికవర్గ విప్లవంఅంటే భయపడింది. మీఅప్పచెల్లెళ్ళు గూడా అంతా ఒకేతీరు. ఈపరిస్థితుల అన్నింటి కారణంగా నువ్వు త్వరగా నీలో మార్పుతెచ్చుకొనేందుకు ప్రయత్నిం చాలి." ఇలాంటి ఉపన్యాసధోరణి యిదివరలోనేను చాలా సార్లు విన్నదే.

ఈబాధలను తప్పించుకోవడానికి 'నిశ్శబ్దం' అని వ్రాసి వుండే గ్రంథాలయంలో ఎక్కువ సమయం గడవటం ఉత్తమం. క్రియవాదులు ఒక్కొక్కప్పుడు నిశ్శబ్ద హెచ్చరికను గూడా

లక్ష్యంచేయకుండా ఎవరినో ఒకరిని ఆకట్టి గుసగుసలుగా ఉప న్యాసాలు దంచుతూ ఉంటారు. అందుకువారికిస్వేచ్ఛ ఉన్నది.

తప్పనిసరిగా కొంతకైము వసతిగృహంలో నువ్వు గడ పక తప్పదు. నీరూమ్‌మేట్ యువజనసమితి సభ్యురాలైఉంటే, పడుకోబోయేదాకా ఆమె మాటలను ఆలకించక తప్పదు. నువ్వు 'అవును' 'కాదు' అని జవాబుయిస్తే చాలదు. ప్రసంగం పూర్తి అయింతర్వాత నీఅభిప్రాయాలను తెలుసు కొనడానికి ఆమె కుతూహల పడుతుంది. నువ్వు నిద్రతో జోగుతూఉన్నా, ఆమె మాటలు జ్ఞాపకం లేకపోయినా, వాటిని తిరిగి చెప్పలేకపోయినా ఆమె కోపతాపాలకు లోను గావలసి వుంటుంది.

ఇవన్నీ చూస్తూఉంటే ఆరోజున టర్కిష్ విద్యార్థిని "ఇది బందిఖానాలో నకలుగాఉంది" అన్నమాటలు చెవుల్లో రింగుమంటూ ఉంటాయి.

వసతిగృహాలకు వెలుపల జీవితం పూర్తిగా రాజకీయ చర్చలతో ముడిపెట్టబడలేదు. పాశ్చాత్యపద్ధతి బాల్‌రూమ్ నృత్యం యిటీవలనే చైనాలో ప్రవేశించింది. వాణిజ్య నౌకా శ్రయాలయిన షాంగ్‌హైలాంటి నగరాలలోనే యిది విశేష ప్రచారంలోకి వచ్చింది. యుద్ధానికి తర్వాత సరిహద్దు ప్రాం తాల జానపద నృత్యాలు ప్రజాదరణాన్ని పొందాయి. పెకిం గ్‌లో కొద్దిమంది విద్యార్థులకు మాత్రమే పాశ్చాత్య నృత్యం తెలుసును. జానపదనృత్య పద్ధతిలో కమ్యూనిస్టులు ప్రవేశ పెట్టిన 'యాంగ్ - కో' విశేష ప్రజాఆదరాన్ని పొందింది.

పాతప్రభుత్వపురోజుల్లో - పైటా విద్యార్థులలో పదవ వంతుకి మాత్రమే బాల్‌రూం నృత్యం తెలుసును. ప్రైవేట్ పార్టీలు అనేవి అరుదు. పెకింగ్‌లోని కొద్ది డాన్సు హాలులలోకి విద్యార్థులు ఎప్పుడో ఒకసారి వెళ్ళేవారు. ఆహ్వానాలు అందినప్పుడు విద్యార్థులు చక్కగా అలంకరించుకొని ప్రైవేట్‌పార్టీలకు వెళ్ళేవారు, ఆలస్యంగా తిరిగివచ్చేవారు. బాలికలపద్ధతి వేరేవిధంగా ఉండేది. బయటకు వెళ్ళటానికి పూర్వం మంచి దుస్తులు జోళ్ళు ధరించి, ముఖానికి రంగువేసి పౌడరు అద్ది కిటికీదగ్గర నిలబడి క్రిందకు చూస్తూఉంటుంది. రంగురంగుల తన దుస్తులుతోటి వారికంటబడటం ఆమెకు యిష్టంలేదు. ఎప్పుడు చీకటిపడుతుందా అని ఎదురుచూస్తూఉంటుంది. బాగా చీకటిపడగానే బయటకు దూసుకునిపోతుంది.

నృత్యసమయంలో ఆమె విశ్రాంతితీసుకోవడానికి అవకాశం చిక్కదు. ఎవరితో డాన్సుచెయ్యాలో ఎవరితో చెయ్యకూడదో తెలియదు. తాను అనుకున్నంతగా తన సంభాషణలు హాస్యంగానూ ఆసక్తిగొలిపేవిగానూ ఉండవు. తనవలెనే పార్టీకి వచ్చిన సహపాఠులమధ్య కూర్చోగానే ఆమెకు ధైర్యం చిక్కుతుంది ఇంతలో ఎవరో ఆమె రిస్ట్‌వాచిమీద చెయ్యివేశారు. అప్పుడు వసతిగృహానికి తొందరగా తిరిగివెళ్ళాలి.

సహాయం వచ్చినవారు ఆమెను విశ్వవిద్యాలయం గేటువద్ద వదిలివెళ్ళారు. ఆవరణలోపల నీడలవలె కొందరు తీరికగా పచార్లుచేస్తూఉంటారు. కాని గేటుమీది వీధిదీపం దేదీప్యమానంగా వెలుగొందుతూఉంటుంది. చేసంచీలో మంచి రుమాలును తీసి ఆమె తన ముఖాన ఉన్న రంగును

తుడిచివేస్తుంది. ఆ తర్వాత చీకటిగుయ్యారంగా ఉన్న మార్గం ద్వారా ఏదో కానిపని చేసినదానివలె పడకటింటిలోనికి పరుగుతీస్తుంది. పక్కమీద పడుకున్నా ఆమె గుండెలు వేగంగా కొట్టుకుంటూనే ఉంటాయి.

పరిస్థితులు గనక సక్రమంగా ఉంటే తమ నృత్య ప్రావీణ్యత విషయంలో బాలికలు యింత ముభావంగా ఉండ వలసిన అవసరం కలిగేదికాదు. పాత ప్రభుత్వం యిలాంటి నృత్యాలపై కొంత ఆంక్షను విధించింది. నృత్యాలకు వెళ్ళిన బాలిక తన సహాధ్యాయిల విమర్శలకు లోనుగావలసివచ్చేది. అభ్యుదయ వాదులైన విద్యార్థులను నృత్య ప్రియులను తీవ్రంగా తెగనాడేవారు. "వీళ్ళుగనక తమను తాము సంస్కరించుకోనకపోతే ఒకానొక రోజున దీనికి తగిన ప్రతిఫలం అనుభవించవలసి ఉంటుంది. బాల్‌రూమ్ నృత్యం! ఒక మొగ వాడు ఆడది కలసి తైతక్కలాడటం! సిగ్గుచేటు!"

నృత్యాన్ని గురించి ఉపన్యాసాలు దంచుతూ ఉండే అభ్యుదయవాదులు, ఆరోజుల్లో ఏనాన్‌లో ఉన్న కమ్యూనిస్టు పాలకుల అభిప్రాయాలనే చాటుతున్నామని తలపోశారు. కాని త్వరలోనే వారు తమ అభిప్రాయాల్ని సరిదిద్దుకోవలసి వచ్చింది. అదే ఏనాన్‌నుండి కమ్యూనిస్టుపార్టీ నృత్యాన్ని దిగుమతి చేసింది. కాడర్లు, చోటా బూర్జువాలకు తరుచు ఏర్పాటుచేసేవి యాంగ్-కో నృత్యాలు కావనీ, బాల్‌రూం నృత్యాలేననీ మేము కనిపెట్టాము.

గోడ వార్తా పత్రికలలో కొత్త ఫ్యాషన్‌ను గురించి వ్యాఖ్యలు పడటం ప్రారంభం అయింది. బాల్‌రూం నృత్యంలో

తప్పు ఏమీ లేదని అభ్యుదయవాదులు పేర్కొన్నారు.
యదార్థానికి సోవియట్ యూనియన్ నూతన ప్రజాస్వామ్యాల లోని యువతీ యువకులకి యీ రకమైన నృత్యమంటే ఎంతో మోజు. పెట్టుబడిదారి దేశాలలోవలె నృత్య మందిరాలు ఆర్భాటంగా ఉండకుండా చూసుకుంటే చాలును.

బాల్‌రూం నృత్యం ప్రయోజనకారియనీ చట్టబద్ధమైన దనీ ప్రకటింపబడగానే కమ్యూనిస్టు కాడర్లు కాంపస్‌లో పార్టీ యిచ్చారు. ఉత్తరభవనంలో నేల నున్నగా అనుకూలంగా ఉంటుంది. బల్లలూ కుర్చీలు ఒక మూలకి జేర్చి నేల నేలంతా బోరిక్ ఆసిడ్ స్ఫటికాలను దట్టంగా వెదజల్లారు.

నృత్యబృందానికి "బాల్‌రూం నృత్యంలో సమష్టి పాఠం" అనే పేరు పెట్టారు. ఆహ్వానింపబడిన అభ్యుదయ వాదుల్లో చాలామందికి యిదివరలో సదభిప్రాయంలేదు. కమ్యూనిస్టుకాడర్లు నృత్యంచేస్తున్నారనీ, మెన్‌చున్-జు లాంటి వృద్ధులు సైతం నృత్యపాఠాలు నేర్చుకుంటున్నారనీ తెలిసిం తర్వాత మేము వెనుక అడుగువెయ్యగలరా? అంతేగాకుండా గోడ వార్తాపత్రికలు ప్రతివారూ నృత్యం నేర్చుకోవలసిన ఆవశ్యకతను బోధిస్తూ ఉన్నాయి. మేము ఆశించినదానికన్నా వేగంగా విప్లవం సాగిపోతోంది; పెట్టుబడిదారీవర్గాల కళ ప్రజల పరమై పోయినది.

అధికార నిబంధనల ననుసరించి నృత్యంచేసే గదిలో అలంకారాలు ఏమీ ఉండవు. విద్యార్థులు నృత్యం ఉపయో గించే దుస్తులనే ధరిస్తారు. ప్రముఖ నృత్యకారులుగూడా ఒక్క కాలిజోళ్ళను మాత్రమే మారుస్తారు. ఇతరులముందు బాలి

కలవద్దకు వచ్చి నృత్యానికి ఆహ్వానించే ధైర్యం, అనుభవం యింకా చాలామంది బాలురకు అలవడలేదు. అలాంటి సందర్భాలు స్త్రీలు కసితీర్చుకోవడానికి ఉపకరించేవి. పాఠశాలలలో బాలురు రాజకీయాలు బోధిస్తూ ఉంటే మేము నోళ్ళు కట్టుకుని వినాలి. ఇప్పుడు మా ఆధిక్యతకు అవకాశం చిక్కింది. ఒకొక్కప్పుడు తనతో నృత్యంచేస్తూ ఉన్న పురుషుణ్ణి ఒంటరిగా వదిలివేసి మరొకపురుషునితో – "క్రితంసారికన్నా బాగా నృత్యంచేస్తున్నావే, ఏదీ మనం యిద్దరం చేద్దాం" అంటూ వెళ్ళటం కద్దు.

నేను చెప్పింది విపరీతంగా తోస్తోందా? బహుశః విపరీతమే కావచ్చును. ప్రముఖ నృత్యకారులు చాలవరకు స్త్రీలే. పురుషులు యీ కళలో చాలా వెనుకపడ్డారు. వారికి బోధించి దారిలో పెట్టవలసిన బాధ్యత మా మీద లేదా? లేకపోతే అది ఛోటాబూర్జువాల స్వలాభ పరాయణత, గర్వపోతుతనం క్రింద లెక్కకు రాదా?

మేము నృత్యంచేయడానికి పిలుగా ఆయాపార్టీలలో వినవచ్చే సంగీతమంతా పాతబూర్జువాల నృత్యఫణతులే. చాలామంది పురుషులదృష్టి తడబాటు చెందే తమ అడుగుల మీదనే ఉంటుంది? సంగీతాన్నిగురించి ఆలోచించడానికి వ్యవధి ఏది? సోవియట్ యూనియన్ లేదా నూతన ప్రజాసామాన్యాలనుండి వచ్చిన యువజనులెవరన్నా ఆ సమయంలో కిటికీలోనుంచి తొంగిచూడటం సంభవిస్తే వారు తప్పకుండా పొట్ట చెక్కలయ్యేటట్లు నవ్వుతారు. ప్రజాస్వామ్య నినాదాలు పాతగోడలను కప్పిపెట్టలేవు. కుర్చీలు బల్లలూ గదిలో

మూలగా యిష్టంవచ్చినట్లు పేర్చిఉంటాయి. గదిమధ్యలో గుమిగూడిన జంటలు ఒకళ్ళనుఒకళ్ళు తోసుకుంటూ, పడుతూ లేస్తూఉంటారు. "ఒకటి, రెండు, మూడు, నాలుగు" అని లెక్కపెడుతూ హఠాత్తుగా ఒకడు ఆగిపోతాడు. దాంతో కొందరు ఒకళ్ళను ఒకళ్ళు ఢీకోడం క్రిందపడటం జరుగుతుంది. అతను "క్షమించాలి...తప్పటడుగు వేశాను" అంటాడు. అతని జంటగా ఉన్న ఆమె "మరేం ఫరవాలేదు. జరిగిపోయిన దానినిగురించి విచారించకు. నన్ను అనుసరించు" అంటుంది.

ఇలాంటి సంఘటనలు క్రమశః అరుదైపోయినవి. నృత్య విషయంలో తీవ్రమైన కృషిచేసి రెండుమూడు మాసాలలోనే చాలామంది మంచి చాకచక్యం సంపాదించారు. ప్రారంభకులు అవడంవల్ల వారు తమకు దొరికిన ప్రతిఒక్క అవకాశాన్ని ఉపయోగించుకుని సాధనచేశారు. విమోచనకు పూర్వం, నృత్యంలో విముఖతగలవారు రెండు వర్గాలుగా ఉండేవారు. వీరికి నృత్యం అంటే లెక్కలేదు. పైగా యిది సంప్రదాయ విరుద్ధమనీ, విచ్చలవిడిగా సంచరించడానికి అవకాశం యిస్తూం దనీ వారి వాదం. (కొంతమంది నృత్య ప్రవీణులు చదువు సంధ్యలలో వెనుకబడటం, అల్లరి చిల్లరిగా ఉండటం యదార్ధమే) పూర్వం బాల్‌రూం నృత్యాన్ని విమర్శిస్తూ వచ్చిన వామపక్ష విద్యార్థులే యిప్పుడు దానిని ఆకాశానికి ఎత్తివేస్తూ ఉండటంవల్ల రెండవపక్షం వారికి అరికాలుమంట నెత్తికెక్కింది. దాంతో ప్రశ్నలవర్షం కురిపించటం ప్రారంభించారు, "నృత్యం చేసే ప్రజలమీద మీరు దాడిచేసేవారా లేదా? అయితే యిప్పుడు మీరే ఆ పని ఎందుకు చేస్తున్నారు? చోటాభూర్జ

వాల వలె కాలం వ్యర్థం అవుతుందని మీరు సిద్ధాంతీకరించే వారుకదా – ఇప్పుడు ఆ ఉపదేశం ఏమైంది?" దీనికి సమాధానంగా జవాబు ఏం చెప్పాలో వామపక్షంవారికి తోచలేదు. తమ ప్రవర్తనను సమర్థించుకునేందుకు వీలుగా వీరిలో కొందరు అభ్యుదయవాదులు ఒక నూతనమార్గం కనిపెట్టారు. సమావేశంలో సంగీతం ప్రారంభం కావడానికి పూర్వం పార్టీ సభ్యుడొకడు లేచి అతి నమ్రతగా స్నేహం తొణికిసలాడే గొంతుకతో యీ విధంగా ప్రకటించేవాడు:

"కామ్రేడ్స్, సినో–సోవియట్ స్నేహ సంబంధాన్ని పురస్కరించుకొని యీరోజు సాయంత్రం మనం పండుగ జరుపుకొంటూ ఉన్నాము. (ఇలాంటి పండుగలు, ఉత్సవాలు అనేకం ఉన్నాయి.) మనలో పెల్లుబికే ఉత్సాహాన్ని ప్రకటించుకునే తరుణం యిది." అక్కడ గుమికూడిన గుంపువంకా కౌగలించుకోబోతున్నట్లు పార్టీ కామ్రేడ్ చేతులు బారజాపి యిట్లా అంటాడు. "సమవిద్యార్థులారా, శక్తివంచన లేకుండా ఆనందం అనుభవిద్దాం రండి. మనం యువకులం. ఉత్సాహం తొణికిసలాడుతూ ఉన్నవాళ్ళం. ఆడదాం, పాడదాం, నవ్వుదాం. ఒకటి రెండు నిమిషాల్లో వాద్యసంగీతం ప్రారంభం కాబోతూఉన్నది. మనలోని సంతోషాన్ని వెల్లడించేందుకు ప్రతివారూ యీ ఉత్సవంలో పాల్గొంటారని ఆశ. మనలో నృత్య ప్రవీణులు ఎవ్వరూ లేరు. ఎవరన్నా నవ్వుతారేమోనని సిగ్గుపడ నవసరంలేదు. రండి...పాల్గొనండి."

ఈ సంతోష ప్రవాహంలో పడి అందరూ కొట్టుకు పోవలసిందే. వెలుపలనుంచి విమర్శించేందుకు ఒక్కడుకూడా మిగలలేదు.

పైటా విద్యార్థులకు కాలినడక అంటే ఎంతో యిష్టం. భోజనానంతరం, మనస్సు చికాకుగా వున్నప్పుడు కొంచెం దూరం నడచిరావటం మాలో కొందరికి అలవాటు. ఒంటరిగా లేకపోతే నేస్తంతోనో వెళ్ళేవాళ్ళము. యువజన సమితి సభ్యులు మమ్మల్ని ఒకకంట కనిపెట్టి చూస్తూనే వుండేవాళ్ళు. నువ్వు ఒంటరిగా తిరుగుతూఉంటే కబుర్లతో ఒకరు వెంట అనుసరిస్తారు. ఇతరత్రా పనివుండి వెంట వచ్చేందుకు వీలు లేకపోతే దూరంనుంచే నీ మనోభావాలను గ్రహించి, నువ్వు ఒంటరిగా తిరగడానికి కారణాలు ఏవై వుంటాయో మిగతా కమ్యూనిస్టు మిత్రులతో చర్చిస్తాడు.

పార్టీ మీటింగ్‌లో నీ పేరు పైకి వచ్చినప్పుడు అప్పుడు జరిగే చర్చ ఏ తీరుగా ఉంటుందో సులభంగా ఊహించ వచ్చును.

"తోటి విద్యార్థుల సుహృద్భావపూర్వకమైన విమర్శలు తనకు తలనొప్పి కలిగిస్తున్నట్లుగా ఆమె తలుస్తోంది. బూర్జువావర్గ అహంకారము ఆమెలో యింకా అతిశయించే ఉన్నది."

"తనను సంస్కరించుకోవాలనే అభిప్రాయం ఆమెకు ఉన్నట్లుగా నాకు తోచటంలేదు. ఆమెకు ఏవిధమైన నిశ్చితాభిప్రాయాలూ ఉన్నట్లు కన్పించదు."

"ఆమె తన పట్టుదలను విడవటంలేదు. ఒంటరిగా ఉండా లనుకుంటుంది. సమష్టి జీవనవిధానం పట్ల నిర్లక్ష్యం చూపు తోంది. శ్రామికవర్గ సిద్ధాంతాల విషయంలో బొత్తిగా అజ్ఞానురాలు." ఈవిధంగా నీ శీలాన్ని గురించి ఎవరి అభి ప్రాయాలు వారు ప్రకటిస్తారు.

ఇటీవలనే యువజన సమితి సభ్యుడుగా చేర్చుకోబడిన ఒక యువకుడు నీ వెంట వచ్చాస్తుచేస్తున్నట్లుగా వారు కనిపెట్టా రనుకుందాము. అతను వారికి అతి ముఖ్యుడనటం వల్ల మరింత లోతుగా పరీక్షిస్తారు. "ప్రభుత్వం, పార్టీ, యువజన సమితి విధానాలపట్ల అతను అసంతృప్తుడు కాలేదని నేను భావిస్తు న్నాను. అతను ఆమెతో ఆరోపణలు చేయటంలేదని నేను విశ్వసిస్తున్నాను..."

"తన అభిప్రాయాలలో అతనికి ధృఢవిశ్వాసం లేదని మీ ఉద్దేశ్యమా? అతను ఆమెతో ప్రేమ కలాపాలలో పడటం లేదని నా తలంపు..." యదార్థానికి, అతను అప్పటి దాకా కష్టపడి పనిచేసి, మిగతా మిత్రులంతా తమ తమ పనుల్లో నిమగ్నులై ఉండటంవల్ల నీతో షికారువచ్చి ఉంటాడు.

పెకింగ్ నగర అందచందాలను గురించి నేను విశేషంగా పొగడనక్కరలేదు. ఇంపీరియల్ ప్యాలెస్, కోల్ హిల్, పైహై, చుంగ్-నాన్ హై, సన్ యట్-సెన్ పార్కు, ఇంపీరియల్ టెంపుల్, స్వర్గఆలయం - ఇవన్నీ పూర్వపు రాజులకాలంలో వెలిసినవే. ఇదివరలో తాము చూడని దృశ్యాలను ఫొటోలుగా తీయా లని పెకింగ్ విద్యార్థులు కెమేరాలతో తిరుగుతూ ఉండేవారు. ఫొటోలుతియ్యటం యిప్పుడు అంత సులభంకాదు. నువ్వు

కెమేరాను అమర్చుకొనేలోపల ఒక పోలీసు అక్కడకివచ్చి 'నువ్వు చేస్తూవున్నపని ఏమిటో తెలుసా' అని ప్రశ్నిస్తాడు. "ఇక్కడ ఫొటోలు తియ్యగూడదని నాకు తెలియదు. తెలిస్తే అందుకు ప్రయత్నించేవాడినికాను" అంటూ నువ్వు ఎంతో నమ్రతతో గసక విన్నవించుకొంటే నువ్వు తేలికగా బయట పడతావు. మహాఅయితే ఆపోలీసు కెమేరాలోని ఫిల్మును తీసుకొని నీదారిన నిన్ను పొమ్మంటాడు. నువ్వు ఎగతాళి చేసినా ఎదురుజవాబు చెప్పినానిన్ను తీసుకుపోయి పౌరరక్షణ సంఘానికి అప్పచెబుతాడు.

ఒక ఆదివారంనాడు కొంతమంది మిత్రులతో కలిసి పైహై కొలనువద్దకు వెళ్ళాను. ఒక మిత్రుణ్ణి ఫొటోతియ్యమని మేమంతా వరుసగా నిలబడ్డాము. అతను ఫొటోతియ్యడానికి సంసిద్ధుడవుతూండగా మాగుంపులోనుండి ఒక విద్యార్థి బయట కువచ్చి నలుదిక్కులా పరిశీలనగా చూపులు సారించాడు. "అంతా సరిగాఉందా? ఆ నేపథ్యంలో మనం ఫొటో తీసు కోవడంవల్ల ప్రమాదం ఏమీ లేదా?" అంటూ చుంగ్-నాన్‌హై వైపు దూరంగా వేలు చూపించాడు. చుంగ్-నాన్‌హై పార్కు భవనాలలో ఒకదానియందు స్టేట్ పరి పాలనా సంఘం నెలకొనియున్నదని మాకు గుర్తుకువచ్చింది. కెమేరాను పుచ్చుకున్న మిత్రుడు "పదండి మరోవైపుకు మారు దాం" అన్నాడు.

పెకింగులో స్టూడెంట్ కెమెరాక్లబ్, విద్యార్థులు తీసిన ఫిల్ములను న్యాయమైన ధరకు డెవలప్‌చేసి యిస్తుంది. పేటికలో మంచి చిత్రాలను డెమాక్రటిక్ స్క్వేర్‌లో అప్పుడప్పుడు

ప్రదర్శిస్తూ వుండేవారు. ఈ చిత్రాలన్నీ ఏదో ఒక ప్రత్యేక సందర్భానికి సంబంధించినవి. 'మే నాలుగు' ఉత్సవాలకోసం బారులుతీర్చి వెళ్ళే విద్యార్థులు, సోవియట్ అతిథులకు పూల మాలలు వేయటం, సమిష్టి నృత్యం సమష్టిబృందగానదళాలు సమష్టి చర్చలు మొదలైన విద్యార్థుల నిత్య జీవితానికి సంబంధించిన విశేషాలు - యీచిత్రాలలోని ముఖ్యాంశాలు. ఫొటోలు తీయడంలో అమిత ఉత్సాహంగల మిత్రుడొకడు వున్నాడు. డెవలప్ అయి తిరిగివచ్చిన ఫొటోలలో ఏది పై ఉత్సవానికి సంబంధించినదో తాను గుర్తించలేకపోవటం కద్దు అని అతను మాతో చెప్పాడు. ఫొటోలు అన్నీ దాదాపు ఒకేరీతిగా ఉండటమే యిందుకు కారణం.

నిషిద్ధనగరానికి వెనుకవైపున ప్రకృతి రామణీయకతతో విలసిల్లే 'కోల్ హిల్', మా హాస్టల్ ఆవరణకు అతి దగ్గరలో ఉన్నది. పెటా విశ్వవిద్యాలయం బాడ్జ్ గలవారు ఏ విధమైన రుసుము చెల్లించకుండా యీ ప్రదేశాన్ని సందర్శించడానికి, కుమింటాంగ్ దినాల్లో అధికారులు అనుమతిని సంపాదించారు. కోల్ హిల్ మానవనిర్మితం, అంతా చెట్లూ చేమలతో కప్పబడివుంటుంది. అతి విషాదకరపరిస్థితులకు లోనైన మింగ్ చక్రవర్తి ఒకడు యిక్కడ ఆత్మహత్య చేసుకున్నాడు. ఇది పెటాకు ఉద్యానవనం. ఈ తోటలో టిక్కెట్లు కొనుక్కునివచ్చేవారికన్నా పెటా విద్యార్థులే ఎక్కువగా షికార్లుచేస్తూవుంటారు. విమోచనానంతరం ఏ కారణాల వల్లనో యీ పార్కును కొంతకాలం మూసివేశారు. తర్వాత తెరిచారు; ఇప్పుడు ప్రతివారూ కొంత ప్రవేశరుసుమును చెల్లిం

చాలి. ముఖ్యద్వారానికి ఎదురుగా ఒక కొత్త పఠనాలయం నెలకొల్పబడింది. దీనినిండా కమ్యూనిస్టు గ్రంథాలు, వార్తా పత్రికలు చేర్చారు.

1949 ఆనురాలుకాలం టరం పూర్తికాగానే, ప్రతి విద్యార్థి ప్రస్తుత పరిస్థితులకు అనుకూల్యంగా తన రాజకీయ మానసిక ప్రవృత్తిలో ఏవిధమైన మార్పులను సాధించగలిగినదీ ఒక వ్యాసం రాసి దాఖలు చేయవలసిందిగా ఆదేశింపబడ్డారు. మొదట, టరంపేపరును—వెనుక జేర్చి వున్న కాళీకాగితాలలో తమతమ వ్యాఖ్యానాలను వ్రాయడానికి వీలుగా రాజకీయ తరగతిలోని మిగతా విద్యార్థులకి అందజేశారు. విమర్శకు, ఆత్మ విమర్శకు రచయిత ఆనివేదికను క్లాసులో బిగ్గరగా చదవాలి. కొత్తగా పార్టీలో చేర్చుకోబడిన ఒక సభ్యుడు యిట్లా తన పేపర్‌లో వ్రాశాడు.

పూర్వపు రోజుల్లో కోల్‌హిల్ యొక్క సౌధ నిర్మాణ సౌందర్యం, సాటిలేని ఆ అందం నాకు నిజంగా మత్తు ఎక్కించేవి; సూర్యుని వెలుగులో స్వర్ణకాంతులు చిమ్మే పెంకులు, కాలం తెచ్చిపెట్టిన అనన్య సౌందర్యంతో విలసిల్లే స్తంభాలు, విచిత్రమైన శిలాప్రతిమలూ చూస్తూఉంటే, చిత్రలేఖనం కవిత్వం ఒకటిగా పెనవేసుకునిపోయి శాశ్వతమైన కళాఖండాలుగా రూపొందినవా అని దిగ్భ్రాంతి కలిగేది. మింగ్ వంశీయుడైన సూజుచక్రవర్తి ఆత్మహత్య చేసుకున్న ఆ ప్రదేశానికి నేనూ రోజూ ఉదయం వెడుతూ ఉండేవాడను. నా చుట్టుపక్కల అన్నీ దేవదారు వృక్షాలే. పొగమంచుతో నిండిన కొమ్మల ఆకులు ముత్యాలవలె మెరుస్తూ కనిపించేవి. శిఖరాగ్రానవున్న

భవనాన్ని చేరగానే పక్షుల కిలకిలారావాలు కర్ణానందంచేసేవి. మనస్సుకి ఎంతో ప్రశాంతంగానూ ఉల్లాసంగానూ ఉండేది.”

అతనిగొంతు తీవ్రరూపం దాల్చింది. “నేను రాజకీయ తరగతిలో చేరింతర్వాత నా మనస్సు సంధిగ్ధావస్థలో పడింది. లోపల కల్లోలం చెలరేగింది. పాత అనుభూతుల పిడికిలి నుంచి తప్పించుకుని బయటపడటానికి ఎంతో పెనుగులాడవలసి వచ్చింది. ఇప్పుడు నా అభిప్రాయాలు మారిపోయాయి. ఇప్పుడు కోల్‌హిల్ మీదకు వెడుతూఉంటే, పూర్వపు చక్రవర్తుల కల్మషభూయిష్టమైన దారుణ జీవితాలు నా దృక్పథంలో సుస్పష్టంగా గోచరమౌతూ ఉన్నాయి. నా కంటికి కనిపించేలా యీ అద్భుత భవనాలు, కట్టడాలు – పాలించే రాజుల విలాసార్థం, సామాన్య ప్రజలు చెమటా నెత్తురూ ఓడ్చి నిర్మించవలసి వచ్చింది. ఇప్పుడు యీ నిర్మాణాలను చూస్తూ ఉంటే నాకు పరమరోత కలుగుతూ వున్నది. అగ్నిలాగా కోపం ప్రజ్వరిల్లుతోంది. ఈ భవనాలను, కట్టడాలను నేల కూల్చాలనీ, యీ కొండను నేలమట్టం చేయాలనీ నాకు ఆవేశంగా వున్నది.”

కమ్యూనిస్టులు అతన్ని ఉపన్యాసానంతరం బ్రహ్మాండంగా పొగిడారు. అతను చెప్పిందాంట్లో సాహిత్యవిలువలు ఉన్నందుకుకాదు. బుద్ధి సరియైన మార్గంలో రూపొందినందుకు ఈ మానిషిలోని మార్పు సఫలీకృతమైనందులకు బ్రహ్మానందమందుతూ – యింకా మన స్త్రత్వంలో మార్పురానివారందరూ అతనిని ఆదర్శంగా తీసుకుని తమను సంస్కరించుకోవలసిందని ఉద్బోధించారు.

షైహేని సందర్శించిన కొద్దివారాల అనంతరం కొందరు విద్యార్థులు ప్రకృతి రమణీయ కతకు పేరుపొందిన ఉత్తర చెరువు వైపునకు విహారయాత్ర వెళ్ళాము. శ్వేతదగోబా మెట్లమీద భోజనాలుచేస్తూ కబుర్లు చెప్పుకుంటూవుండగా మాలో ఒకడు, దూరంగా దేవదారు వృక్షాన్ని ఆనుకుని మా వైపు వెన్నుతిప్పి ఒకవ్యక్తి కూర్చుని ఉండటం చూచాడు. మేము అక్కడికి వచ్చినప్పుడు ఎవ్వరూ మాకు కనుపించలేదు. ఇంతలోకీ యీ వ్యక్తి ఎక్కడనుంచి ఊడిపడ్డాడో మాకు బోధపడలేదు. దీంట్లో ఏదో కీలకం ఉండి ఉంటుందని మాతో పాటు వచ్చిన యువజనసమితి సభ్యుడు పసికట్టాడు. మాకబుర్లు ఆగిపోయాయి. అతను పెద్ద గొంతుకతో బిగ్గరగా "ప్రపంచ శాంతి ఉత్సవసందర్భంలో మనం అంతా క్రితంసారి ఊరేగింపు జరిపినప్పుడు మీరు జండాలను నిటారుగా ఎందుకు పుచ్చుకో లేదు? అవి ఉంగచుట్టుకునిపోవడం ఎంతైనా హాస్యాస్పదంగా కనిపించిందని వెనుకవాళ్ళు అన్నారు."

ఆ వ్యక్తి కదలకుండా మెదలకుండా కూర్చుని ఉన్నాడు. "అతని ధోరణి విచిత్రంగా కనిపించడంలేదూ?" అని ప్రక్క వానితో నెమ్మదిగా అన్నాను.

ఎవ్వరూ జవాబు చెప్పలేదు. "బహుశః తన ప్రేమ వ్యవహారమో లేక మరేదో తలపోసుకునేందుకు వచ్చి ఉంటాడు" అని హాస్యంగా మళ్ళీ అన్నాను.

మా నాయకుడు మాట్లాడకు అన్నట్టు నా వైపు చూచాడు. "మనం కాస్త త్వరగా తిరుగుముఖం పట్టడం

మంచిది. యువజన సమితి సమావేశం ఉన్నది, మరచిపోకండి"
అని అన్నాడు.

భోజన పాత్రలను సర్దుకుంటూ మేము ఆ ఆగంతకుని వైపు చూచాము. మేము లేచినవెంటనే అతనూ లేచి నిల బడ్డాడు. మావైపు చూచాడు. ఏవిధమైన సంకోచం లేకుండా ముఖాన్ని ప్రక్కకు త్రిప్పుకుని సిగరెట్ ముట్టించాడు. మేము అతన్ని బాగా పరకాయించి చూచాము. అతనికి షుమారు ముప్పై సంవత్సరాలు ఉండవచ్చును. చిన్నకళ్ళు, పొడుగాటి ముఖం, కొనతేలిన గడ్డం. ప్రకృతి సౌందర్యాన్ని గ్రోలు తున్నాడా లేక పీడించే వర్గాలను గురించి యోచిస్తున్నాడా అని నాకు అనిపించింది. మాతోపాటు దూరంగా అతనుకూడా కదిలాడు.

మా వెనుక ఎంతో దూరంలో అతను మాయమై పోయాడు. ఆ విషయం గుర్తించి మా యువజనసమితి నాయ కుడు యిట్లా అన్నాడు. "ఆ వ్యక్తి ఎవరై ఉంటాడు; వీలైనంత బిగ్గరగా మేమంతా విద్యార్థులం అని వెల్లడిచేశాను. అతనిలో చలనంలేదు. మాలో కొంతమంది యువజన సమితిలో జేరిన వారే ననిగూడా తర్వాత సూచించాను. అతనిలో ఏవిధమైన కదలికా లేదు."

"బహుశః అతను యీలోకంలో ఉండిఉండడు. ఏదో మైకం కమ్మి ఉంటుంది. ఆ స్థితిలో మనం విద్యార్థులమయ్యేది,

యువజన సమితి సభ్యులమయ్యేదీ అతనికేం పడుతుంది" అని నేను అన్నాను.

యువజనసమితి నాయకుడు గొంతుతగ్గించి నావేపు తిరిగి గంభీరంగా యిట్లా అన్నాడు. "అసలువిషయం అదికాదు. మనవిప్లవంలో ప్రథమ ప్రముఖవిజయాన్ని మనంసాధించాము. విప్లవాన్ని ప్రతిఘటించేందుకు అనేక ప్రయత్నాలు జరుగుతూ ఉన్నాయి; శత్రువుల ఏజెంట్లు తమపథకాలను గురించి మూరు మూలల నక్కి చర్చలుసాగిస్తూ వున్నారు. అలాంటివారిని కనిపెట్టడానికి ఆ యాత్రస్థలాల్లో మన ఏజెంట్లనుకూడా నియమించాలి. కాని, మనం విద్యార్థులం అని చెప్పినా గుర్తించనట్లుగా నటించవలసిన అవసరం అతనికి ఏమీలేదు."

ఇదన్నమాట అసలుకారణం. యువజనసమితి నాయకునకు యిలాంటి విషయాలు బాగా తెలుసును. నేను ఏ షికారునకో పార్కుకు వెళ్ళేటప్పుడు కొందరువ్యక్తులు నన్ను నీడలాగా అనుసరించి రావటం నేను చాలాసార్లు గ్రహించాను. సాధారణంగా ఒంటరిగా ఆడపిల్ల వెడుతూవుంటే వెంటపడే పోకిరీ రకంగా భావించి వీళ్ళనుగురించి నేను అంత ఖాతరు చెయ్యలేదు. ఇలా 'ప్రజాసేవ' చేస్తున్న విచిత్రవ్యక్తులు ఎందరు ఉన్నారో? కొద్దిరోజులక్రితం, నేను కోల్‌హిల్‌కి వెళ్ళిననాటి సంఘటన జ్ఞాపకం వస్తోంది. రాజభవనాల సౌందర్యాన్ని

బారులుతీరిన దేవదారువృక్షాల అందాన్ని తిలకిస్తూ ఉన్నాను. ఇంతలో నల్లని దుస్తులు ధరించిన ఒకపోలీసు నావైపుకు రావటం గుర్తించాను, వచ్చి నన్ను నఖశిఖ పర్యంతం తేరపారచూశాడు. నాకు కాళ్ళు వణుకుపుట్టాయి. నెమ్మదిగా నడక ప్రారంభించాను. నాకు అర్థం అయింది. గుప్తంగా ఏ కైంబాంబునో తీసుకువచ్చి ఏమూలనో పాతిపెట్టడానికి తలపోస్తూన్న నేషనలిస్ట్ ఏజెంట్‌గా అతను నన్ను అనుమానించి ఉంటాడు.

# 8

## ఛత్రారామం

1949, 1950 సంవత్సరాలలో పైటాయొక్క పరిస్థితిని వర్ణించడానికి ప్రయత్నించాను. విమోచనానంతరం మా జీవితాలలో వచ్చిన మార్పులందు మాత్రమే దృష్టిని కేంద్రీకరించటంవల్ల, పరిస్థితులు దారుణంగా వున్నాయని చిత్రించే ప్రమాదం వున్నదని నాకు తెలుసును. సమిష్టిగా ఉద్యమం సాగిపోతూ ఉందంటే మా జీవితాలకి ఏ విధమైన విరామం లేదని అర్థంకాదు. నియమప్రకారం మాకు సెలవలు యిచ్చేవారు. ఈ సెలవలు 'నరాలకు ఉత్సాహాన్ని' యిచ్చే విటమినులవలె ఉపయోగపడేవి.

మే దినోత్సవంలో అనేక అధికార ఉత్సవాలు వరుసగా ఒకదాని తర్వాత ఒకటి ప్రారంభమయ్యేది. తర్వాత జూలై ఒకటి – 1921 లో స్థాపించబడిన చైనీస్ కమ్యూనిస్టు పార్టీ వార్షికోత్సవము. తర్వాత ఆగస్టు ఒకటవ తేదీ – ప్రజా విమోచన సైన్య జన్మదినోత్సవము. అక్టోబరు మొదటి తేదీ – జాతీయ ఉత్సవం: 1949 లో స్థాపితమైన ప్రజారిపబ్లిక్ వార్షికోత్సవం. 1949 డిసెంబరు 21–స్టాలిన్ డెబ్బై ఒకటవ పుట్టిన రోజు పండగ ప్రపంచమంతటా యీ పండగకు ఒక చరిత్రాత్మక ప్రాముఖ్యత ఉన్నట్లుగా మా వార్తాపత్రికలు ప్రకటించాయి. ఈ పండగను మేము రెండురోజులపాటు జరుపుకున్నాము. పార

శాలల బాలబాలికలూ, విశ్వవిద్యాలయ విద్యార్థులు, సామాన్య ప్రజలు సోవియట్ రాయబార కార్యాలయానికి ఊరేగింపుగా వెళ్ళి సభలలో పాల్గొన్నాము.

ప్రభుత్వ భవనాలనుంచి పెద్ద పెద్ద బానర్లు, షాపుల మీాద నివాస భవనాలమీాదా చిన్న జండాలు కనిపిస్తాయి. ఒకటి రెండు రోజులముందుగానే వార్తాపత్రికలలో ప్రచురించ బడిన నినాదాలను వల్లెవేస్తూ సమూహా సమావేశాల అనంతరం ప్రజలు పార్కులలో పచార్లు చేస్తూవుంటారు. ఇలాంటి సందర్భాలలో వీధులను భవనాలను చక్కగా అలంకరింప బడతాయి, బాణసంచా కాలుస్తారు. కొత్త రెడ్ స్క్వేర్ లో ఒక లక్షమంది పౌరులమధ్య భుజం భుజం రాసుకుంటూ, బాల్కనీలోనుంచి మాట్లాడే ఉపన్యాసకుల కంఠస్వరం లౌడ్ స్పీకర్లుద్వారా తనవద్దకు వస్తూవుండగా నిలబడి వినే రాజకీయాలంటే యిష్టంలేని సామాన్యవ్యక్తికూడా ఏదో విచిత్రమైన అనుభూతిని, దివ్యశక్తిని పొందినట్లుగా తలుస్తాడు. తన చుట్టూ వున్న ప్రజలతో తదాత్మ్యం చెందుతాడు.

విశాలమైన రెడ్ స్క్వేర్ ను ప్రజలతో నింపివేయడానికి ఎంతో కష్టపడి పనిచేయాలి. ఒక్కొక్క సమూహా సమావేశానికి సామాన్యప్రజల ప్రతి కుటుంబమూ ఒక్కొక్క ప్రతినిధిని పంపించాలి. ఒకరోజు ముందుగానే పోలీస్ వాళ్ళు యిళ్ళకు వెళ్ళి మీాటింగ్ కు హాజరయ్యేవారి పేర్లు వ్రాసుకుంటారు. కొన్ని గంటలకు పూర్వం ఊరేగింపు అజమాయిషీ నాయకులు పాల్గొనేవారి నందరినీ వరుసలలో నిలబెట్టి తమ జాబితాలోని పేర్లప్రకారం రోల్ కాల్ పిలుస్తారు. దీనినిబట్టి

వేస్తు యిచ్చినవారిలో ఎవరు హాజరు అయ్యేనదీ లేనిదీ తెలు స్తుంది. ఈ పద్ధతి పూర్వ ప్రభుత్వ కాలంలో కూడా ఉన్నదే. కాని ప్రస్తుతపద్ధతి ప్రకారం యిష్టంలేనివారు కూడా సమా వేశాలకి హాజరుకాక తప్పదు.

ఇలాంటి ఉత్సవ సమయాలలో తమ పూర్వ సంప్ర దాయాన్ని అనుసరించి పోలీసులు ప్రతిషాపుమీద ప్రతి ఇంటి మీద జాతీయపతాక ఎగిరేటట్లు జాగ్రత్తపడతారు. 'నీలాల నింగిలో శ్వేతసూర్యుడు చిహ్నంగల పూర్వపు జండాస్థానే ఒక మూలను అయిదు బంగారు నక్షత్రాలుగల ఎర్రజండా 1949 అక్టోబరు ఒకటవ తేదీన అధికార పూర్వకంగా అమలు లోనికి వచ్చింది. ఈ జండాలను పోలీసులు కారులనిండా వేసు కొని ఇంటింటికీ ఒక జండావంతున అమ్మివస్తారు. ఈ జండాలను కొందరు పోలీసులు అధిక ధరలకి అమ్మి లాభం జేబులో వేసు కుంటారని వాదు ఉన్నది. అసలు వెల అతి స్వల్పం అవటం వల్ల ఎంత ఎక్కువ ధరకు అమ్మినా వారికి లాభించేది ఉందని నా విశ్వాసం.

విద్యార్థులు ఊరేగింపులకు మీటింగులకు విధిగా హాజరై తీరాలనే నిర్బంధం ఏమీలేదు. అయితే కొద్దిమంది విద్యార్థులు మాత్రమే దూరదూరంగా ఉండేవారు. నగరంలో నివసించే యితర ప్రజలకన్నా మేము నియమబద్ధులమై ఉండే వాళ్ళము. మా ఉత్సాహాతిశయాలకు ఒక పరిమితి ఉన్నది. ప్రతి నిర్ణీత ఉత్సవానికీ కొద్దిరోజుల ముందునుంచే విద్యార్థి నాయకులు ఒక మీటింగ్ నుంచి మరొక మీటింగునకు మూగుతూ ఉండేవారు. కార్టూనులు గీయటం, నినాదాలు

వ్రాయటం, జట్లు తయారు చేయటం, యాంగ్ - కో నృత్యం అభ్యసించటం, పాడబోయే పాటలు రిహార్స్ చేసుకోవడం మొదలైన పనులను మాకు పంపకం చేశేవారు. సహాయం కోరినప్పుడు ఏ బాలికా తాను చేయనని నిరాకరించదు. స్త్రీల బృంద గాన దళంలో పాల్గొనవలసిందిగా 'అంతస్తు మేనేజర్' కోరినప్పుడు ఏదో కారణంచూపి నువ్వు తప్పించుకోనే ప్రయత్నం చేయవచ్చును. కాని మర్నాడే క్లాస్‌లీడర్ వచ్చి నీదగ్గర వాలతాడు. అతను తయారుచేస్తున్న యాంగ్ - కో నృత్యదళంలో ఇద్దరు బాలికలు తక్కువగా, ఉన్నారని నువ్వు సహాయం చేయకతప్పదని అంటాడు. అందువల్ల మొట్టమొదటి ఆహ్వానాన్ని నువ్వు అంగీకరించటం ఉచితం; లేకపోతే నీ సహాయాన్ని అర్థిస్తూ ఎవరో ఒకరు వెంటపడుతూనే వుంటారు. నీ పరిస్థితులను గురించి వీరికి నచ్చచెప్పాలని ప్రయత్నించటం చాలా ప్రయాసతో కూడినపని. ఊరేగింపులోని వివిధ దళాలను తయారు చేసేందుకు మొదట్లో అందరిమధ్య ఎంతో పోటీ వుంటుంది. విశ్వవిద్యాలయ అధికారులు ఒక్కొక్క విద్యార్థిదళానికి ఒక్కొక్క పనిని అప్పగిస్తారు. పోటీలతో వారు ఆ పని అతి సమర్థవంతంగా నిర్వహిస్తారు.

నగరంలో జరిగే సమూహా సమావేశాలలో మిగతా జనాభాతోగాకుండా విద్యార్థులకు ఉపన్యాస వేదికదాపునే జాగా యిస్తారు. ఈ సమూహా సమావేశాలలో విపరీతమైన కోలాహలం చేయవలసి వుంటుంది. ఈ విషయంలో పార్టీ సభ్యులను మినహాయిస్తే విద్యార్థులకు ఎవ్వరూ సాటిరాలేరు.

నిర్ణయప్రకారం మేము చేసే కరతాళధ్వనులు మిన్నుముట్ట వలసిందే. పార్టీ సభ్యులు జనంలో చెల్లాచెదురుగా కలిసిపోయి ఆ యా సమయాల్లో చప్పట్లు కొట్టించడానికి ప్రోత్సహిస్తూ వుంటారు. రెడ్ స్క్వేర్ నుంచి వెళ్ళేటప్పుడు వచ్చేటప్పుడు కూడా ప్రవర్తనలో మా విద్యార్థులకు మిగతా ప్రజలకు ఎంతో తేడా కన్పిస్తుంది. ప్రజలు బ్లాక్ నాయకుల హెచ్చరికలను వినిపించుకోకుండా అటూ యిటూ చెల్లాచెదరై పోయి యిష్టంవచ్చినట్లు నడక సాగిస్తారు. మేము వీరు సక్రమం తప్పకుండా బారులు తీర్చి నడుస్తూ నాయకుల ఆజ్ఞ ననుసరించి నినాదాలు చేస్తూ వుంటాం లేదా పాటలు పాడతాం, యాంగ్-కో నృత్యం చేస్తాం.

ఊరేగింపులో అత్యంత ఆసక్తిని కలిగించే అంశం యాంగ్-కో నృత్యమే. లయానుగుణ్యంగా ధ్వనించే గంటలు నాదం కర్ణానందంగా ఉంటుంది. ఈ లయను ఆధారంచేసుకుని విద్యార్థులు చిందులు వేస్తారు. ఈ నృత్యాన్ని ప్రతివారూ సులభంగా చెయ్యవచ్చును. అందంకోసం కొందరు పద్ధతిలో మార్పుచూపిస్తూ నృత్యంచేస్తారు.

విమోచనకు పూర్వం నృత్యంచేసేటప్పుడు మేము ఎప్పుడూ రంగురంగుల దుస్తులను ధరించేవాళ్ళము కాము. ముఖ్యమైన ఉత్సవసమయాలలోగూడా పురుషులు తమతలకి జేబురుమాలు చుట్టేవారు, పాశ్చాత్యపద్ధతి పాంట్లు లేదా యూనిఫారములు, బరువైన బూట్లను ధరించిన విద్యార్థులు ఢక్కీల చప్పుళ్ళకు అనుగుణ్యంగా ముందుకు వెనక్కు అడుగులు వేసేవారు. విమోచనానంతరం యాంగ్-కో ఒక అద్భుత

ప్రదర్శనంగా రూపొందింది. పురుషులు స్త్రీలూకూడా ఎరుపు, ఆకుపచ్చ, పసుపుపచ్చ నీలిరంగు తలపాగాలు, జాకెట్లు, పొడుగులాగులు, చేతుమాలాలు ధరిస్తున్నారు. స్త్రీలు ముఖానికి దట్టంగా పౌడరు, ముగ్గిన ఆపిల్ ఫలమువలె బుగ్గలకు ముదర ఎరుపురంగు, గులాబీపువ్వులవలె పెదవులకు గులాబి రంగు పులుముకుని, రంగస్థలంమీద ప్రవేశిస్తున్నట్లుగా తయారయ్యేవారు. రాత్రివేళ, కాగడాల దీపశిఖల చుట్టూ నాట్యం చేసే మాలో ఒక్కరుకూడా దక్షిణప్రాంతాలనుంచి వచ్చిన రైతు బాలికలను పోలి ఉండరు. మాతోపాటు పురుషులు ముఖాలకుకూడా రంగు పూసుకుని, కనుబొమలు దిద్దుకొని రకరకాల దుస్తులు పాదరక్షలు ధరించి నృత్యంలో పాల్గొంటారు.

ఆతర్వాత యాంగ్ - కో నృత్యంలో శ్రామికవర్గ సంప్రదాయం పాటించేటట్లు చేయటానికి ప్రయత్నం జరిగింది. బాలికలు ఫ్యాక్టరీస్త్రీలవలెను, పురుషులు పొలంలో పనిచేసే రైతులవలెను దుస్తులు ధరించవలెనని మాకు ఆదేశించారు. నృత్యం చేసేటప్పుడు సామాన్య కార్మికులనుపోలి ఉండటానికి మేము అట్టలతో సుత్తులు, కొడవళ్ళు మొదలైన పనిముట్లు తయారు చేశాము. సామాన్య కర్షక కార్మికులవలె దుస్తులను పరికరాలను ధరించి నృత్యం చేస్తూవుంటే ఎంతో ఉత్సాహంగా ఉన్న పూర్వపు రంగురంగుల దుస్తులు ఉంటేనే బాగుండునని మనస్సులో అనిపిస్తూ వుండేది. జనం మానృత్యాలను విడ్డూరంగా చూస్తూవుండేవారు.

నాట్లనృత్యంలో మేము కొన్ని మార్పులు చేర్పులు చేశాము. కమ్యూనిస్టులకు ఇది నచ్చలేదు. ఈవిషయమై విమ

ర్శిస్తూ ఒక అభ్యుదయ దినపత్రిక సంపాదకీయం వ్రాసింది. ఈ నృత్యాన్ని ప్రదర్శించేటప్పుడు చాలా భాగాలను వదిలివేయ వలసిందిగా మ్యునిసిపల్ కార్మికసంఘం తన అజమాయిషీలో నున్న పనివారలకు తాఖీదులు యిచ్చింది. పురుషులు స్త్రీల వలె దుస్తులు ధరించరాదనీ, ఎవరూగూడా ఎక్కువగా రంగులను వేసుకొనుట ఉపయోగించరాదనీ హుకూం జారీ అయింది. ఈవిషయాలను గురించి కూనాయకులు మమ్మల్ని హెచ్చరించారు. అప్పటినుండి మా నృత్య ప్రదర్శనాలలో ఎంతో మార్పు వచ్చింది.

పెకింగ్‌లో సాధారణంగా వర్షంపడదు. అయినప్పటికీ సమావేశాలను ఏర్పాటు చేసేవారు. వాతావరణంలో అనేక బాధలకు లోనుగావలసి వచ్చేది.

1949 ఫిబ్రవరిలో జరిగిన మొట్టమొదటి పెద్ద ఊరేగింపులో లిన్‌పో దళాలతోపాటు వెంట విపరీతమైన గాలి దుమారంలేచి అందరి కళ్ళలోనూ దుమ్మును జల్లింది. ఆ సంవత్సరం శరత్కాలంలోనూ వేసవిలోనూ మేము హాజరైన ప్రతి మీటింగూ వర్షమునకో లేక జల్లులకో లోనుగాక తప్పలేదు. అందమైన ప్రదర్శనకోసం చాలా రోజులుగా కృషి సల్పిన విద్యార్థులంతా జండాలవెనుక తడిసి ముద్దలౌతూ నిలబడి వుండేవారు. ఎంతో కష్టపడి రంగుకాగితాలు అంటించి తయారుచేసిన దీపాలు ఎందుకూ పనికిరాకుండా పోయేవి. పెద్ద పెద్ద అక్షరాలతో వ్రాసి తయారుచేసిన బానర్ల మీద జల్లు పడటం మొదలు పెట్టగానే, సిరాతడిసి కరిగి చారికలుకట్టి నానా అపభ్రంశంగా అలుక్కుపోయేది.

వర్షంలోనో లేక గాలి దుమారంలోనో చిక్కుకున్న మూఢవిశ్వాసాలు గల దుకాణదార్లు, పల్లెప్రజలు, దేవునికి ఆగ్రహం కలిగిందనో, నూతన ప్రభుత్వం అంటే దైవానికి కోపం వచ్చిందనో గుసగుసలాడుతూ ఉండిఉండవచ్చును. కాని మా విద్యార్థులు మాత్రం చలించకుండా నిలబడి వుండేవారు. కుండపోతగా వర్షం పడుతున్నా చెక్కు చెదరకుండా వరుస క్రమం తప్పకుండా పాటలు పాడుతూ సుశిక్షితులైన సోల్జర్లవలె నడిచి వెళ్ళేవాళ్ళము. ఒకసారి కుంభవృష్టిగా వర్షం పడుతోంది. మా ఎడమవైపునఉన్న విద్యార్థిదళం పెద్దగొంతు కతో యిట్లా కేకలు పెట్టడం ప్రారంభించింది. "విమోచన ప్రాంతాలలో వాతావరణం ఎంతో అనుకూలంగా ఉంది—ఇక ప్రజలా! వారెంత ఆనందంగా ఉన్నారు! ప్రజాప్రభుత్వం తన ప్రజలను ప్రేమిస్తుంది – కమ్యూనిస్టుపార్టీ ఆదరాభిమానాలు ఇంతని చెప్పడానికి వీలు లేదు." బాల్కనీలో నుంచి తొంగి చూస్తూ ఉన్న నాయకులకే గనక చెవులువుంటే యీమాట లలో ధ్వనించిన వ్యంగ్య ధోరణిని గ్రహించి ఉండేవారు.

రెడ్‌స్క్వేర్ మీద వర్షం వచ్చిపడిందో ఆరోజున మీటింగ్ నానా గందరగోళంగా ఉంటుందని వేరే చెప్పనవ సరం లేదు. ఒకానొక రోజున – ఎవరూ కూడా ఏ కాలో చెయ్యో విరగడమో లేక స్పృహతప్పడమో జరిగితే తప్ప మీటింగ్ నుంచి కదలడానికి వీలులేదు. నిబంధనను ఉల్లం ఘించడానికి ఎవరికీ ధైర్యంలేదు. చాలామంది ఒకేసారి తమ గొడుగులను తెరిచారు. బాల్కనీలో నుంచి చూచే నాయ

కులకు - రంగురంగుల గొడుగులతో విస్తరించిన దృశ్యాన్ని చూడడానికి మనోహరంగానే ఉంటుంది.

పైటానుంచి వచ్చే మాలోని చాలామంది విద్యార్థులం గొడుగులు వెంటబెట్టుకుని రావటానికి నిరాకరించే వాళ్ళం. ధారాపాతంగా వర్షంపడుతున్నా తలకు జాకెట్లన్నా కప్పుకునేవాళ్ళంకాదు. అందుకు బదులుగా ముఖాలను పైకి ఎత్తి, మా చుట్టుప్రక్కల ప్రజల గొడుగులనుండి జాలువారే మంచు నీటి ప్రవాహాలలో మా శరీరాలను తడవనిచ్చేవాళ్ళము. తడిసిన దుస్తులు మా వంటికి అంటుకుపోయేవి. బయటి వస్త్రాలను విప్పి ఆరవేసుకోవటం సభ్యతగల మేము చెయ్యవలసిన పని కాదు. కాని సాధారణంగా వర్షం ఆగింతోటేగాని ప్రారంభమయ్యేది. బాల్కనీలలో కూర్చున్న ప్రముఖుల ఉపన్యాసాలు పూర్తిఅయ్యేలోపున మా యూనిఫారాలు ఆరిపొయ్యేవి. ఇంకా ఎక్కడన్నా కాస్త తడిఉంటే, ఆ తర్వాత నినాదాలతో, పాటలతో, యాంగ్-కో నృత్యాలతో జరిగే ఊరేగింపుతో ఆరిపొయ్యేది.

ఆ తర్వాత ప్రక్కవీధులలో ప్రచారానికనో లేక నగర ప్రజలకు ప్రదర్శన లివ్వడానికనో మమ్మల్ని కామ్రేడ్స్ తీసుకుపోయేవాళ్ళు. ఉదయం ఎనిమిదిగంటలకు బయలుదేరినవాళ్ళం తిరిగి తిరిగి రాత్రి ఏ తొమ్మిది పదిగంటలకో హాస్టల్‌కి చేరుకునేవాళ్ళం. ఈ ఉత్సవాలు అయినరోజు రాత్రి కొయ్యదుంగల్లాగా పడుకునేవాళ్ళం. మర్నాడు ఉదయం నిద్రలేవగానే వళ్ళంతా నెప్పులు పోట్లతో మహాబాధగా వుండేది.

ఈఉత్సవాలనుంచి తప్పించుకోవడంకన్నా, వాటిల్లో పాల్గొనడమే మంచిది అని మేమంతా గ్రహించాము. వ్యక్తిత్వ వాదులు, సోమరులు, కొందరు విద్యార్థులు ఉత్సవ ఆహ్వానాలను తిరస్కరించి, సెలవదినాలను చదువులోనో లేక ఊరికే తిరగటంలోనో గడిపేవారు. ఇటువంటివారు విద్యార్థి జనాభాలో నూటికి పదివంతులకన్నా అధికంగా ఉండరు. వారు అలక్ష్యంగానో లేక వాదానికి దిగేవాళ్ళుగానో ఉంటారు. వారం వారం జరిగే విమర్శనా సమావేశాలలో మమ్మల్ని ముఖాముఖి కలుసుకొనడానికి సంకోచించరు.

ఒకసారి; చైనీస్ కమ్యూనిస్టుపార్టీ పుట్టినరోజు పండుగ సమావేశానికి మాసహపాటి బెట్టీ చాంగ్ హాజరుకాలేదు. ఈమె అందంగా గర్వంగా ఉంటుంది. పెద్ద తెలివితేటలు ఉన్న మనిషికాదు. తన పేరుకు ముందు పాశ్చాత్యపదం జోడించింది. చాంగ్ అనే పేరుకన్నా బెట్టీ అనే పేరే ఆమెకు యిష్టం. మాలో చాలామందికి ఆమె నచ్చేది. ఆమెను విమర్శించేవారు తమ పనికి ఉపక్రమించారు.

"ఉత్సవంలో పాల్గొనకపోవడంద్వారా మిస్ చాంగ్ తన బూర్జువా మనస్తత్వాన్ని ప్రదర్శించుకొన్నది..." అని విమర్శాప్రవాహం ప్రారంభమైనది.

ఆమె మాటకు అడ్డం వెళ్ళింది. ఉద్రేకంతో "ఉత్సవంలో పాల్గొనకుండా వుండటం నా వుద్దేశ్యం కాదు. అంతూ పొంతూ లేకుండా జరిగే ఈ సమావేశాల అంతరార్థం ఏమిటి? ఎండా వానా అనకుండా పదిగంటల పాటు నిలబడటం, ఊరేగటం, పాడటం, యిదేగా చేసేపని.

పని. ఆ మర్నాడు వాళ్ళంతా నెప్పులూ పోట్లూ, ఏపని చెయ్యడానికీ వీలుండదు. అసలు పనికి యిది అంతరాయం కలిగివుంది. కాలం వ్యర్థం చేయటం మినహా వీటివల్ల ప్రయోజనం ఏమీ లేదని నా వుద్దేశ్యం. బాలురతో ఎక్కువ సమయం గడిపే బెట్టీ యిట్లా అనగలగడం నిజంగా వింతే. ఆమె హాస్టల్‌ను విడిచిపెట్టకపోవడానికి మరేదైనా కారణమై యుండాలి గాని చదువుకోసం వుండటం మాత్రం నిజంగాదు. అయినా ఆమె చెప్పేదాంట్లో కొంత యధార్థం లేకపోలేదు.

"కాలం వ్యర్థం చేయడమా?" విమర్శనను ప్రారంభించిన విద్యార్థినాయకుని ముఖం కోపంతో ఎర్రబడింది. అంతలోనే వుద్దేశాన్ని తమాయించుకుని "కాని యీ మీటింగులకి విద్యాసంబంధమైన ప్రాముఖ్యం చాలా వుంది సుమీ" అన్నాడు.

"పదిగంటలు ఊరికే గుంపులో నిలబడి కాళ్ళుతొక్కుకోవడంకన్నా ఆ సమయాన్ని చదువుకోసం వినియోగించటం వల్ల ఎంతో లాభం వుంటుంది. "పదిగంటలసేపు బెట్టీ చదువుతుందనే విషయాన్ని మేము నమ్మం. అయినా ఆమెకు జవాబు ఏం లభిస్తుందోనని మేము ఎదురుచూశాము."

"నువ్వు అనుసరిస్తూఉన్న మార్గం సరియైనది కాదు." బెట్టి అదృష్టం చేసుకోబట్టి యువజన సమితి మనిషి తన కోపాన్ని అదుపులో పెట్టుకోనగల్గాడు. "ప్రతి సమావేశంలోనూ ఒక ప్రత్యేక ప్రాముఖ్యం ఉన్నదని మా అందరికీ తెలుసును. ఈ విషయాన్ని నువ్వు తెలుసుకోనక తప్పదు. ఏ సందర్భంలో జరిగినా సమావేశాలు, ప్రజల అఖండతకి

ఉద్దీపనను, పటిష్ఠతను వెల్లడిస్తాయి. సమావేశాలకు హాజరు కాకపోవటంవల్ల, ప్రజాశక్తిని నువ్వు నీ హృదయంలో గౌరవించటం లేదనీ పైగా తూష్ణీభావంతో చూస్తున్నావనీ వ్యక్తం అవుతుంది! మిస్ చాంగ్, నువ్వు ఒక్కసారి ఆత్మపరీక్ష చేసుకో. నీ ఆలోచనలను సరిదిద్దుకో! అప్పుడు నిన్ను నువ్వు సరిగ్గా విమర్శించుకో గల్గుతావు."

ప్రజాశక్తిని గేలిచేయడానికి వీలులేదు. అదంటే తనకి గౌరవం లేదని బెట్టి అనకూడదు. ఆమె ఉచ్చుల్లో ఉన్నా తప్పించుకొని బయటపడే అవకాశం ఆమె జారవిడుచుకుంది. "ఏది ఏమైనా అంతంత కాలాన్ని వ్యర్థం చేయటం అనవసరం. మీరు ఆలోచించండి. ప్రతిసారీ యిన్ని వేలమందీ హాజరు కావాలి. వీరందరికీ ఆరోజంతా వృథాయే. ఇలా వ్యర్థం చేసే సమయంతో మహత్తరమైన పనులను సాధించవచ్చును."

మా కమ్యూనిస్టు లీడరు యింతవరకూ చర్చజోలికి రాలేదు. ఇప్పుడు జోరబడ్డాడు. "సమూహా సమావేశాలలో మనం ఎందుకు పాల్గొనాలో నేను వివరిస్తాను. ఇంతకుముందు యువజనసమితి సభ్యుడు వెల్లడించినట్లు ప్రతి మీటింగ్ కీ ఒక ప్రత్యేక ప్రాముఖ్యత ఉన్నది. ఆ మీటింగ్ ను బలపరస్తూ ఉన్నట్లు ప్రజలను నమ్మించడానికిగాను నువ్వు తప్పక పాల్గోవాలి. ఇక రెండవవిషయం: ప్రతి సమావేశంలోనూ మనకు అనేకసంగతులు తెలుస్తాయి. ఉపన్యాసకులందరూ ప్రజానాయకులే గదా. వారికిగల రాజకీయ పరిజ్ఞానం అనుభవం అపారం. అటువంటివారినుండి అనేకవిషయాలు తెలుసుకోగలగడం నిజంగా మన అదృష్టమే. మనం విశ్వవిద్యాలయంలో నేర్చు

కునేదానికన్నా అధికంగా యీ సమావేశాలలో నేర్చు కుంటాము.

ఇక మూడవసంగతి: మన నూతనసమాజం ఏదిక్కుగా పురోగమిస్తున్నదో మనం అర్థంచేసుకోవాలి. సమాజగమనం సమిష్టి వ్యవస్థ వైపు మొగ్గుతున్నది. సమిష్టి ఉత్పత్తి, సమిష్టి జ్ఞానోపార్జన, సమిష్టి జీవితం – యివి మన ధ్యేయాలు. వేల కొలది ప్రజలు సమావేశమైన మీటింగులో నువ్వు పాల్గొనడంద్వారా సమిష్టి జీవన వ్యవస్థకై మేము చేస్తూ ఉన్న కృషికి దోహదమివ్వడ మౌతుంది. ఒకరితో ఒకరు కలిసి నిల వడంద్వారా ప్రజలసమిష్టి శక్తినీ, ప్రభావాన్నీ మనం గుర్తించ గలం. మిన్ చాంగ్ – ఇప్పుడు నీ అభిప్రాయం ఏమిటి?

ఏవో శక్తులు బెట్టీని మాట్లాడకుండా చేసినవి. జవాబు కోసం కమ్యూనిస్టులు చాలా ఓపికతో ఎదురుచూశారు. ఈ ప్రతిష్టంభనను తొలగించడానికి అభ్యుదయవాది సుమెహ్ ముందుకు వచ్చాడు "శక్తివంతమైన టియెన్ యాన్ గేట్ క్రింద, ఛైర్మన్ మావ్ సముఖంలో – వేలాది మనప్రజలు గుమికూడుతారు. పెకింగ్ పౌరులు – ప్రతిసందునుంచీ ప్రతి వీధి నుంచీ, ప్రతి ఇంటినుంచీ, ప్రతి పాఠశాలనుంచీ వచ్చి చేరు తారు. ఇళ్ళమీద, గోడలమీదా, జనసందోహంమీదా ఎర్రజెండాలు ఎగురుతూఉంటాయి. మన పాటలకి తప్పెట్లు తాళాలు అమరుతాయి. ఎల్లెడలా నవ్వులు ప్రతిధ్వనిస్తాయి. ప్రతివారి పెదవులపైనా మన నాయకుల పొగడ్తలు నాట్య మాడతాయి" ఆశుకవిత్వ పద్ధతిలో యీ విధంగా ధోరణి దొర్లుకుపోతోంది.

"ఆ అద్భుత దృశ్యాన్ని కనులార గాంచడానికి మనం వెళ్ళాలనుకుంటాము. మనం ఆశించదగిన ప్రతిఫలం వేరే ఏమున్నది. జనసందోహ సంభరితమైన ఆ దృశ్యాన్ని జూస్తూ ఉంటే నీ గుండెలు వేగంగా కొట్టుకోవా? కామ్రేడ్స్, శాస్త్ర విచక్షణా జ్ఞానంగల స్త్రీగాని పురుషుడు గాని సమూహ సమావేశాన్ని పరికించినప్పుడు, కమ్యూనిస్టుపార్టీ ఉత్తమాటల తోనూ, హామీలతోనూ పదవి నలంకరించలేదని గ్రహించి తీరతారు." సుయెహీం ఉపన్యాసం కాగానే అభ్యుదయవాదులు చిరునవ్వులతో కరతాళ ధ్వనులు చేశారు. పార్టీ మనుష్యులు సంతోషంగానూ, గర్వంగానూ కనిపించారు.

పార్టీ మనుష్యులు, అభ్యుదయ వాది చెప్పినవాటిలో చాలావరకూ నిజమే. మాలో కొందరికి అనుమానాలు అప్పుడప్పుడు తలఎత్తినా సమావేశాలకి హాజరవటంలో అవి మటుమాయమయ్యేవి. ఆ జన సందోహ గందరగోళంలో మా అనుమానాలను త్రోసివేసి వ్యక్తిగతమైన కష్టాలను మరచిపోయి నూతన జీవిత విధానంవైపు అడుగులు జాచేవాళ్ళం. ఎర్ర జండాలు ఎగురుతూవుండగా, ఆ యా ప్రకారం తప్పెట్లు, తాళాలు మ్రోగుతూ వుండగా, పాటలు వినిపిస్తూఉండగా—అనుమానంతో అలమటిస్తున్నవారు కూడా నూతనశక్తిని నమ్మకతప్పదు. నాయకులవైపుకు ముఖాలు త్రిప్పి బారులుగా నిలబడివున్న మా విద్యార్థులకు, గాలిదుమారాలు వస్తున్నా వర్షం ధారాపాతంగా పడుతున్నా పడే బాధలో ఏదో అసాధారణ ఆనందాన్ని మేము చవిచూచే వాళ్ళం.

# 9

## స్వేదము, ప్రార్థన

నిజం చెప్పవలసివస్తే పైటో వ్యాయామ క్రీడల విషయాలో ఎల్లప్పుడూ వెనుకపడే ఉన్నది. దానినిగురించి మేము అంతగా పట్టించుకోలేదు. పైటో ప్రాముఖ్యత మానసిక సంబంధమైన విషయములకేగాని శారీరక సంబంధమైన విషయములకు గాదు. వేర్వేరు విదేశీ మత ప్రభావములు విశ్వవిద్యాలయ ఆవరణలోకి ప్రవేశించకుండా ఆకట్టినట్లుగానే విదేశీ ఆటలనుగూడా దూరంగానే ఉంచుటకు మేము ప్రయత్నించాము.

జపాన్ మీాద విజయం సాధించిన అనంతరం పాశ్చాత్య పద్ధతి వ్యాయామ విద్యాపద్ధతులవైపు పైటో మ్రొగ్గింది. మొదట్లో కళాశాల ప్రారంభ తరగతులలో చదువుతున్న విద్యార్థులు వారానికి రెండుగంటలు వ్యాయామమునకు వినియోగించవలసిందిగా హెచ్చరించబడ్డారు. మరుసటి సంవత్సరం క్రీడలలో తమకుగల ఆసక్తిని చూపుటకుగాను పాఠశాల పాలకులు, పై తరగతులలో ఉన్న విద్యార్థులంతా శరీరవ్యాయామ శిక్షణ పొందవలసిందని సూచించారు. పాత విద్యార్థులకు యీా నిర్బంధం లేదు.

ప్రారంభకులకు, పై తరగతులవారికి యిచ్చే శరీర వ్యాయామ శిక్షణాపద్ధతులు చూడ ముచ్చటగా ఉంటాయి.

మొదటి సమావేశంలో అధ్యాపకులు తమ యీలలు ఊది విద్యార్థులను ఒకచోట పోగుచేస్తారు. ఆ తర్వాత, విశ్వ విద్యాలయ నిబంధనలను అనుసరించి ఏవిద్యార్థికూడా వ్యాయామ తరగతులు మూడింట ఒక వంతుకన్నా అధికంగా గైరుహాజరు అవకూడదని ఉపన్యాసం ప్రారంభిస్తాడు. "ఎవరికన్నా రావడానికి యిష్టంలేకపోవచ్చును. అయితే అటువంటివారు తాము ఎన్నిసార్లు తరగతులు ఎగవేస్తున్నదీ గుర్తు ఉంచుకోవాలి. ఈ ఎగవేత, మూడవవంతుకన్నా అధికమైతే అధ్యాపకుడు చిక్కుల పడవలసివస్తుంది..." ఈ వార్త విన్నవారికి విపరీతమైన అసంతృప్తి కలిగింది. వారు యిందుకు ప్రతిఘటిస్తూ కేకలు వేయటం ప్రారంభించారు. అసంతృప్తి కారణంగా చెలరేగిన గందరగోళం సద్దు మణిగేదాకా అధ్యాపకుడు ఓపికపట్టి «కొద్దిరోజులు అటూ యిటూ అయినా ఏం పెద్ద ప్రమాదంలేదు" అని గొణిగాడు. ఏదో ఫీట్లు చేయటమే తప్ప అధ్యాపకునిలో నిజమైన సంస్కృతి అనేది ఏకోశానా లేదని విద్యార్థులకు తోచింది.

ఈ విధంగా చెప్పటంవల్ల, వ్యాయామ శిక్షణను ఒక భరింపరాని శిక్షగా మేము భావిస్తున్నామని మీరు తలంచరాదు. ఈ శిక్షణ అంత శ్రమను కలిగించేది ఏమీకాదు. బారులుతీరి నిలబడిన విద్యార్థులను హాజరుపిల్చిన తరువాత బాస్కెట్‌బాల్, వాలీబాల్, సాక్కర్, బేస్‌బాల్ మొదలైన ఆటలు ఆడుకునేందుకు వదిలివేసేవారు. బంతిఆట ఆడి ఒళ్లు అలిసేటట్లు చేసుకోవడానికి యిష్టంలేకపోతే మైదానం చివర ఏ మిత్రులతోనో చేరి నవ్వు కబుర్లు చెప్పుకోవచ్చును. అయి

ష్టంతో నీవైపు తేరిపారచూడటం మాత్రమే అధ్యాపకుడు చేయగలిగిన పని.

కాని టరం పూర్తికాగానే యీ శిక్షణలో పరీక్ష ఉంటుంది. విద్యార్థులలో వేగాన్ని శక్తిసామర్థ్యాన్ని గుర్తించేందుకు మూడు ప్రత్యేక పరీక్షలు ఉంటాయి. మొదటిది బేస్‌బాల్‌ను విసరటం. ఒక గోడమీద పదకొండు అడుగుల కైవారంలో ఒక లక్ష్యాన్ని గీస్తారు. ప్రతి పోటీదారుడూ షుమారు నలభై ఏభై అడుగుల దూరంనుంచి బేస్‌బాల్‌తో ఈ లక్ష్యాన్ని కొట్టాలి. ప్రతి విద్యార్థి అయిదుసారులు ప్రయత్నించవచ్చును. చాలమంది విద్యార్థులు ప్రతిసారీ లక్ష్యాన్ని సాధించలేకపోయేవారు.

ఇక రెండవది: బాస్కెట్ షూటింగ్. ఏ విద్యార్థి కూడా నిర్ణీతసమయంలో పరుగులు సాధించలేకపోయేవాడు.

మూడవది: వందమీటర్ల పరుగు. మొత్తం కార్యక్రమంలో ఆసక్తిని కలిగించే అంశము యిదే.

ఉన్నత ప్రభుత్వోద్యోగముల కొరకు జాతీయ పరీక్షలద్వారా పైటా విద్యార్థులు ఎంచుకోబడేవారు. మా తరం విద్యార్థులు, ఆ పురాతన సంస్కృతీ సంప్రదాయమునకే కట్టుబడినవారు. వారు పిల్లలవలె పరుగులు పెట్టటం తమ విద్యాధికతకు చిన్నతనంగా భావించేవారు.

కొందరు విద్యార్థులకు ఆటలంటే ఆసక్తిలేకపోలేదు. తమ ఆధిక్యతను గురించి లెక్క చేసేవారుకాదు. అవకాశం చిక్కినప్పుడల్లా పీకు బాస్కెట్‌బాల్, వాలీబాల్ ఆడుతూ వుండేవారు. అయితే నిత్య వ్యాయామంద్వారా లాభం పొంద

గలిగే విద్యార్థులు చాలాస్వల్ప సంఖ్యలో ఉంటారు. ప్రారంభ కులు, పై తరగతులవారు యావన్మందీ శరీర వ్యాయామ తర గతులలో చేరినమాట యదార్థం కాదు. విశ్వ విద్యాలయ వైద్యుడు ఫలానా ఫలానా విద్యార్థి శరీర శ్రమకు ఓర్చుకో లేడని, అడగని వాడిది పాపంగా సర్టిఫికేట్లు దానం చేసేవాడు. ఆ విద్యార్థుల జోలికి ఎవ్వరూ పోయేవారుకారు.

'పాశ్చాత్య రాక్షసులు' దిగుమతిచేసిన ఆటలలో నీకు ఆసక్తి లేకపోతే చైనీస్ బాక్సింగ్ సెక్షన్‌లో నువ్వు చేర వచ్చును. దీనిని బోధించడానికి విశ్వవిద్యాలయం కొందరు ప్రవీణులను నియమించింది. గుంపులు గుంపులుగా చేరిన విద్యా ర్థులు యీ కళలో ప్రవీణుడివద్ద శిక్షణ పొందుతూ ఉండటం అప్పుడప్పుడు నీకు కనిపిస్తూ ఉంటుంది.

పైటాలో అనేక క్రీడాసంఘాలు ఉన్నాయి. వాలీబాల్ బాస్‌కెట్‌బాల్ పోటీ ఆటలకు యితర పాఠశాలల విద్యార్థు లను పిలిచేవారు. టిటాన్ వ్యాయామ సంఘం, నార్త్ స్టార్ వ్యాయామ సంఘం ముఖ్యమైనవి.

విమోచనతో పాటుగా, మా జీవితాలలో ఆరోగ్య ప్రదమైన శరీర వ్యాయామము ఒక ముఖ్య భాగమైనది. శరీర సౌష్ఠవాన్ని యినుమడింపచేయడానికి యిదివరలో తలంచ డానికి గూడా వీలులేని సమూహ వ్యాయామ పద్ధతి ప్రవేశ పెట్టారు. సామాన్య ప్రజలవలె మాలాంటి జవసత్వములు గలవారు చెమట ఓడ్చటం మంచి దేగదా!

పరిస్థితులు యింకా ఒక మార్గాన పథకపూర్వం ఒక నూతన వ్యాయామ పద్ధతి విశేష ప్రచారంలోనికి వచ్చింది.

ఇది డ్రమ్ డాన్స్. యంగ్-కో నృత్యానికీ నాట్య నృత్యానికీ దీనితో పోలికలేదు. డ్రమ్ డాన్సులో విద్యార్థులు, విద్యార్థినులు పొట్టి దుస్తులను ధరించి రెండు వరుసలలో నిలబడతారు. ఎర్రరంగు డ్రమ్ములు నడుములకు బిగించి ఉంటాయి. శరీర వ్యాయామ అధ్యాపకులు ఆదేశానుసారం, డ్రమ్ములమీద పుల్లలతో వాయిస్తూ, లయకు అనుగుణ్యంగా ముందు వెనుకలకు నడక సాగించాలి. చాలామంది విద్యార్థులకు ఒక సంవత్సర శిక్షణలో తెలిసేది సామాన్యమైన లయమాత్రమే; థంప్, థంప్, థంప్, థంప్, థంప్! లేకపోతే థంపెటీ థంపెటీ, థంప్! ఈ వ్యాయామంలో చేతులకూ కాళ్ళకూ మంచి పని తగులుతుంది. ఈ వ్యాయామాన్ని గురించి మాట్లాడుతూ మా నాయకులలో ఒకరు యిట్లా అన్నారు "లయ అనేది సమూహమునకు సంబంధించినది. ఒకరితో ఒకరు కలియునట్లు బంధించి ఉండే సిమెంట్ లాంటిది."

ఆ తర్వాత, విద్యార్థులు తమ శరీర సౌష్టవాన్ని బలాన్ని పెంపొందించుకుని, ప్రభుత్వంలో పదవులు స్వీకరించేందుకు వీలుగా శరీర వ్యాయామ శిక్షణను పొందితీరాలని అన్ని విద్యాలయాలకు హెచ్చరికలు చేయబడినవి. ప్రతి పాఠశాలలోనూ డ్రిల్లు తరగతులు ప్రారంభం అయినవి. కాని యీ డ్రిల్లుకోసం నిర్ణయించిన టైము మాలో చాలా మందికి చికాకు కల్గినది. ఉదయం 7 గంటలకల్లా అందరూ డ్రిల్లుకు హాజరు కావాలి. ఆ సమయానికె నిద్రలేవటం చాలామందికి అలవాటు ఉండదు. డ్రిల్లుకోసం ప్రొద్దున్నే నిద్రలేవటం వెంటనే

చెమట శరీరాలతో తరగతులకు వెళ్ళటం చాలా చీదరగా ఉండేది.

నాయకుల ఆదేశానుసారం చేతులు ఊపటం, పైకి ఎత్తటం, శరీరాన్ని ముందుకు ప్రక్కలకు వంచటం - దీనిని 'సోవియట్ పద్ధతి శరీర వ్యాయామం'గా వర్ణించారు. శరీరాన్ని వంపులు తిప్పే మా వ్యాయామ పద్ధతులు యితర సైన్యాల వ్యాయామవిధానాలతో పోలిక కల్గిఉన్నాయి. ఈ వ్యాయామ విధానంలో సోవియట్ శాస్త్రజ్ఞులు అనేక అభ్యుదయకరమైన నూతన కదలికలను చేర్చారనీ, యీ మార్పు చేర్పులే రెడ్ ఆర్మీ అతి పటిష్టంగా తయారవడానికి కారణ భూతమైనదని మాకు వెల్లడించారు.

మాధ్యమిక పాఠశాలలయందు శరీర వ్యాయామ శిక్షణావస్థలో మార్పుచేశారు. పట్టభద్రులు మిలిటరీలో చేర వలసివస్తే తగిన శరీరదారుఢ్యం యీ శిక్షణద్వారా పొంద గలిగిఉంటారని భావన. యుద్ధానంతరం బేస్ బాల్ విశేష ప్రచారంలో ఉన్నది. కాని అధికారులు దీనిని 'అమెరికన్ ఆట' అనటంచేత కొంతకాలం మూలపడింది. కాని యీ ఆటలో కొంత 'మిలిటరీ విలువ' ఉన్నదని అధికారులు కనిపెట్టడంతో మళ్ళీ యిది బయటకు వచ్చింది. పూర్వపు మెత్తటి బంతికి బదులుగా క్రూడ్ గ్రెనేడ్ వలె మిస్సిలి ఆకారంలో బేస్ బాల్ రూపొందింది. శ్రమను ఓర్చటానికి పరుగు, శరీరదారుఢ్యతకు- బ్రాడ్ జంప్, లాంగ్ జంప్ అమలులోకి వచ్చాయి. ముందు ముందు మిలిటరీ శిక్షణకు వీలుగా తాడుపట్టుకు ఎగబ్రాకడం, నిచ్చెన నెక్కడంలో పరీక్షలు పెట్టారు. శ్రమతోకూడిన యీ

కసరత్తులన్నీ పురుషులకు మాత్రమే. బాలికలు డ్రమ్‌డాన్స్ మొదలైనవాటిలో పాల్గొనేవారు. మిలిటరీ డ్రిల్లులలో పాల్గొనవలసిన అవసరంలేదు. కాని పైటాలోని మేము మాత్రము ఊరేగింపులకోసం మార్చింగ్ ప్రాక్టీసుచేసేవాళ్ళము.

సైన్యంలో అనేక అద్భుతక్రీడలు సాధనచేస్తూ ఉంటారని మేము విన్నాము. మోటారుసైకిలు పరుగు, తుపాకులు కాల్చి పరుగెత్తటం, ఎత్తైన వేదికలపైనుంచి దూకడం, విమానాలనుంచి పారాచూట్లతో బయటికి గెంతటం, హాంగ్‌కోవాసియైన మిత్రుడొకడు వాళ్ళ ఊళ్ళో జరిగిన క్రీడా ప్రదర్శనలను గురించి చెప్పాడు. బ్రహ్మాండమైన బైసికిల్ దళంలో పోస్ట్‌మన్ పాల్గొన్నారు. హాండిల్ బార్‌నుంచి జండాలు ఎగురుతూవుండగా ఒకరిచేతులు ఒకరు పుచ్చుకుని వలయాలుచుట్టి చివరకు 'చైనీస్ కమ్యూనిస్టుపార్టీ జిందాబాద్' అనే అక్షరాకృతి చెందారు.

శరీర వ్యాయామమువలె పైటా విద్యార్థుల జీవిత విధానంలో మతమునకు అంతగా ప్రాధాన్యం ఉండేదికాదు. ఎవరో కొంతమంది మాత్రమే మతాన్ని పట్టుకు ప్రాకులాడుతు ఉండేవారు. రాజకీయ సమస్యలతో మునిగితేలుతూ ఉండే విద్యార్థులు, మతంలో నమ్మకంగలవాళ్ళు పిరికిపందలుగానూ అసమర్థులుగానూ తెగనాడుతూ ఉండేవారు.

పాఠశాలలలో రకరకాల మతాలవాళ్ళు ఉండేవారు. మాలో చాలామంది మత సహనంగలవాళ్ళే. తెలివితేటల్లో మాకు వాళ్ళకన్నా ఆధిక్యం ఉన్నదని టవోయిజంలో మూఢ నమ్మకమున్నవారు చదువుసంధ్యలురాని రైతులకన్నా కనాకష్టమని మా విశ్వాసం. విద్యార్థులలో చాలామందికి బౌద్ధ

మతంలో విశ్వాసం ఉన్నది. వాళ్ళనుచూస్తే మాకు నవ్వు వచ్చేది.

మా మధ్య చెల్లా చెదరులుగా ముస్లిములున్నారు. వాళ్ళవంటలు వాళ్ళు వొండుకొని ఎవరికంటా పడకుండా చాటుగా తినేవాళ్ళు. సిలవల్లో మేము రకరకాల వంటకాలను ఆరగించేవాళ్ళం. మా ముస్లిం మిత్రులు ఆ వంటకాలవైపు చూడనైనా చూచేవాళ్ళు కారు. మహమ్మద్ అనుచరులకు వారి స్వంత సిద్ధాంతాలూ, పద్ధతులు ఉంటాయని నేను విన్నాను. మతసంబంధమైన కార్య కలాపములకు గాని, యితరులను తమవైపునకు త్రిప్పుకొనేందుకు గాని వారు ఏ ప్రయత్నమూ చేసినట్టు కనపడేదికాదు. వారి మతాన్ని గురించి తెలుసుకోవాలని ఆసక్తిగలిగిన విద్యార్థులకి కూడా వారు ఏమీ చెప్పేవారుకారు. మహమ్మద్ సూక్తులను తూచ తప్పకుండా మీరు ఎందుకు పాటిస్తారని నొక్కి అడిగితే వారు చెప్పే సమాధానం ఒక్కటే – "మా పూర్వీకులు ముస్లిములు. అనేక శతాబ్దాలుగా ఆ మతంలో మాకు నమ్మకం ఉన్నది."

క్రిష్టియన్ మత వర్గాలలో ఒకటైన కాథలిక్కులు కూడా యిదేవిధంగా సమాధానం చెప్పేవారు. మత విశ్వాసం ఒక తరంనుండి మరో తరానికి సంక్రమిస్తూ ఉంటుంది. మనం వేసేప్రశ్నలకు జవాబులు ఎప్పుడూ సిద్ధంగానేవుంటాయి. ప్రతి ఆదివారం ఉదయం వారు మిగతా పనులనన్నింటినీ కట్టి పెట్టి చర్చికి వెడతారు. వారు భక్తి ప్రపత్తులు గలవారు. చాలామందికి మతం వారిఆత్మలలో కేంద్రీకృతమై ఉంటుంది.

కళాశాల ఆవరణ కార్యకలాపాలలో ప్రొటెస్టెంట్స్ చాలా చురుకుగా కనిపిస్తారు. కాని సంఖ్య చాలా స్వల్పమై నందువల్ల వారి ప్రభావం మామీద అంతగా పడటానికి అవకాశం లేదు. వారికి కొంతమంది అనుచరులు ఉండేవారు. క్రిస్టియన్‌లు కాని వారిలో వీరు ఎక్కువ సంచలనం కలిగించలేక పోయారు. క్రిష్టియనులు 'వ్యక్తిత్వవాదులు'. అందువల్లనే లోతుగా తమ ఆత్మలలో పెంచేసుకున్న ఆవేశాలను వారు పైకి ప్రదర్శించలేకపోయేవారని నా తలంపు.

ఇదే, పైటాలో మతానికి ఉన్న గౌరవ ప్రతిపత్తులు. కాని మిగతా పాఠశాలల్లో పరిస్థితి వేరేవిధంగా ఉన్నది. విదేశీ మిషనరీల ప్రభావానికి లోబడి ఆ యా విశ్వవిద్యాలయాలు పనిచేస్తూ ఉన్నాయి. మత సంబంధమైన విషయాలే గాకుండా, బోధనా క్రమంగూడా అందుకు అనుగుణ్యంగానే ఉండేది. ప్రీస్టులు, క్లెర్జిమెన్ అధ్యాపకులుగా పనిచేస్తూ ఉండేవారు. మతంతో ముడిపెట్టిన బోధనా పద్ధతి పనికిరాదని విమర్శించే విద్యార్థులను శిక్షించకపోయినా వారిని తమ మార్గంలోనికి మరల్చాలనే ప్రయత్నాన్ని మాత్రం మత బోధకులు మానుకోలేదు. క్రమశః కొందరు మతంలోకి మారి బాప్టిజాన్ని అంగీకరించారు.విద్యార్థులు విరామసమయాన్ని మత కార్యకలాపాలతో నింపివేయడానికి అధికంగా కృషి జరగకపోయినా ఆవరణలోని వాతావరణం అంతా మత చిహ్నాలతో నిండి ఉన్నట్లు ఆగంతకులు గుర్తిస్తారు - వెయిటింగ్ హాలులో గోడకు జీసెస్ చిత్రము లేక మతపరమైన చిహ్నం వ్రేలాడుతూ ఉంటుంది. కాథలిక్ పాఠశాలలో గోడలకు

శిలువ లేక క్రీస్తు మాతృమూర్తి చిత్రాలు వేలాడుతూ ఉంటాయి. ఫూజెన్ విశ్వవిద్యాలయంలో మా మిత్రురాలు నివసిస్తూ ఉండే అంతస్తు నౌకరు అతి నమ్రత, సౌమ్యత విధేయత గలవాడు. మెడలోని శిలువ ఊగులాడుతూ ఉండగా నేలను ఊడుస్తూ, బాప్టిజానికి పూర్వం తాను ఎంతబాధ పడింది, ఇప్పుడు క్రిస్టియన్ దైవము తనని ఏవిధంగా రక్షించి కాపాడుతున్నదీ అతను వివరిస్తాడు. ఈ పాఠశాలలో క్రిస్‌మస్ ఈస్టర్ పడుంగలు భారీఎత్తున జరుగుతాయి. మా మిత్రులు నమ్మే దానియందు మాకు నమ్మకంలేదు. కాని ఎవరి మత విశ్వాసాలు వారు కలిగి ఉండవచ్చుననీ, మత సంబంధమైన ఉత్సవాలలో ఆనందానుభూతిని చవిచూడవచ్చుననీ మేము తలంచాము.

విమోచనతో పాటుగా చాలామంది క్రిస్టిమన్ మిత్రులు మావలెనే తమ నూతన రాజకీయ దృక్పథాన్ని ప్రదర్శించాలని చాలా ఆరాటం చెందారు. మావ్ సే-టుంగ్ వారి సార్వజనీన కార్యక్రమంలోని మత స్వాతంత్ర్య అంశానికి వారు హర్షామోదములు ప్రకటించారు. వీరిలో కొందరు ఛైర్ మన్ మావ్ రచించిన "నూతన ప్రజాస్వామ్యం" చదివారు. అందులో ఒక భాగమునందు యిట్లా ఉల్లేఖించబడింది. "కమ్యూనిస్టు ప్రజాశక్తి సంతటినీ రాజకీయంగా కేంద్రీకరింప చేయడానికి అన్నిమతాలవారినిగూడా కూడదీసుకోవాలి, కాని వారి మత సిద్ధాంతాలను, నమ్మకాలను మనం ఆమోదించాము." నూతన ప్రభుత్వం ఎంతో హామీ నివ్వడంవల్లా అభ్యుదయవాదులైన ప్రముఖ చర్చి నాయకులు నూతన

ప్రభుత్వ ఆగమనాన్ని ఎన్నో విధాల పొగడటం వల్లా తమ తమ విశ్వాసాలకు సుస్థిరత్వం చేకూరిందని చాలమంది తలపోశారు. అందువల్ల, మా నూతన నాయకుల పట్ల తమ గౌరవాన్ని ప్రదర్శించేందుకు, సమూహా సమావేశాలకు ఊరేగింపులకు వారు హాజరయ్యేవారు. ఆదివారంనాడు చెర్చికి వెళ్ళిపోయేవారు.

ఆరునెలలపాటు ఏవిధమైన అవరోధమూ లేకుండా వారు మనుగడ సాగించారు. ఆ తర్వాత తమ మత విశ్వాసాలను వారు సంరక్షించుకోవలసిన అవసరం ఏర్పడింది. పైలాలో మత సమస్యను గురించి చర్చించేందుకు ఒకజడ్జి ఏర్పాటయింది. ఈ గోష్టిలో ప్రప్రథమంగా 'మతం' మీద దాడి ప్రారంభమయింది.

"మతం అనేది ప్రజలపాలిట నల్లమందు లాంటిది. ఈ మత్తుమందును సేవించే పెట్టుబడిదారీ బానిసలు తమ మానవత్వాన్ని సభ్యతనూ కోల్పోతున్నారు" అనే లెనిన్ వాక్యాలు పైకి వచ్చాయి.

ఆ తర్వాత, సమావేశమైన పార్టీ కామ్రేడ్స్ తమ తీర్పును యిచ్చారు. "మతం అశాస్త్రీయమైనది. మూఢ నమ్మకాలకు, పిరికితనానికి సోమరిపోతు తనానికి ఆలవాలమైనది. ప్రజలపాలిట మత్తుమందు."

రెండవగోష్టి సమావేశంలో సోవియట్ యూనియన్ నందు మత సంబంధమైన కార్యకలాపాలపట్ల ఎట్లా సహానం చూపబడుతున్నదో ఒక విద్యార్థి విశదీకరించాడు.

"ఈనాటికీ సోవియట్ యూనియన్‌లో కొద్ది మతా లయములు ఉన్నాయి. కొద్దిమంది మాత్రమే యీ ఆలయ ములకు ప్రార్థనకొరకు వెళుతున్నారు. వీరంతా వృద్ధులు, అజ్ఞానులు. దీనినిబట్టి క్రితండానికి చెందిన ముసలివాళ్ళు, పాత బడిన సాంఘిక ఆచారాలను, మత విశ్వాసాలను పూర్తిగా తొలగించివేసుకోలేకపోయారని విశదమవుతుంది. కాని యీ తరంవాళ్లుయిందుకు భిన్నంగా ఉంటారు. నూతన యుగానికి సం బంధించిన మార్క్సిస్టు-లెనినిస్టు విద్యను వీరు అభ్యసించారు. మతంలో వీరికి ఏ విధమైన విశ్వాసమూ ఉండదు. కాబట్టి... క్రితం తరానికి చెందిన ముసలి వాళ్ళంతా చనిపోగానే, సోవి యట్ యూనియన్‌నుంచి మతం పూర్తిగా మాయమైపోతుంది.

హాలులో మా మధ్య చెల్లాచెదరుగా కూర్చున్న పార్టీ, లీగ్ సభ్యులు మిన్నుముట్టేటట్లు కరతాళధ్వనులు చేశారు. ఆ రోజుసాయంత్రం నేనూ, నాతోపాటు ఫ్రూజెన్ విశ్వవిద్యాలయానికి చెందిన ఒక మిత్రురాలూ, మేము విన్న విషయమునుగురించి ముచ్చటించుకోవడానికి షికారు వెళ్ళాము. (ఇది 1949 లో జరిగిన విషయం. ఇదే గనక 1950 లో జరిగి ఉంటే ఆమె నాతోగాని మరో మిత్రునితోగాని యీ విష యాలనుగురించి చర్చించడానికి సంశయించి ఉండేది.) ఆమె ఒక పత్రికలో చదివిన సంగతులు కొన్ని నాకు చెప్పింది. 1924లో రష్యాయందు, మతాన్ని తుడిచిపెట్టడానికీ, ఆలయములను మూసివేయడానికి, మతగ్రంథాలను తగలపెట్టడానికి ప్రయత్నం జరిగింది. కర్షకులు తీవ్రంగా ప్రతిఘటించడంతో దైవప్రార్థనను రూపుమాపడానికి సాధ్యపడలేదు. క్రితం యుద్ధసమయంలో

ప్రజల సహకారాన్ని సంపాదించడానికి, ఎంతో కాలంనుంచి మూసివేయబడిన ఆలయములను స్టాలిన్ తెరవవలసివచ్చింది. ప్రార్థనాసమయంలో ముసలివారితో పాటు యువసోల్జర్లు, కర్షకులు మోకరిల్లేవారు. 'పెట్టుబడిదారీ' బానిసల మత్తుమందును "ప్రజలు ఆస్వాదించడానికి స్టాలిన్ తిరిగి ఆలయాలను ఎందుకు తెరిపించారు ?" అని ఆమె ప్రశ్న. ముప్పైసంవత్సరాల క్రితం - రష్యన్ కమ్యూనిస్టుపార్టీ అధికారాన్ని హస్తగతం చేసుకుని పాఠశాలలన్నిటియందు కమ్యూనిస్టు విద్యావిధానాన్ని ప్రవేశ పెట్టినప్పుడు యీ నాటి "వృద్ధప్రజలు" అప్పటికే ముసలివారు కాదుగదా ? నూతన సమాజవ్యవస్థ స్థాపితమై ముప్పైసంవత్సరాలు అయినా తమ నాయకుని అభీష్టానికి విరుద్ధంగా ప్రజలు మతవిశ్వాసాలను పట్టుకు ప్రేలాడటం ఎందుచేత ? విశేష అధికారంగల స్టాలిన్ మతాన్ని సంపూర్తిగా నిర్మూలించలేకపోవడానికి కారణం ?

కారణం నాకు తెలియదు. కొంతమంది పుటకే అటువంటివారై ఉండాలి. తమకన్న ఆధిక్యత కలిగిన బుద్ధుడు, క్రీస్తు, మహమ్మద్, మావ్ సే-టుంగ్, స్టాలిన్ మొదలైన వాళ్ళను వారు ఆరాధిస్తారు. ఇది చాలా చిక్కు ప్రశ్న - ఇంతకుమించి సమాధానం చెప్పడానికి నా బుర్ర చాలదు.

ఆమెవలె నిష్ఠూరంగా మాట్లాడటానికి నేను సిద్ధపడ లేదు. "నేను ఎప్పుడూ రష్యా చూచి ఎరుగను. పుస్తకాలలో చదవడంవల్లా పాఠశాలలో వినడంవల్లా కొన్ని విషయాలు తెలుసుకున్నాను" అన్నాను.

"కాని, మతం అనేది - వారు చెప్పే పలాయన మంత్రమే అయితే, మత విశ్వాసం గల ప్రజలు దేనినుంచో పలాయనం చిత్తగిస్తున్నారనేగదా అర్థం? ఈనాటికీ సోవియట్ యూనియన్‌లో అలా పలాయన మంత్రం పఠించడానికి ఏది కారణం?"

"దేనినో నమ్ముకోవాలనే ఆ కాంక్షను తుడిచిపెట్టడం బహుశః సాధ్యంకాక పోవచ్చును. అలాంటి మన స్తత్వాలను సరియైన మార్గంలోకి మళ్ళించాలి..." మా సంభాషణ బఠాణీల దుకాణం దగ్గర సమాప్తం అయింది.

నా అభిప్రాయం ఏమంటే: ప్రజలలో నిగూఢంగా ఉన్న మత విశ్వాసాలను రూపుమాపటం సాధ్యంకాదని యీ ముప్ఫై సంవత్సరాలలోనూ సోవియట్ నాయకులు గుర్తించారు. అంతేకాదు, మతాన్ని తుడిచిపెట్టడానికి ఏ ప్రయత్నం జరిగినా అది అజ్ఞాతంగా మనుగడ సాగించడానికి దోహదం చేస్తుందని గూడా వారు గుర్తించారు. కాని మా నాయకులు మాత్రం యింకా 1924 నాటి మన స్తత్వంతోనే ఉన్నారు.

నాయకుల కోపతాపాలు మత వ్యవస్థపై ప్రసరించాయి. సంప్రదాయ సిద్ధమైన మతములనుంచి అనేక రహస్య మతసంఘాలు శాఖోపశాఖలుగా విస్తరించడానికి, విదేశ సామ్రాజ్యవాదాన్ని నిందించడానికి వీలులేదు. ఇప్పుడు ఆ మత సంఘాల నిర్మూలనకు అవలంబించే దారుణ చర్యలు మమ్ములను దిగ్భ్రాంతులను చేసినవి. మతం పేరిట దోపిడీలు, దొంగతనాలు, మానభంగాలు మొదలుగాగల అనేక చట్టవిరుద్ధమైన దారుణ కృత్యాలు జరుగుతున్నాయనీ, వీటిని తుడిచి

పెట్టవలసిందిగా ప్రజలు కోరటంచేత ప్రభుత్వం తీవ్రచర్యలు తీసుకోవలసి వచ్చిందనీ వార్తాపత్రికలు ప్రచారం ప్రారంభించాయి. (పల్లె ప్రాంతాలలో యీ రహస్య మతసంఘాలు ప్రభుత్వ విధానాలు కొన్నింటిని నిరోధించి ఉంటాయని మా అనుమానం.)

బౌద్ధ, టావ్ మతస్థులు మూఢనమ్మకాలు గలవారనీ, ప్రజలను కొల్లగొడుతున్నారనేవంతోనే దాడి ప్రారంభం అయింది. ఆలయముల ఆస్తిపాస్తులు లాగివేయ బోతున్నట్లు సన్యాసులు, సన్యాసినులు మిగతా వారితోపాటు మనుగడ సాగించుటకు బలవంతం చేయబడుతున్నట్లు వార్తలు వినవచ్చినవి. సన్యాసినులు తమంత తాముగా అజ్ఞాతవాసముల నుండి బయటికి వచ్చి ప్రజోద్యమాలలో పాల్గొంటున్నారని వార్తాపత్రికలలో కథలు పడటం ప్రారంభించాయి.

ప్రభుత్వ కోపానికి ఎర అయిన విదేశమతాల్లో ముఖ్యమయినవి కాథలిక్ మతం, ఘోరమైన నేరాలు చేస్తూఉన్నట్లుగా ఆరోపించి అనేకమంది మత గురువులను, సిస్టర్లను జైలుకు పంపించారు. అనేక మిషనరీ పాఠశాలలను ప్రభుత్వం తనపరం చేసుకున్నది. కాథలిక్ ఆధిపత్యంనుండి ఫ్యూజెన్ విశ్వవిద్యాలయ పరిపాలన తొలగించబడింది. దేశంలో మిషన్లు తమ చర్చిలను ఒకటితర్వాత ఒకటిగా గోల్పోతున్నాయి. ప్రభుత్వం తన ఆయుధాగారంనుంచి ఒక నూతన ఆయుధాన్ని బయట పెట్టింది. ప్రజలకు తాము నమ్మకున్న మత విషయంలో స్వేచ్ఛ ఉండాలని వాదించినట్లయితే మతం అంటే నమ్మకం లేనివారికిగూడా స్వేచ్ఛఉండాలని ఒప్పుకోక తప్పదు.

ఆవేశపూరితులైన జనం పల్లె ప్రాంతాల ఆలయాలను దోచు కొని తగలబెడుతూ ఉంటే స్థానికమిలటరీ ప్రభుత్వం ఆ విష యంలో జోక్యం కలుగ జేసుకోవడానికి నిరాకరించింది. ప్రజల మనోభీష్టాన్ని వ్యక్తంచేసే యిలాంటి సంఘటనలలో ప్రభుత్వ సానుభూతి చూపించవద్దా? మత వ్యవస్థలను ఎదుర్కొనవలె నని తలంచే ప్రజల స్వేచ్ఛాభిసత్త్వాలను ప్రభుత్వం సంరక్షించ వలదా?

ఈ ఉద్యమ ప్రారంభంలో పైటూలోని మతవర్గాల కార్యకలాపాలు చప్పగా చల్లారిపోయాయి. మరీ ధైర్యశా లురు మాత్రమే ఏకొద్దిమందో ఆలయాలకు హాజరయ్యేవారు. మిణుకు మిణుకుమనే కొవ్వొత్తి దీపకాంతిలో కొద్దిమంది ప్రార్థనలు జరుపుతూ ఉండేవారు. కాథలిక్ మతగురువులు సిస్టర్లు తమ ఆవరణలను వదలిపెట్టి వెళ్ళిపోవలసి వచ్చింది. ప్రార్థనా సంగీతగోష్ఠులు నిలిపివేయబడ్డాయి. వీరికేగనక పాటలు పాడవలెనని ఉంటే అనేక అవకాశాలు కల్పించబడ తాయి. ప్రభుత్వంయొక్క అనుగ్రహాన్ని సంపాదించడానికి కొందరు క్రిస్టియన్ విద్యార్థులు తమ పూర్వజీవిత విధానాన్ని విమర్శిస్తూ నూతన ప్రజాఉద్యమాలను తమ కృషిని అంకితం చేయడానికి సంసిద్ధతను తెలియచేశారు. కాని వీరిమాటలు బూటకాలనీ యిళ్ళల్లో తలుపులు మూసుకుని చాటుగా ప్రార్థ నలు జరుపుతారని మాలో కొందరికి తెలుసును. వీరు అవకాశ వాదులైన క్రిస్టియనులు. ఇలాంటివారికి నూతన వ్యవస్థలో చోటులేకపోలేదు. ప్రజలను సేవిస్తున్నామనే పేరుతో రాజ

కీయ తరగతులుగా ప్రార్థనా సమావేశాలు మారడంతో యీ అవకాశవాదులకుతగిన స్థానం లభించింది.

విదేశీ మిషనరీలలో చాలామంది తమ దేశంలోకన్నా యీ దేశంలో సౌఖ్యప్రదమైన జీవితాలను గడుపుతూ ఉంటారనీ, చైనీలుకన్నా అధికులమని విర్రవీగుతూ ఉత్త అవకాశ వాదులుగా మనుగడ సాగిస్తూ ఉంటారనీ, క్రిస్టియన్ మతావలంబులు కాని మాబోటివారి అభిప్రాయం. అందువల్లనే వారంటే మాకు యిష్టంలేదు. అయితే వీరిలో కొందరు ఉత్తములైన వైద్యులు అధ్యాపకులు లేకపోలేదు. వ్యక్తిగతంగా వారియందు గౌరవం ఉన్నా వారిమతంలో మాత్రం మాకు గౌరవం లేదు. కాని మతకారణంగా దాడిచేసే సమయాల్లో వీరినిగూడా వదిలిపెట్టేవారు కారు. స్థానికంగా వారికి గల పలుకుబడి కారణంగా మరింత బాధలపాలు కావలసి వచ్చేది. సన్యాసినులను గురించి, వేలకొలది బిడ్డలను వారు చంపడాన్ని గురించి వినవచ్చే కథలు నమ్మడానికి మాకు చాలా కష్టంగా ఉండేది. అనాధశరణాలయాలు, తల్లులు తమకు అక్కరలేనిబిడ్డలను వదిలివెళ్ళడానికి అనువైన స్థలాలని మాకు తెలుసును. అజ్ఞానులైన ప్రజలను మభ్యపెట్టడానికే యీలాంటి కథలు ప్రచారం చేయబడుతున్నాయనే విషయం మాకు తెలిసినదే.

మతంమీద దాడి జరుగుతూన్న ఉద్యమ విషయాలన్నీ కథల రూపంగాను బొమ్మల రూపంగానూ వార్తాపత్రికలలో మాకు తెలిసేవి. వాటి ప్రభావం ప్రత్యక్షంగా

మామీద పడలేదు. కాని నూతన శరీర వ్యాయామ కార్యక్రమం ఇందుకు భిన్నమైనది. ప్రతివారూ యీ కార్యక్రమానికి లోనైనవారే. తమ శరీర దారుఢ్యాన్ని గురించి బడాయాలు కొట్టుకునే ఏకొద్దిమందికో తప్ప మిగతా ఎవ్వరికీ యీ వ్యాయామ శిక్షణా విధానము నచ్చలేదు. ఈ కార్యక్రమం ద్వారా ఒక వర్గంవారు ఆనందాన్ని చవి చూచి ఉంటారు. ఆ వర్గానికి చెందినవారే మా శరీర వ్యాయామ శిక్షణాధ్యాపకులు.



10

# విద్యా సంస్కరణలు

"షైటా, సాంస్కృతిక సంపన్నులైన కొందరు మానవులకు విలాసభవనమా లేక విప్లవవాదులకు శిక్షణ కేంద్రమా?"– మార్క్సిజంలో నిధిఅయిన హాంకాన్ - చిహ్ వేసిన ప్రశ్న యిది. కవిత్వధోరణిలో వేసిన యీ ప్రశ్నలోనే జవాబు కూడా యిమిడిఉన్నది.

మా నిత్యజీవితంలో అనేకమార్పులు రావటం అట్లా ఉండగా, ప్రభుత్వసహాయ కార్యకలాపములు, ఆత్మవిమర్శనా సమావేశాలు, రాజకీయతరగతులు మొదలైన విధానములు విశ్వవిద్యాలయమును ఏ మార్గాన పట్టిస్తున్నవో గ్రహించడానికి మాకు కొంతకాలం పట్టింది. కమ్యూనిస్టు పరిపాలనలో విద్యార్థులు ఏ విధంగాను మసులు కుంటున్నదే మా నూతన నాయకులు తెలుసుకోవడానికి ప్రథమసంవత్సరంలో అవకాశం చిక్కింది.

నూతన విద్యాసంవత్సరం ప్రారంభంకాగానే పరిస్థితులు స్పష్టమైన స్వరూపం ధరించటం ప్రారంభించాయి. ఆరు నెలల పాటు షైటాలో కమ్యూనిస్టు కార్యకర్తలు పరిశీలనలు జరిపారు. తమకు సహాయంచేయగల విద్యార్థులను ఎంచుకోవడానికీ, ఆత్మవిమర్శనా సమావేశములు మొదలైనవాటిద్వారా

సంపాదించిన అనుభవంతో – యువతీయువకులను సక్రమ మార్గములో పెట్టగల విధానాలను అమలుపరచడానికీ, నాకు సంసిద్ధులయినారు.

తమ పథకాలను నిర్వహించడానికి యీ కార్యకర్తలు మూడు అంచెలలో మా జీవితాలను కంట్రోలు చేయాలి: మేము మామూలుగా విద్యాసంబంధమైన తరగతులలో ఏం చేస్తున్నదీ, నూతన రాజకీయతరగతులలో ఏంచేస్తున్నదీ, క్లాస్‌రూములకు వెలుపల ఏంచేస్తున్నదీ వీరు గుర్తిస్తారు. ఇరుగు పొరుగుగదుల్లో నివసించే విద్యార్థులను అయిదు మొదలు పది సంఖ్యవరకూ ఉండేటట్లు జతచేర్చి 'లివింగ్ సర్కిల్స్'గా ఏర్పరచినట్లు యిదివరకే నేను చెప్పిఉన్నాను. ఈ సర్కిల్స్‌ను ఫ్లోర్ గ్రూపులతో ముడిపెట్టారు. ఫ్లోరు గ్రూపులన్నీ కలిసి డార్‌మెటరీ యూనియన్ అవుతాయి. వేర్వేరు డార్‌మెటరీ యూనియన్లు అన్నీకలిసి 'ఆల్ డార్‌మెటరీ కౌన్సిల్'గా రూపొందుతాయి. ఈ కౌన్సిల్ అన్ని 'లివింగ్ సర్కిల్స్'ను కంట్రోల్ చేస్తూ ఉంటుంది.

ప్రతి తరగతినీ అయిదు మొదలు పదిమంది విద్యార్థులు ఉండే పరస్పర సహకార సంఘాలుగా విభజించారు. తరగతిలోని సంఘాలు అన్నింటిపైనా అజమాయిషీ వహించే ఒక వ్యవస్థ ఉంటుంది. ప్రతి క్లాస్ వ్యవస్థకీ కొందరు అధికార్లు ఉంటారు. అడ్మినిస్ట్రేటివ్ మేనేజర్, అతని అసిస్టెంట్, స్టడీమేనేజర్, ఒక వెల్‌ఫేర్ మేనేజరు, ఒక బెసినెస్ మేనేజర్ ఉంటారు. నాలుగు తరగతులు కలిసి ఏర్పడే డిపార్టుమెంటల్ కౌన్సిల్

నుంచి యీ అధికార్లు తమ ఆర్డర్లు అందుకుంటారు. డిపార్టు మెంటల్ కౌన్సిల్‌కి వేరే అధికార్లు ఉంటారు.

నూతన రాజకీయ తరగతులు ప్రారంభం కాగానే యీ పద్ధతియందు కొన్ని మార్పులు చేయాలని అధికారులు ఆశించారు. కొన్ని పాఠ్య విషయాలు విద్యార్థులు విధిగా చదవవలసి ఉండడంచేత తరగతులు చాలా పెద్ద పెద్దవిగా ఉండేవి. అనేక డిపార్టుమెంటులనుంచి వచ్చిన విద్యార్థులు షుమారు రెండువందలమంది ఒకొక్క తరగతిలో ఉండేవారు. తరగతులను సెక్షనులుగానూ, సెక్షనులను స్క్వాడ్‌లుగానూ విభజించారు. ప్రతి స్క్వాడ్‌కి ఒక ఛైర్‌మన్, ఒక వైస్ ఛైర్‌మన్ ఉంటారు. ఈ స్క్వాడ్‌లను తిరిగి పరస్పర సహకార సంఘాలుగా విభజించారు.

ఈ పరస్పర సహకార సంఘాలు ప్రతిదానిలోనూ ఒకొక్క పార్టీ లేక లీగ్ సభ్యుడు ఉంటాడు. ఈ సభ్యుడు సంఘంయొక్క పెత్తందారుగా ఉంటాడు. సమావేశాలు ఏర్పాటు చేస్తాడు. గోష్ఠి సమావేశాలలో తల ఎత్తే ప్రశ్నలకు సమాధానాలు యిస్తాడు. తన అజమాయిషీలో ఉన్న విద్యార్థులు కాలాన్ని ఏవిధంగా సద్వినియోగం చేయాలో యితడు నిర్ణయిస్తాడు. ప్రతివిద్యార్థి యొక్క వ్యక్తిగత జీవిత విధానాన్ని, అతని మనో వికాసాభివృద్ధిని యితను అతి జాగ్రత్తగా కనిపెట్టి చూస్తూ ఉంటాడు. తన అజమాయిషీలో గల ప్రతి విద్యార్థి నిత్యజీవిత కార్యకలాపాలను గురించి విపులంగా రిపోర్టు వ్రాస్తాడు.

ఈ కట్టుదిట్టాలను సంఘజీవితాన్ని ఏ ఒక్క విద్యార్థి గూడా తప్పించుకునేందుకు అవకాశంలేదు. నువ్వు విదేశ భాషలు-సాహిత్యమూ చదువుతూన్న మూడవ సంవత్సర విద్యార్థివనుకుందాము. ప్రారంభంలో నువ్వు పరస్పర సహకార సంఘానికి చెందుతావు. జ్యూనియర్ క్లాస్ వ్యవస్థకీ, ఆల్ డిపార్ట్ మెంట్ యూనియన్‌కీ సభ్యత్వం వహిస్తావు. నీ విద్యా విష యాలనుగురించి ఈ సంఘాలు బాధ్యతవహిస్తాయి. రాజకీయ తరగతులలో నువ్వు మరొక పరస్పర సహకార సంఘసభ్యుడివి అవుతావు. ఇలాంటి మూడు సంఘాలు కలిసిఏర్పడిన స్క్వాడ్ మీటింగులకు నువ్వు హాజరుకావాలి. అతి ముఖ్యమైన విష యాలను చర్చించేందుకు నీ స్క్వాడ్ నాలుగు అయిదు ఇతర స్క్వాడ్‌లలో కలుస్తుంది.

సాయంత్రం డార్మిటరీకి వెళ్ళగానే, నువ్వు యిరుగు పొరుగులలో కలిసి 'లివింగ్‌సర్కిల్' సమావేశంలో పాల్గొన వలసి ఉంటుంది. ఫ్లోర్ గ్రూప్, డార్మిటరీ యూనియన్‌లకి నువ్వు సభ్యుడివిగా ఉంటావు. పైగా విద్యార్థులందరివలెనే నువ్వుగూడా స్టూడెంట్స్ యూనియన్‌లో జేరాలి. నలుగురి చేతా మాట పడకుండా వుండటానికి డిపార్టుమెంటల్ బృంద గాన దళంలో చేరకతప్పదు. నువ్వు యూత్ లీగ్‌కి చెందివుంటే, మరి మూడు సంఘాలలో సభ్యత్వం సంప్రాప్త మవుతుంది.ఇవన్నీ లెక్కిస్తే నువ్వు పదమూడు సంఘాలకి సభ్యుడి వవుతావు. నీకేగనక ఉత్సాహం వుంటే యింకా లైబ్రరీక్లబ్ లోనూ, రాజకీయ గోష్ఠి దళంలోనూ సభ్యుడి వవుతావు.

పాఠ్యక్రమంలో మార్పులను ప్రయత్నించడానికి పూర్వమే కమ్యూనిస్టులు నూతన రాజకీయ తరగతులను ప్రవేశపెట్టారు. మార్క్సిజంతో విద్యార్థుల మనస్సులు బాగా మర్దన చేస్తే ముందుముందు తాము తీసుకుని రాబోయే సంస్కరణలకు సహకారం సంపూర్తిగా లభ్యమౌతుందని కమ్యూనిస్టుల అభిప్రాయం అయివుంటుంది. మొదట్లో ప్రతి వారమూ తొమ్మిది గంటలు మేము రాజకీయాల అధ్యయనానికి వినియోగించే వాళ్ళము. మేము చదువుతున్న విషయాలపై రాజకీయ దురంధరుల వ్యాఖ్యానాలు వినడానికి ప్రతి శనివారం ఉదయం ప్రత్యేక లెక్చర్లకి హాజరు అయ్యేవాళ్ళము.

మేము విన్న ప్రతి విషయమూ నోటు పుస్తకాలలో వ్రాసుకుని మాతోపాటు పరస్పర సహకార సంఘాలగోష్ఠి సమావేశాలకు తీసుకుని వెళ్ళేవాళ్ళము. మార్క్సిస్టు సిద్ధాంతానికి ఆయువుపట్టు అయిన గత తార్కిక భౌతిక వాదమున కంటేకూడా చారిత్రాత్మిక భౌతికవాదాన్ని గురించే ఉపాధ్యాయులు ఉద్ఘాటిస్తూ ఉండేవారు. బహుశః తమకు సుస్పష్టంగా బోధపడిన సిద్ధాంతాలనే చర్చించాలని వారిఉద్దేశ్యం అయి ఉండవచ్చును. విప్లవోద్యమంలో తమయొక్క పాత్రను గురించి వీరు ముక్తకంఠాలతో చాటుకునేవారు.

శనివారం ఉదయం డెమాక్రటిక్ స్క్వేర్‌లో ప్రముఖ ఆగంతకుల ఉపన్యాసాలు ఏర్పాటు చేయబడేవి. మేమంతా నేలమీద క్రిక్కిరిసి కూర్చుని నోట్సు వ్రాసుకుంటూ వుండే వాళ్ళము. మా నాయకులు మమ్మల్ని ఒక కంట కనిపెట్టి చూస్తూవుంటారు. ఏ ఉపన్యాసకుడు చెప్పినా విషయంఒక్కటే.

ఏవిధమైన మార్పూ వుండదు. అందువల్ల మేము ఒక్కసారి నోట్సు వ్రాసుకుని ఉంచేవాలు. ఏ ఉపన్యాసంలోనూ అవే విషయాలు తిరిగి వినిపిస్తాయి.

ఆ తర్వాత మేము రేడియో ప్రసంగాలు వినడం ప్రారంభించాము. ప్రతి లెక్చర్ హాలుకి రెండు రిసీవింగ్ సెట్లు ఉంటాయి. రాజకీయ విద్యాబోధనా సంఘంద్వారా విద్యార్థులు అందజేసిన ప్రశ్నలకు రేడియో లెక్చర్లలో జవాబులు యివ్వడం రివాజు.

ఒక్కొక్కప్పుడు ఆశించిన విధంగా ప్రశ్నలకు తగిన జవాబులు లభించేవి కావు. ఉదాహరణకు ఒక ప్రఖ్యాతవ్యక్తి యీ విధంగా వెల్లడించాడు "సామ్రాజ్యవాద దేశములైన ఇంగ్లండ్, అమెరికాలు సాంస్కృతి రంగంలో చైనాను ఏవిధంగా పీడించినదీ తమకు అర్థం కావడంలేదని కొందరు విద్యార్థులు తెలియజేశారు. మిషనరీ పాఠశాలలు యిందుకు చక్కటి ఉదాహరణములు కావా?" ఇంతటితో ఈ విషయాన్ని కట్టిపెట్టి వక్త మరో ప్రశ్నను ఎత్తుకున్నాడు.

క్లాసు రూములలోనూ, రేడియోలోను విన్న అన్ని విషయాలను తిరిగి మేము పరస్పర సహకార సంఘ సమావేశాలలో చర్చించాలి. మా నాయకుడు వింటూండగా నోటు పుస్తకాలలో వ్రాసుకుని ఉన్న విషయాలను పైకి చదివే వాళ్ళము. రాజకీయ పదాలు సమాసాలు మా నోటివెంట దొర్లుకు వచ్చేవి.

తాము ఆశించిన మార్పు విద్యార్థులలో ప్రస్ఫుటం కాగానే, నాయకులు విద్యావిధానాన్ని కాలానుగుణ్యంగా

సంస్కరించడానికి పూనుకున్నారు. అయితే, విద్యారంగంలో సంపూర్ణమైన సంస్కరణ సాధ్యంకాదని వారు గుర్తించారు. ఏ విద్యార్థికూడా చదువు పూర్తి అయి పట్టభద్రుడయ్యేంత వరకూ తన పాఠ్యక్రమంలో సంస్కరణలకు యిష్టపడడు. ఇక అధ్యాపకులు ఎంతో కాలంగా తాము బోధిస్తున్న విషయాలు సంపూర్ణంగా సంస్కరింపబడటానికి విముఖత చూపుతారు.

కాబట్టి, సంస్కర్తలు తగు జాగ్రత్తతో ముందడుగు వేశారు. తమ ఉద్యమాన్ని మూడు మార్గాలలో నడపవచ్చునని వారు తలంచారు. ఒకటి: తమకు యిష్టమైన క్రొత్త కోర్సులను ప్రవేశపెట్టడం. రెండు: పాతకోర్సులను తొలగించటం మూడు: పాతాల శీర్షికలను ఉన్నవి ఉన్నట్టుగా ఉంచి దాని లోని విషయాన్ని, దృక్పథాన్ని మార్చివేయటం.

విమోచనానంతరం 1949 స్ప్రింగ్ టరంలో 'సాంఘికాభ్యుదయ' చరిత్ర అనే ఒక క్రొత్త కోర్సును ప్రారంభించారు. రాజకీయ పాఠ్యములవలె ప్రతి విద్యార్థి విధిగా యీ కోర్సును చదివితీరవలెనని నిర్బంధంలేదు. ఈ కోర్సు అంత సంతృప్తికరంగా లేదు. సాంఘిక వ్యవస్థ ఏఏ మార్గాల పురోగమించినదీ బోధింపబడుతుందని ప్రకటించారు. కాని, ప్రొఫెసర్ హూ లాంటి అధ్యాపకులు అసలువిషయాన్ని వదిలివేసి పాత ప్రభుత్వాన్ని దూషించడం, కమ్యూనిస్టుపార్టీని భూషించడంతో తృప్తిపడే వారు.

మొదటిసంవత్సరంలోనే అనేక పాతకోర్సులను తీసి వేశారు. ముఖ్యంగా సాంఘికశాస్త్రము న్యాయశాస్త్రము యిందుకు బలిగావలసివచ్చింది. పాత న్యాయశాస్త్రములన్నీ

విద్రోహపూరితములుగా భావించడంవల్ల పాఠ్యక్రమంలోనుంచి పూర్తిగా తొలగించివేయబడ్డాయి. దీనితో న్యాయశాస్త్రము కొంతవరకూ అభ్యసించిన విద్యార్థులు ఏమి చేయడానికీ తెలియని సందిగ్ధావస్థలో పడ్డారు.

కొన్ని గ్రంథాలలో శీర్షికలు పాతవే ఉంచి పాఠాల లోని విషయం మార్చివేశారు. ఈ 'నూతన దృక్పథం' బారి నుండి కొన్ని టెక్నికల్, సైంటిఫిక్ కోర్సులు తప్పించుకున్నాయి. కాని, ఆర్థికశాస్త్రము, సాంఘికశాస్త్రము, తత్వశాస్త్రము, విదేశసాహిత్యము మొదలైనవి గట్టిదెబ్బ తిన్నాయి.

పాఠ్యగ్రంథాలలో వలెనే బోధనా పద్ధతులలోగూడా అనేక సంస్కరణలు ప్రవేశపెట్టబడినవి. ఈ సంస్కరణ విషయంలో చాలా తతంగం నడిచింది. ప్రాథమిక పథకాలు వెయ్యడం పూర్తి అయింతర్వాత పైటా అధ్యాపకుల ప్రతినిధులు విద్యార్థుల ప్రతినిధులు, బోధనా పద్ధతులను నిర్ణయించడానికి సమావేశమైనారు. ఈ సమావేశము చరిత్రాత్మకమైనదనీ, మిగతా విశ్వవిద్యాలయములకు పైటా ఆదర్శప్రాయం కాగలదనీ ఉపన్యాసములు ఉద్ఘాటించారు.

"అధ్యాపకులకు విద్యార్థులకు మధ్య గల సహకార సౌమనస్య భావములమీదనే బోధనా పద్ధతి ఆధారపడి ఉండాలి" అని సమావేశంలో తీర్మానించబడింది.

ఉపాధ్యాయులు తాము బోధించే పాఠ్యక్రమ సంస్కరణ విషయంలో విద్యార్థులను సంప్రదించవలెననే తీర్మానం—మేము ఏ ఏ విషయాలను పఠించవలెనో నిర్ణయించుకునే హక్కును ప్రసాదించినది. కాని, పార్టీ లీగులచే ఎంచుకొన

బడిన మా నాయకులు మా అందరిమీద ఆధిపత్యం కలిగి వున్నారు. కాబట్టి దీని భావం ఏమంటే—పార్టీ తాను ఆశించిన సంస్కరణలను మమ్ములను అడ్డుపెట్టుకుని అమలు జరపదల్చింది.

ఈ పరిస్థితిలో అధ్యాపకులు చాలా యిరకాటంలో పడ్డారు. క్లాసులో ఏం చెబుతే ఏం ప్రమాదం సంభవిస్తుందోననే ఆందోళన మనస్సుల్లో చెలరేగింది. పైటా ప్రొఫెసర్లు సహితం తమ గర్వాన్ని కొంత విడిచి మాతో సహకరించడానికి గద్దె దిగవలసి వచ్చింది. మా టీచర్లు తమ తరగతులతో సంప్రదించడానికి మూడు విధాలుగా ప్రయత్నించారు.

1. ఆత్మస్థయిర్యముగల ఉపాధ్యాయులు తాము ఏ ఏ విషయాలు ఎంతకాలంలో బోధించదలుచుకున్నదీ ఒక చిన్న ఉపన్యాసం యిచ్చి యిక ఏవిధమైన చర్చలకు అవకాశం యివ్వకుండా పాతపద్ధతిలోనే పాఠాలు బోధించడానికి ఉపక్రమించారు. క్లాస్ రూమ్ వదిలే ముందర "మీకేమన్నా అభిప్రాయాలు ఉంటే తప్పకుండా తెలియజెయ్యండి" అని వెళ్ళిపోయేవారు. భవిష్యత్తులో తాము పడబోయేపాట్లు వారికి తెలియవు !

2. అంతగా ధైర్యంలేనివారు తమ కార్యక్రమాన్ని ప్రకటించి చిరునవ్వుతో విద్యార్థులకు అంగీకారమేనా అని ప్రశ్నించేవారు. అంగీకారం కాని విద్యార్థులు లేచి మాట్లాడవచ్చును; లేదా కాగితం వ్రాసి యివ్వవచ్చును.

3. భయస్థులు వేదిక దిగివచ్చి "మీకు ఏం నేర్చుకోవాలని ఉందో నిర్మొహమాటంగా చెప్పండి" అనేవారు.

చర్చా సమయంలో "అవును అవును," "నిజం," "అభిప్రాయం చాలా బాగుంది" అంటూ ప్రొఫెసర్లు కూర్చునేవారు. చివరికి విద్యార్థుల అభీష్టానికి అనుగుణ్యమైన పాఠ్యక్రమం ఏర్పాటు అయ్యేది.

పాఠ్యక్రమాన్ని కొంత తగ్గించి ఆ సమయాన్ని రాజకీయ బోధనకు వినియోగించాలనే ప్రయత్నాన్ని ఇంజనీరింగ్, మెడికల్ ప్రొఫెసర్లు ప్రతిఘటించారు. వృత్తి పాఠ్యక్రమం కుదించడంవల్ల నిపుణులైన పట్టభద్రుల కొరత ఏర్పడుతుందని వారు హెచ్చరించారు.

మిగతా పాఠ్య గ్రంథాలన్నీ మారిపోయాయి. మార్క్సిజం, లెనినిజముల పఠనమునకు ప్రాధాన్యత ఏర్పడింది. కొన్ని కోర్సులను పూర్తిగా ఎత్తివేశారు. బోధనా విధానం మారిపోయింది.

విద్యా సంస్కరణోద్యమం ఒక ఘట్టమును చేరగానే ప్రజాభిప్రాయం తెలుసుకోవాలనే నెపంతో ఒక సమావేశం ఏర్పాటుచేశారు. కాంసన్ లీడర్ ఉపక్రమించాడు. "కామ్రేడ్స్! మన విద్యా విషయంలో వచ్చిన సంస్కరణలను గురించి చర్చించడానికి యిది మహావకాశం – మీ అభిప్రాయాలను తెలియజెయ్యండి"

ఒక మిత్రుడు లేచాడు. "ఈ మార్పులు ఏమీ సమంజసంగా లేవు. విద్యార్థుల తెలివితేటలను అభివృద్ధిచేసే శిక్షణా కేంద్రాలుగానే విశ్వ విద్యాలయాలు ఉండాలని నా ఉద్దేశ్యం."

మరొక మిత్రుడు లేచి గర్జించాడు. "రాజకీయ శిక్షణే మీ ప్రధానోద్దేశ్యమైతే విశ్వవిద్యాలయా లన్నింటినీ ఎందుకు మూసివేయరాదు ?"

• ఇదే ధోరణిలో చర్చ కొనసాగితే చేసిన ప్రయత్న మంతా వ్యర్థమౌతుందని లీడర్ పసికట్టాడు. మిగతా విద్యార్థుల ప్రసంగాలు కట్టిపెట్టి పార్టీ సభ్యుణ్ణి ప్రసంగించమని ఆదేశించాడు.

"కామ్రేడ్స్! ఇప్పటికీ బూర్జువా తత్త్వాన్ని పట్టుకు ప్రాకులాడటంవల్ల మీరు క్షమించరాని ఘోర అపరాధాన్ని చేస్తున్నారు. ప్రజలకు విషతుల్యములైన కోర్సులను రూపుమాపటం మన విధి – అది విద్యార్థుల హక్కు. మీ మనస్తత్వమే మారి, శ్రామికవర్గము యొక్క దృక్పథాన్ని అలవర్చుకొని ఉంటే మీకు సంస్కరణలను గురించి బాగా బోధపడేది. ఈ విధమైన సందేహాలతో మనం పురోగమించలేము. ఈ సమావేశం వాయిదా వేయటం మంచిది."

ఈ సంస్కరణలను విద్యార్థులు ప్రొఫెసర్లు ధైర్యంగా ప్రతిఘటించటం సాగించారు. దీనికి ఫలితంగా ఒక సంవత్సరం పాటు సంస్కరణలను నిలిపివేయవలసిందిగా మావ్ సే-టుంగ్ విద్యా మంత్రిత్వశాఖకు సందేశం యిచ్చారు. దానితో విద్యా మంత్రిత్వశాఖలోని అతివాదులు, యింతకు పూర్వం పాఠ్య క్రమంలో ప్రవేశపెట్టిన మార్పులలో మాత్రమే సంతృప్తి చెందవలసి వచ్చింది.

'సమిష్టి జీవిత విధానం లక్ష్యంగా సమిష్టి విద్యాభ్యాసం అలవరచుకోవాలని నాయకులు హెచ్చరించడం ప్రారంభిం చారు. 'బూర్జువా వ్యక్తిత్వం' అనే దూషణకు ఎక్కడ పాల్పడవలసివస్తుందోననే భయంకొద్దీ ప్రతివిద్యార్థి సమష్టి విద్యాభ్యాసానికి తల ఒగ్గవలసివచ్చింది. ఈ సమష్టి విద్యాభ్యాసానికి విద్యార్థులందరూ వచ్చికజ్యూళ్ళలోనో, ఖాళీతరగతి గదుల్లోనో గుమికూడి ఒకేపాఠాన్ని బిగ్గరగా చదవాలి. అధ్యాయం చదవటం పూర్తికాగానే ఆగి, చదివిన విషయాలనుగురించి చర్చ ప్రారంభించాలి. ప్రశ్నలు అడగనివారికీ జవాబులు చెప్పనివారికీ వారి నిర్లక్ష్యతకు శిక్షలు జరుగుతాయి.

శాస్త్ర మందకొండి విద్యార్థులకి యీ పద్ధతి బాగానే ఉంటుంది. తమకి యిచ్చిన పాఠాన్ని వారు ఒకసారన్నా చదువుతారు. కాని తెలివితేటలుగల విద్యార్థులకి బిగ్గరగా చదవటం అన్నా ప్రశ్నలు జవాబుల రూపంలో చర్చించడమన్నా చిరాకుగా ఉంటుంది. కాని యీ నూతనపద్ధతి సరియైంది కాదని ఎవ్వరు అనగలరు? ఈ పద్ధతిద్వారా మందకొండి వాళ్ళకు తెలివితేటలుగల వాళ్ళకు సమానత్వం సిద్ధించింది.

రష్యన్ లాంగ్వేజి డిపార్టుమెంటులో యీ సమష్టి విద్యాభ్యాస ప్రభావం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. విద్యార్థులు గుంపులుగుంపులుగా కూర్చుని రష్యన్ విశ్లేషాలను, చిన్న చిన్న వాక్యాలను ముక్తకంఠంతో వల్లెవేస్తూఉంటారు.

విమోచనానంతరం పరీక్షల బెడద తొలగిపోతుందని కొందరు విద్యార్థులు ఆశించారు. "చరిత్రాత్మకమైన సమావేశంలో" యీ ఆశకు తావులేకుండా తీర్మానించడం జరిగింది. అయితే పరీక్షావిధానంలో మార్పువచ్చింది: ప్రతిటీచరు పరస్పర సహకారసంఘాలను కల్పించుకునివుండాలి. విద్యార్థుల తప్పులు తెలుసుకోవాలి. వారి సమస్యలు నివారించాలి. వారి మంచి చెడులు తెలుసుకోవాలి.

పార్టీ ప్రయోజనాలకోరకే యీ నూతన పరీక్షా పద్ధతి అవలంబించబడిందని మాకిప్పుడు అర్థం అయింది. పార్టీ కార్యకలాపాల్లో మునిగితేలుతూ ఉండే విద్యార్థులకు మిగతా వాళ్ళలా చదివేందుకు ఎక్కువ అవకాశం ఉండదు. 'బాగా చదువుతే తప్ప ఉత్తీర్ణులము కాము.' అనే బాధ తప్పిపోయింది.

పరీక్షలు ప్యాసు కావడం సులభం అయిపోయింది. ప్రథమస్థానాలను అలంకరించే అవకాశం ఎక్కువైపోయింది. దానితో చాలామంది విద్యార్థులకు మంచి మార్కులను సంపాదించాలనే ఆసక్తి సన్నగిల్లిపోయింది. "ఈ విధమైన పరిస్థితులను తెచ్చిపెట్టి, విద్యార్థులు కష్టించి పనిచేయాలని అధికారులు ఏ విధంగా ఆశించగలరు?" అని ఒక ప్రొఫెసర్ ప్రశ్నించాడు. అధికారులను నిందించటంకన్నా దూరదృష్టిలేని తన తెలివితక్కువతనాన్ని గురించి ఆయన చింతిస్తే బాగుండును. మేము కష్టపడి పనిచెయ్యాలనే అధికారుల ఆకాంక్ష. మా కృషి వారికి తెలుసు. కాని, పాతపద్ధతి పరీక్షలకోసం మా శక్తి సామర్థ్యాలన్నింటినీ వినియోగించటం వారికి యిష్టంలేదు.

నూతన ప్రజాస్వామ్యవ్యవస్థలో బాధ్యతాయుతమైన కార్యక్ర
మాలను నిర్వహించడానికి మేము శిక్షణపొందుతూయున్నాము.
మాకు ఏవిధమైన శిక్షణ అవసరమో మా నాయకులకు తెలు
సును. పుస్తకాలలో మునిగి తేలడంకన్నా ఆ సమయాన్ని
ఆత్మవిమర్శనా సమావేశాలకి, ఊరేగింపులకి వినియోగించడం
ద్వారా సరియైన శిక్షణ లభిస్తుందని వారి ఉద్దేశ్యము.

ఇతర విశ్వవిద్యాలయములు క్రమశః పైటాను ఆదర్శ
ప్రాయంగా తీసుకోవడం ప్రారంభించినవి. 'మా చరిత్రాత్మక
సమావేశముల' ప్రభావము దూర దూరాలకు విస్తరించినది.

# 11

## ఎవరు ఎవరికి బోధిస్తారు?

అమాయ్ విశ్వవిద్యాలయంలో ఒక ప్రొఫెసర్ ఉండే వాడు. విద్యార్థులకి క్రమశిక్షణ ఎలా అలవర్చాలో ఆయనకి తెలిసినట్లు యీనాటి ప్రొఫెసర్లు చాలామందికి తెలియదు. ఆయన పేరు చెపితే విద్యార్థులకి సింహస్వప్నంగా ఉండేది. ఎప్పటి పాఠాలు అప్పుడు చదివితీరాలిసిందే. ఏ విద్యార్థి ఎడల నైనా ఆయనకి సదభిప్రాయం కలగకపోతే అతను ఆనువత్సరం పరీక్షలో ఉత్తీర్ణుడు కావడం అసంభవం. క్లాసులోనేగాకుండా బయటకూడా ఆయనంటే విద్యార్థులకి హడల్‌గా ఉండేది.

ఆయనను గురించి చైనాలో ఒక కథ విశేష ప్రచారంలో ఉన్నది. ఒకరోజున ప్రొఫెసర్‌గారు క్లాసుకు రాగానే విద్యార్థులంతా లేచి నిలబడ్డారు. వారందరినీ కూర్చోమని సౌంజ్ఞచేసి, వేదిక నెక్కి కుర్చీలో కూర్చున్నాడు. ఆ కుర్చీ కాలు ఓటిదవటంవల్ల ఆయన దభీలుమని వెనక్కు విరుచుకు పడ్డాడు. ఒక్క నిమిషంపాటు అట్లాగే ఉన్న తర్వాత విద్యార్థుల వైపు తీక్షణంగా చూచాడు. ఏ విద్యార్థీగూడా కిక్కురు మనలేదు. ఆయన లేచి, కుర్చీని ప్రక్కకు త్రోసివేసి మామూలు ప్రకారం పాఠం ప్రారంభించాడు.

ఈనాడు పరిస్థితి మారిపోయింది. ప్రొఫెసర్ ఏ ప్రముఖ ప్రభుత్వ నాయకుడో లేక రష్యానుంచి వచ్చిన ఏ గౌరవనీయుడైన ఆగంతకుడో అయితే తప్ప యిలాంటి క్రమశిక్షణకు అవకాశం లేదు. పూర్వపురోజుల్లో అధ్యాపకులన్నా పండితులన్నా చైనాలో ఎంతో గౌరవభావం ఉండేది. కాని విమోచనకి పూర్వమే విద్యార్థి - అధ్యాపక బాంధవ్యంలో ఎంతో మార్పువచ్చింది. 1911 లో ఆఖరి రాజవంశం పతనానికి పూర్వమే విద్యార్థులకి విదేశ విషయాలంటే ఉత్సాహము దేశీయ గ్రంథాలను బోధించే అధ్యాపకులంటే విరక్తికలగటం ప్రారంభించాయి. వీరిలో కొందరు పట్టభద్రులై అధ్యాపక వృత్తిని చేగొన్నవారు ఉన్నారు. కాని తరతరాలుగా పాతుకుని పోయిన అభిప్రాయాలను, గ్రంథాలను త్రోసిరాజనడానికి వారికి ధైర్యం లేకపోయింది.

జపాన్‌తో యుద్ధం సాగుతున్న రోజుల్లో అనేక విశ్వవిద్యాలయాలు తమ స్థానాలను వదలి సురక్షిత ప్రాంతాలకు తర్లిపోయినవి. ఈ సమయంలోనే విద్యార్థికి, అధ్యాపకునికి మధ్యగల బాంధవ్యం మరింత సన్నగిల్లింది. యుద్ధానంతరం విశ్వవిద్యాలయాలు తిరిగి తమపూర్వస్థానాలను జేరుకున్నా కాని గురుశిష్య సంబంధాల్లో మాత్రం ఏవిధమైన మార్పురాలేదు. పూర్వప్రభుత్వపు రోజుల్లో అభ్యుదయవాదులైన విద్యార్థులకు రాజకీయాలమీద ఉండే ఆసక్తి తమ చదువుమీద ఉండేది కాదు. మిగతా విద్యార్థులుగూడా వీరినే అనుసరించారు. విద్యార్థులంతా కలిసికట్టుగా ఉండటంవల్ల, వారి రాజకీయ కార్యకలాపములయందు సానుభూతిలేని ప్రొఫెసర్లుగూడా

క్లాసులో వారిని గదమాయించలేక పోయేవారు. మీటింగులకు హాజరు అయ్యేందుకు, ఊరేగింపులు చేసేందుకు, రాజకీయ కార్యక్రమాలు నిర్వహించేందుకు విద్యార్థులు సమిష్టిగా క్లాసుల్ని ఎగగొట్టేవారు.

విప్లవం తీసుకురావడానికి కొందరు ప్రొఫెసర్లుగూడా చాలా ఉత్సాహంతో పని చేశారు. కార్యకలాపాల్లో స్వయంగా పాల్గొనలేకపోయినా సానుభూతి చూపేవారు. రాజకీయాలలో ఏవిధమైన సంబంధమూ లేకుండా తటస్థంగా ఉండి తమపని తాము చేసుకుపోవాలని కొందరు ప్రయత్నించారు. అభ్యుదయవాదులైన విద్యార్థులు వీరి ధోరణిని తీవ్రంగా నిరసించారు. సరిపోని జీతాలు, నోట్ల ముద్రణం అవినీతి నెత్తిమీద మొత్తుతూ ఉండగా చేతులు ముడుచుకుని వినుకూర్చోవటం ఏమిన్యాయం.

విమోచనానంతరం చాలామంది ప్రొఫెసర్లు మాతో చేతులుకలిపారు. ఊరేగింపులో పాల్గొన్నారు. ప్రజావిమోచనసైన్య ఆగమనమునకు స్వాగతం యిచ్చారు. విమోచనతోపాటు వీరి జీతాలు పెరిగాయి. విద్యార్థులు తక్కువ మార్కులు యివ్వటంవల్ల జీతాలుతగ్గిన అధ్యాపకులకుగూడ యిప్పుడు పెరిగాయి. ఉత్సవాలు అయినంతలోనే పద్ధతులలో నూతన విద్యాబోధన కొనసాగాలో చర్చించడానికి టీచర్లు వార్తాపత్రికలు చదవటం ప్రారంభించారు. ఉత్సవ సంబంధమైన హడావుడి సద్దుమణగగానే తరగతులు ప్రారంభం అయినాయి. మాలాగానే వారుగూడా నూతన నాయ

కత్వవిధానం ఎట్లా ఉంటుందో తెలుసుకోవడానికి సంసిద్ధులయ్యారు.

విజయం సిద్ధించిన కొద్దిరోజులలోనే టీచర్లను గ్రేడింగు చేసి జీతాలు నిర్ణయించవలసిన అవకాశం మాకు అధికారులు ఇచ్చారు. తమ అధ్యాపకులమీద కోపంవున్న కొందరు విద్యార్థులు విమోచన తమను బంధవిముక్తులను చేసిందని తలంచారు. కాని తర్వాత జరిగిన సంఘటనలు యీ అభిప్రాయం సరియైనది కాదని రుజువు చేశాయి. గురుశిష్య సంబంధం సరిదిద్దబడింది. అభ్యుదయవాదులైన అధ్యాపకులు విద్యార్థులు ఒక వర్గంగానూ, వెనుకబడిన అధ్యాపకులు విద్యార్థులు ఒక వర్గంగానూ వేరుచేయబడ్డారు. వెనుకబడిన అధ్యాపకులకు బోధించడానికి అభ్యుదయవాదులైన విద్యార్థులకీ, వెనుకబడిన విద్యార్థులకు బోధించడానికి అభ్యుదయవాదులైన అధ్యాపకులకి అవకాశం చిక్కింది.

పైటాలో అభ్యుదయవాదులైన అధ్యాపకులకన్నా విద్యార్థులే అధికమయ్యారు. మేమంతా మా టీచర్లకన్నా వయస్సులో ఎంతో చిన్నవాళ్ళం, మాకు బంధవిముక్తి కలిగిందనీ, స్వాతంత్ర్యం లభించిందనీ మొదట్లో మేము చంకలు గుద్దుకున్నాము. ఏపాఠాలు చెప్పాలో ఏవిధంగా బోధించాలో శాశించగల మా అవకాశం మాకు ప్రప్రథమంగా చిక్కింది. పలుకుబడిలేని టీచర్లు బహిరంగసభల్లో మేము వారి బోధనా పద్ధతులను గురించి, రాజకీయ అభిప్రాయాలను గురించి చీల్చి చెండాడుతూ ఉండే గట్టు చప్పుడు గాకుండా నిశ్శబ్దంగా కూర్చునేవారు. మొదట్లో, తమ వచోనైపుణ్యంవల్లా అనుభ

వంతల్లా వారిలో కొందరు మాలో వాగ్వాదానికి దిగడానికి ప్రయత్నించారు. కానితర్వాత తర్వాత వారిఆటలు సాగలేదు.

ప్రజావిమోచన సైన్యంతోపాటు తిరిగివచ్చిన విద్యార్థి నాయకులు, నవీనపద్ధతులకు అనుగుణ్యంగా టీచర్లను సంస్కరించడానికి మేము చేస్తున్న ప్రయత్నాలకు తోడ్పడ్డారు. ప్రొఫెసర్లకి సహాయంచేయడం ఎంత అత్యావశ్యకమో ఉద్బోధిస్తూ మా పరస్పర సహకారసంఘ సమావేశాలలో వారు ఉపన్యసించారు. "మన ప్రొఫెసర్లలో చాలామంది మంచి వాళ్ళు ఉన్నారు వారిలో కొందరు బోధనలో ప్రతిభ కల వారు. కొందరు నిజంగా అభ్యుదయవాదులు, విప్లవంవైపు మనం పురోగమిస్తున్న సమయంలో వీరు మనకు అండగా నిలిచారు."

"అభ్యుదయవాదులు నిజమైన కామ్రేడ్స్. ఇక మిగతా పాతవిషయం ఏమిటి? వారు ఏ వర్గంవారో మనం గుర్తించాలి. అనేక సంవత్సరాలుగా వారు యీ వృత్తిలో ఉన్నారు. పాతవిషయాలనే వల్లన వేయిస్తున్నారు. వారి దృక్పథం బూర్జువా మనస్తత్వంలో కలుషితమైపోయింది. చాలామంది మధ్యతరగతికి చెందినవారు. తమ స్థానాన్నుంచి తొలగడానికి వారికి యిష్టంఉండదు. బూర్జువా మనస్తత్వం అనే విషం వారి నిలువెల్లా ప్రతి అణువులోనూ నిండిఉంటుంది.

"కామ్రేడ్స్! ఈ విషం వెలిగ్రక్కాలంటే అంత సులభంకాదు. మన టీచర్లు యీ పనిని తమంతట తాము స్వయంగా చేయలేరు. తమ మనస్తత్వాన్నీ, జీవితవిధానాన్నీ మార్చుకోవడానికి టీచర్లకు మన సహాయం ఎంతైనా అవ

పరమైంది. వారి శక్తిసామర్థ్యాలను మనం గౌరవించవలసిందే. కాని వారికి సహాయం చేయాలనుకుంటే మాత్రం వారి బూర్జువా మనస్తత్వాన్ని మనం సహించకూడదు. మనకోసం-మన దేశంకోసం వారికి మనం సహాయం చేసితీరాలి...తప్పదు."

దీని ఫలితంగా మేము జరిపే రాజకీయ సమావేశాలకి, చర్చలకి ప్రొఫెసర్లు అందరినీ ఆహ్వానించాలని మేము తీర్మానించాము. మేము వెళ్ళి వారిని పిలిచాము. మా ఆహ్వానాన్ని వారు ఎట్లా స్వీకరిస్తారోననే విషయంలో మాకు కొన్ని సందేహాలు లేకపోలేదు. కానివారంతా హాజరవడానికి చిరునవ్వుతో అంగీకరించారు.

సమావేశానికి పూర్వం మా నాయకులు మమ్మల్ని హెచ్చరించారు "మీరు కొన్నివిషయాలు జ్ఞాపకం ఉంచుకోండి. టీచర్లు వాళ్ళలో వాళ్ళు గుసగుసలాడుకుంటున్నారు. వాళ్ళను సంస్కరించవలసిన బాధ్యత మనమీద ఉన్నది. వారిని యీ మార్గంలో ఉత్సాహపూరితులను చేయడానికి మన శాయశక్తులా ప్రయత్నించాలి. అవసరాన్నిబట్టి విమర్శించడానికి మెచ్చుకోవడానికీ మనం వెనుకాడకూడదు."

మొదటి సమావేశం ప్రారంభం అవడానికి పూర్వం టీచర్లు రాకకోసం మేము ఎదురుచూస్తూ కూర్చున్నాము. గంట మ్రోగింది. మా టీచర్లలో యిద్దరుమాత్రమే తలుపు తెరుచుకు లోపలికి వచ్చారు. కార్యక్రమం సంక్షిప్త పరచవలసి వచ్చింది. చైర్మన్ తమ ప్రారంభోపన్యాసాన్ని విరమించుకున్నాడు. వచ్చిన యిద్దరి టీచర్ల ఉనికినిగురించి మెచ్చుకోవడమూ మానడమూ అనే సందిగ్ధావస్థ పరిస్థితిలోపడ్డాడు.

ఎట్లాగైతేనేం నిర్ణయానికి వచ్చి వచ్చిన యిద్దరిలో ఒకరిని ఒక ప్రశ్నను గురించి వ్యాఖ్యానించ మన్నాడు. ఆ టీచర్ "నేను వినడానికీ నేర్చుకోడానికీ వచ్చాను, వ్యాఖ్యానించడానికి కాదు" అని గట్టిగా చెప్పాడు. చర్చ ముగిసింది. ఆ ప్రొఫెసర్లను చూసి మేము చిరునవ్వు నవ్వాము, కాని మీటింగునకు హాజరుకాని టీచర్ల విషయంలో ఏదో చెయ్యక తప్పదు.

పెద్ద సమావేశాలను విరమించి చిన్న గోష్టులను ఏర్పాటు చేశాము. అధికారుల ఆగ్రహాన్ని గురించి ఎవరో ప్రచారంచేసి వుంటారు. అందువల్ల చాలామంది టీచర్లు హాజరు కావటం ప్రారంభించారు. కాని కార్యకలాపాల్లో పాల్గొ వాలనే ఉత్సాహాన్ని వారు ప్రకటించడంలేదు. రంగంలోకి దిం చాలని గ్రూప్ లీడర్ ప్రయత్నించినప్పుడు వారు "మాకన్న మీరు యువకులు. అన్ని విషయాలూ మాకంటె మీకే బాగా తెలుసును" అని తప్పించుకుంటున్నారు. పైగా మేము వినడానికి వచ్చామని అంటున్నారు.

గోష్ఠి సమావేశాలకు టీచర్లు హాజరుకావడం తగ్గిపోయింది. మమ్మల్ని సమావేశపరచి మా లీడర్లు పరిస్థితిని ఎట్లా చక్కపరచడమా అని ఆలోచించారు. సమావేశాలకు విధిగా హాజరయ్యేవరకూ వారిని వెంటాడుతూనే ఉండాలనీ, అతి వినయంగా మంచిమాటలతో వారి బుద్ధిని మళ్ళించాలనీ నిర్ణయించబడింది.

ప్రొఫెసర్ చెన్‌ను ఆహ్వానించవలసిన బాధ్యత, హుయాంగ్ నాయకత్వం వహించిన రాయబారవర్గం మీద పడింది. ఈ బృందంలో నేనుకూడా ఉన్నాను. మేము ప్రొఫె

సర్ చెన్ యింటికి వెళ్ళాము. ఆయన భార్య తలుపుతీసి మమ్మల్ని లోపలికి ఆహ్వానించింది. కూర్చున్న తర్వాత మిఠాయి, టీ అందించింది. "ప్రొఫెసర్ ఇంట్లో లేరా" అని మేము అడిగాము. "అయిదు నిమిషాలకి పూర్వమే ఆయన బయటికి వెళ్ళారు. సాయంత్రందాకా తిరిగిరారు. మీరు ఆయనతో చెప్పదలచిన విషయాలు నాతో చెప్పండి." అన్నది ఆమె.

నాకు ఒక ఆలోచన తట్టింది. ప్రొఫెసర్ చెన్ మీటింగులకు హాజరయ్యేటట్లు ఆమె ప్రోత్సాహం యిస్తే ఎంత బాగుంటుంది! ముఖాముఖి ఆయన్ని అడగటంకన్నా యీమె ద్వారానే పని సుకరం చేసుకోవచ్చును.

"ప్రారంభంలో ప్రొఫెసర్ చెన్ ఒకటిరెండు మీటింగు లకుహాజరు అయ్యారు. ఈమధ్య రావడం మానివేశారు. మాకు ఆయనంటే ఎంతో అభిమానం. ముందుముందు ఆయన మాతో పాటు సమావేశాల్లో పాల్గొంటారని మేము ఆకాంక్షిస్తు న్నాము. ఇది ఆయనకే కాకుండా మాకుగూడా ఎంతో మేలు కలుగజేస్తుంది. మాకు బోధించండం ఆయన ముఖ్యకర్తవ్యం గదా?" అని నేను అన్నాను.

"ఈమాటు సమావేశం ప్రారంభం కావడానికి పది నిముషాలుముందు మళ్ళీవస్తాము. ఈటైంటేబుల్‌ని ప్రొఫెసర్‌కి యివ్వండి." అన్నాడు ముయూంగ్.

"అట్లాగే" అంటూ ఆమె వీడ్కోలు యిచ్చింది.

ఈ టీచర్లు ఇంతే...ముక్కు పట్టుకు లాక్కువస్తేతప్ప వీళ్ళు తమంతట తాముగా మీటింగులకు హాజరుకారు. అభ్యు

దయవాదినని చెప్పుకునే ప్రొఫెసర్ చెన్‌గారే యిట్లా చేస్తూ ఉంటే మిగతా వారిమాట చెప్పాలా” అన్నాడు హ్స్యూయాంగ్.

టీచర్లు మీటింగులకి హాజరు కావడం అరుదైపోయిందనే విషయం పై అధికార్ల వరకూ వెళ్ళి ఉంటుంది. అధ్యాపక దళాన్ని సంస్కరించే భారంలో ఎక్కువపాలును తన భుజాల మీదకు విశ్వవిద్యాలయ యూనియన్ తీసుకున్నట్లు ఆతర్వాత మాకు తెలిసింది.

పైగా పరిపాలనావిధానాలలో కొన్ని మార్పులు వచ్చాయి. నిర్వాహకసంఘానికి తత్వశాఖ ప్రొఫెసర్ టాంగ్‌ని చైర్‌మన్ చేశారు. ఆయనయెడల గల గౌరవాన్ని పురస్కరించుకొని యీ పదవిని అప్పగించారు. ఇతరులను ఆదర్శప్రాయంగా ఉండేందుకు ప్రతిపనిలోనూ ఆయన అభ్యుదయ మనస్తత్వాన్ని ప్రదర్శించాలి.

గతితార్కిక భౌతికవాదము మీద ఉపన్యసించడానికి ఒక “శ్రామికవర్గ తత్వవేత్త” ఆహ్వానింప బడినప్పుడు బూర్జువా తత్వవేత్త అయిన ప్రొఫెసర్ టాంగ్ కూడా ఆ సమావేశానికి హాజరుకావలసి వచ్చింది. మూడు గంటలు దాటినా ఉపన్యాసం ముగింపుకువచ్చే సూచన కనిపించలేదు. అసలే రక్తపోటు వ్యాధి స్థూలకాయముకలిగిన డాక్టర్ టాంగ్ చికాకును భరించలేక నెమ్మదిగా జనంలోనుంచి తప్పించుకొని బయటకు వచ్చాడు. ఆయాసంతో “విప్లవానికి బలి అన్నా అవుతానుగాని యీ ఉపన్యాసాలు వింటం నావల్లకాదు” అన్నాడనే వార్త ఆ తర్వాత ప్రచారమైంది.

విద్యార్థి జీవితంలో టీచర్లు అధిక ఆసక్తిని చూపాలనే కోర్కెను చాలామంది మన్నించారు. టీచర్లు సమిష్టి జీవిత విధానాన్ని అవలంబించాలని మా నాయకులు ప్రోత్సహించారు. మేము విహార యాత్రలకు చుట్టుప్రక్కల ప్రాంతాలకు వెళ్ళినప్పుడు మాతోపాటు టీచర్లుగూడా ట్రక్కులలో వచ్చేవారు. మాతోపాటు ఆటపాటలలో పాల్గొనేవారు. మాతో నృత్యంలోగూడా పాల్గొనేవారు.

ఈపద్ధతులలో చాలామంది టీచర్లు కాలానుగుణ్యంగా మారేందుకు అవకాశం కలిగింది. నూతన విషయాలను చెప్పేటప్పుడుకూడా వారు తరగతిలో ఏవిధంగా బోధించాలో మేము సూచనలు యిచ్చేవాళ్ళం.

మా డిపార్టుమెంటులో ఒక విదేశీ అధ్యాపకుడు ఉండేవాడు. మేము యిచ్చే సూచనలన్నింటినీ ఆయన తూచ తప్పకుండా పాటించేవాడు. మా మాట వింటున్నాడనే ఉత్సాహంతో ఎప్పటికప్పుడు కొత్త సూచనలు చేస్తూఉండేవాళ్ళం. ఒకసారి యిట్లాగే చేయబోతూ ఉంటే అభ్యుదయవాదినియైన ఆయన భార్య "ఇంక మీరేమీ సూచనలు చెయ్యకండి. మీ ఉద్దేశ్యం ఏమిటి – ఆయన ఏ చాటుకైనా వెళ్ళి ఉరి తీసుకోవాలనా" అని మందలించింది. మాకు సిగ్గువేసింది. ఇంతవరకూ ఏదో ఆటగా కొనసాగించిన యీ కార్యక్రమాన్ని మేము వదులుకున్నాము.

సంస్కరణల విషయంలో చాలామంది టీచర్లు పురోగమించారు. కాని మా నాయకులు మాత్రం మనుష్యుల్ని వెనుక నుంచి పొడవటం మానలేదు. "ప్రజాస్వామిక సిద్ధాంతాలు

వంటబట్టినా వారిలో జారుకుని పోదామని ప్రయత్నించేవాళ్ళు ఎప్పుడూ ఉంటారు. కాబట్టి టీచర్లను మనం ఒకకంట కనిపెట్టి చూస్తూనే ఉండాలి. నిర్లక్ష్యంచేయడానికి వీలులేదు.

ఒకరోజున ఒక సందేహం తీర్చుకోవడానికి మా తత్వ శాఖ ప్రొఫెసర్ గదికి వెళ్ళాను. ఆయన అప్పుడే యిద్దరు విద్యార్థులకు తలుపుదగ్గర వీడ్కోలు యిస్తున్నాడు. మనిషి కొంచెం ఆరాటపడుతున్న వాడిలా కన్పించాడు. మీరు ఈ మాటలు మంచి మూడ్‌లో ఉండగా నన్ను కలుస్తారు లెండి" అంటూ ఆ విద్యార్థులు వెళ్ళిపోయారు.

నేను కూర్చున్నాను. ప్రొఫెసర్ చాలా అలిసి పోయినట్లు కన్పించారు. "మీరు చాలా అలిసినట్లుగా కని పిస్తున్నారు. ఎక్కువగా చదువుతున్నారని అనుకుంటాను. కొంచెం విశ్రాంతి ఎందుకు తీసుకోరాదు?"

ఆయన చిరాకుగా "నేను ఏం అలిసిపోలేదు - బాగా చదువుతున్నమాట మాత్రం నా స్వరమే. రాజకీయ గ్రంథాలు శ్రద్ధగా చదువుతున్నాను."

"అవి చాలా ముఖ్యమని మీ అభిప్రాయం కదూ?"

"అవును... లెనిన్ చెప్పింది ప్రతిదీ నిజమే."

"మీరింకా ఏమైనా చదివారా... నేను చదవడానికి ఏదన్నా గ్రంథం సూచించండి."

"యువజనాన్ని గురించి స్టాలిన్ వ్రాసింది చదవదగ్గ గ్రంథం. ఆ గ్రంథం చదివింతర్వాత స్టాలిన్ ఎంత గొప్పవాడో నాకు బోధపడింది."

నా ముందుకాలికి బంధం పడింది.

"నువ్వు వచ్చినప్పుడు యిక్కడ యిద్దరు విద్యార్థులను చూశావే - వారెవరో నీకు తెలుసునా ?"

"వారెవరో తెలుసు. కానిపేర్లు మాత్రం తెలియవు."

"వాళ్ళిద్దరూ యువజనసమితిలో ఉన్నట్లు జ్ఞాపకం... నిజమేనా ?"

"అవును, యిద్దరూ సభ్యులే ... వారేమన్నారేమిటి ?" అని ప్రశ్నించాను.

"దేశవిమోచనానంతరం, అనేకవిషయాలు తరగతిలో విశదంచేయడానికి వీలుండదని వారన్నారు. ఈ రోజుల్లో తరగతిలో వినేదానివల్ల వారి జ్ఞానతృష్ణ తీరదన్నారు. పూర్వపు రోజుల్లో నేను బోధించే పాఠాలనుగురించి కొన్నివిషయాలు చెప్పమన్నారు."

"అలాంటివి మీరు వారికి ఏమీ చెప్పలేదుగదు" ప్రొఫెసర్ ఎంతవరకూ సంస్కరించబడిందీ తెలుసుకునేందుకే పార్టీవారు యీ పథకం పన్నారని నేను గ్రహించాను.

"నేను చెప్పడానికి నిరాకరించాను. కాలంతోపాటు మనం మారవలసిందే. ప్రభుత్వవిధానానికి వ్యతిరేకంగా వ్యవహరించడం సామతంకాదు. మారనివాళ్ళను సంస్కరించబడాలనీ, మాలోని విషాన్ని పారద్రోలాలనీనాకు తెలుసును. జీవిత విధానాన్ని ఎట్లా మార్చుకోవాలో, సామాన్య ప్రజానీకంతో ఎట్లా కలవాలో మాకు తెలుసును."

ప్రొఫెసర్ రక్షింప బడ్డారు. ఆయన పరీక్షలో నెగ్గాడు. ఇక నేను నిలవలేక బయటికి వచ్చేశాను.

సమావేశాలకు హాజరయిన టీచర్ల మనస్సులలో ఎలాంటి ఊహాలు తోస్తూఉంటాయోనని నాకు ఆశ్చర్యంగా వుండేది. కొందరు బోధనా విధానాన్ని గురించి విద్యార్థులు సూచించడం గురించి తీవ్రంగా విరసన తెల్పారు కొందరు అందరిముందు నిలబడి తమ పూర్వ ప్రవర్తనకు క్షమార్పణ కోరుకున్నారు. కొందరు విద్యార్థులతో సహకరించినందుకు సిగ్గుపడ్డారు.

పైటాకి ఎంతో దూరంగావుండి ఆలోచిస్తూ ఉన్న నాకు, వారి ప్రవర్తనను గురించి అధికంగా నిందించాలని లేదు. ప్రాత క్రొత్తలమధ్య చిక్కుకుని వారు సతమత మయ్యారు. దేశం అల్లకల్లోలంగా ఉన్న స్థితిలో వారు ఉపాధ్యాయ వృత్తిని ప్రారంభించారు. దీర్ఘకాలం కొనసాగిన జపాన్ యుద్ధ సమయంలో పాఠశాలలు సర్వనాశనం కాకుండా కాపాడటానికి ఎన్నో బాధలను వారు ధైర్యంగా అనుభవించారు. జపాన్ వారి బారినిపడకుండా కళాశాలలను దూరంగా తీసుకువెళ్ళారు. వి. జె. దినోత్సవానంతరం తమ విద్యార్థులతో పెకింగ్ తిరిగి వచ్చారు. నోట్ల ముమ్మరం, అధికధరలు ఆర్థికంగా వారిమీాద దెబ్బతీశాయి. ప్రభుత్వ విధానం ఉత్సాహాన్ని చంపివేసింది. విజయం సంప్రాప్తించి నందువల్ల ఆశించిన దేమీా వారికి జరగ లేదు. చాలామందిని నిరుత్సాహం అలసట ఆవహించాయి. ఒకవిధమైన స్తబ్ధత ఏర్పడింది. పరిస్థితులను ఎదుర్కొనే స్తోమత వారిలో నశించిపోయింది. అందువల్ల వారిని నేను నిందించలేను.

12

## ఆత్మ విమర్శ

చైనా దేశంలో విశ్వవిద్యాలయ అధ్యాపకులన్నా విద్యార్థులన్నా అనాదినుంచే ఎంతో గౌరవ మర్యాదలు వున్నాయి. ఇచ్చటి బోధనా పద్ధతులు, అధ్యయన పద్ధతులు అపూర్వమైనవి. ఇలాంటి సంప్రదాయాలు యితర దేశాలలో కానరావు. చాలమంది ప్రొఫెసర్లు విద్యార్థులు - తమకు సంభవించే కష్టనష్టములను గూడా లెక్కచేయకుండా కమ్యూనిస్టులను అధికారంలోనికి తీసుకురావడానికి కృషిచేసారు. ఈ విశ్వవిద్యాలయ వ్యక్తులు జాతీయ జీవితంలో ప్రముఖపాత్ర వహిస్తారని కమ్యూనిష్టులు ప్రచారం చేసి వుండటం వల్ల, విమోచనా నంతరం విశ్వవిద్యాలయ జీవితవిధానంలో హటాత్తుగా మార్పు తీసుకుని రావడానికి ప్రయత్నించడం కృతఘ్నతా సూచకమౌతుంది. పైగా 1949 లో పరిస్థితులు యింకా చక్కబడలేదు. చైనామీద కమ్యూనిస్టుల ఆధిపత్యం సందిగ్ధావస్థలోనే ఉన్నది.

దీనికి మరో చిక్కుగూడా ఉన్నది. నూతన సాంఘిక వ్యవస్థలో పాతరకం విశ్వవిద్యాలయానికి తావులేదు. విప్లవానికి సహాయం చేయగల వ్యక్తులను తయారుచేయటంతో వాటి పని పూర్తి అయింది. ఇకముందు విప్లవంతో పనిలేదు. చెల్లా

చెదిరుగా ఉన్న శక్తులను కేంద్రీకరింపచేయాలి. ఈ కృషికి పాతకాలపు పండితులు పనికిరారు. మంచి సాంకేతిక పరిజ్ఞానముగల కార్యకర్తలు కావాలి.

• ఈ విశ్వవిద్యాలయాలను ఏం చెయ్యాలి అనే సమస్యకు కమ్యూనిస్టులు ద్వివిధ పరిష్కారమార్గం రూపొందించారు. పాత పాఠశాలలను తోడుగా కొత్త విశ్వవిద్యాలయాలను నెలకొల్పడం మొదటిమార్గం. ఇందులో విద్యార్థులుగా చేరే పార్టీ, యువజనసమితి సభ్యులు రాజకీయాల్లో బాగా రాటు తేలిన వారై ఉంటారు. ముందు ముందు బాధ్యతాయుతమైన ప్రభుత్వ పదవులను చేబట్టేందుకు తగిన శిక్షణను వీరు పొందుతారు.

ఇక రెండవమార్గం: పాత విశ్వవిద్యాలయాల్లో కొన్నింటిని అలంకారార్థం ఉండి, మిగతా వాటిని మూసి వేయటం. వీటిలో సంస్కరణలు అమలు జరపాలి. చైనాలో చదువుకున్నవారి సంఖ్య బహు తక్కువగా ఉన్నది. వీరిలో గూడా పార్టీ అడుగుజాడలలో నడిచే వారికి, కేడర్లకిమాత్రమే పదవులను సంపాదించి తమ ప్రజ్ఞను ప్రకటించుకునే అవకాశం ఉన్నది.

అనేక విద్యాలయములలో బోధించే పాఠ్య విషయాలను మార్చవలసిఉంది. మార్క్స్, ఏంగెల్స్, లెనిన్, స్టాలిన్ మావ్ సె-టుంగ్, సెమెనోవ్, మొదలైనవారి రచనలు తరగతుల్లో పాఠ్యాలుగా ఉపయోగించాలి. పూర్వపు రోజుల్లో పరీక్షలలో నెగ్గవలెనంటే అనేక జాతీయ ఉద్గ్రంథాలను చదవవలసి ఉండేది. ఇప్పుడు చరిత్ర, ఆర్థిక శాస్త్రము, తత్త్వ

శాస్త్రము సాహిత్య విమర్శ - యివేగాక యింకా పదార్థ విజ్ఞానశాస్త్రము, జీవతత్వ శాస్త్రము మొదలైన వాటిలో విభిన్న దృక్పథాలని బూర్జువా పాండిత్య ప్రకర్షగా ప్రకటించారు. పాఠ్యక్రమమం అంతా మారిపోయింది. మార్క్సు, లెనిన్, స్టాలిన్ గ్రంథాలు ప్రతి విద్యార్థి చదవవలసి ఉంది; ప్రొఫెసర్లు బోధించవలసిఉంది. పురాతన గ్రంథాలుమాయమై పోయినవి.

చాలామంది టీచర్లు పూర్వపు పద్ధతిలో హాజరుపట్టీ చదవటం మానివేశారు. నువ్వుగనక కమ్యూనిస్టు లీగ్ మిత్రులతో బాగా జోస్తీగా వుంటే నీ యిష్టం వచ్చినప్పుడు తరగతికి హాజరుకావచ్చును లేదా మానవచ్చును. నువ్వు క్లాసులో చెప్పింది వినకపోయినా, యితర మిత్రులతో బాతాఖానీ వేస్తున్నా అధ్యాపకులు నిన్ను చూసీ చూడనట్లు ఊరుకుంటారు. నీ ధోరణి యిహ భరించ శక్యం కానప్పుడు మాత్రం దయయుంచి నిశ్శబ్దంగా వుంటారా" అని అధ్యాపకుడు అందరి వైపూ చూస్తూ అంటాడు. ప్రత్యేకం ఏ విద్యార్థినీ వేలుపెట్టి చూపడు. అట్లా చేస్తే లీగ్ సభ్యుని గౌరవానికి హానికరంగదా.

పాఠ్యవిషయముల సంస్కరణ కోసం ఎదురుచూస్తున్న అధ్యాపకుల తరగతులయందు యీ విధమైన వాతావరణం అలుముకుని వున్నది. రాజకీయ తరగతులలో క్రమశిక్షణ విధానం వేరేవిధంగా వుంటుంది. అధ్యాపకుల వద్ద హాజరుపట్టీ వుండదు. కాని తరగతి ముగిసింతోటే ఎవరెవరు హాజరు కాలేదో, ఏ విద్యార్థి పాఠాన్ని శ్రద్ధగా ఆలకించలేదో వారందరి పేర్లు ప్రతిక్లాసు చైర్ మెన్ వ్రాసి ఒకనివేదిక సమర్పిస్తాడు.

రాజకీయ ఉపన్యాసాలు పెద్ద లెక్చర్ హాలులో జరుగుతాయి. క్లాసులో వందమంది విద్యార్థులు, యిద్దరు అసిస్టెంట్లు, ఒక అధ్యాపకుడు ఉంటారు. విద్యార్థుల వరసల్లో పార్టీ యువజన సమితి సభ్యులు చెల్లా చెదరుగా కూర్చుని మిగతా విద్యార్థుల ధోరణిని కనిపెట్టి చూస్తూ వుంటారు. విద్యార్థులకి సహాయం చేయడమే పార్టీలీగ్ సభ్యుల ఆశయం.

ఈ కార్యకలాపంలో మాకు సహాయం చేయడానికి పార్టీ యూత్ లీగ్ సభ్యులకి కొంతటైము తీసుకుంటుంది. మొదటి ఆరు వారాలు యీ తరగతుల్లో విద్యార్థులు ఏ విధమైన ఆసక్తి చూపకుండా చాలా మందకొడిగా వున్నారు. మాలో కొంతమంది అధ్యాపకుల ముఖాలను వంకరటింకరగా బొమ్మలుగీస్తూ కాలం గడిపారు. కొంతమంది యిదివరకు తరగతులలో విన్న పాఠాలు నోట్సు వ్రాసుకున్నారు. కొందరు మిగతావారి నోట్సు కాపీ చేసుకున్నారు. కొందరు రంగు అద్దాల కళ్ళజోళ్ళు ధరించి కునికిపాట్లు తీశారు. ఈ విధమైన నిర్లక్ష్య చర్యలన్నీ—పరస్పర సహకారసంఘ సమావేశాలలో పైకిఎత్తారు. రాజకీయ బోధనా తరగతుల్లో విద్యార్థులు యితోధికంగా శ్రద్ధాసక్తులు కలిగివుండటం అవసరమనీ, రాజకీయ పాఠాలను లక్ష్యశుద్ధితో మననం చేసుకోవాలనీ నాయకులు మాకు హెచ్చరిక నిచ్చారు. మేమంతా కూడా తరగతుల్లో రాజకీయ విషయాలను శ్రద్ధతో వినాలనీ, ఉపన్యాసాలు నోట్సు వ్రాసుకోవాలనీ, అలక్ష్యంచేసే విద్యార్థులను మందలించాలనీ నిర్ణయాలు తీసుకున్నాం. ఈ మీటింగుల అనంతరం పరిస్థితి పూర్తిగా మారిపోయింది. ప్రతి విద్యార్థి

తనస్థానంలో కట్టివేసినట్లుగా కూర్చుని శ్రద్ధగా వింటూనో లేక నోట్సు వ్రాసుకుంటూనో ఉన్నట్లుగా కన్పించేవాడు.

ఈ తరగతుల్లో బోధించే విషయం ఎప్పుడూ ఒక్కటే. ఏ విధమైన మార్పూ ఉండేది కాదు. గతితార్కిక భౌతికవాదం ఒక్కటే యదార్థమైన తత్వశాస్త్రమనీ, ప్రామాణికమనీ-మిగతా తత్వములన్నీ విద్రోహకరములైనవనీ సారాంశం. కాని అధ్యాపకులు చెప్పే విషయాలలో ఎన్నో తప్పులూ, అసందర్భాలు దొర్లుతూ ఉండేవి.

ఉదాహరణకు ఒక అధ్యాపకుడు చెప్పిన మాటలు మనవిచేస్తాను. "ఇంటా బయటా కూడా సామ్రాజ్యవాదులను విద్రోహులను హతమార్చడానికి, శ్రామికవర్గ నాయకత్వం క్రింద మనం విప్లవం లేవనెత్తాము. ధనికవర్గాలను, భూస్వాములను రూపుమాపడానికి రైతువర్గాన్ని సమీకరించింది. చోటా బూర్జువాలు, జాతీయబూర్జువాలతో చేతులు కలిపాయి. మనుగడ అనేది చైతన్యాన్ని నిర్ణయిస్తుందని మనకు తెలుసును. విప్లవంలో ముఖ్యపాత్రను ధరించినది కార్మికులే. సహకార క్షేత్రాలలోనూ, భారీఎత్తు పరిశ్రమలలోనూ పాల్గొనడంవల్ల కార్మికులు ఎంతటి కష్టాలనైనా ఎదుర్కొనగల శక్తిని సంపాదించారు. వారిలోలత్యశుద్ధి, దృఢనిశ్చయం ఉన్నాయి. మనం చోటా బూర్జువాతరగతికి చెందివున్నాము. సంధికి మనం సిద్ధమే. మనలో స్వలాభాపేక్ష, గర్వం పాళ్ళుఎక్కువగా ఉన్నాయి. ఉన్నత పదవులకు ఎగబ్రాకాలని మన ఉబలాటం. ఇప్పుడు పరిస్థితులు, రోజులు మారాయి. మనం మారవలసిన తరుణం ఆసన్నమయింది. పురాతన భావాలను తొలగించి

వేసుకోవాలి. బూర్జువా చైతన్యాన్ని పారద్రోలాలి, శ్రామిక వర్గ దృక్పథానికి మనం కట్టుబడి ఉండాలి. విప్లవంలో అగ్రగాములం కావాలి."

మాకు ఒక ప్రశ్న అడగాలని ఉన్నది. శక్తిమంతమైన రెండువర్గాలు ఒకదానిప్రక్క ఒకటి ఎట్లా మనుగడ సాగించగలవు? శ్రామికవర్గం జన్మతః అతిశక్తివంతమైనదని అంటున్నావు - తర్వాత నువ్వు మాతో అంటున్నదేమిటి. శ్రామికవర్గీయులు కాని మేము - అనగా విద్యార్థులుగూడా శక్తిమంతులు కావచ్చును. కాబట్టి నువ్వు అంటున్నదేమిటంటే - నలుగురు అప్పచెల్లెళ్ళలో పెద్దామె (శ్రామికవర్గం) చక్కని చుక్క. కాని మూడవచెల్లెలు (మేము)గూడా చక్కనిచుక్క కావచ్చును!

"నీ ఛోటా బూర్జువా మన స్తత్వాన్ని తొలగించుకునే విషయం ఏమిటి? మనుగడ, చైతన్యాన్ని నిర్ధారణచేస్తుందని నువ్వే చెప్పావు. ఇప్పుడు స్వేచ్ఛాయుత అభీష్టంతో ఆ చైతన్యాన్ని తొలగించుకుంటావేమిటి? నీ మొదటి స్టేట్మెంట్ ప్రకారం 'స్వేచ్ఛాయుత అభీష్టం' అనేదానికి మనుగడలేదు. బూర్జువావర్గ 'పూర్వమనుగడ'లో మార్పుతీసుకుని రాలేకపోతే, కృషి, జీవితవిధానాలు యథాతథంగా ఉన్నట్లయితే - బయటి ప్రోద్బలంలేకుండా తనంత తానుగా బూర్జువా చైతన్యము ఎట్లా మారుతుంది?"

నా మనస్సును యిలాంటి సందేహాలు చాలా ఆవహించి ఉన్నాయి. రాజకీయ తరగతిలో నా సందేహాలను వెలి

బుచ్చేందుకు గనక అవకాశం ఉండిఉంటే వీటిలో కొన్ని అధ్యాపకునిద్వారా నివృత్తి అయ్యేవి.

తరగతిలో మా అధ్యాపకులు చెప్పింది వినటమే తప్ప మేము ప్రశ్నించడానికిగాని ఆ విషయాలను చర్చించడానికిగాని అవకాశం లేకపోవటంవల్ల పాఠాలు చకచకా జరిగిపోతున్నాయి. చైనాలో అడపాదడపా కానవచ్చే ఆహారకొరతకు పరిష్కార మార్గం ఒక పావుగంటలో మా లెక్చరర్ సూచించారు. "ఆహారకొరత అనేది అసందర్భ ప్రలాపం. యథార్థానికి మన దేశం, తినేందుకు అనువైన అనేకపదార్థాలను ఉత్పత్తి చేస్తోంది. మనప్రజలకు తగినంత సరఫరాచెయ్యడమే కాదు. ఇండియాలాంటి యితర దేశాలకు ఎగుమతి చెయ్యగలిగినంతఅధికంగా ఆహారపదార్థములను మనం ఉత్పత్తిచేస్తున్నాము. పూర్వ ప్రభుత్వ కాలంలో మారుమూల ప్రాంతాలలో క్షామాలు సంభవిస్తూ ఉండేవి. అధికార్లలోని అవినీతి లంచగొండితనం, యింకా సరియైన రవాణా తంతి తపాలా సౌకర్యాలు లేక పోవడం యిందుకు కారణములై ఉండేవి. రవాణా, తంతి తపాలా సౌకర్యములవిషయమై కమ్యూనిస్టుపార్టీ ఎంతో శ్రద్ధ తీసుకుంటున్నది. ఈ రోజున మనం ఎదుర్కొంటున్న తాత్కాలిక ఆహారకొరత — త్వరలోనే తొలగిపోతుంది!"

ఇతర దేశాలకుగూడా ఎగుమతి చేయగలిగినంత అధికంగా ఆహారపదార్థాలు మాకు నిజంగా ఉన్నాయా? అసలు రహస్యం ఆ తర్వాత బయటపడింది. ఈశాన్యదిశను పండిన పంటలను రైళ్ళలో ఎక్కించి సోవియట్ యూనియన్‌లోకి తర్లిస్తున్నారు. ఉపన్యాసాలలో చెప్పినట్లు ఆహార పదార్థాలు

అధికంగా ఉన్నందుకు దృష్టాంతరం మాకు కన్పించాలిగదా. పూర్వపు రోజుల్లో రైలుమార్గాలకి ఆటంకాలూ, రోడ్డు మార్గాలకి అవరోధాలూ కల్పించిన వారెవరు? బ్రిటిషు ప్రభుత్వం తన పాలనలోనున్న నగరాలకి ఆహారపదార్థములను సరఫరా చేసే మార్గాలకు అవరోధం ఏమాత్రం కల్పించి ఉండదు. రవాణా సౌకర్యముల విషయంలో పార్టీ అధిక శ్రద్ధ వహిస్తూ ఉన్న మాట నిజం కావచ్చును. సోవియట్ యూనియన్ లోకి నేరుగా వెళ్ళే రైలుమార్గం మంచి స్థితిలో ఉన్నది.

ఈ లెక్చర్లు మిగతావాటికన్న దీర్ఘంగా ఉన్నట్లు కన్పించడం మీకు ఆశ్చర్యాన్ని కలిగిస్తున్నదా? విషయాన్ని గ్రహించడానికి మనస్సు యంత్రంలాగా పరుగుపెట్టాలి. చకచకా పెన్నుతో నోట్సు వ్రాసుకుపోవాలి. మధ్యలో అలసట వచ్చినప్పుడు పెన్నును ఒక్కసారి కింద ఉంచి అరచేతులతో కళ్ళను ముఖాన్ని తుడుచుకుని, తిరిగి వ్రాతకు ఉపక్రమించాలి. రాజకీయ తరగతులకి ఎవ్వరూ గైరు హాజరు అయ్యేవారు కారు. చిల్లర మల్లర సుస్తీల నెపంతో హాజరుకాకుండా ఉండటం మంచిదికాదు. సుస్తీగా ఉన్నట్లు డాక్టరుచేతగాని నర్సుచేతగాని సంతకం పెట్టించడానికి నువ్వు ఎంతో వాగ్వివాదంలోకి దిగవలసి ఉంటుంది. కాబట్టి, ఆరోగ్యం బాగా లేకున్నా క్లాసుకు హాజరు కావటమే ప్రాణానికి హాయి. తరగతిలో ఎంతో శ్రద్ధాసక్తులతో కూర్చునిఉన్నట్లుగా కన్పించాలి. ఏదో ఒకనాడు కాస్త అలసటగాను చికాకుగానూ ఉండక తప్పదు. కాని మానేటట్లు మనను ఒక కంట కనిపెట్టి చూస్తూనే

ఉంటారు. క్లాసు ముగిసింతోటే నిన్ను ప్రశ్నించటం జరుగుతుంది: "నువ్వు యివ్వాళ కాస్త చికాకుగా ఉన్నట్లున్నావ్ కామ్రేడ్. నీకేదన్నా సమస్య ఉన్నదా?"

ఈ మానేటర్లు బెడద తొలగించుకోవడానికి విద్యార్థినులకు ప్రకృతి ప్రసాదించిన వజ్రాయుధం ఒకటి ఉన్నది. ఆ ఆయుధాన్ని ఉపయోగించడానికి కొందరు విద్యార్థినులు ఏవిధమైన సంకోచము చూపించరు.

"ఇవ్వాళ క్లాసులో నువ్వు అదోరకంగా ఉన్నావేం కామ్రేడ్. నిద్రమత్తుగా కనిపించావు. వంట్లో బాగుండలేదా" అని పార్టీ లీడర్ ప్రశ్నిస్తాడు.

"రాత్రి నాకు బాగా నిద్రపట్టలేదు... నేను బయట చేరాను..." లీడర్ యీ జవాబుతో వెనుకంజ వేస్తాడు.

ఆంతరంగిక మిత్రులనుకునేవాళ్ళలో కొందరు యీ విధానాన్ని గురించి విమర్శించడానికి అప్పుడప్పుడు పూనుకునేవారు. ఒకరోజున ఒక మిత్రునితో కలిసి క్లాసుబయటకు వచ్చాను. "మిస్ యన్ నిన్ను నేను కనిపెట్టి చూస్తున్నాను. క్లాసులో కూర్చుని నోట్సు వ్రాస్తున్నప్పుడు నిన్నుచూస్తే అంత ఆసక్తితో పనిచేస్తున్నట్లు కనిపించలేదు. కాని బయటికి వెళ్ళేటప్పుడు మాత్రం ఆ నోట్సును ఏదో పెద్ద పెన్నిధిలాగా తీసుకుని వెడుతున్నట్లు కనిపిస్తావు. రాత్రిళ్ళు ఆ నోట్సును ఏం చేస్తున్నావ్—దిండుక్రింద పెట్టి పడుకుంటున్నావా?"

"ఇవాళ నేను ఆరుపేజీల నోట్సు వ్రాశాను. నువ్వు కూడా అన్ని పేజీలు వ్రాసి ఉంటావు—" అని గర్వంగా అన్నాను.

మా క్లాసురూమ్‌నుంచి డార్ మెటరీలోని పరస్పర సహకారసమావేశంలోకి మేము నేరుగా నడిచాము. లెక్చర్ నోట్సు అలక్ష్యం చేద్దామనుకున్నా పరస్పర సహకార సంఘం మాత్రం అందుకు అనుమతించదు. దిండు క్రింద నోట్సు పెట్టుకోవడం అనేది కొంత అతిశయోక్తి మాత్రమే. ప్రతి విద్యార్థివలెనే నేనుగూడా అనేక సంఘాలలో సభ్యురాలిని. ఈ సంఘ కార్య కలాపాలతో ఒక్క క్షణంగూడా మాకు తీరుబడి ఉండదు.

నేను సభ్యురాలినిగా ఉన్న సర్కిల్‌లో నాగదిలో వున్న మరో బాలిక, ప్రక్కగదిలో వున్న యిద్దరు బాలికలు సభ్యులుగా వున్నారు. వీరిలో ఒకామె పార్టీ మెంబరు. ప్రతిసర్కిల్ లోనూ విధిగా ఒక పార్టీ మెంబరో లేక లీగ్ మెంబరో సభ్యుడుగా వుండి నాయకత్వం వహించి కార్యకలాపాలు నడుపుతూ ఉంటాడు. ఏ సర్కిల్‌లోనన్నా పార్టీ మెంబరు లేకపోతే యిందులోనుంచి ఒకరిని మరొక గ్రూపులోకి పంపించి ఆ స్థానం ఖాళీగా వుంచుతారు. ఆ ఖాళీలో పార్టీ మెంబరును చేర్చుకునేటట్లు సర్కిల్ సభ్యులమీద ఒత్తిడి తీసుకువస్తారు. ఏదో ఒక మార్గాన ప్రతి సర్కిల్‌లోను ఒకొక్క పార్టీ మెంబరును యిరికిస్తారు.

విమోచనానంతరం ఈ సర్కిల్స్‌ను ప్రప్రథమంగా నెలకొల్పినప్పుడు యీ కార్యకలాపంలో సహాయం చేయడానికి వచ్చిన గాయకులు తమ ఉద్దేశ్యాన్ని యీ విధంగా వెల్లడించారు. "ఈ సర్కిల్స్‌ద్వారా విద్యార్థులు సమిష్టి జీవితాన్ని అలవరచుకోవడం, ఒకరినొకరు ప్రోత్సహించుకునేందుకు తగిన అవకాశాలను కల్పించడం, తద్వారా వారిజీవితాలను సార్థకం

చేయడం మా ఆశయం" ఈ సర్కిల్స్‌లోని సభ్యులు, ఒకరి నొకరు ఒకకంట కనిపెట్టి జాగ్రత్తగా చూస్తూ ఉంటారు.

ఈపరిస్థితులలో అభ్యుదయవాదిగా నటించటం చాలా కష్టమైన పని. రంగస్థలంమీద ఒక పాత్రను సజీవంగా నటించటమంటేనే ఎంతో కష్టం. రేయింబవళ్ళు నిన్ను కనిపెట్టిచూస్తూ ఉండే వారిమధ్య నటించడమనేది సాధ్యంకాని విషయం. అందువల్ల చివరచివరకు అభ్యుదయ వాదిగా నిన్ను నువ్వు నమ్మించుకొనడంలోనే వీలూ పాలూ వున్నాయి, అంతేగాని నటనవల్ల ఏమాత్రం ప్రయోజనం లేకపోగా ప్రమాదంగూడా వున్నది.

విద్యార్థులపైన అజమాయిషీ కార్యక్రమాల్లో విమర్శనా సమావేశాలు ముఖ్యమైనవి. వారానికి ఒకసారి ఆ యా సభ్యులు ఎంత అభ్యుదయాన్ని సాధించినదీ సింహావలోకనం చేసేందుకు కొన్ని 'లివింగ్ సర్కిల్' సమావేశమౌతాయి. "హాంగ్‌కాంగ్ లోని మీ సోదరి నీకు ఉత్తరం వ్రాస్తూ బ్రిటిష్ వలస ఆధిపత్యంక్రింద అక్కడ వార్తాపత్రికలకు గల స్వేచ్ఛ యిక్కడ పెకింగ్‌లో లేదని వ్రాసింది. నీ జవాబులో యీ విషయాన్ని నువ్వు ఖండించలేదు. వార్తాపత్రికల విషయంలో ప్రజాప్రభుత్వ విధానం ఏమిటో గూడా నువ్వు విశదీకరించడానికి ప్రయత్నించలేదు."

"అందరితో పాటు అడుగువెయ్యటం వినా చేసేందుకు మరేం తోచడంలేదని నువ్వు నిన్న మిస్ వాంగ్‌తో అన్నావుట కదా – నీ భావం ఏమిటి ?"

"డ్రాయింగ్ తరగతిలో 'వివియన్ లీ' బొమ్మ మోడల్‌గా నువ్వు చిత్రాలు గీస్తున్నావటగా. విదేశీ చలన చిత్రాలు విద్రోహకరమైనవి కావని నీ ఉద్దేశ్యమా?"

మిత్రుల పుస్తకాలలోని వ్యాఖ్యానాలు ఆధారంగా యిలాంటి ప్రశ్నలు విసరబడతాయి. నువ్వు బిత్తరపోతావు. ఏ సాకు చెప్పి బయటపడాలో గూడా నీకు తోచదు.

కాబట్టి ప్రతి ప్రశ్నకు నువ్వు తల ఊపవలసిందే. అవును, రాజకీయ తరగతుల్లో నువ్వు శ్రద్ధగా ఉండటంలేదు. అవును, బూర్జువా మనస్తత్వం యింకా నీనుండి పూర్తిగా తొలిగిపోలేదు; అవును, యథార్థాలకు దూరమై స్వప్నలోకాలలో విహరించాలని ప్రయత్నించావు; అవును, హాంగ్‌కాంగ్‌లోని సోదరిని తలుచుకుంటే నీకు యీర్ష్య కలిగింది. నువ్వు గడుపుతున్న జీవితంలో నువ్వు తగినంత ఆసక్తిని తీసుకోలేదు. విప్లవంఅంటే నీకు నిశ్చితాభిప్రాయంలేదు. పాశ్చాత్య సామ్రాజ్యవాదతత్వంతో నీ మనస్సు విషపంకిలమైపోయింది. ఈ విషాన్ని పారద్రోలడానికి మారుగా నీలో బూర్జువా మనస్తత్వాన్ని వృద్ధిచేసుకున్నావు.

ఈ తప్పులను ఒప్పుకోవడంతో బాటు, యికముందు ఎన్నడూగూడా యిలాంటి తప్పులను చేయబోనని నువ్వు గట్టిగా వాగ్దానాలు చేస్తావు. రాజకీయ పాఠాలను మననం చేస్తాననీ నఖశిఖ పర్యంతం పూర్తిగా మారిపోతాననీ నిశ్చితాభిప్రాయంగా హామీనిస్తావు. ఈ రోజున నీతోటి విద్యార్థులు నిన్ను విమర్శించి తద్వారా సంస్కరణకు సహాయంచేసినందుకు ధన్యవాదాలు అర్పిస్తావు. ఈ విషయాలన్నీ నువ్వు

చెప్తావు – ఎంతో నమ్మకంగా చెప్తావు – లేకపోతే యిక మీటింగ్ ముగియటమనేదే ఉండదు. తాడో పేడో తేల్చే వరకూ అది కొనసాగుతూ ఉండవలసిందే!

సామాన్యమానవుడు తనని తాను సనిమర్శకంగా పరీక్ష చేసుకోడు. దీనికి అలవాటు కావడం మాకు చాలా కష్టమనిపించింది. మొదట్లో మాకు ఎంతో బాధగా ఉండేది. తల ఎత్తుకోలేకపోయేవాళ్ళము. వెళ్ళి దిండ్లమధ్య తలదూర్చేవాళ్ళము. కాని నీతోపాటు నీ గదిలో నివసించే సహవాసిని విస్మరించడానికి వీలులేదు. నీ కలవరపాటు, భయాందోళనలు కనిపెట్టి ఆమె, వచ్చే సమావేశానికి ఒక ప్రసంగాన్ని తయారు చేస్తోంది. "విమర్శ నందుకొన్న మిస్ యెన్ ఏ విధమైన కృతజ్ఞత ప్రకటించకపోగా రహస్యంగా తన నిరసనను తెలియజేస్తోంది..."

నీలోని అలసటను ఉపశమింపచేసుకోవడానికి ఒంటరిగా ఏ పార్కుకో వెళ్ళటం అంతమంచి పని కాదు. నువ్వు ఒక్కడానివీ కూర్చుని చాలా సమయాన్ని వ్యర్థం చేశావని ఎవరన్నా అనుకోవచ్చును. ఏ నవలనైనా చదివితే కాస్త మనస్సుకి ప్రశాంతత కలగవచ్చును. కాని కమ్యూనిస్టులు నువ్వు వాటిని చదవడానికి వీలులేదని నిషేధించారు. చివరికి నీకు ఏమీచేయడానికి వీలులేదు; మనస్సులోని చికాకును పిచ్చైనంతవరకు అదిమిపట్టాలి. విమర్శనా విధానంవల్ల నీలో విపరీతమైన మార్పు వచ్చిందని కమ్యూనిస్టులు నిజంగా నమ్మేటట్లు నీ నీ పాత జీవితాన్ని గురించి పశ్చాత్తాపం నటించాలి. సమావేశం అయినవెంటనే ఒక కామ్రేడ్ దగ్గరకు వెళ్ళి అతని

చెయ్యిపుచ్చుకుని "కామ్రేడ్ నువ్వు యివ్వాళ సరిగా విమర్శించినందులకు నిజంగా కృతజ్ఞురాలిని. నేనన్నా, కమ్యూనిస్టు పార్టీ అన్నా నీకు ఎంత గౌరవమో నాకు బోధపడింది" అనాలి.

ఈ విధమైన పద్ధతికి చాలామంది మిత్రులు అలవాటు పడ్డారు. కమ్యూనిస్టుల చెవులకి ఏ మాటలు యింపుగా ఉంటాయో వారికి బాగా తెలుసును. "కామ్రేడ్—నాపూర్వ జీవితాన్ని తలుచుకుంటే నాకే ఎంతో సిగ్గుగా ఉంది...కొద్ది నెలలలోనే నేను యింతగా మారిపోవటం చాలా ఆశ్చర్యంగానే ఉంది. ఇదంతా మీ సహాయం వల్లనే సాధ్యమయింది..." ఈవిధమైన ధోరణితో విద్యార్థి నాయకులను బుట్టలో వేస్తున్నాముగదా అని కొందరికి మనస్సులో గర్వంగా ఉండేది.

సమావేశంలో నువ్వు ఆత్మవిమర్శ చేసుకోవడం, ఇతరులు నీ తప్పులను ఎత్తిచూపడంతో పని పూర్తికాలేదు. ఏదన్నా ఒక మీటింగులో నీతప్పులు ప్రస్తావన రాకపోయినా నీ బాధ్యత అంతటితో పూర్తికాలేదు. నీ మిత్రులను నువ్వు విమర్శించాలి. నువ్వుగనక విమర్శించకపోతే నీమీద మరికొన్ని నిందలు పడతాయి. "నీతోటి విద్యార్థులన్నా, నీ చదువుకు కారణభూతులైన ప్రజలన్నా నీకు లక్ష్యంలేదు" అని నీమీద ముద్ర పడుతుంది. నీమిత్రుల్ని లక్ష్యంగా చేసుకుని వారితప్పులు నువ్వు ఎంచాలి. పార్టీ సభ్యులలోను, యూత్ లీగ్ సభ్యులలోను తప్పు లెంచడం చాలా కష్టం. తమ తప్పులను గురించి వారు ఎల్లప్పుడూ అప్రమత్తులై ఉంటారు. పైగా పార్టీ ఇటు

వంటివారి విషయంలో తీవ్రచర్యలు తీసుకుంటుంది. కాబట్టి వారి జాగ్రత్తలు వారికి తెలుసును. కమ్యూనిస్టువిద్యార్థి తప్పు చేసినా అతనిని విమర్శించే అవకాశం మాకు లేదు. ఇక మిత్రులమైన మాలో మేమే ఒకళ్ళమీద ఒకళ్ళం తెగపడి విమర్శించుకోవాలి.

ఈపద్ధతి మాలో చాలామందికి బాధాకరంగాతోచింది. ఒక రోజున మిత్రులం కొంతమందిమి వచ్చికబయల్లో కూర్చుని ఉన్నాము. మాలో ఒకడైన చేటా - మింగ్ ఇట్లా అన్నాడు "వ్యక్తిగతంగా మనలో ఏ ఒక్కరికీ బలంలేదు. కాని మనం అంతా గనక కలిస్తే మనం సాధించలేనిది ఏమీ ఉండదు. వాళ్ళలాగే మనంగూడా ఎందుకు సంఘటితం కాకూడదు- మన నాటకం మనం ఆడదాం."

అతని మాటలు మాకు ఆశాజనకంగా తోచాయి.

అతను మళ్ళీ ప్రారంభించాడు "వినండి! సమావేశానికి ముందుగానే వాళ్ళు అన్నీ సిద్ధంచేసుకుని, రిహార్సల్ చేసుకుని వస్తారు. అందువల్లనే మనం దెబ్బతింటున్నాము. మనం గూడా నాటకాన్ని ముందుగానే ఎందుకు రిహార్సల్ చేసుకోకూడదు. నేను చెపుతూన్న నాటకంలో మనం ఒకళ్ళమీద ఒకళ్ళు దాడిచేస్తున్నట్లు నటించాలి. ముందుగా కథ గనక అర్థంచేసుకుంటే విమర్శనా సమయంలో ఏ ఒక్కరికీ మనస్సు నొప్పికలగదు - మీ అభిప్రాయం ఏమిటి? మనవైపు వాడి మీద మనం అందరం దాడిచేద్దాము. నిందితుడు తన తప్పును కప్పుకుంటూ వాళ్ళు లేచే లోపల హఠాత్తుగా తప్పు ఒప్పుకుంటాడు. వాళ్ళు మూక ఉమ్మడిగా మనమీద దాడికి లేచి

నప్పుడు మనం కలసికట్టుగా ఒకళ్ళకి ఒకళ్ళం మద్దతు యిచ్చుకుంటూ మాట్లాడదాం. అట్లా చేస్తే వాళ్ళ పొగరు కొంత అణుగుతుంది...మనంగూడా నవ్వులపాలు గాకుండా తప్పించుకో వచ్చును. ప్రయత్నంచేసి చూద్దాము. మీరేమంటారు ?”

“ఇది తాత్కాలిక ఉపశమనం మాత్రమే. ఇది శాశ్వత పథకమేమీ కాదు.” అని ఒకరు ఆక్షేపణ తెలిపారు.

“బ్రహ్మాండమైన పార్టీ బలంముందు యిలాంటి చిట్కా ఎత్తులవల్ల ప్రయోజనం అంతగా ఉంటుందని నేను అనుకోను” అని నేను అన్నాను.

మా అందరి అభిప్రాయాలు ఎట్లావున్నా దీనికి విరుగుడుగా ఏదో ప్రక్రియ చేయక తప్పదని మేమంతా నిర్ణయించుకున్నాము.

మీటింగు సమయంలో మేమంతా ముఖాముఖి ఒక వలయంగా కూర్చునేవాళ్ళము. ఎవరన్నా మాట్లాడేటప్పుడు ఒకళ్ళముఖాలను ఒకళ్ళం బాగా తేరిపార చూసుకునేందుకు వీలుగా వుంటుంది. ఆరోజున చౌటా-మింగ్, చైర్మన్ ప్రక్కనే కూర్చోవటం సంభవించింది. అతను లేచి తనప్రసంగానికి ఉపక్రమించాడు.

“కామ్రేడ్స్! ఈరోజున నేను ఆత్మవిమర్శ చేసుకోబోతున్నాను. రాజకీయ తరగతిలోని నా కార్యకలాపాన్ని గురించి నేను చాలా ఆరాటం చెందుతున్నాను. నేను ఒక్కరోజుకూడా గైరుహాజరు కాలేదు. ఉపన్యాసాలకు సమిష్టి చర్చలకు ఎంతో శ్రద్ధాభక్తులతో హాజరవుతున్నాను. వాటిలో

పొల్గొంటున్నాను. నేను యిచ్చే జవాబులకన్నా వేసే ప్రశ్నలే అధికంగా వుంటున్నాయి. అయితే నా ఉద్దేశ్యం తోటి విద్యార్థులకు సహాయం చేయకుండా వుండవలెనని కాదు. కాని మరో దృష్ట్యా చూస్తే, కమ్యూనిస్టు సిద్ధాంతాలను గురించి నాకు తెలిసింది బహుస్వల్పమనీ, అందువల్ల యితరులకు సహాయం చేయలేక పోతున్నాననీ స్పష్టమవుతుంది. రాజకీయ సంబంధమైన గ్రంథాల నన్నింటినీ నేను చదివాను. ఇక నిత్య జీవితంలో ప్రతిపనినీ తూచ తప్పకుండా అతి జాగ్రత్తగా నిర్వహిస్తున్నానని తోటి విద్యార్థుల కందరికీ తెలుసును, అందువల్ల యీ విషయాన్ని గురించి నేను ప్రత్యేకంగా ప్రస్తావించ వలసిందేమీ లేదు... నాకు తెలియని అనేక తప్పిదాలను నేను చేసివుండవచ్చును. యీ తప్పులను గురించి మీరు వ్యాఖ్యానించ వలసిందిగా కోరుతున్నాను." అంటూ నావైపు ప్రోత్సహిస్తున్నట్లుగా చూశాడు.

అంతగా ప్రమాదం లేనికొన్ని తప్పులను ఎంచుతే, అతను ఒప్పుకునేందుకు అవకాశం యిచ్చినట్లు అవుతుందని నేను భావించాను. నేను మాట్లాడడానికి లేచి నిలబడక పూర్వమే యూత్ లీగ్ సభ్యుడు హఠాత్తుగా నిలబడ్డాడు "మనతోటి విద్యార్థిచౌ, రాజకీయ తరగతులయందు యిటీవల ఎంతో ఆసక్తిని కనబరచడమే గాకుండా అభ్యుదయాన్ని కూడా సాధించాడు. ఇది శుభాసూచకము. అతను యింకా అధికంగా కృషి చేస్తాడని మేము ఆశిస్తున్నాము..." ఈ విధంగా ముందు ప్రత్యర్థిని నిరాయుధుణ్ణి చేసి మళ్ళీ ఉపక్రమించాడు.

"వ్యక్తియొక్క కృషిమీదనే అతని రాజకీయ పరిజ్ఞానం ఆధారపడి ఉంటుంది. తరగతిలో పాఠాలు శ్రద్ధగా విని, నోట్సు చదువుతూ ఉంటే తోటి విద్యార్థుల మానసిక సమస్యలను పరిష్కరించడానికి వారికి నువ్వు తోడ్పడగలవు. ఇతరులకి సహాయం చేయటంలేదని నువ్వు ఒప్పుకున్నావు. దీనికి కారణం, నువ్వు నీ బాధ్యతలను గుర్తించకుండా ఉండిఉండాలి, లేదా రాజకీయ పాఠాలు బాగా మననం చేసుకోకుండా నైనా ఉండి ఉండాలి—నువ్వు ఒప్పుకుంటావా?"

చౌ లేచాడు "ఒప్పుకోలేను. రాజకీయ పరిజ్ఞానం కోసం నేను బాగా కృషిచేస్తున్నాను. నేను చేయగలిగినదల్లా చేస్తున్నాను. ఇప్పటికీ నా మనస్సులో యింకా అనేక సందేహాలు ఉన్నాయీ అంటే, నేను తగినంత తెలివితేటలు గలవాణ్ణి కాకపోవడమే కారణం అయిఉండవచ్చును. చాలా కష్టపడి కృషిచేశాను. కాని నేను ఎక్కువగా నేర్చుకున్నది ఏమీ కానరావడం లేదు."

మిగతా విద్యార్థులందరికన్నా చౌ బాగా తెలివితేటలు గలవాడని మా అందరితోపాటు కమ్యూనిస్టులకికూడా తెలుసును. కావాలని అతను ఎగతాళి చేస్తున్నాడా అని వారికి అనిపించి ఉంటుంది. ఒకరివైపు ఒకరు చూచుకున్నారు. అంతా కలసి ఉమ్మడిగా ముట్టడి సాగించేందుకు సిద్ధంగా ఉన్నారు. ఈ ముట్టడిని ఆకట్టడానికి నేను లేచి నిలబడ్డాను.

"కామ్రేడ్స్! మన మిత్రుడుచౌ రాజకీయ పరిజ్ఞానం కోసం తాను చేయగలిగినదంతా చేశానని తలుస్తున్నాడు. కాని మార్క్సు, లెనిన్, మావ్ సే-టుంగుల భావములు

అత్యంత గంభీరములు. వారి రచనల మహత్తును మననం చేసు కోవడానికి కొద్దికాలం చాలదు. అవి అర్ధసత్యాలను, అసత్యాలను చాటే సామాన్య రచనలు కావు. సత్యం – సంపూర్ణ సత్యం– అర్థంచేసుకోవటం చాలా కష్టం" నా ధోరణికి సెబాసుగా తలలూపే కమ్యూనిస్టులను చూస్తే నాలో నాకు నవ్వొచ్చింది.

నా నవ్వే గనక పెదవులు దాటి బయటపడిఉంటే అసలుసంగతి బట్టబయలు అయి ఉండేది. నేను అతి గంభీరంగా మళ్ళీ ఉపన్యసించడం ప్రారంభించాను. "సత్యం అనేది చిట్ట చివరికి అర్థమౌతూవుంటుంది. ఆ నమ్మకంవల్లనే యీ రోజున మనం పురోగమించగలుగుతూ ఉన్నాము. రాజకీయాలు తెలుసుకోడానికి మిత్రుడుచౌ ఎంతో కృషిచేసి ఉన్నాడు. అతను తన అన్వేషణలో అనేక కష్టాలను ఎదుర్కొనవలసివచ్చింది. అందువల్ల అతను తాను తెలివిగలవాడిని కానేమోనని సందేహింపవలసివచ్చింది. తన చుట్టుపక్కలనున్న చేలాదిప్రజలు ఎట్లా మారిపోతున్నారో, సత్యాన్ని ఎంత సులభంగా గ్రహిస్తున్నారో భవిష్యత్తులో ఒకానొకరోజున అతను గుర్తిస్తాడు. అప్పుడు అతనిలో ఆత్మవిశ్వాసం ప్రజ్వరిల్లుతుంది. అప్పుడు అతని పురోగమనం అత్యంత వేగంగా కొనసాగిపోతుంది.

జవాబు చెప్పడానికి చౌకి అవకాశం యివ్వకుండా నేను విషయం మార్చాను – "అతను నిత్యజీవితంలో ఒంటరితనానికి బాగా అలవాటుపడ్డాడు. మిగతావారితో కలిసిమెలిసి మసలుకోడానికి ఆసక్తి చూపడంలేదు. సమష్టి జీవిత ఆనం

దాన్ని అతను అనుభవించటం ఎంతైనా అవసరమని నా అభిప్రాయం.” ఒక కామ్రేడ్ అంటున్నాడు.

“మిస్. యస్. నువ్వు చెప్పినది సత్యం. సహవిద్యార్థి చౌ సాధారణంగా యితరులతో కలియడు. కలిసినా ఎంతో చిరాకుగా కనిపిస్తాడు. లైబ్రరీలో ఒంటరిగా కూర్చుని వ్రాసుకుంటాడు. తన గదిలో ఒంటరిగా చదువుకుంటాడు. పూర్వకాలపు మన స్తత్వం యింకా అతనిలో పాతుకుని ఉండటమే యిందుకు కారణం. ఈ దోషాలను అతను తొలగించుకోవాలి. శ్రామిక వర్గ యుగం ప్రారంభమైనదని అతను గ్రహించాలి. సమిష్టి జీవనానికి అతను అలవాటు పడాలి. ......”

కథ తలక్రిందులైనందుకు నాకు బాధకలిగింది. చౌని పట్టి బంధించే తాడును కమ్యూనిస్టులకు చేతులారా నేను అందించినట్లు అయింది. చౌ ఏంచేస్తాడు? తన తప్పును ఒప్పుకుంటాడా? కామ్రేడ్ తన ఉపన్యాసాన్ని చెప్పుకుని పోతూనేవున్నాడు. కాని నేను యిక ఏమాత్రం వినలేకపోయాను. కమ్యూనిస్టులలో, యిలాంటి సందర్భాలలో చాకచక్యంగా ప్రవర్తించగల సుశిక్షితప్రజ్ఞా, సంఘటితశక్తి అద్భుతంగా ఉన్నాయి.

వారితో మేము ఎట్లా పోల్చుకోగలం ?

మాకుగల అవరోధాలను ఎదుర్కొని గెలుపొందడానికి మాలో అసాధారణ శక్తులుండాలి. వాదనలోకి దిగినప్పుడు మేము అనేక నిబంధనలు పాటించవలసి ఉండటంవల్ల మా చేతులు బంధింపబడిపోయాయి. కమ్యూనిస్టు దృక్పథంతోను సిద్ధాంతాలతోను మాత్రమే మా తరఫున మేము వాదించుకోవలసి ఉంది. యిందుకు మరోమార్గంలేదు.

# 13

## శ్వేతకుంతల నాటకం

విప్లవానికి పూర్వం విమోచన అనేది దేశానికి, దేశం లోని ప్రజలకు విముక్తి కలిగిస్తుందని కలలుకనే రోజులలో సాహిత్యరంగంలో విపరీతమైన సంచలనం కలిగింది. ఒకనూతన ఉత్సాహంతో సాంస్కృతిక రంగంలో నూతన మార్గాలు ఏర్పడుతాయని మేమంతా అనుకుంటూ వుండేవాళ్ళము. ప్రజలకు ఒక నూతన సందేశాన్ని యీ కథలు, గాథలు, నాటకాలు, నవలలు అందిస్తాయని, విముక్త ప్రాంతాలలో పరిచయమూ గల విద్యార్థులు మాకు ఆశ పెట్టేవారు. సాహిత్యచరిత్రలో ఒక వినూత్న అధ్యాయం ప్రారంభం కాబో తున్నదనే ఆశ మాలో రేకెత్తింది.

విప్లవానికి పూర్వం చైనా సాహిత్యం చాలావరకు కృత్రిమంగానూ, అసహజంగానూ వుండేది. 1920లో సాహిత్య రంగంలో పునరుజ్జీవనం కలిగించిన రచయితలంతా యీనాడు వృద్ధులయ్యారు. వాళ్ళు భాషలో ఏవైనా మార్పులు తీసుకు వస్తే వచ్చిఉండవచ్చును కాని భావంలోమాత్రం ఏ నూతన పంథాను సృష్టించలేక పోయారు. ఆనాడు భవిష్యత్తులోకి తొంగిచూచి ప్రజల ఆలోచనలను, అభిరుచులను ప్రతిబిం బించే రచనలు సాగించినవారే ఇప్పుడు మన అభినందనలకు పాత్రులగుతున్నారు. ఈ తరం వాళ్ళమైన మాలో చాలా

మందికి పాతపద్ధతి నాటకాలు అంటే అసహ్యం కలగడానికి కారణం అవి సహజంగా వుండకపోవటమే. ఇక చిత్రరచన, కావ్యరచన – యివన్నీకూడా నిర్జీవం, నిస్సారమై పూర్వపు రచయితలు, చిత్రకారుల రచనలకు, చిత్రాలకు తెలివి నాసి రకం అనుకరణలవలె వున్నాయి.

శ్వేతకుంతల – చైనా విప్లవ యుగంలో ప్రసిద్ధి చెందిన సంగీత రూపకం. దానికీర్తి, విప్లవ సైన్యాల కంటెకూడా ముందుగానే మా వద్దకు చేరింది. చిట్టచివరకు 1949 లో యీ ప్రదర్శనం చూసే అవకాశం కలిగింది. ఉత్తర చైనా విశ్వ విద్యాలయ నాటక సమాజంవారు ప్రదర్శన యిచ్చారు.

నిజానికి ఆ రోజు ఒక అద్భుతమైన అనుభవం: విప్లవం అంటే ఏమాత్రం సుముఖంగా ఉన్న విద్యార్థులయినా యీ పాతకాలపు చైనా నాటకాలు, వాటి యితివృత్తాలని గురించి ఏ విధమైన శ్రద్ధ, లక్ష్యం చూపించేవాళ్ళు కాదు. కాని యీ నాటకం కొత్త పోకడలతో, కొత్త పద్ధతులతో ప్రదర్శిస్తూ ఉంటే, ప్రదర్శనం చూస్తూ ఉన్న నాలుగు గంటలసేపు ఒకదానివెంట ఒకటి మనస్సుని ఆ దృశ్యాలలో ముంచెత్తే సన్నివేశాలను చూస్తూ గడిపేటట్లు చేసింది. ఈ కథను గురించి ముందుగానే విని ఉండటంవల్ల, ఎప్పుడు చూద్దామా అనే ఉబలాటం యింకా అధికమైనది. నాటకం రోజున హాలంతా మా యూనివర్శిటీ విద్యార్థులతో కిటకిట లాడుతోంది. సంబరం పట్టలేనివాళ్ళు కొందరు మధ్య మధ్య విప్లవ గీతాలు పాడుతూ ఉంటే మేముకూడా గొంతు కలిపే వాళ్ళం.

తెరఎత్తగానే హాలంతా చీమచిటుక్కుమన్నా వినిపించేటంత నిశ్శబ్దంగా ఉన్నది. రంగస్థలంమీద మాకు కనిపించిందల్లా కష్టంతో, దారిద్ర్యంతో సతమతమవుతూన్న ఒక నిరుపేదయిల్లు. యింట్లోని ప్రతివస్తువు ఆ వ్యక్తియొక్క పేదరికాన్ని వేనోళ్ళ చాటుతున్నది. చలికాలం బయట అంతా మంచుతో నిండిపోయింది. నిజంగా దూరంగా ఉండే రూపాలతో, అస్వాభావిక కంఠాలతో మాట్లాడే రాజులు, రాణీలు రంగస్థలంమీదకు రాలేదు. చాకిరీతో, చికాకుతో, కృంగి కృశించిన ఒక ముసలిరైతు తనచిన్నారి బిడ్డతో మాటాడుతున్నాడు. అప్పులబాధ అధికమైంది. భూస్వామి డబ్బుకోసం ఒత్తిడిచేస్తున్నాడు. ఇంటా బయటా -- ఎక్కడాకూడా ఎరని ఏగానిలేదు. ఈ ఋణాన్నుంచి విముక్తిపొందడానికి ఒక్కటేమార్గం. తన కుమార్తెను జమీందారుకు దాసిగా అమ్మివేయడం.

ఋణదాత ఒత్తిడి భరించలేక ముసలివాడు కన్నకూతురిని ఆ కసాయివాడికి అమ్మి ఋణవిముక్తుడయినాడు. కాని తాను చేసిన పని పాపమై కరువవ్వగా, దుఃఖంతో గుండెచెరువై చివరకు, ఉరిపోసుకుని, తనవాళ్ళకి, తన దుఃఖాలకి దూరమైపోయాడు. జమీందారు, అతని అనుచరులు ఆ పిల్లను బలవంతంగా లాక్కువెడుతూఉంటే, మా అందరికీ కళ్ళనీళ్ళ పర్యంతం అయింది. ఇంట్లో ఆడవాళ్ళంతా ఆ పిల్లను తిట్టికొట్టి పశువు కంటేకూడా కనాకష్టంగా చూస్తూఉంటే, కోపంతో మా అందరి రక్తం ఉడుకెత్తింది. అంతటితో ఆ పిల్లదాన్ని భగవంతుడు దయదల్చలేదు. వయస్సులోఉన్న ఆచిన్నదాని

అందాన్ని చూసి. ఆ కామాంధుడు, ఆమె పారిపోవడానికి ఎంత ప్రయత్నం చేసినా అవకాశం యివ్వక, పట్టి బలవంతాన మానభంగం చేశాడు. ఇక మిగతా కథ అంతా మామూలే. అన్ని కథలలోకిమల్లేనే యీ చిన్నది కూడా గర్భం దాల్చింది. జమీందారు వివాహం చేసుకుంటానని మాటయిచ్చి, తీరా సమయం వచ్చేసరికి యింకొకపిల్లను వివాహం చేసుకోవడానికి నిశ్చయం చేసుకున్నాడు. ఈ పిల్లని ఎలాగైనాసరె వదిలించుకోవాలని వేశ్యలకు అమ్మివేయాలనుకున్నాడు. ఈ వార్త విని యీ పిల్ల ఉరిపోసుకోవడానికి ప్రయత్నం చేస్తూఉంటే, యింట్లో పనిచేసే పనిమనిషి చూసి తప్పించాడు. ఎల్లాగైనాసరే యిక్కడనుంచి తప్పించుకు పారిపోవాలనే దృఢసంకల్పంతో ఆపిల్ల ఆ యింట్లోంచి పారిపోయి, ఒక కొండ గుహలో దాక్కుంది. ఎవరి సహాయంలేకుండా ప్రసవించింది. అక్కడే ఒంటరిగా తను, పసిపిల్ల ఎవరికంట పడకుండా ఉంటూ, రాత్రిపూట రహస్యంగా గుడిలోకి వెళ్ళి అక్కడి దేముని ఆరాధనకోసం పెట్టిన పళ్ళూ ఫలాలు తీసుకువచ్చి తనూ, బిడ్డా తింటూ రెండు సంవత్సరాలు కాలక్షేపం చేసింది. అహర్నిశలు వెలుతురు చొరని ఆ గుహలో చిక్కులలో సతమతమైన చిన్నది. అంత చిన్నవయస్సులోనే జుట్టు నెరిసి భీకరంగా మారింది. రాత్రిపూట ఆహారంకోసం ఆమె రహస్యంగా వెళుతూఉంటే చూచినవారు దయ్యమో భూతమోనని దడుసుకునేవాళ్ళు.

చిట్టచివరకు, విప్లవసైన్యాలు వచ్చి, యీ ఊళ్ళోని జపానువాళ్ళని ఓడించి తరిమికొట్టారు. ఈ సైన్యంతో ఆ పిల్ల

దాని ప్రియుడుకూడా ఉన్నాడు. తెల్లజుట్టు పిల్లని గురించి వినగానే, ఆ విషయం తెలుసుకుందామని గుహలోకి వెళ్ళి, చింపిరిజుట్టు, చింకిరి బట్టలతో కూడిన ఆ పిల్ల అవతారం చూడగానే భయపడి తుపాకితో కాల్చాడు. ఆ పిల్ల గాయ పడి గుహ లోపలికి పారిపోయింది. ప్రియుడు ఆ పిల్లని తరిమి పట్టుకొని చిట్టచివరకు నిజం తెలుసుకున్నాడు.

ఇద్దరు కలిసి గ్రామంలోకి తిరిగి వచ్చారు. ఇంతవరకు యీ చిన్నదాన్ని యిన్ని అగచాట్లుపాలు చేసిన జమీందారు జపానువాళ్ళతో కలసి ప్రజలను బాధించాడనే నేరంమీద విచారణకు తీసుకువచ్చారు. ఆ పిల్ల తన కష్టాలను గురించి చెప్పగానే అక్కడి ప్రజలంతా ఏకకంఠంతో జమీందారునికి, అతని అనుచరునికి మరణదండన విధించాలని గగ్గోలు చేశారు. నేరస్తులకి దండన అమలుజరపడానికి తీసుకుపోయారు.

నాలుగు ముక్కల్లో చెప్పాలంటే కథ యిది - పెద్ద బ్రహ్మాండమైన కావ్యఖండంలాగా కనిపించదు. శ్రావ్యమైన సంగీతం, అద్భుతమైన సన్నివేశాలతో మేళవించే సరికి యీ ప్రదర్శనం ప్రతి ప్రేక్షకుడిని ఉత్తేజపరచి, రసవాహినిలో ముంచి లేవనెత్తుతోంది. కథ పోకడ కొత్తదైనా పద్ధతులన్నీ పాతవే. నటీనటులు, సంభాషణలు సాగతీస్తూ చెప్పారు. ఇక సంగీతం కూడా పాతపద్ధతే. 'శ్వేతకుంతల' నాటకం పాత సాంప్ర దాయంలో నడిచిన క్రొత్త యితివృత్తం గలది. నాలుగు గంటలూ, నాలుగు నిమిషాలవలె గడచిపోయాయి.

నాటకాంతంలో జమిందారుని అతని అనుచరుని వధ్య స్థలానికి తీసుకొని పోయినప్పుడు ఎన్నడూ కనివిని ఎరుగనంత

హర్ష ధ్వానాలతో హాలంతా మార్మోగింది. దిగులుగా, నిరా శగా వున్న వాళ్ళందరి హృదయాలు ఒక్కసారిగా ఆనందంతో ఉప్పొంగినాయి.

• రాత్రంతా ఆనందంతో నిండిపోయింది. ఎంతో అద్భుతంగా వున్నది. నాతో వున్న కుర్రవాడు "ఇంతకంటె మంచి నాటకం రాయటం సాధ్యమా ?" అని అడిగాడు.

ఆ ప్రశ్నయొక్క విలువ ఆనాడు తెలియలేదు. అంతకంటె మంచి నాటకం యీనాటివరకు రాలేదు.

సాహిత్యం :

నాటక రంగంలోనే కాదు, సాహిత్య రంగంలోకూడా ఎవ్వరూ యీ "శ్వేతకుంతల"ను మించిన రచన చేయలేక పోయారు. పూర్వకాలపు రచనలతో, పద్ధతులతో నాకు పరిచయం ఉన్నది. ఆ తర్వాత వచ్చి సాహిత్యంలో సంచలనం కలిగించినవారి రచనలుకూడా నాకు తెలుసును. పూర్వ సాహిత్యంలోని అస్వాభావిక సన్నివేశాలు, అసహజ సంభాషణలు, వర్ణనలు, యీ మధ్యకాలపు కవుల రచనలలో కొంతవరకూ తగ్గినా, మా తరం వాళ్ళకి మాత్రం పురాతన పద్ధతులలోని రచనలను ఖండిస్తూ రాసిన యీనాటి రచనలే ఆనందాన్ని కలిగించేవి.

దురాచారాన్ని, అవినీతిని, రాజకీయ అత్యాచారాలను ధైర్యంగా విమర్శించేవాళ్ళు మా దృష్టిలో పెద్దనాయకులు. విప్లవానికి ముందురోజుల్లో యీ రచయితలు తమ సాహసంవల్ల చాలా చిక్కులపాలయ్యారు. అందువల్ల విప్లవానంతరం సాహిత్యగోష్టి కోసమని, నూతన సాహిత్యపు తీరులు

తెలుసుకోవాలని మేమంతా అతి ఉత్సాహంతో ప్రథమ సాహిత్య సమావేశంకోసం ఎదురు చూశాం. అక్కడ ఆనాడు సమావేశమైనంత మంది రచయితలని నే నెన్నడూ చూడ లేదు. అనేక విశ్వవిద్యాలయంలోని ప్రొఫెసర్లు, సాహిత్య రంగంలో ఉత్తమ కవులుగ ఖ్యాతిగన్న వ్యక్తులు, సాహిత్య సేవకులు వీరేగాక కమ్యూనిస్టుపార్టీ అగ్రగాములలో ఒకడైన భావో, సూరి, ఆనాటి సభకు హాజరైయ్యారు. 8 వ శతాబ్దపు కవి 'లీపా–' రచనలను తీవ్రంగా ఖండించడంతో ఆనాటి సభ ప్రారంభమయింది. 'లీ–పా' చేసిన పొరపాటల్లా ఒక్కటే. ఆ రోజుల్లో వుండే ధనిక వర్గాన్ని పొగుడుతూ రచనలు సాగించడమే. అన్నింటి కంటేగూడా కమ్యూనిస్టు పార్టీ నిందకు గురియైనది "యాంగ్ కెఫ" అను రాజనర్తకినిగురించి వ్రాసిన సంగీత రూపకము. సభను ముగిస్తూ "ఈనాడే లి. పో జీవించివుంటే చాంకైషేక్ భార్య అందాన్ని వర్ణిస్తూ తన కాలాన్నంతా వ్యర్థపుచ్చేవాడేమో !"

తరువాత దేశదేశాలన్నీ తమ వాక్ మాధురితో ముంచెత్తి విద్యార్థులకు మరపురాని మధురస్మృతులు కలిగించు టలో వినుతికెక్కిన హేంపిన్ ఉపన్యసించాడు. తమ పూర్వ రచనలను తాము పూర్వము చదివిన పుస్తకములను వారుభ యులు నిర్దాక్షిణ్యముగ నిష్కర్షగ ఖండిస్తూఉంటే విన్నవాళ్ళు ఇది కలయో, వైష్ణవమాయయో అన్న భ్రాంతిలోపడి నిశ్చే ష్టులై నిలచిపోయారు. పూర్వము సాహిత్యరంగము నేలినవారి రచనలు కళకోసం కళ అను సిద్ధాంతముమీద ధనికవర్గాల కోసం వాస్తవికతను వదలి స్వప్నలోకాలలోకి దారితీసేవి. బల

హీనుల కోసము బూర్జువాల మెప్పుకొరకు రచయితలు పాటు పడేవారు. ఈ ఉపన్యాసాల వెనుక ఈ మాటుమణిగిన నగ్న సత్యము యిప్పుడు బహిర్గతమయింది. ఈనాటినుండి బూర్జువా అభిప్రాయాలను మరచిపోయి ఒక నూతన అధ్యాయము ప్రారంభించుటకు నిశ్చయించుకున్నాము.

ఇంతకంటెకూడ కాలేజీ ప్రొఫెసర్ల ఉపన్యాసములు మమ్మల్ని మరింత కలవరపెట్టినవి. అంతా ఏదో యొకటి మాట్లాడి తీరవలసినదే! తెలిసీ తెలియని యిబ్బందులు పడుటకంటె ఈ నూతన అభిప్రాయములతో ఏకీభవించినట్లు నటించడమే వాళ్ళకు మేలనిపించినది. మావ్ సాహిత్యసిద్ధాంతములను తనివితీరా శ్లాఘించుట ఈ నూతన పంథాతో తాముకూడ మనసా వాచా కర్మణా నడుచుకుంటామని మరీమరీ వక్కాణించుటకంటె వాళ్ళు చేయగలిగినదేమియు కనుపించలేదు. ఈ వ్యక్తులైనా ఒకనాడు చైనాసాహిత్యమే కాదు, వివిధ దేశాల సారస్వతమును సాహిత్యపు పోకడలనుగురించి నిర్భయముగ నిర్మొగమాటముగ చెప్పించేవాళ్ళు అని మాకు ఆశ్చర్యము వేసినది.

"చైర్మన్ మావ్ సిద్ధాంతము ప్రకారము సాహిత్యము ప్రజలలో ఏదో ఒక తెగకొరకు నిర్దేశింపబడినది కాని ఏదో యొక వర్గము ఆనందముకొరకు నిర్మింపబడిన ఆటవస్తువుగాదు. కర్షకుల కొరకు కార్మికులకోసము దేశస్వాతంత్ర్యముకొరకు ప్రాణములను ధారపోసే సైనికులకోసం రచనలను సాగించలేని కవితా కవిత్వములేదు. అతని రచనలలో సాహిత్యపు తీపులు లేవు. పూర్వపురోజులలో క్లాసురూములను విద్యార్థులకు అసత్య

సిద్ధాంతములనుగూర్చి బోధించుటకొరకు చాలమంది ఉపాధ్యాయులు వినియోగించుకునేవారు. అదృశ్యము అజ్ఞాతము అయిన విషయములకొరకు విలువగల కాలమును వ్యర్థముగ వెచ్చపెట్టేవారు. ఈనాడు మనఅందరి ఎదుట ఒకమహాయజ్ఞము సలుపవలసిన అవసరము లభించింది. వాస్తవిక నిత్య నూతన విప్లవసాహిత్య సృష్టిని జరిపే భారము మనఅందరిలో ప్రతి ఒక్కరి మీదా ఉన్నది. ఈనాడు ఇక్కడ సమావేశమైనకామ్రేడ్స్, మన అందరికంటె కూడ విప్లవ జీవితములో అనుభవ వృద్ధులైనవారు, మనకు శిక్షణ ఇచ్చుటకు సంశయించరని నేను ఆశించుచున్నాను."

ఇదే ధోరణితో యింకా నలుగురైదుగురు వ్యక్తులు తమ తమ సిద్ధాంతములను వక్కాణించారు. వీరిమాటలు వింటూంటే సాహిత్యంకంటె కూడ మాకు తెలిసినదల్లా ఒకటే విషయము. ఎవరెవరు పార్టీ సిద్ధాంతములతో ఎంతవరకు ఏకీభవించినదీ తమ సిద్ధాంతములను తమని పార్టీ విశ్వసిస్తుందో లేదో అని సంకోచపడేవారిని సులభముగ కనుక్కోగలిగాము. అధికారుల మన్ననలు పొందినవారు నిరపాయముగ విచ్చలవిడిగ పాతకాలపు పోకడలనే విమర్శిస్తున్నారు. ఈనాటి రీతులను గురించి వారి అభిప్రాయము లేమిటో ఎవరు ఇదమిత్థమని విడమర్చి చెప్పలేదు. ఎందుకంటె పార్టీకి ఏది యిష్టమో ఏది యిష్టముకాదో యింకానిశ్చయముగ ఎవరికి తెలియలేదు. విప్లవమునకు పూర్వము వ్రాయబడిన ప్రతిరచనను సందేహంతో చూస్తున్నారు. ఈ ఉపన్యాసముల వలన మేము నేర్చుకొనకలిగినదల్లా ఒకటే. ఎటువంటి సాహిత్యాన్ని

ఎల్లా అభినందించాలి; సాహిత్యాన్ని శైలికోసం పద లాలిత్యము కోసము మెచ్చుకునే రోజులు ఏనాడో పోయాయి. "సాహిత్యాన్ని అభినందించడం ఒక బూర్జు వాలకు, పనిపాట లవసరములేని సోమరిపోతులకు మాత్రము చెల్లినది" అని అన్నాడు ఒక మహావక్త. కర్షకు లకు, కార్మికులకు కూడ మంచి వస్తువులను, మంచి రచనలను గ్రహించి శ్లాఘించగల శక్తి వున్నదని చైర్మన్ మావో అన్న మాటలు బహుశః ఈయన మర్చిపోయి వుండవచ్చు. మాన వులు వారికి చెందిన సమస్త సంపదలలాగానే వారి మనోజన్య మైన సాహిత్యముకూడ ఈనాడు పార్టీ చేతిలో ఒక పనిముట్టు అయినది. 1942 సం॥లో అనేక వుపన్యాసముల ద్వారా చైర్మన్ మావో పార్టీ సిద్ధాంతములకు ఒక సమగ్రరూపాన్ని ఏర్పరచ గలిగాడు. ఈ యుగములో సాహిత్యము. సంస్కృతి ఏదో ఒక నిర్ణీతమైన వర్గానికి గాని తెగకుగాని చెంది, ఏదో ఒక రాజకీయపంథాకు లోబడివుండాలి. పార్టీ నిబంధనలకు సాహిత్యము లొంగివుండాలిసిందే. ఏదో ఒక పార్టీకి లొంగి నంత మాత్రముతో సాహిత్యపు బాధ్యత తీరిపోలేదు. ప్రజ లకు పార్టీకికూడ సేవ చేయవలసిన విధి సాహిత్యానికి ఉంది. లెనిన్ అన్నట్టుగ సాహిత్యం ఒక మహాయంత్రములో శీల మాత్రమే. ఊరికే సీల అని అనుకంటె సాహిత్యము ఒక పరి కరము, ఒక ఆయుధము అని అన్నట్టయితే ఘనతగ ఉండేది. మాలో చాలా కొద్దిమంది మాత్రమే చైర్మన్ మావ్ ఉప న్యాసాలన్నీ పూర్తిగ చదువగలిగాము. కాని మిగత ప్రఖ్యాత రచయితలు క్రొత్తలో వారి సందేశాలలో చెప్పినదల్లా

ఒక్కటే! ప్రజానీకానికి సేవచేయవలసిన బాధ్యత సాహిత్యానికి ఎంతైనా ఉంది. ఈ పనినుంచి ఏ ఒక్కరు తప్పించుకొని పోవుటకు వీలులేదు. ఈ పని ఎంత బాగా ఎంత సక్రమముగ నిర్వహిస్తున్నారు అనేది నిర్ణయించడానికి అధికారులే నిర్ణయించాలి. ఈ సందిగ్ధ సమయములో అంటే ఏ సాహిత్యం మంచిదో ఏ మహాకవి రచనలను పార్టీ ఆమోదించగలదో నిర్ణయముకాని పరిస్థితులలో ఎటువంటి సాహిత్యం చదవాలి అనేది నిజానికి చాల గడ్డుప్రశ్న. మన అభిమానకవిని అతని రచనలను "యువకసమాజము" బూర్జువా రచనలుగా నిర్ణయించి బహిష్కరిస్తే మనం పడే యిబ్బందులకి అంతముండదు. చివరకు ట్రాట్స్కీ రచనలుకూడ కృత్రిమము అస్వాభావికముగా వున్నాయని వాళ్ళు బహిష్కరించినపుడు చైనా విద్యార్థుల పరిస్థితి వర్ణనాతీతము. మా సహాధ్యాయులు చాలమంది ఈబూర్జువా సాహిత్యము అను విషగ్రస్తులై తిరుగుతూఉంటే ఈ విషముకంటెకూడ భయంకరమైనది యింకొకటి దాపురించేది. విషకలుషితమైన మా మనసులను తిరిగి నిర్మలముగ చేయడానికి "సహాయము" చేస్తాము అంటూ వచ్చే యువజన సమితినుండి తప్పించుకోడానికి మేము మా సాహిత్య అభిరుచి విషయములో అప్రమత్తులమై యుండేవారము. నూతన సోవియట్ రచయితల అనువాదాలు నేను నిర్భయముగ కొనుక్కోవచ్చు, చదువవచ్చు. పేరుపొందిన సిమనోవ్, ఫెదా, రచనలు కూడ మేము నిస్సంకోచముగ చదువవచ్చు. కాని వెనుకటి తరము రచనలు, అంటే టర్జ్నివ్ దస్తవ్‌స్కీ చివరికి గోర్కీల అనువాదాలుకూడ బూర్జువా సాహిత్యమని నిషేధించారు.

చైనా సాహిత్యములో చో. సూ. లి. టింగ్‌లింగ్ మొదలయిన వాళ్ళ రచనలను ప్రతిఒక్కరు స్వేచ్ఛగ చదువుకోవచ్చు. యిహ సరే! పార్టీ సిద్ధాంతములకు అనుగుణ్యముగ యువక రచయితలు ఈ నాటివాళ్ళు రచించిన ప్రతివాక్యముకూడ నిర్భయముగ చదివి ఆనందించవచ్చు. విప్లవమునకు పూర్వపు రచయితలు, చివరకు కమ్యూనిస్టులు వ్రాసినవైనను సరే ఎవరైన తెలిసో తెలియకో పొగిడితే వాళ్ళని సందేహంతో చూసే వాళ్ళు.

క్రొత్త రచనలు చాలావరకు, కార్మికులు, కర్షకులు, సైనికులను గురించి వుండేవి. ఒకటో, అరో కవులు, విద్యార్థులు, ఆఫీసు గుమాస్తాలు, షాపుల్లో పనిచేసే నౌకర్లు, చాకర్లనిగురించి రాశారు. ఏదైనా ఒక తెగని గురించిన రచన చదివితే, దానికి సంబంధించిన మిగతా రచనలు ఎట్లా వుంటాయో వూహించటం ఏమంత కష్టమైన పని కాదు. ఫ్యాక్టరీ కార్మికుని గురించిన రచనలో, నాయకుడు చాలా కష్టించి పని చేశేవాడు. అధికంగా కష్టించి అధికారుల మెప్పుకోసం శాయశక్తులా ప్రయత్నం చేసేవాడు. ఎటువంటి కష్టాలనైనా సరే లెక్కచేయకుండా, చివరకు ఆరోగ్యం చెడినాసరే, వెనుదీయక, తమ ఫ్యాక్టరీలోని ఉత్పత్తి అధికం చేసేవాడు. రైతులని గురించిన గ్రంథాలలో రైతు భూసంస్కరణల కోసం భూస్వామితో పోరాడి జయం సాధించి, తనదగ్గరున్న ధాన్యమంతా ప్రజలకర్పించి, అమితఉత్సాహంతో, ప్రజాసైన్యంలో చేరేవాడు. సైనిక కార్యకలాపాల లోని నాయకులు, మానవోత్తములైన వీరాధివీరులు, వారి జీవితలక్ష్యమల్లా ఒక్కటే-

దేశానికి, ప్రజలకి సేవ చేయటం, ప్రజల మన్ననలకు ప్రశంసకు పాత్రులవటం. ఈ రచనల్లో యితివృత్తం శైలి దాదాపు అన్నీ ఒకేమాదిరిగా ఉంటాయి. ఒకే వ్యక్తి వ్రాశాడేమోనని భ్రాంతి కల్గిస్తాయి.

కొన్ని నెలల తర్వాత మాలో కొందరు పురాతన గ్రంథాలు, అంటే యింకా పార్టీచే నిషేధించబడనివి తిరిగి చదవటం మొదలుపెట్టాము. షేక్స్పియర్‌ను గురించి యింకా యిదమిద్ధంగా తేలలేదు. అతని నాటకాలన్నీ రాజులు జమీందారులను గురించినవే. దాంట్లో ఏవైనా ప్రజలకు సంబంధించిన పాత్రలుంటే అవి ధనికవర్గంచేత నిరసింపబడటానికి సృష్టింపబడినవే. షేక్స్పియర్ నాటకాలు చదవదలచుకున్నవారు వాటిని రహస్యంగా చదువుకోవలసిందే. షేక్స్పియర్ బూర్జువా అని నిందించిన వ్యక్తులందరినీ సందిగ్ధావస్థలో పెట్టే సంఘటన ఒకటి జరిగింది. సోవియట్ దేశంనుండి మొట్టమొదట వచ్చిన పత్రికలలో షేక్స్పియర్ నాటకాలకి చాలా ప్రాముఖ్యత యివ్వబడింది. రష్యాలో అతని నాటకాలు ఎంత బ్రహ్మాండంగా ఎంతెంత డబ్బుఖర్చుపెట్టి ప్రదర్శిస్తారో పూర్తిగా బొమ్మలతో సహా వివరించబడి ఉంది. దాంతో యిక్కడ అభ్యుదయ విమర్శకులు తమ తమ అభిప్రాయాలను మార్చుకోక తప్పిందికాదు. అప్పుడే రష్యా పర్యటించివచ్చిన సాంస్కృతిక రాయబారవర్గ నాయకుడు, షేక్స్పియర్ వగైరా రచయితలను గురించి రష్యన్‌లు చూపించేశ్రద్ధను విద్యార్థులకు విపులంగా చెప్పాడు. ఆనాటినుంచి షేక్స్పియర్ గ్రంథాలు చదవడం ప్రతిపత్తి చిహ్నంగాక పార్టీ సాహిత్యంలో ఒక భాగ

పైనది. షేక్స్పియర్ జన్మదినోత్సవ సందర్భంలో బ్రిటిష్ కౌన్సిల్ ఏర్పాటుచేసిన ప్రదర్శనానికి మేమంతా హాజరయ్యాము. ప్రదర్శనకంటెకూడా అద్భుతమైనది ఏమంటే కొన్ని మాసాలక్రితం షేక్స్పియర్‌ని బూర్జువా అని నిషేధించిన పెద్దలే అక్కడ హాజరుకావటం.

సంగీతం:

విప్లవానంతరం సంగీతంలోకూడా అన్ని రంగాలలో వలెనే మార్పువచ్చింది. పాశ్చాత్య శాస్త్రీయ సంగీతం వినే వాళ్ళ సంఖ్య ఆనాటికి ఆనాటికి క్షీణించింది. డప్పులు బాజాలతో శృతి మేళవించిన విప్లవగీతం 'చీ - లై' ప్రతి ఒక్కరి చెవిలోను మారుమ్రోగి పోతోంది. జపాన్‌తో సలిపిన పోరాటంలో యీ గీతం జాతీయగీతమై, ప్రతివ్యక్తికీ అకుంఠిత శక్తిని ప్రసాదించినది. యింక అనేక వస్తువులతో పాటు కమ్యూనిస్టులు దీనినికూడా తమదిగా చేసుకున్నారు. కమ్యూనిస్టు ప్రభుత్వం రాగానే దానిని జాతీయగీతంగా ప్రకటించారు. అటు ఫార్మోజాలోని నేషనలిస్టు ప్రభుత్వం దానిని నిషేధించింది. చాలామంది చైనా విద్యార్థులకి బెథోవెన్, షోపిన్, షూబర్ట్, మొజార్ట్ లాంటి పాశ్చాత్య సంగీతాచార్యుల సంగీతం అంటే చాలా యిష్టం. కాని ఎవ్వరైనా మమ్మల్ని బూర్జువాలని ప్రజా ప్రభుత్వం అంటే లక్ష్యంలేని వాళ్ళని భావిస్తారేమోననేభయం కొద్ది మావద్దనున్న గ్రామఫోను రికార్డులు దాచిపెట్టాము.

కమ్యూనిస్టులువచ్చిన ఆరునెలలకి సోవియట్ సాంస్కృతిక దళం మా నూతన సంగీత పోకడలు వినడానికి వచ్చింది. కమ్యూనిస్టు దళవాయులు, వచ్చిన ఆగంతకుల గౌరవార్థం

పార్కులో ఒకపాటకచ్చేరీ ఏర్పాటుచేశారు. మేమంతాకలసి నూతన కర్షకుని గీతం, డప్పులు బూరల సమ్మేళనంతో పాడాము. తర్వాత బాలికలంతా కలిసి 'పదిమంది స్త్రీలు తమ భర్తలను పొగడటం' అనే పాటపాడాము. ఆ పాటపాడే పద్ధతి చూస్తే పదిమంది భర్తలు భార్యలను కొడుకులు వుండేవాళ్ళ గోలచేస్తూన్నట్లుగా ఉంది. పురుషుల్లోంచి వెకవెకలు పక పకలు వినబడ్డాయి.

ఆచారం ప్రకారం, వచ్చిన అతిథులు, హర్షనాదాలు చేశారు, కాని వాళ్ళ ఉల్లాసంలో ఎక్కడా నిజాయితీ కన బడనేలేదు; మా పాటకచేరీ అనంతరం వాళ్ళు తమ కౌశల్య మును మాకు ప్రదర్శించారు. మొదటిపాట వింటుంటేనే మాకు చాలా ఆశ్చర్యము వేసినది. ఆ పాటను మెచ్చుకుని మేము వన్స్‌మోర్ అని అరిచేముందు మా నాయకుల వంక తేరిపార చూచాము. ఎందుకంటే మొట్టమొదట పాడిన సోవియట్ కామ్రేడ్ బూర్జువా వర్గానికి చెందిన క్రీస్లర్ రచించిన ఒక ప్రాక్ దేశముల ఫణితిలో నున్న ఒక పశ్చిమ గీతము పాడి వినిపించారు. రెండవ అతను స్కూబర్ట్ గీతాన్ని పియానోతో కలిపి పాడాడు. శ్రోతలలో హర్షనాదములు స్వల్పముగ విన బడినవి. "శాస్త్రీయ సంగీతము ప్రజానీకమునుండి వైదొలగి ధనిక వర్గము పక్షము నవలంబించినది. ఆహారము, విరామము, కలవారికి లభ్యమయ్యే సొత్తుగా మారినది. ఇటువంటి సంగీతము నకు ప్రజాయుగములో తావులేదు. సమూహములను సమాజ మును దూరంచేసి అహంభావానికి, వ్యక్తులలోని గర్వమునకు తావునిచ్చే ఈ సంగీతము, సమష్టి జీవనములో స్థానమును

పొందలేదు." అని ఒక వక్తవక్కాణించిన మాటలు మాకుమళ్ళీ మళ్ళీ గుర్తుకు వచ్చినవి. శ్రోతలు ప్రదర్శించిన ఉత్సాహము, ఉల్లాసము గురించి సోవియట్ ప్రతినిధులు నిజానికి ఏమను కున్నారో నాకు తెలియదు. కాని కార్యక్రమము అనంతరము సోవియట్ ప్రతినిధివర్గ నాయకుడు తనకు, తన వెంట వచ్చిన యితర సోవియట్ కామ్రేడ్స్‌యెడల మేము చూపిన ఆదర ణకు కృతజ్ఞత తెలియబరచుచు యిలా అన్నాడు. "సోవి యట్ రష్యా ఈనాడు సాంస్కృతికముగ ఎంతపురోగమించి నదో మన చైనా సోదరులకు తెలియబరచుటకు నేను చాల ఆనందించుచున్నాను. సాంస్కృతికముగా సోవియట్ కార్మి కుడు సామ్రాజ్యవాదులు, ధనికవర్గాల రాజ్యాలలోని వ్యక్తుల కంటె అనేక అంతస్థులు ముందుకుసాగాడు. అతను "ప్రవద" మొదలైన పత్రికలకు చందాదారుడు. కార్మికుల లైబ్రరీలలో మెంబరు. రోజూ పనిఅయినతర్వాత యింటికివచ్చి, తన సొంత రేడియోలో చక్కని నాటకములు, బెథోవెన్ లాంటి సంగీతా చార్యుల సంగీతమును వింటూవుంటాడు."

మామూలుగా ఫ్యాక్టరీలో పనిచేయు కార్మికుడికి సొంత రేడియో, దానిలో బొథోవెన్ సంగీతము వినుట – యివన్నీ మాకు నమ్మ శక్యము గానివిగ కనుపించాయి. కొన్నిరోజుల వరకు కూడ మా నాయకులు అనేకప్రశ్నలకు సమాధానము యివ్వవలసి వచ్చినది. రష్యా దేశములో సామాన్య కార్మి కుడే తనకు నచ్చిన సంగీతము వినగల్గినపుడు మనదేశములోని యూనివర్సిటీ విద్యార్థులు భావి రాజ్యాంగ పౌరులు ప్రజా ప్రభుత్వమునకు ఆయువుపట్టు అయిన వ్యక్తులు మాత్రము

ఈ విషయములో ఎందుకు అస్వతంత్రులుగా వుండాలి? కమ్యూనిస్టు పార్టీకి మూలస్థానమైన రష్యాలో మన్ననపొందిన సంస్కృతి ఈ దేశంలో ఎందుకు బహిష్కరింపబడాలి? మా నాయకులు చెప్పిన మాటలు వారికే తిరిగి ఒప్పగించే అవకాశము మాకు ఒక్కసారి లభించినది. యిప్పటికీ మా నాయకులు కొన్ని విషయములలో తమతమ తప్పిదములనుగ్రహించి నూతన పంథాని అవలంబించుట నేర్చుకున్నారు. తాము పొరపాటు చేశామని ఒప్పుకోనకుండానే పూర్వపు పద్ధతులను కొన్నిటిని మెల్లిమెల్లిగ స్వీకరించుట మొదలుపెట్టారు. బూర్జువా దేశములోనే ప్రతివ్యక్తి, ప్రతి గాయకుడు తమ శక్తిని ఒక్క ధనికవర్గము ఆనందము కోసమని ధారపోయ లేదు. అందులో కొందరు ఆనాడే ప్రజానీకము కొరకు పాటు పడ్డారు వగైరా మాటలతో తమ తప్పులను ఒప్పులుగా చూడటం నేర్చుకున్నారు. రష్యాదేశపు మన్నన పొందిన పాశ్చాత్య గాయకుల రచనలలో తప్పక విప్లవ సందేశము ఉండి వుంటుంది. అందుకని ధనికవర్గానికి చెందిన వారు ప్రజాప్రభుత్వంలో గౌరవ స్థానాన్ని పొందగలిగారు. మేము భయంతో దాచివేసిన గ్రామఫోన్ రికార్డులన్నీ మెల్లిమెల్లిగ బయటకు రావటము మొదలు పెట్టినయ్యి. విదేశయాత్రీకులు కోసము చైనా ప్రభుత్వం ఫిడేలు వాయించే మా–సుంగ్ అనే ఆయన్ని, గాత్రంలో ప్రసిద్ధికెక్కిన శ్రీమతి కుహాన్‌ను రాజధాని పీకింగ్‌కు ఆహ్వానించారు. వాళ్ళు పాశ్చాత్య సంగీత పోకడలో పాటకచేరీలు చేసేవారు.

ప్రభుత్వ దృష్టిలో మాత్రము కమ్యూనిస్టు సంగీతానికే అగ్రస్థానము. విదేశమిత్రులు సలహాదారులకోసమని శాస్త్రీయ సంగీతాన్ని రేడియో ప్రసారానికి ఒప్పుకున్నారు. అధికార వర్గానికి మాత్రము ప్రజాబాహుళ్యానికి నచ్చేసంగీతం అంటే నే యిష్టము.

ఈ క్రొత్త సంగీతంలో "కమ్యూనిస్టుల మంచితనము చెప్పలేము, వారిచ్చే వరాలన్నీ లెక్కపెట్టలేము" "చైర్మన్ మావ్ పై ప్రశంసాగీతము" "నూతన నారీగీతము", "బంజరు దున్నే అన్నా - చెల్లెలు" వగయిరా పాటలు ప్రజానీకంలోకి ప్రవేశపెట్టబడ్డాయి. ప్రజలుగాని, వారి ప్రతినిధులుగాని, ఆ పాటలు పాడుతున్నా, కనీసం కూనిరాగం తీస్తున్నా మేము వినలేదు. కాని కాలేజీ ఆవరణలో ఇవి తరుచు వినబడుతుండేవి. వినబడడమే కాదు. మేము రోజూ పాడవలసివచ్చేది. కమ్యూనిస్టుప్రభుత్వం రాకపూర్వము కాలేజీవిద్యార్థులు అనేక సంగీత సమాజములు సభలు స్థాపించారు. నిజానికి ఈ సభలు ఈ సమావేశములు అన్నీ ఒకసాకు. ఈ సమాజములు పేరిట విద్యార్థులు ఒకరినొకరు కలుసుకొని రాజకీయ కార్యక్రమాల్లో పాల్గొంటూ ఉండేవాళ్ళు. స్వాతంత్ర్యం అనంతరం ఈ సమాజంలో సభ్యులసంఖ్య అమితంగా వృద్ధిపొందింది. రాజకీయ కార్యక్రమాలకోసం విద్యార్థులకు తర్ఫీదు యిచ్చేబదులు క్రమశిక్షణ, ప్రచారంకోసం ఉపయోగింపబడేవి. ప్రతివిద్యార్థి తను క్లాసు స్థాపించిన సంగీతసమాజంలో సభ్యుడుగ చేరాలి. దీనిని తన స్వార్థంకోసం అంటే తన సంగీతాన్ని అభివృద్ధిచేసుకోడానికి తన కంఠంతో అందరిని మెప్పించి తాను మన్ననపొందడానికి కాదు.

కాలేజీ ఆవరణ బయట రాజకీయ ప్రచారానికి కావలసిన వస్తు సామగ్రి అంతా సమకూర్చడంకోసం.

సైనిక విన్యాసాలదగ్గర, ఫాక్టరీ కార్మికులదగ్గర, మహిళా సమాజాలతో, జనసమ్మేళనములతో, ఏడెనిమిదినెలల్లు ఈ పాటలు అదేపనిగా పాడేసరికి ఇవి మా మనసుల్లోనే కాదు వ్యక్తిత్వంతోనే ఒకభాగమయ్యాయి. ఎప్పుడైనా యథాలాపంగా ఏదైనా పాట మొదలెడితే చివరకది కమ్యూనిస్టు వర్గపుపాటే అయియుండేది. కాలేజీలో ఏ మూలచూచినా ఈ పాటలే మారోగుతూఉండేవి. కొన్ని రష్యన్‌పాటలుకూడ ఈ దేశంలోకి ప్రవేశించాయి. కాని అవి ప్రజలలో అతిగా ప్రచారంకాలేదు. ఈ కారణంవల్ల ఈ పాటలను అనువాదం చేసినవాళ్ళు కావాలనో లేకపోతే చేతకాకో, వాటిని అర్థరహితంగా వ్యంగ్యంగా రూపొందించారు. మచ్చుకి ఒకటి రెండు వాక్యాలు చెప్తాను. ఆ పాటలలో కొన్ని చరణాలు "ఎంత విశాల మీ మాతృదేశం! ఎంత సుందర మీ మాతృదేశం! ఎన్నినదాలెన్నినగాలీ మాతృదేశం! ఎంత సుందర మీ మాతృదేశం! స్వేచ్ఛగా నిర్భయంగా చరించగల మీ దేశంలో! నాయకులవలెనే చరించగలం!" యింకొకపాటలో "ఎందైన గలదా యింతటి స్వేచ్ఛా? ఎందైన గలదా? ఈ నిరంతరశాంతి?" పాటలభావం ఎలా ఉన్నా మా మనసుకు నచ్చిందల్లా మా దేశపు పోటీ! "చెప్పతరమా, మా కమ్యూనిస్టుల మంచితనము, లెక్కించగలమా వారిచ్చే వర ప్రసాదాలు!"

యుద్ధానంతర సంవత్సరాలలో ప్రజానీకానికి బాగా వినోదం చేకూర్చ కలిగినవి చలన చిత్రాలే! పెకింగ్‌లో కొత్తరకం సినిమాహాల్లు లేవు. వచ్చే చిత్రాలన్నీ ఏవో పాతకాలపువి వచ్చేవి. యుద్ధంరోజుల్లో మేమెవరి సినిమాలూ చూడలేదు. అందువల్ల మేము చూడకుండ పోయిన చిత్రాలన్నీ చూద్దామని ఉబలాటపడుతున్నాము. పైగా ఈ ఆధునిక చిత్రాలకంటే ఒక విధంగా పాతకాలపు చిత్రాలే మెరుగనిపిస్తున్నాయి. ఏదైనా ప్రఖ్యాతి చెందిన పురాతన చిత్రం ప్రదర్శించినప్పుడు ప్రేక్షకులలో నూటికి 80 మంది విద్యార్థులుండేవాళ్ళు. హాలు మా కాలేజీలో ఉన్న ఆడిటోరియం లాగా విద్యార్థులతో నిండి ఉండేది.

సాధారణంగా మాలో ఎవరిదగ్గర అదనంగా డబ్బు ఉండేదికాదు. అందుకని సినిమాకోసం డబ్బు సంపాదించాలంటే అనేక రకాల ప్రక్రియలు అగచాట్లు పడాల్సి వచ్చేది. చాలా మంది విద్యార్థులు బట్టలు లాండ్రీకి వేయకుండ తామే ఉతికి ఇస్త్రీ చేసుకునేవారు. బయట కాఫీ హోటళ్ళలో డబ్బు ఖర్చుపెట్టకుండా హాస్టలులో ఇచ్చే దాంతోనే తృప్తిపడేవాళ్ళు. దూరపు ఆలోచన లేకుండ వచ్చిన డబ్బంతా ముందరే ఖర్చుపెట్టినవాళ్ళు మమ్మల్ని అనేక విధాలుగా పీడించి టిక్కట్టుకు కావలసిన డబ్బు అప్పుగ తీసుకునేవారు. ఒకొక్కసారి విద్యార్థులకోసం ప్రత్యేకంగా టిక్కట్లు ధర తగ్గించేవాళ్ళు **Madame curie, Janeeyre**

Rebecca, For Whome the Beetolls, లాంటిఉత్తమచిత్రాలు వచ్చినప్పుడు యూనివర్సిటీలో ఒక పెద్ద కలవరం బయలు దేరేది. ఈ చిత్రాలను చూచుటకు ఎప్పుడు వెళ్ళాలి అనే విషయాన్ని గురించి చర్చిస్తూ సభలు సమావేశములు అనేకం జరుగుతూ వుండేవి. నాటకాలకంటే కూడ మాలో సినిమా లంటేనే చాలామందికి యిష్టం. అంటే నాటకాలని చూసి అర్థంచేసుకుని ఆనందించగల శక్తి మాలో లేదని కాదు. మా ఊళ్ళో ఎలాగో పెద్ద డ్రామా కంపెనీ ఉండనే ఉన్నది. వాళ్ళు వేసే చౌకబారు నాటకాలు చూడాలంటే సినిమా టిక్కెట్టు కంటే నాలుగైదురెట్లు డబ్బు ఖర్చుపెట్టాలి. పైగా ఈనాటకాలు సినిమాలంత బాగుండవు.

విప్లవానికి పూర్వం కొంతమంది విద్యార్థులు యూని వర్సిటీ నాటకసమాజాన్ని స్థాపించారు. వీరిలో చాలమంది యుద్ధసమయంలో South west associated univeresity లో చదివినవాళ్ళు. వీళ్ళు స్థాపించిన నాటకసమాజం చాలా త్వర త్వరలో నే ప్రఖ్యాతి చెందినది. ఈ కంపెనీ అనేక యూనివర్సి టీలను అనేక కళాశాలలను జయ పతాక అనే తమ ప్రఖ్యాత నాటకం ప్రదర్శించి అందరి ప్రశంశలను పొందినది. ఈ నాటకాన్ని విద్యార్థులంతా కలసి వ్రాశారు. నేషనలిస్టు చైనా సైన్యాలు జపానువారి చేతిలో చిక్కుకున్నాయి. ఒక చైనా గ్రామానికి తిరిగిరావడం అక్కడ జపాను సైన్యాలతో చేయి కలిపి అక్కడి ప్రజా సైన్యంతో పోరాటం సల్పడం. నిజానికి యింతవరకు జపాను వారి నెదిరించినది ఈప్రజాసైన్యమే. నాట కంలోకల్లా మరుపురాని ఘట్టం నేషనలిస్టు చైనాసైన్యంలో

ఒక అధికారి ప్రజాసైన్యంతో పోరాడుచూ పట్టుబడినవారిలో తెలియక తన కన్న కొడుకునే కాల్చివేస్తాడు. మరణించిన వ్యక్తి తన కన్నకొడుకని తెలిసినపుడు అతనుపడే బాధ వర్ణనాతీతము. ఈ దృశ్యమునుండి విషాదముతో ముగిసిన తనకు యాత్ర తాపానికి గురియై చివరకు ఆ వ్యక్తి ఆత్మహత్య చేసుకున్నాడు. కథలో సంభాషణలు అంత ఉదాత్తంగా లేవు. సెట్టింగులు సహజంగాకూడ అంతంత మాత్రమే. కాని ఈ నాటకం చూస్తుంటే చాలమంది కన్నీరు మున్నీరుగ ఏడ్చారు. "ఉద్యోగంలో పైకి పోవటం ఎలా అనేది ఒక చాల విజయవంతమైన హాస్య ప్రధాన నాటకము. సింగ్‌హూవా, యెన్‌చింగ్, షిహో — టా యూనివర్సిటీలో విద్యార్థులు కొందరు కలసి ఈ నాటకమును వ్రాశారు. ప్రభుత్వాన్ని ఎదుర్కొంటున్న అవినీతిని దురాచారములను లంచగొండి తనాన్ని ప్రజానీకానికి తెలియబరచడమే ఈ నాటకం ఉద్దేశ్యం. సాహిత్యంతో పరిచయమయిన కొంతమంది మిత్రులు ఈ నాటకాన్ని గోగల్ యొక్క ప్రఖ్యాత నాటకం Inspector General తో పోల్చారు. ఎప్పుడైనా విద్యార్థులు తమకు జరిగిన అన్యాయాలను గురించి అధికారులతో మొరపెట్టుకొన్నప్పుడు అధికారుల ఉద్దేశాలను ప్రస్తుతపు రాజకీయ నీతిని తెలియబరచటంకోసం ఈ నాటక సమాజంవారు కొన్ని ప్రచార నాటకములనుకూడ ప్రదర్శించేవారు. సంగీత సమాజములు, సాహిత్య కేంద్రములు లాగానే ఈనాటక సమాజములు కూడ ప్రజలకు వినోదం విజ్ఞానం కలిగించటానికి బదులు రాజకీయ కార్యక్రమానికి అనువైన వ్యక్తులను ఎన్నుకొని

వారిద్వారా ప్రజానీకం రాజకీయ చైతన్యం కలిగించటానికి ఉపయోగపడేవి.

కమ్యూనిష్టు జెండా పెంకిగ్‌లో స్థాపింపబడినపుడు ఈ నాటక సమాజం కొత్తరకం ప్రచారం చేయడం మొదలు పెట్టింది. "అరుణ పతాకగీతం. ఆలోచించవలసిన సమస్య, మాస్కో వ్యక్తిత్వం, రష్యా సమస్య" మొదలయిన నాటకములు ప్రదర్శించుట మొదలుపెట్టారు. 1949 మార్చిలో అంటే ఈ కమ్యూనిస్టు ప్రభుత్వం వచ్చిన రెండవ మాసంలో "నూతన సాంస్కృతిఅజమాయిషి పర్యవేక్షకసమితి" ఇంతవరకు ప్రదర్శింపబడుతున్న నాటకాలను, సంగీత రూపకములను నిషేధించింది. ఇందుకు కారణాలు చెప్తూ ప్రభుత్వం తను చేసినపనిని యిలా సమర్థించుకొన్నది. కొన్ని నాటకాలనిండా మూఢనమ్మకాలు, కొన్నిటిలో అవినీతి, కొన్ని దేశప్రహోదాని, గౌరవమును భంగం కలిగించే యితివృత్తాలు గలవి. మంగీలులు, టార్టారులు చైనా దేశంపై దాడివెడలి ఆ దేశాన్ని తమవశం చేసుకుని చైనీయులను బానిసలుగా చేసుకున్న సంఘటనలు ఇతివృత్తంగా గల నాటకములు చైనా దేశీయులలో బానిస భావాన్ని పెంపొందింపచేస్తే అందువల్ల అవి ఎన్నటికీ ప్రదర్శనార్హములు కావు. మిగతా నాటకములు ధనికవర్గాలకి జమిందారి వర్గాలను గురించినవి. విమర్శకులకు ఏ మాత్రము నచ్చలేదు. ప్రజానీకానికి విజ్ఞానంగాని వినోదంగాని యివ్వలేని ప్రదర్శనలు వ్యర్థం. వాటి ప్రదర్శన సర్వదా నిషేధం. ఇదే మాసంలో విదేశ నాటకాలతోబాటు విదేశ చలనచిత్రాలపై కూడ దాడి ప్రారంభమైంది. ప్రభుత్వపు అధికారపు ఉత్తరువు

ఏమీ లేదుగాని బూర్జువా చిత్రాలు మాని అభ్యుదయ చిత్రాలు ప్రదర్శింప వలసినదిగా థియేటరు యజమానులకు ప్రభుత్వం జూజాగా సూచనచేసింది. ఒక వార్తాపత్రిక ఈ విషయాన్ని బాహాటంగానే ప్రచురించింది. దురూహాలను దురాచారములను బాహాటంగా ప్రచారంచేసే ఈ అమెరికన్ చిత్రాలు ప్రచారంనుండి పోయాయి. చక్కని ఉదాత్తమైన రష్యన్ చిత్రాలు ప్రచారంలోకి రావాలి. ఇప్పటికే 50, 60 రష్యన్ చిత్రాలు ఈ దేశంలో విడుదల చేయబడ్డాయి. 13 చిత్రాలు పెకింగ్‌లో కూడ ప్రదర్శిస్తారు. చైనాలోని షాంగ్ హైలో నిర్మించిన కొన్ని చిత్రాలను ప్రజాభిప్రాయముతో సమతూగటం లేదని ప్రభుత్వం నిషేధించారు.

నిజానికి యిబ్బందిపడినవాళ్ళు థియేటరు యజమానులే. విదేశచిత్రాలు రాకపోవటముతో తగినన్ని రష్యాచిత్రాలు గాని, చైనాలో నిర్మించిన కొద్దిచిత్రాలతోగాని థియేటర్లు నడ పటం చాలా కష్టం. పురాతన చిత్రాల బదులు నూతన చిత్రాలు రాగానే ప్రేక్షకులసంఖ్య ఎన్నడూ కనీవినీ ఎరుగ నంతగ తగ్గిపోయింది. జనాన్ని ఆకర్షించుటకోసం కొన్ని థియే టర్లలో టికెట్ల రేట్లు చాలాసార్లు తగ్గించవలసివచ్చింది. ధరలు తగ్గించగానే అనేక పత్రికలు థియేటర్లను వారి యజమాను లను చాల పొగిడాయి. కళలను ప్రజానీకం అందుబాటులోనికి తీసుకువచ్చే మొట్టమొదటి ప్రయత్నము ఇది అని వేనోళ్ళ వక్కాణించాయి. కాని ప్రేక్షకులు మాత్రం సినిమాహాలుకు సాధ్యమైనంతదూరంలోనే ఉండిపోవడం మొదలుపెట్టారు. గవర్న మెంటు థియేటరు యజమానులగోడు భరించలేక నెలకు ఐదు

రోజులు రష్యేతర ప్రాంతంలో నిర్మించిన చిత్రాలు ప్రదర్శించడానికి అనుమతి నిచ్చింది. దీని ఫలితంగా నెలకు ఐదురోజులు థియేటర్లలో జనం ముమ్మరంగా ఉండేవాళ్ళు. మిగతా రోజుల్లో ఎప్పుడూ చూసినా నిర్మానుష్యం. సమాజానికి హాని కలిగించే చిత్రాలను నిషేధించాలని అన్నివర్గాల దగ్గరనుంచి ఏకకంఠంగా విజ్ఞప్తులు మాకు చేస్తున్నాయి. అని ఒక్కసారిగా పత్రికలు ప్రకటన చేసేసరికి గవర్నమెంటు అభివృద్ధి నిరోధక చిత్రాలను ఒక్కసారిగ నిషేధించింది. కొన్ని వారముల అనంతరం షైనాలోని పెద్ద థియేటర్లలో ఒకటి రష్యన్ ఫిల్మ్ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీకి అమ్మివేసినట్లుగా మాకందరికి తెలిసినది. ఈ థియేటరులో రష్యాలో నిర్మించిన చిత్రాలుమాత్రమే చూపిస్తారు. కమ్యూనిస్టుపార్టీమీద కోపంవల్లగాని రష్యాదేశమంటే ద్వేషంవల్లగాని షైనీయులు రష్యన్ చిత్రాలను నిషేధించలేదు. ఒక్కరష్యన్ చిత్రం చూస్తే చాలు మిగతావి చూడనక్కరలేదు. "The story of Madeline, The Rainbow, Chapaer, Maxims youth, Defence of Lnin grat, The battle ship potemkin, The East Bound Train"లాంటి అనేక మహోన్నతచిత్రాలు ప్రదర్శింపబడాయి. యుద్ధానికి పూర్వం తీయబడ్డ చిత్రాలు చాలా బాగున్నాయి. మిగతావి చాలా పేలవంగా నిస్సారంగా ఉన్నాయి.

The young grenadier మా ఊరిలో ప్రదర్శించినపుడు మా క్లాసు మానిటరు నన్నొక ఐదునిముషములు ఉండమన్నాడు. సాంకేతికంగా ఈ చిత్రం ఎంతగొప్పదో మాకు తెలియబరచాడు. ఇది ప్రతి ఒక్కరు చూచుటకు వీలుగ ఏర్పాట్లు

అప్పుడే చేయబడ్డాయి. ప్రత్యేకంగా ఈ చిత్రంకోసం విద్యార్థులకు సగం రేటు. ఈ చిత్రం చూడదల్చుకున్నవారు టిక్కెట్టో తమ పేరు సంతకం చేసి డబ్బు క్లాసు మానిటరుకిస్తే చాలు. మిగతా ఏర్పాట్లు అతను చేస్తాడు. ఇటువంటి చిత్రాలు నేను చాలా చూశాను. అందుకని ప్రత్యేకంగా ఈ చిత్రాన్ని చూడాలని ఉబలాటం నాకేమీ కలగలేదు. పుస్తకాలను సంచిలో పెట్టుకుని బయలుదేరాను. కాని అంత మాత్రంలో వదిలిపెట్టేటట్టుగా లేడు వాళ్ళు. క్లాసుమానిటరు నాదగ్గరకు వచ్చి సంతకం పెట్టలేదేమని అడిగాడు. 'ఏమో నాకు రేపు రావాలని లేదు.' అని నేను అన్నాను. "చూడు ఈ విషయాన్ని గురించి నువ్వు సీరియస్‌గ ఆలోచించటంలేదు. ఇది వ్యక్తిగత యిష్టాయిష్టములకు అనుగుణ్యమైన కాలం కాదు. ప్రతి విషయాన్ని మనం సామాజికంగా సామూహికంగా ఆలోచించవలసి యుంటుంది ఇది ప్రజాస్వామిక దినాలు. నీకు ఈ చిత్రాన్ని చూడాలని ప్రత్యేకమైన కోరిక ఏదీ ఉండకపోవచ్చు. ఇది గొప్పదేమోనని ఆగ్రహం కూడ కలుగవచ్చు. అందుకనే తప్పక చూడాలి ఈ చిత్రాన్ని. విప్లవం అంటే ఆసక్తి చూపించే ప్రతి విద్యార్థి యిటువంటి ఉత్తమ చిత్రాన్ని చూడ్డానికి ఉబలాటపడతాడని అనుకుంటున్నాను." ఈ మాటలు నామీద ఎలా పనిచేస్తాయో చూడటం కోసం అతను ఆగాడు. ఎటువంటి పంథా అవలంబిస్తే నేను కూడ తమ మార్గంలోనికి రాగలనో అని ఆలోచిస్తున్నాడు. నేనే కనక ఉన్నదున్నట్లుగా రష్యన్ చిత్రాలను గురించి నా అభిప్రాయం చెప్పినట్లయితే నేను

మా యిద్దరి సమయాలను వ్యర్థంచేసిన దాన్నవుతాను. పైగా నేను లేని పోని యిబ్బందిలో పడవచ్చు.

"ఇటువంటి చిత్రాలంటే నాకేం ఆసక్తి తక్కువని నేను అనుటలేదు. మీ అందరికంటెకూడ ఎక్కువ యిష్టమే. కొన్ని వారాల క్రితం Rainbow అనే చిత్రం చూచాను. చాలా మంచి చిత్రం. ఆ చిత్రం చూస్తుంటే నా మనస్సు కరిగి కన్నీటితో హాలు బయటకు వచ్చేశాను. అప్పటినుంచీ ఆ చిత్రం నా మనస్సులో మసులుతూనే యున్నది. ఆచిత్రం ఆధారంగా నా మనసులోని భావాలన్నిటిని పునశ్చరణ చేసుకుని ఒక నూతనమార్గాన్ని అవలంబించుటకు నిశ్చయం చేసుకున్నాను.

"ఇక ఎన్నడూ విదేశీ చిత్రాలు చూడను. రష్యన్ చిత్రాలద్వారానే నాకు కావలసిన విజ్ఞానాన్ని వినోదాన్ని పొందుతాను. విదేశ చిత్రాలు నా మనస్సుని తిరిగి బూర్జువా పంథాలోకిలాక్కుని వెడుతుంటే రష్యన్ చిత్రాలు మాత్రం నా మనస్సులోని మూఢనమ్మకాలను వైదొలగించి మనసును ఆవరించిన శంకలను దూరం చేస్తున్నాయి." ఈమాటలన్న తరువాత ఎవరైనా నన్ను ఈ లెంపా ఆ లెంపా వాయిస్తే బాగుండుననిపించింది. బహుశః నా మాటలలోని కపటాన్ని అతడు గ్రహించాడేమో! అతని ముఖంలోని చిరునవ్వు మటుమాయమైంది. "ఈ మాటలే నిజమైతే మరి మాతో రేపు Yong grenadier చూచుటకు ఎందుకురావు అని అడిగాడు. నేను అనవసరమైన ఇబ్బందిలో పడ్డాను. నేను ఆడిన అబద్ధం కప్పిపుచ్చాలంటే ఇంకొక అబద్ధం ఆడాలి.

"ఏమో అయినా యిపుడు వెళ్ళాలని లేదు. ఈ మధ్య నాకు వంట్లో ఏమీ బాగుండడంలేదు. వీలున్నపుడు తప్పక చూస్తాను. అయినా చాలా రోజులుంటుందిగా."

"నీవు ఒక్కొర్తెవూ వెడతావా లేక మీ వాళ్ళంతా కలిసి వెడతారా?" అని అడిగాడు. నా మాట నమ్మినట్లుగా వున్నాడు. అతని కళ్ళలో కోపంపోయి మళ్ళీ చిరునవ్వు వచ్చినది. "నీకు తోటి విద్యార్థులతో కలిసి యిటువంటి సినీమాలకి వాటికి వెళ్ళటంఇష్టంయిష్టంలేదనుకుంటాను.ఇట్లాగ నక కొంతకాలం పోతే, ప్రజానీకంతో పాటు నువ్వు నడవలేవు. నూతన వాతావరణానికి, అలవాటు పడటం నేర్చుకోవాలి. లేక పోతే ముందు ముందు చాలా యిబ్బందులు రావచ్చును. మాతో కలిసి రేపు సినిమాకి రాకూడదూ? ప్రయత్నం చేసి చూడు. అంతా కలిసిమెలిసి ఉండటం అలవాటు చేసుకుంటే చాలా మంచిది. మనమంతా సహకరించుకుంటేనే కలిసిమెలిసి ఉండటం అలవాటవుతోంది. ఆ సమిష్టి జీవితం ఒకసారి అల వాటయితే చాలా బాగుంటుంది. రేపు సినిమాకూడా చాలా సరదాగా వుంటుంది." అని అతను ఉత్సాహంతో అన్నాడు. నేను లిస్టులో వ్రాయమని పేరు యిచ్చాను. ఈ సమష్టిజీవితం లోనూ, సోవియట్ చిత్రాలలోనూ నాకు ఎంత ఆసక్తిఉన్నదీ పరీక్ష చేసుకోవటం కోసమే నేను ఆ విధంగా చేశాను. అంతే కాని అతను చెప్పింది మనస్సుకు నచ్చడం వల్ల కాదు.

మధ్యాహ్నం వేళ మా కోసం ఒక ప్రత్యేక ప్రదర్శనం ఏర్పాటు చేశారు. సినిమా చూచుటకు వచ్చినవారితో డెమాక్రటిక్ స్క్వేరంతా క్రిక్కిరిసి పోయింది. చివరకు

మేమంతా బారులుతీర్చి నిలబడి 'యువజన విజయ గీతికను' పాడుకుంటూ సినిమాహాలుకు వెళ్ళాము. అక్కడ ఒక్కొక్క క్లాసు విద్యార్థులను ఆ క్లాసు లీడర్ పేరుపేరునా పిలుస్తున్నాడు. మేమంతా బారులుతీరి హాలులోకి వెళ్ళి కూర్చున్నాము. కొంతమంది స్తంభాల వెనుకకు వెళ్ళవలసివచ్చింది. వాళ్ళలో వాళ్ళు సణుక్కుంటూ సర్దుకుని కూర్చున్నారు.

లైట్లు ఆరిపోయినాయి. ఆచారంప్రకారం మార్షల్ స్టాలిన్, చైర్మన్ మావ్‌ల చిత్రాలు తెరమీద ప్రదర్శించారు. ప్రేక్షకుల హర్షనాదాలతో హాలంతా పిక్కటిల్లింది. తరువాత మిలిటరీ సంగీతం. తరువాత అసలుచిత్రం ప్రారంభమైంది.

రష్యన్ చిత్రాన్ని చైనాభాషలో డబ్బింగు చేశారు. కాని డబ్బింగు ఏమాత్రం బాగులేదు. సంభాషణలు డబ్బింగు చేసినది రష్యనులో లేక చైనాలోనే దూరప్రాంతీయులో ఐ యుంటారు. వాళ్ళ ఉచ్చారణ నుడికారం చాల విచిత్రంగా ఉంది. జర్మనుల దాడిని ఒక రష్యాయువకుడు ఎదుర్కొని జయించిన సంఘటన ఈ చిత్రానికి యితివృత్తం. కథ బాగానే ఉండచ్చు కాని సాంకేతికంగా అనేక లోపాలున్నపుడు చిత్రం విజయంసాధించడంచాలా కష్టం.ప్రజాసిద్ధాంతాల్లోఎంతో నమ్మకం ఎంతో విశ్వాసాన్ని వ్యక్తంచేసే సంభాషణలు చైనావాళ్ళలో చైనాభాష మాట్లాడే రష్యనులో మాట్లాడుతూఉంటే ఆ సిద్ధాంతాలమీద వాళ్ళకేవో చాలా సందేహాలున్నట్లుగా వినిపించాయి. అతి ఉద్రేకం కలిగించే సన్నివేశంలోని సంభాషణలు అతి నిశ్చలంగా నిర్లిప్తంగా చెపుతుంటే వినే వాళ్ళకు గంగి వెర్రులెత్తాయి. పొగడ్తలు శాపాల్లాగ విని

పించాయి. విషాద సంఘటనలు వీళ్ళు చెప్పుకున్నప్పుడు ఏదో వేళాకోళంగా అంటున్నట్లు ఉంది. ఉద్రేకం ఉత్సాహం అన్నీ స్క్రిప్టులో ఉన్నాయి కాని యాక్టర్లుమాత్రం యథాశక్తిని వాటిని బీభత్సంచేసి చిత్రాన్ని పేలవంగా హాస్యాస్పదంగా మార్చారు. "నా దేశం కోసం నేను ఏదైనాసరే త్యాగం చేస్తాను. ఎటువంటి త్యాగానికైనా వెనుదీయను" అని కథా నాయకుడు ఎక్కిరింతగా అంటుంటే మేమంతా దిగ్భ్రాంతులై ఒకరి ముఖాలొకరు చూస్తున్నాము. అటువంటి చిత్రాలవల్ల విజ్ఞానాన్ని పొందడం కష్టం. యుద్ధంలో అప్పుడే గుండు దెబ్బతిని పడిపోయిన ఒక యోధుడి దగ్గరకు కథానాయకుడు పరుగెత్తుకు వెళ్ళి బెదిరిస్తున్న కంఠంతో "కామ్రేడ్ కొంచం ఓపికపట్టు. నిన్ను నేను మోసుకు వెళతాను." అని అన్నప్పుడు ఆ క్షతగాత్రుని పరిస్థితి ఏమాతుందో అని మేమంతా భయ పడ్డాము. ఇక నటీనటులుకూడ ఏదీ యితర దేశపు వారిలాగా ఉన్నారు. కొందరి వేషాలకు, వారు ధరించిన పాత్రకు సంబంధం లేదు. నిరాడంబరంగా ఉండడం మంచిదే. చాలా అవసరం కూడాను. కాని కురూపితనాన్ని నిరాడంబరమని భ్రమపడడం చాలా పొరపాటు. రూమేనీల దృష్టిలో కొందరు నటీనటులు తోలుబొమ్మలాటలోని గాంధాళిగాడికి మల్లే కను పించారు. వాళ్ళు చాలా సీరియస్‌గా చెప్పే సంభాషణలు మా హృదయాన్ని విషాదంతో నింపడానికి బదులు మనస్సును హాస్యంతో నింపాయి. కథానాయికలో లవ లేశమయినా అందం లేదు. సినిమాలో ఆవిడ ఒక గూఢచారిణి. ఆమె అందానికి దాసుడై ఒక జర్మన్ నాయకుడు యుద్ధరహస్యాలన్నీ

ఆమెకు చెప్పివేస్తాడు. జర్మనులు యుద్ధంలో ఓడిపోయారంటే అబ్బురము ఏమియు లేదు.

చీకటిలో కూర్చుని ఈ చిత్రంవల్ల మాకు ఎటువంటి ఉత్తేజం లభిస్తుందా అని ఆలోచిస్తున్నాను. చైనా ప్రజలు చైనా యువకులు జపానీయులతో ఏళ్ళ తరబడిగా పోరాడిన పోరాటం కంటె రష్యన్ సైన్యాలు జర్మనులతో సలిపిన పోరాటం ఎందుకు అధిక ప్రశంశలను పొందుతోంది? ఈ కథ లోని నాయకుడు సలిపే వీరోచిత కృత్యాలు మా చైనా దేశస్థులకు అధిక విజ్ఞానము నిస్తాయి అనడానికి కారణం ఆ నాయకుడు రష్యన్ అయి యుండుట వలననా? చివరకు కథా నాయకుడు తన అంతిమ ఉపన్యాసాన్నిచ్చాడు. హర్ష నాదాలతో విజయ గీతాలతో చిత్రం అంతమైనది. దబ్బున లైట్లు వెలిగాయి. యింతసేపు యింతమంది జనసమ్మర్ధములో కూర్చుని యున్నందుకు తల దిమ్మెక్కి ఏదో ప్రపంచంలో నుంచి వచ్చినట్లుగ బయిటకు వచ్చాము. ప్రతివ్యక్తి తనకంఠంలో ఓపిక ఉన్నంతవరకు ఈ చిత్రాన్ని పొగుడుతున్నారు. చాలా గొప్పసాంకేతిక విలువగలచిత్రం. Rainbow తరువాత యిలాంటి ఉత్తమ చిత్రాన్ని యింతవరకు చూడలేదు. నా ఆత్మీయ మిత్రుని ఒకణ్ణి అడిగాను – చిత్రం నిజంగా అంత బాగుందా అని; అతను చిరునవ్వుతో "మనకుగల శ్రామికవర్గ దృక్పథంపై అది ఆధారపడి ఉంటుంది" అన్నాడు. ఇద్దరం కలిసి జనసమ ర్దం నుండి బయటకు వచ్చి కాలేజీవైపు నడచి వెళ్ళి పోయాము. నేను మాత్రం హాలులో స్థంభాల చాటున కూర్చున్న వాళ్ళ అదృష్టాన్ని యీర్ష్యతో తలుచుకుంటూ యింటిముఖం పట్టాను.

# 14

## పెళ్లికూతుర్లు అలక

హాంగ్‌కాంగ్‌లో నేను డాక్టరు దగ్గరకు వైద్యంకోసం వెడితే ఆయన రకరకాల ఖరీదైన మందులపేర్లు వ్రాసియిచ్చి మాటల సందర్భంలో "కమ్యూనిస్టుల పరిపాలనలో స్త్రీ పురుషుల వైవాహిక సంబంధాలు ఎట్లా వుంటాయి, వాళ్ళు చాలా విచ్చలవిడిగా ఉంటారని విన్నమాట నిజమేనా?" చిలిపినవ్వు నవ్వుతూ "ఒక్కొక్కసారి గర్భిణీతో ఉన్న స్త్రీకి తనకుపుట్టబోయే బిడ్డకి తండ్రి ఎవరోకూడా తెలియదటగా?" అని యింకా ఏవో అనబోతూ ఉన్నాడు.

నేను మధ్యలోనే అందుకుని "సైన్యంలో కొంత వ్యభిచారం ఉన్నమాట నిజమేగాని మిగతావాళ్ళనుగురించి నేనేమీ వినలేదు. ఆఫీసులలో పాఠశాలల్లో కలిసి మెలిసి పనిచేసేవారు చాలా జాగ్రతగా ఉంటారు. అవినీతికి ఆస్కారంలేదు" అని అన్నాను.

"అవునవును, అదీనిజమే. కమ్యూనిస్టులు వచ్చిం తర్వాత పరిస్థితులు చాలా చక్కబడ్డాయి. రోడ్డు మళ్ళీ తెరిచిం తర్వాత ఆహారం అందరికీ లభిస్తోంది. అంతా చాలా హాయిగా ఉన్నట్టు ఉన్నారు" అని అన్నాడు.

నేను బలవంతాన నవ్వు ఆపుకోవలసి వచ్చింది. ఆయన అకస్మాత్తుగా తన ధోరణి మార్చుకోవటం చూస్తే, నవ్వు

కమ్యూనిస్టులు యిటువంటి వాళ్ళను కనిపెట్టటంకోసం హాంగ్ కాంగ్ నకు పంపిన గూఢచారిణిగా అనుకుని ఉండాలి. నిజానికి నవచైనాలో యువతీ యువకుల మధ్య యీ ప్రేమ కలాపాలకి సరససల్లాపాలకీ యితరులు అనుకున్నంత స్థానంలేదు. ఎవరైనా వాటినిగురించి అధికంగా చెప్పారంటే అదంతా ఊరికే మనల్ని మభ్యపెట్టడానికి చెప్పే మాటలన్నమాట.

మిగతా ప్రదేశాలలోకిమల్లేనే పైటాలోని విద్యార్థులకి కూడా ప్రేమ, కామం, స్త్రీ పురుష సంబంధాలను గురించి, కమ్యూనిస్టు రాజ్యం రాకపూర్వమే తెలుసును. సహజమైన వాంఛలు ఉండటంచేతనే ఒకరినొకరు చూసుకోవటం, ఆకర్షింపబడటం జరిగేవి. చాలామంది బాలికలు మొగపిల్లలతో కలిసి షికార్లకు, సినిమాలకు, డాన్సులకు వెళ్ళేవారు. అన్నింటికంటె ఎక్కువగా పడవషికారుకు వెళ్ళేవారు. వసంత ఋతువులో సాయంకాలంపూట నులివెచ్చని ఎండలో చీకూ చింతా లేకుండా పడవలో హాయిగా షికార్లు చేయడంకన్నా వేరే ఏమికావాలి! క్రమక్రమంగా వెలుగుతగ్గి చీకటి వస్తూవుంటే ఊళ్ళో దీపాలు ఒకటొకటే వెలుగుతున్నయి. పడవ షికారుపూర్తికాగానే హోటల్లో వేడివేడిటిఫిన్ తింటూఉంటే ఎంత హాయిగా ఉంటుంది!

సినిమా నటీనటులలో ఛార్లెస్ బోయర్, ఇన్‌గ్రిడ్ బెర్గ్‌మన్, గారీకూపర్ అంటే మాఅందరికీ చాలా యిష్టము. రాజకీయంగా పురోగమించి ఉన్నా చైనా విద్యార్థులు వ్యక్తిగత జీవితాలలో చాలా పురాతన పంథాలలోనే యింకా నడుస్తూ ఉన్నారు. 1948 ప్రాంతంలో మావ్యక్తిగత అభి

లాషలు యిష్టానిష్టాలకంటెగూడా దేశభవిష్యత్తు మాకు చాలా ముఖ్యంగా కనిపించింది.

కొంతమంది కమ్యూనిస్టుల ఉద్దేశ్యంలో లైగింక సంబంధమన్నా, వాంఛలన్నా, దాహం వేసినప్పుడు దప్పిక తీర్చుకోవటం ఎంతో యిదిగూడా అంతే. చేతల్లో కాక పోయినా కనీసం ఉద్దేశ్యంలోనైనా మేము స్వాతంత్ర్యం సిద్ధించగానే ధైర్యంగా స్వేచ్ఛగా ఉందామని అభిలషించాము. కాని క్రొత్తపోకడల నిజస్వరూపం తెలియగానే మాలో ధైర్యంచేసి ముందుకువచ్చినవాళ్ళు తమ ఊహాలు ఉద్దేశ్యాలు మార్చుకుని వెనుకంజ వేయవలసి వచ్చేంది.

బానిసత్వంనుంచి విముక్తి కలుగగానే మేము యింకా అనేక క్రొత్త కట్టుబాటులకి లొంగవలసి వచ్చింది. స్త్రీ పురుషులు ప్రేమ జీవనంకంటె ముఖ్యమైన పనులు ఎన్నో కనిపించాయి.

మా డిపార్టుమెంట్ లో ఒక చిన్నవాడు, ఒక చిన్నది ఉండేవాళ్ళు. వాళ్ళు యిద్దరూకూడా పార్టీలో సభ్యత్వం కోసం వేచియున్నారు. ఇద్దరూస్నేహితులు. పైగా కామ్రేడ్స్. ఇద్దరూ ఒకే పనిలో వుండటంవలన తరుచు కలుసుకొంటూ ఉండేవాళ్ళు. వాళ్ళ ఉభయుల సమావేశాలూ ఆఫీసు పని కోసమే. మాట్లాడవలసిన విషయం అయిపోగానే అతను వెంటనే వెళ్ళిపోయేవాడు. స్వాతంత్ర్యం వచ్చిన ప్రథమ మాసాలలో వారిద్దరుకూడా చాలా హడావుడిగా క్షణం తీరిక లేకుండా ఉండేవారు. ఎప్పుడైనా కలుసుకున్నా ఏదో పనికి

సంబంధించిన విషయాలు మాట్లాడుకునేవారు. స్వంత విషయాలు మాట్లాడుకోటానికి వ్యవధి ఏది ?

ఆ పిల్లదాన్ని గాఢంగా ప్రేమిస్తున్నట్లు ఆ పిల్లవాడు అకస్మాత్తుగా తెలుసుకున్నాడు. దీనితో లేనిపోని బెడద ఒకటి వచ్చిపడింది. ఈ పిల్లమీద ప్రేమవల్ల పార్టీపనులను సక్రమంగా నిర్వహించలేనేమోనని భయపడ్డాడు. పార్టీలో యీ విషయాలన్నీ చెబుదామని అనుకున్నాడు. చివరకు తనముఖ్యస్నేహితునితో యీ విషయం కొంత చెప్పాడు. పరిస్థితి అంత విషమిస్తే చెయ్యగలిగిందల్లా ఒక్కటే – ముసుగులో గుద్దులాట మాని వేసి అసలు విషయానికి రావటమే. "ఆ పిల్లమీదకు ఒక దండయాత్ర సాగించు. మీ యిద్దరూ మంచి స్నేహితులు. కలిసి మెలిసి పనిచేస్తున్నారు. గెలుపు తప్ప ఓటమి ఉండదు" అని మిత్రుడు సలహాయిచ్చాడు.

మర్నాడు మధ్యాహ్నం తనగదిలో కూర్చుని ఆ పిల్ల ఏదో రాతపనిలో ఉంది. ఇతను తలుపుతట్టగానే లోపలికి రమ్మని పిలిచింది. "కూర్చో! ముఖ్యమైనదని ఏమన్నా ఉంటే చెప్పు, ఈ రాత పని ఆపేస్తాను" అన్నది.

ఆ పిల్ల మాటలు అతని చెవిని పడటంలేవు. గుడ్లు అప్పగించి ఆ పిల్లవంక చూస్తూ కూర్చున్నాడు. అతని చూపుకు ఆమె యిరకాటంలోపడి తన ప్రశ్నను మళ్ళీ అడిగింది. ఆ పిల్ల మాట్లాడటం ప్రారంభించగానే అతను కుర్చీలో నుంచి ఎగిరి గెంతువేసి ఆ పిల్ల చేతిని తన చేతులోనికి తీసుకొని తుపాకి పేల్చినట్లుగా "నిన్ను ప్రేమిస్తున్నాను. నా ప్రేమను స్వీకరించు" అని అన్నాడు.

ఆపిల్ల దిగ్భ్రాంతిచెందింది. ఆమెకు ఈ ప్రేమకలాపాల్లో బొత్తిగా అనుభవంలేదు. పైగా యీ మొరటు కామ్రేడ్ తన ప్రథమ ప్రేమికుడు అవుతాడని ఆమె కనీసం కలలోకూడా అనుకోలేదు. తన చేతిని అతని చేతినుంచి విడిపించుకుని "నాకు నిన్ను గురించి బాగా తెలియదు..."

అంతమాత్రంచేత అతను నిరుత్సాహ పడే రకంకాదు. "దయచేసి నా ప్రేమను స్వీకరించు. నేను నిన్ను గాఢంగా ప్రేమిస్తున్నాను. ఎందుకంత సిగ్గు. మనం యిద్దరం మిత్రులం. ఇద్దరం ఒకేరకమైన కష్టాలూ బాధలూ గడిచి చివరకు యీ తీరుకు వచ్చాము. ఇద్దరం కలిసి మెలసి పనిచేశాము. మన భావాలు, గమ్యస్థానములు ఒక్కటే-ప్రేమనుగురించి మనకు ఎటువంటి ఉద్దేశ్యం ఉండాలో నేను చెప్పవలసిన అవసరం లేదు. పార్టీ పని మన యిద్దరినీ ఒకచోటుకు చేర్చింది. నన్ను గురించి తెలుసుకోవలసినదంతా నువ్వు ఎప్పుడో తెలుసు కున్నావు. ఇంతకన్నా అధికంగా నీకు కావలసిన దేమున్నది?" అని ప్రార్థిస్తున్నట్లు, ఆజ్ఞాపిస్తూ ఉన్నట్లు అన్నాడు.

ఈ తాకిడికి ఆచిన్నది తట్టుకోలేక పోయింది "ఈవిష యం గురించి ఆలోచించడానికి వ్యవధి కావాలి. నేను దీనిని గురించి యిప్పుడే యిదమిత్థంగా ఏమీ చెప్పలేను" అని అన్నది.

"దీంట్లో ఆలోచించడానికి ఏముంది? పూర్వపు బూర్జువా పద్ధతులనువదలి నూతనవ్యక్తిత్వాన్ని అలవర్చు కుంటామని మనం ప్రమాణం చెయ్యలేదూ? ఈనాడు ఒక స్త్రీ ప్రేమను సంపాదించడానికి పురుషుడికి, పురుషుణ్ణి తన

వానిగా చేసుకోవడంకోసం అలంకరించుకుని కూర్చోవడానికి ఏ స్త్రీకి సమయంలేదు. నిర్భయంగా, స్వేచ్ఛగా, ప్రజానాయకుల్లాగా, విప్లవవీరుల్లాగా ప్రేమించుకుందాం" అని తన వాక్ప్రవాహంలో ఆమెను ఉక్కిరి బిక్కిరి చేశాడు.

ఆపిల్ల మొదటయిచ్చిన సమాధానమే తిరిగియిచ్చింది. "ఇది మన యిరువురి జీవితాలకీ సంబంధించిన ఒక ముఖ్య సమస్య. దాని నిర్ణయంమీదనే యిరువురి భవిష్యత్తూ ఆధారపడి ఉంటుంది" అని ఆమెఅన్నది.

అతడు వెళ్ళితనపార్టీ మిత్రులతో యీసంగతిచెప్పాడు. ఎందువల్లనంటే యిదికూడా పార్టీకి సంబంధించిన విషయమే గనుక. సరే, కొంత తర్జనభర్జన జరిగిన తర్వాత వారు నిర్ణయించిన దేమిటయ్యా అంటే ఆపిల్ల అతనిప్రేమను స్వీకరించ గలిగితే వారిరువురూ ఆదర్శ దంపతులు అవుతారని. ఎందుకంటే వాళ్ళు అన్ని విషయాలు సమగ్రంగా చర్చించుకున్నారు. కొద్దిరోజులలోనే పార్టీసభ్యులుకూడా కాబోతున్నారు. పార్టీని చాలా నమ్మకంగా సేవిస్తున్నారు. వారిద్దరూ ఒకరినొకరు ప్రేమించుకునేటట్లు చేయగలిగితే వారు కష్టపడి పనిచేస్తారు; ఇద్దరివల్లా పార్టీకి ఎంతో లాభం ఉంటుంది. వాళ్ళ అభిరుచులు, యిష్టానిష్టాలు వ్యక్తిగతమైనవి. అందువల్ల పార్టీ వాటిని గురించి చర్చించలేదు.

తన స్నేహితుల సహాయంతో ఒక మహిళా కామ్రేడ్ వద్దకు వెళ్ళి విషయమంతా చెప్పాడు. తననుగురించి తన ప్రియురాలితో అన్ని విషయాలూ విపులంగా చెప్పమని ప్రార్థించాడు. "ఇది విప్లవయుగం. బూర్జువాలవలె ప్రేమకలాపాలకు, విరహ

లకు యిప్పుడు వ్యవధిలేదు. కలిసి సినిమాలు చూడటం, సరస సల్లాపాలతో పార్కులలో కాలం గడపటం, హోటళ్ళకు వెళ్ళి విందులారగించటం-యిటువంటివాటికి యిప్పుడు వ్యవధి లేదు. మన భావాలని స్వేచ్ఛగా వ్యక్తపరచడం నేర్చుకోవాలి. విద్యావతియైన యువతికి నేటి ప్రజాస్వామ్యపు రోజుల్లో సిగ్గును అభినయించటం అంతగా భావ్యంకాదు" అని చెప్పుతున్నాడు. ఆ మహిళా కామ్రేడ్ యితని సందేశాన్ని ఆ పిల్లకు చేరవేసింది.

ఏం చెయ్యాలో తోచక ఆ పిల్ల పార్టీతో మొరపెట్టుకుంది. వాళ్ళంతా చర్చించి అతని ప్రేమను స్వీకరించవచ్చునని అన్నారు. ఒకవేళ ఆమెకు అతనిమీద ఎటువంటి ప్రేమలేకపోతే వివాహం చేసుకోమని పార్టీ బలవంతం చెయ్యదు. ఇంత వరకు అతనియందు తనకు స్నేహభావంతప్ప మరేభావములేదని ఆ పిల్ల పార్టీతో మనవిచేసుకున్నది. ఈ సంఘటనజరిగి రెండు వారాలు గూడా కాలేదు. ఓ రోజున ఆపిల్లవాడు తన స్నేహితులందరికీ మిఠాయి పంచిపెడుతున్నాడు. ఇద్దరు యువతీయువకులు ఒకరి నొకరు ప్రేమించుకుని, వివాహమాడ నిశ్చయించుకుంటే యిట్లా మిఠాయి పంచిపెట్టడమనేది చైనా దేశంలో ఆచారం. ఈ వార్త విన్న వెంటనే ఆమె స్నేహితులంతా విషయం నిజమేనా అని అడిగారు. మొదట్లో ఆమె ఏమీ చెప్పలేదు. చివరకు ఒప్పుకోక తప్పలేదు. కొద్దిరోజులనుంచి అతనియందు ఆమెకు ప్రజాస్వామికపు ప్రేమ కలిగింది. చాలా ఆలోచించిన తర్వాత అతని ప్రేమను స్వీకరించ కలిగినది. రెండు మూడు వారాలదాకా వాళ్ళను మాకు తోచినవిధంగా

ఎగతాళి చేసేవాళ్ళను. తర్వాత వాళ్ళకు మాకూ అది పరి పాటి అయిపోయింది. ఏళ్ళతరబడి కాపురం చేస్తున్న వాళ్ళ లాగా వారు కన్పడేవారు.

నిజానికి ఆ పిల్లదాని మనస్సులో అతనియందు- ప్రేమ ఉన్నదో లేదో చెప్పలేము. కాని ప్రజాస్వామికమనే మంత్రం మాత్రం ఆ పిల్ల మనస్సుని యిట్టే వశపరచుకొన్నది.

కొంతమంది విషయంలో మాత్రం యీ ప్రేమ, వారి వారి పనులకి చాలా యిబ్బంది కలిగించింది. పార్టీకి, ప్రజా సేవకు వినియోగించవలసిన వారికాలం యీ ప్రేమకలాపాలతో వ్యర్థమయింది. కాని, కొందరు తెలివితేటలుగలవాళ్ళుమాత్రం, తమ పార్టీని, పార్టీ కార్యకలాపాలను - తాము ప్రేమించిన యువతులతో పరిచయం అభివృద్ధిచేసుకోవడం కోసం ఉపయో గించుకునేవారు. కుర్రవాడు ఏదైనా సంగీతసమాజానికి చెందిన వాడైతే తను ప్రేమించే పిల్లనుకూడా యీ సమాజంలో చేరమని ఆహ్వానిస్తాడు. ఆ పిల్ల చేరటానికి నిరాకరిస్తే సమిష్టి కార్యక్రమాలలో పాల్గొనటానికి యిష్టపడని బూర్జువా తత్వం కలిగి ఉన్నావని ఆమెను బెదిరిస్తాడు. లేకపోతే, ఆ పిల్లకు బాగా నృత్యంచేయడం వచ్చినా - తనకి రానప్పటికీ అది సాకుగా తీసుకుని డాన్సు నేర్చుకునే మిషమీాద ఆ పిల్లతో వీలైనప్పుడల్లా కాలం గడపవచ్చును. ఆ పిల్ల సుముఖంగా లేకపోతే కుర్రవాడు సేవకునివలె నటిస్తూ నేరం ఆ చిన్నదాని మీాదకు నెట్టవచ్చును. "ఫలానా పిల్లకి తోటి విద్యార్థులకి సహాయం చేయటం యిష్టంలేదు. యింకా బూర్జువా మనస్తత్వాన్నే కలిగిఉన్నది" అని ప్రచారం చేయవచ్చును.

ఇంతకంటె సులభమైన పద్ధతి మరొకటి ఉన్నది. ఎవ్వరైనా పిల్ల ఒంటరిగా వెడుతూఉంటే, ఆ పిల్లతో కలిసి నడుస్తూ మాటామాటా కలిపి; మాటల సందర్భంలో నూతన రాజకీయ వ్యవస్థనుగురించి ఆ పిల్ల అభిప్రాయాలు కనుక్కోవటం, ఆ పిల్ల మనస్సులో యీ నూతన విధానముఎడల ఏమైనా అనుమానాలు ఉన్నట్లు తోచినా, ప్రజారాజ్యంమీద యింకా దృఢనమ్మకం ఏర్పడలేదని తెలిసినా, "నువ్వు అడిగిన ప్రశ్నలను బట్టి చూస్తే కొన్ని పొరపాటు అభిప్రాయాలు నీ మనస్సులో వున్నట్లు కనిపిస్తున్నది. ఈ బూర్జువా భావాలు నీలో పాతుకునిపోయి వాటి ప్రభావం నీవుతలచిన దానికంటెకూడా అధికంగా నీమీద పనిచేస్తున్నాయి. ఈ భావాలను నీలోనుంచి నిర్దాక్షిణ్యంగా, నిర్భయంగా కూకటి వేళ్ళతో సహా పెకలించి వెయ్యాలి." అని అంటూ ఆ పిల్లవంక అతి ఆప్యాయతతో చూసి "నీకు వీలున్నప్పుడు యీ విషయాలను గురించి సమగ్రంగా మనం చర్చించుకోవాలి" అంటాడు. ఆ పిల్ల దాని మనస్సును పాత పద్ధతులనుంచి మరలించి కొత్త మార్గంలో పెట్టాలంటే ఒక్కనాటితో అయ్యేపనికాదు. కొత్త పద్ధతులలోనుంచి మళ్ళీ పాత అలవాట్లలోకి మనస్సు జారబడకుండా కట్టుదిట్టం చేసుకోవాలంటే అతని సహాయం చాలా అవసరం.

ఆత్మవిమర్శన సమావేశాలలో ఆ చిన్నది తనను తాను విమర్శించుకుంటూఉంటే అతనిముఖంలో సంతోషం తాండవిస్తుంది. సభా అనంతరం "అప్పుడే ముఖ్యమైన మార్పులు నీ మనస్సులో ప్రారంభమైనాయి. ఇట్లా కొంతకాలం ప్రయత్నం

చేసి ముందుకు సాగిపోవాలి. ఈ విషయంలో వెనకపడవద్దు. అందరితో సమానంగా ఉండాలి. మన చర్చలు యింకా కొంత కాలంవరకూ కొనసాగుతూఉంటే మంచిదనుకుంటాను... ఏమంటావ్" అంటాడు.

ఒక్కొక్కసారి కథ అడ్డం తిరుగుతోంది. ప్రేమకోసం తహతహలాడే యీ పిల్లవాడికంటె ఆ చిన్నదే రెండుఆకులు ఎక్కువ చదివిఉంటుంది. అప్పటికీ ఆ పిల్ల పార్టీ మెంబరు కాక పోతే యువజన సంఘంలో సభ్యురాలుగా ఉంటుంది. కుర్రవాడు యింకా నికార్సైన రాజకీయ దృక్పథానికి అలవాటుకానివాడై నూతన మార్గంలో పురోగమిద్దామనే ఉత్సాహిమాత్రం అయిఉండటం కద్దు. ఇటువంటి సందర్భాలు చాలా అరుదు అయినా అసంభవము అని చెప్పటానికి మాత్రం వీలులేదు. ప్రియునికన్నా ప్రియురాలు తెలివిగలది, సుస్థిరమైన భావాలు, అభిప్రాయాలు కలది. అయితే సాధారణంగా యీ ప్రియుడు భయపడి రంగస్థలంనుంచి తప్పుకుంటాడు. అట్లా కాదని ఆ కుర్రవాడు ఆ కన్నె ఎదుటపడి తన ప్రేమని వ్యక్తం చేస్తే, సర్వసాధారణంగా ఆమె అతని ప్రేమని వ్యక్తంచేస్తుంది, లేదా అతడు కష్టపడి పనిచేసి "స్వర్ణ జాబితా"లో స్థానం పొంద గలిగితే అతని ప్రేమసంగతి ఆలోచిస్తానని వాగ్దానం చేస్తుంది. పూర్వం ప్రభుత్వ పరీక్షలలో ఉత్తీర్ణులై, ఉన్నత పదవులకి అర్హులైన వారి పేర్లు స్వర్ణ జాబితాలో ప్రకటించేవారు. సరే యీనాడు ఆ జాబితాలో పార్టీలోగాని యువజన సమితిలో గాని సభ్యులుగా చేర్చుకోబడినవారి పేర్లు ప్రకటిస్తున్నారు.

ప్రేయసీ ప్రియులలో ఎవరైనా అప్పటికే పార్టీ మెంబరు అయివుంటే వాళ్ళ విషయాలు, పార్టీలో బాహాటంగా చర్చించేవాళ్ళు. ఎవరైనా తమ ప్రేమ వ్యాపారాలని కప్పి పుచ్చటానికి ప్రయత్నం చేస్తే, చెప్పటానికి సిగ్గుపడుతున్నాడని, బూర్జువా వాసనలు యింకా వదలలేదని, యితరులకు చెప్పరాని రహస్యాలు వుండటం పార్టీకి, పార్టీ సిద్ధాంతాలకి విరుద్ధమని అనేవాళ్ళు. ఒక వ్యక్తి ప్రేమకలాపాన్ని గురించి పార్టీతో చెప్పగానే వాళ్ళు యీ విషయంలోని బాగోగులు చర్చించి, తమకు నచ్చిన సలహాలను యిచ్చేవాళ్ళు. ఈ సలహాలను అక్షరాలా పాటించాలని ఎక్కడా నియమంలేదు. కాని ప్రతివ్యక్తి తన రాజకీయ జీవితం గురించి ఆలోచించవలసి వుంటుంది. నీ ప్రియుడు కాని, ప్రియురాలు కాని రాజకీయంగా చాలా వెనకబడివుంటే, అటువంటి వ్యక్తితో నీ బంధనాలను తెంచివెయ్యటం ఉత్తమమని పార్టీ సలహా యిస్తుంది. కాని సాధారణంగా, నీ ప్రియుణ్ణి కాని, ప్రియురాలిని కాని పాత పద్ధతులనుంచి తప్పించి క్రొత్త మార్గంలోకి తీసుకువచ్చే బాధ్యత పార్టీ నీమీద వదలిపెడుతుంది. ఈ పనిలో సాఫల్యం లభిస్తే నువ్వు నీ ప్రేమ కలాపాలు యథేచ్ఛగా సాగించవచ్చు.

మనిషి నిలువెల్లా ఆనందంతో నిండిపోవటం అనేది, యీ మధ్యనే చూశాను. నా స్నేహితురాలు ఒక యువకుని ప్రేమించింది. అతను మాకంటె ఒకసంవత్సరం ముందుగానే చదువు ముగించుకుని, దక్షిణాన ఒక చిన్నపల్లెటూరులో పని చేస్తున్నాడు. ఆ పిల్ల అప్పటికే పార్టీ మెంబరు. అతడికి యింకా

ఆగౌరవం లభించలేదు. పార్టీ అంటే ఆ పిల్లకి ఎంత భక్తి గౌరవం వున్నా, తన వ్యక్తిగత సమస్యలనిగురించి తరుచు దిగులుపడుతూవుండేది. ఒంటరిగా గదిలో కూర్చుని ఒక్కొక్క సారి గుండెలు పగిలేటట్టు ఏడ్చేది. ఒకరోజు సాయంకాలం మేము యిద్దరం షికారునుంచి తిరిగివచ్చేసరికి కాపలామనిషి, ఆ పిల్లకు ఒకవుత్తరం పట్టుకొచ్చాడు. "అతనిదగ్గరనుంచేనా?" అని అడిగాను. "వారిదగ్గరనుంచే...ఈ మధ్య చాలా దిగులు పడ్డాను. ఆయన వుత్తరాలు చదవటమంటేనే భయంవేస్తోంది" అని అన్నది.

గదిలోకి వెళ్ళి ఉత్తరం చదవటం మొదలుపెట్టేసరికి విచారంఅంతాపోయి చెప్పలేని ఆనందం కలిగింది. ఉత్తరం చదివి ఆనందంతో నాట్యం చెయ్యడం మొదలుపెట్టింది. "ఆయన దరఖాస్తు మంజూరు అయింది. ఆయన్ని పార్టీలోకి తీసుకోవడానికి వప్పుకున్నారు."

"చాలా బాగుంది. మీయిద్దరిని చూస్తూ ఉంటే నాకుచాలా సంతోషంగా. వుంది. ఇహ నువ్వు పెళ్ళిఏర్పాట్లు చేసుకోవచ్చు" అని అన్నాను.

ఈమాట వినగానే ఆపిల్లలో ఉత్సాహం తగ్గింది. "నాచదువు పూర్తి అయ్యేదాకా ఆగాలి. పైగా మా యిద్దరికీ పార్టీ అనుమతి రావాలి" అని అన్నది.

ఆపిల్లనిచూసి నేను చాలా సంతోషపడ్డాను. కాని ఆపిల్ల దృక్పథం నాకు బోధపడలేదు. రాజకీయంగా తమకు అనువైన వాళ్ళనే ప్రేమించడం, వివాహం చేసుకోవడం జరగాలనే కమ్యూనిస్టుపార్టీ సంప్రదాయం ఆడపిల్లలందరి

మనస్సుల్లోను గాఢంగా నాటుకు పోయివుంటుంది. పైగా పార్టీ పదవులమీద ఆశలున్న పిల్లలు కొందరు "ఏమైనాసరే మేము సభ్యుడినే వివాహం చేసుకుంటాం" అనే ధోరణిలోకి వచ్చి, వాళ్ళ ప్రయత్నాలన్నీ ఆమార్గంలోనే జరుపుతున్నారు. 'పార్టీ మెంబరునే ప్రేమిస్తాను, పార్టీ మెంబరునే పెండ్లి చేసుకుంటాను' అనే యీ ఆలోచన చాలా విచిత్రమైనది. పూర్వం రోజుల్లో ఆడపిల్లలు, మేము 'విదేశాలు తిరిగివచ్చిన వ్యక్తి నే వివాహమాడతాం' అని అంటూఉండే వాళ్ళు. ఇంతలో జపానుతో యుద్ధం వచ్చింది. ఈ ఉద్దేశ్యం కొంతవరకూ మార్చుకోవలసి వచ్చింది. ఏమైనా విప్లవానికి పూర్వం ఉద్దేశాలు స్వార్థసంకుచితత్వాలు వ్యక్తిగత పంథాలలో బూర్జువా మార్గాలలో నడుస్తూ వుండేవి. 'నేను పార్టీ మెంబరునే ప్రేమిస్తాను, వివాహమాడతాను' అనే ఉద్దేశ్యంకూడా నాదృష్టిలో అంతసంకుచితంగాను, స్వార్థంగాను కనబడింది.

ప్రేమ, వివాహం గురించిన చర్చలు పార్టీ, యువజన సంఘాలలోనే కాక మామూలు క్లాసులలోకూడా అన్ని డిపార్టుమెంటులలోను జరుగుతూ ఉండేవి. వాటన్నింటి పర్యావసానం ఒకటే. వ్యక్తి గతమైన ప్రణయాలు విరహాలునుంచి వైదొలగి, పార్టీ సిద్ధాంతాలకి, ఆదర్శాలకి అనువైన ప్రేమ, అంటే – మార్క్సిస్టు సిద్ధాంతాలకి అనువైన ప్రేమ అలవరచుకోవాలి. నిజానికి పెండ్లి ప్రేమ అనేవి వ్యక్తిగత సుఖానికి సంబంధించిన విషయాలు. పార్టీ లేకుండా వ్యక్తి సుఖపడలేదు. పార్టీయే బలంగా సుస్థిరంగా లేనప్పుడు వ్య[illegible] ఖానికి తావు ఏది?

కాబట్టి, చైనాలో ప్రజలు, ముఖ్యంగా ప్రజల ధనంతో విద్యనుపొంది విజ్ఞానవంతులైన వ్యక్తులు తమ వ్యక్తిగత స్వార్థాలని విస్మరించి, దేశంకోసం ప్రజలకోసం తమశక్తినిధారపోయాలి. ఈ ప్రేమలు, శృంగారాలు యివన్నీ పురాతన కాలపు దొరల వాళ్లు. స్త్రీ పురుషుల మధ్య లైంగిక సంబంధం విశృంఖలంగా, విచ్చలవిడిగా, తయారైతే, దేశాభ్యుదయంకోసం ఉపయోగ పడవలసిన శక్తి సంపదలు, పెడత్రోవత్రొక్కి, పురోగమించ వలసిన సమయంలో కలతలు, కలహాలు రేకెత్తిస్తాయి. దాంతో పార్టీ వర్గాలలో, శత్రుమిత్రభావాలు ఏర్పడి, అంతః కలహం ప్రారంభమై పార్టీని కూకటివ్రేళ్ళతో కూల్చివేస్తాయి. పార్టీ సిద్ధాంతాలని క్షుణ్ణంగా తెలుసుకున్నా, విద్యార్థులకు తెలిసిందల్లా ఒక్కటే. వాళ్ళు ఖాళీగా ఉన్న కొద్ది క్షణాలు, ప్రేమాన్వేషణలో గడపటం, అన్నీ సమకూడినప్పుడు వివాహం చేసుకోవటం. రెండుముక్కల్లో చెప్పాలంటే, ప్రేమని గురించి వాళ్ళ సిద్ధాంతం యిది: "నా మనస్సు బూర్జువా సిద్ధాంతాల నుండి వైదొలగి నూతన పంథాలకు అలవాటు కాగలిగితే, ప్రేమ, వివాహం, నా మనస్సుని, నా పనినుంచి, నా పార్టీ సేవనుంచి తొలగించలేవు."

విద్యార్థులు, రాజకీయాల నుంచి, ప్రజాసేవనుంచి, దూరంగా ఉండగలిగిన వాళ్ళకి యీ కట్టుడులు, ఆరడులు లేవు. వాళ్ళకి మా కంటే ఎక్కువ స్వేచ్ఛఉంది. వాళ్ళ వ్యక్తిగత వ్యవహారాల్లో, వాళ్ళు దాదాపు సర్వస్వతంత్రులు. ఈదాదాపు అనే మాటకు చాలా మహాత్మ్యం వుంది. ఎందుకంటే ఇట్లా స్వతంత్రంగా ఉండగలిగిన వ్యక్తుల చర్యలని, రాజకీయంగా

పురోగమించిన సహాధ్యాయులు అనుక్షణం కనిపెడుతూ వుంటారు. వాళ్ళ చర్యలని వీలైనప్పుడల్లా వీలైనచోటల్లా విమర్శించటం, ఎవరైనా పిల్లవాడు ఒకపిల్లమీద ఎక్కువడబ్బు ఖర్చుపెట్టినా ఆమెతో ఎక్కువకాలం గడిపినా అతనిని వట్టి అను మానాలి మనిషనీ, ఆవేశపరుడనీ పార్టీకంటెకూడా స్వలాభం, స్వసుఖం ఎక్కువగా అభిలషించే 'బూర్జువా' అని హేళన చేస్తారు. శృంగార రసప్రధానమైన చలన చిత్రాలకి ఆ పిల్ల వాడు తనప్రియురాలిని తీసుకు వెళ్ళడానికి వీలులేదు. ఇహ చూస్తే ఇద్దరూ యుద్ధాలు విప్లవాలకి సంబంధించిన సిని మాలు, చూడవచ్చు. పడవషికార్లు కూడా మును పటంత వీలులేదు. పూర్వం పున్నన్ని పడవలుయిప్పుడు కూడా వున్నాయి. కాని వాటిలో తిరిగేవాళ్ళంతా విప్లవసైనికులే. వాళ్ళ షికార్లుకూడా ఒక సైనికవిన్యాసం లాగానే ఉండేవి. పైగా ప్రతివ్యక్తి ఆర్థిక స్థితిని గురించి, ఆఖరి క్షణం అధికారుల నిఘావుండేది. చిల్లరఖర్చుకు డబ్బు పూర్వం లాగానే యిప్పుడు కూడా దొరకటం చాలా కష్టమయింది. ఎవరైనావ్యక్తి ప్రేమలోపడి హద్దుమీరి ప్రవర్తిస్తున్నట్టుగా అధికారులు భావిస్తే మా నీతి నియమాలకు అంగరక్షకులుగా ఉన్న అధికారులు, మా సమయాన్ని మేము వ్యర్థంగా, హాని కరమైన పనులకి వెచ్చబెట్టకుండా, ఉండటంకోసం, యింకా కొన్ని పనులని మాకు వప్పచెప్పేవారు.

నేను 'హాంగ్ కాంగ్' లో విన్న విచిత్రమైన వార్తలకి విరుద్ధంగా పార్టీ నిజానికి వివాహాలని ప్రోత్సహించేది. యదా ర్థానికి వివాహాల ఉద్దేశ్యంకూడా, మనిషిలో పరవళ్లు త్రొక్కు

తున్న ఉద్రేకులకి అనువైన మార్గం చూపి, శాంతియుత గృహవాతావరణంతో అతన్ని ఆనందపరచడమే అవడంవల్ల ఈ స్త్రీ పురుషుల సంబంధం వాళ్ళని ముఖ్యమైన విషయాల నుంచి విముఖులు కాకుండా చేస్తుంది. పార్టీ అనే విశ్వ కుటుంబం యెడల తన బాధ్యతలని నిర్వర్తించడంలో అడ్డు రానంతసేపు, వ్యక్తివ్యక్తి, తనదంటూ యిల్లూ వాకిలి పెళ్ళాం బిడ్డలు వుండవలసిందే.

ఈ నూతన పంథాలో వివాహపు రీతులుకూడా చాలా సులభమయ్యాయి. వాళ్ళ వాళ్ళ రాజకీయ అంతస్తు ననుస రించి విద్యార్థులు ఆచారంలోవున్న మూడురకాల వివాహపు పద్ధతులలో ఏదో ఒకదాని ప్రకారం పెళ్ళి చేసుకొనేవారు. మొదటిది పూర్వంనుంచి ఆచారంలోవున్న సివిల్ వివాహానికి సరళ స్వరూపం (ఈ సందర్భంలో మనం ఒక్క విషయం మరచి పోకూడదు. విద్యార్థు లెవ్వరికి మతంలేదు). వెలగల బట్టలు, వివాహానంతరపువిందులు వీటిని "బూర్జువా లక్షణాలని" నిషేధించారు. పెళ్ళికూతురు, తనకు ఉన్న వాటిలో మంచిబట్టలని కట్టుకునేది, ఎప్పుడైనా చేతిలో ఒక పూలగుత్తి పట్టుకునేది. పెండ్లికొడుకు తన మిలిటరీ యూని ఫారంగాని, పాశ్చాత్యరకపు సూటుగాని వేసుకునేవాడు. వాద్యాలు వాయిస్తూవుంటే యిద్దరూ వివాహమండపంలోకి అడుగుపెట్టేవారు. అక్కడ, వధూవరుల తల్లితండ్రులు,సాక్షుల, సమక్షంలో వివాహము జరిగేది. తరువాత పెళ్ళికి వచ్చిన వాళ్ళంతా ఏదైనా హోటలుకు భోజనానికి వెళ్ళేవారు; అనం తరం వధూవరులు, ఒకబండీలో ఒంటరిగా తమగదికి వెళ్ళే

వాళ్ళు. పూర్వాచారప్రకారం, పెళ్ళికూతురుతో పరిహాసా లాడటానికి స్నేహితులెవ్వరు వచ్చేవాళ్లు కాదు. నిజానికి యిది చాలా మెరుగే. ఎందుకంటే దిట్టంగా తిని, మత్తుగా తాగిన బంధువుల పరిహాసాలు చాలా అసభ్యంగా వుంటాయి.

పార్టీ యొక్క ఆశీస్సులు పొందాలని ఆశించేవాళ్ళు 'ప్రజాస్వామిక పద్ధతిలో వివాహం జరుపుకునే వాళ్ళు' వధూ వరులు 'సివిల్ మారేజి'కి వేసుకునే లాంటి బట్టలే వేసుకుం టారు. ఈ వివాహానికి ముందు అతిథులంతా తమ స్వంత ఖర్చుమీద ఏర్పాటుచేసుకున్న విందు నారగించి, వివాహ మండపానికి వస్తారు. వివాహ మండపం పువ్వులతో కాగితపు తోరణాలతో అలంకరింపబడి వుంటుంది. ఒక బల్లమీద వధూవరులకొచ్చిన బహుమతులు అందరికీకనబడేటట్టుగా పెడ తారు. వివాహ మంటపంలో ఒకచోట అయిదుకుర్చీలు వేసి వుంటాయి. వధూవరులిద్దరికీరెండు, వాళ్ళతల్లితండ్రులకి రెండు, వివాహానికి సాక్షిగాఉండే పెద్దమనిషికోసం ఒకటి. వధూవరులు గదిలోకి ప్రవేశిస్తూవుంటే, అక్కడ బల్లలమీద కూర్చున్న అతిథులు, హర్షనాదాలతో వారికి స్వాగతం యిస్తారు. 'సాక్షి' వివాహ పత్రం చదివి వినిపిస్తాడు. వివాహం చూడటానికి వచ్చిన ఉపాధ్యాయులు, సహాధ్యాయులు, పెండ్లికొడుకుని కూతురిని పొగుడుతూ ఉపన్యాసాలిస్తారు. అనంతరం వివా హాని కొచ్చిన అతిథులకు తన కృతజ్ఞత తెలియపరుస్తూ పెండ్లికుమారుడు రెండుముక్కలు చెబుతాడు. ఈతతంగ పూర్తిఅయిన తరువాత అంతాకలసి "ఐకమత్యమే బలము" "పార్టీయిచ్చే వరాలు, చెప్పతరమా" మొదలైన పాటలుపాడు

తారు. పురాతనపు అలవాటు ప్రకారం, వధూవరులు, వాళ్ళతల్లి తండ్రులు, ఇంటికి వెళ్ళి అతిథులకి గుమ్మందాకావచ్చి వీడ్కోలు యిస్తారు.

వివాహం చేసుకోబోయే వ్యక్తి పార్టీ మెంబరుగాని, “యువజన సంఘం” సభ్యుడుగాని అయితే అతని ఖర్చులన్నీ అంటే భోజనానికి, వసతికి, బట్టలకుకూడా “పార్టీ ఆధ్వర్యాన జరిగే వివాహం” పేరిట ప్రభుత్వమే డబ్బు యిచ్చేది. వివాహ మండపం చాలా సాదాగా, నిరాడంబరంగా, అలంకరిస్తారు. ఛైర్మెన్ మావోతోపాటు నూతన రాజ్యాంగపతకం తగిలిస్తారు. పెద్ద బ్రహ్మాండమైన విందులు వగైరా అట్టహాసం ఏం వుండదు. వచ్చిన అతిథులకి అల్పాహారము ఏర్పాటుచేస్తారు. ఒకసిగ్నల్ యివ్వగానే, వధూవరులిద్దరు, తమ తమ యూనిఫారాలు ధరించి గదిలో ప్రవేశిస్తారు. వారిని చూడగానే, అతిథులు హర్షనాదాలతో స్వాగతం యిస్తారు. అక్కడున్నవారిలో పార్టీ పెద్దలు ఈ వధూవరులకు తమపార్టీ విశ్వకుటుంబంలోకి స్వాగతంయిస్తూ ఉపన్యాసాలు యిస్తారు. తరువాత మరీ సన్నిహితులైనవారు ఎవరైనా వుంటే వాళ్ళు వధూవరులని గురించి భావిజీవితంలో వారు ఎటువంటి సుఖాలని పొందాలని ఆశిస్తున్నదీ వగైరా విషయాలు చెబుతారు. అవసరమైన ఆడంబరం లేకపోయినా సివిల్ మారేజికంటే యీ పద్ధతే చాలాబాగుంటుంది. విద్యార్థులలో చాలామంది యీ పద్ధతిప్రకారమే వివాహం చేసుకుంటారు.

ఈ ఉపన్యాసాలయిన తరువాత అతిథుల్లో ముఖ్యులు శోభన దంపతులకు ప్రత్యేకం యీ సందర్భంకోసం రచించిన

పద్యాలను పాటలను, కానుకగా యిస్తారు. ఈ గేయాలలో కూడా భాష అంత అందంగా లేకపోయినా అసభ్యంగా మాత్రం ఎప్పుడూ వుండదు.

సాధారణంగా అవి సందర్భశుద్ధిగాను హాస్యకరంగాను వుంటాయి. ఉదాహరణకు వధూవరులను పేర్లతో పిలవకుండ పాటలతో వారిని అభినందిస్తూ యిట్లా సంబోధించవచ్చు. 'వాంగ్-లీ సహకార ఉత్పత్తి సంఘానికి అభినందనాలు. స్నేహితులందరి శుభ ఆశీస్సులతో, శుభాకాంక్షలతో, యీ వధూవరు లిద్దరూ ప్రభుత్వంచే ఏర్పాటు చేయబడిన, శయ్యా గృహములోకి వెళ్ళిపోతారు.'

ఈ శయ్యాగృహంలో దంపతులు మూడురోజులనుంచి వారం రోజులదాకా ఉండవచ్చు. పల్లెటూళ్ళలోని పడక గదు లలాగానే, ఈ గదికూడా ఆనందద్యోతకమైన ఎర్రరంగుతోనే అలంకరించబడి వుంటుంది. పెండ్లి కుమార్తె ఈగదిలో అడుగు పెట్టేసరికి ఎటుచూసినా కనిపించేది ఎర్రరంగే. ఎర్రటి గలీబులు తొడిగిన దిండ్లు, ఎర్ర దుప్పటి వేసిన పరుపు, బల్లమీద ఎర్రటి టేబిల్ క్లాత్, బీరువాకి ఎర్రటి కర్టెన్, శీతాకాలంలో గది వెచ్చగా వుండేందుకు ఒక మంటకూడా ఏర్పాటుచేసి వుండేవి. పార్టీ అనే యీ పెద్ద కుటుంబంలోకి రావటంవల్ల, వ్యక్తి పొందగల సుఖాలని పరిశీలించడం కోసం కాబోలు, పార్టీ యీ విషయంలో యింత శ్రద్ధ తీసుకుంటుంది.

సాధారణంగా వివాహాలు యీ మూడుపద్ధతులలో జరిగేవి. ఇంతకంటే కూడా అభ్యుదయకరమైన భావాలు కల వ్యక్తులు, ఈ ఆచారాలు, అనవాయితీలు పాటించకుండా

ఇంకా సాదాగా వివాహం జరుపుకునేవారు. తమ మిత్రులని టీ పార్టీకి రమ్మని పిలవటం, అంతా సమావేశం అయిన తరు వాత వారికి వధూవరులు తమ పెండ్లి సర్టిఫికెట్ చూపించడం మిత్రులతో కలిసి కొంచంసేపు సరదాగా గడిపిన తరువాత ఎవరిఇళ్ళకు వాళ్ళు వెళ్ళడం. ఇంకోరకం వివాహం వుంది. అతిథులు, వధూవరులు అంతా ఏదైనా ఒక ఓడమీద కలుసు కుంటారు. వధూవరులు తమ వివాహంగురించి వెల్లడిచేస్తారు. తర్వాత ఏదైనా ద్వీపంలోదిగి కొంతసేపు సరదాగా గడపి, తమతమ స్థావరాలకి వెళ్ళిపోతారు.

నూతన దంపతులు స్వల్పకాలంలోనే తిరిగి తమతమ పనులలో మునిగిపోతారు. పెళ్ళయిన కొద్దివారాలకి యీ దంపతులని పలకరిస్తే "కులాసాగానే వున్నాం, కాని పని రద్దీవల్ల ఏం తీరికలేదు" అంటారు. పార్టీపనులలో మునిగి తేలే వాళ్ళ విషయంలో యిది అక్షరాలా నిజం. సాధారణంగా పార్టీ పనులమీద వాళ్ళు చాలా దూరప్రాంతాలలో విడి విడిగా పనిచేస్తూవుంటారు. ఏదైనా దగ్గర పట్టణాలలో ఉద్యో గం చేస్తూవుంటే వారానికి ఒకసారి కలుసుకుంటూ వుంటారు. పెళ్ళి క్రొత్తదనం మాయగానే వాళ్ళు పురాతన పద్ధతులకి చప్పున మారిపోతారు. రోజుకు ఎనిమిది గంటలు పని, పార్టీ సమావేశాలు, సభలు వీటితో కాలంపూర్తిగా గడచిపోతుంది. పార్టీ ఉద్దేశ్యంకూడా సరి అయినదే. భార్యాభర్తలకి యిద్ద రికీ పార్టీతో సంబంధించిన ముఖ్యమైన పనిఉన్నప్పుడు, ఈ బూర్జువా ప్రేమతో సతమతమవడానికి అవకాశం లేదు.

# 15

## స్వర్ణ జూబిలీ

ఆయన నాదగ్గరకు వచ్చి ఎప్పుడు నిల్చున్నాడో తెలియదు. "రాయడం పూర్తయిందా" అని అడిగేటప్పటికి నేను ఉలిక్కిపడ్డాను. అప్పటికి చాలమంది విద్యార్థులు తమ పేపర్లను వాచర్లకిచ్చి వెళ్ళిపోయారు. నేనుకూడ పూర్తిచేసి రాసిన దాని వెనుక తప్పులేమైనా ఉంటాయేమో నని చూడ్డం మొదలు పెట్టాను. ఆయన అడిగిన ప్రశ్నకు సమాధానంగా "రాయడం పూర్తయింది. కాని ఒకసారి సరిచూచుకుందామనుకుంటాను." అన్నాను. ఆయన అక్కడనుండి తన బల్ల దగ్గరకు వెళ్ళిపోయాడు. నే రాసినది చదువుతుంటే అది నేను రాసినట్టులేదు. ఎవరో రాసినట్టు ఉంది. ఇది చివరి పరీక్ష. అందుకని జాగ్రత్తగా ఉండటం చాలా అవసరం. నిజానికి ముఖ్యమైన పరీక్ష రెండు నెలల క్రితమే జరిగిపోయింది. కాలేజిలో చదువు అయిన తరువాత ఏమిచేయాలి అనేది ఇంకా నిర్ణయించుకోనివాళ్ళు, ఈ కాలేజి చదువు తరువాత మన భవిష్యత్తు ఏమిటి అని ఆలోచించటం మొదలుపెట్టారు. నేను మాత్రం ధైర్యంగానే ఉన్నాను. కాలేజీ విద్యార్థులు ఉద్యోగాల కోసం అవస్థ పడవలసిన అవసరంలేదు. పూర్వపు రోజుల్లో కాలేజి చదువు అయిన వెంటనే విద్యార్థులు ఒక నూతన ప్రపంచంలోకి ప్రవేశించే వాళ్ళు. అక్కడ వాళ్ళకి తగినన్ని ఉద్యోగాలు ఉండేవి కావు. ఈనాడు పరిస్థితులు మారాయి.

చదువుకున్న వాళ్ళని ప్రభుత్వమే పిలిచి తగిన ఉద్యోగాలిస్తున్నది. అయినా విషయం అనుకున్నంత ఆనందాన్ని కలిగించలేదు. ముఖ్యంగా సైన్సులోను, వైద్యంలోను రిసెర్చి చేద్దామనుకునే వాళ్ళకి మరీను ప్రభుత్వం ఈ రోజుల్లో విపరీతంగా సహాయం చేస్తోంది. పరిపాలనా కార్యకలాపాలు సక్రమంగ నిర్వహించడానికి విద్యావంతులైన వ్యక్తులు చాల మంది అవసరం. అందుకని కాలేజీలో చదువుకున్న చాల మందికి ఆఫీసు గుమాస్తాలుగాను, నకళ్ళు వ్రాసే వాళ్ళుగాను ఉద్యోగాలు చేయవలసి వచ్చేది. పైగా భూసంస్కరణలను పురస్కరించుకొని విద్యాధికులైన వ్యక్తులను గ్రామాలకు పంపి పనిచేయించడానికి ప్రభుత్వం ప్రయత్నం చేస్తోంది. ఇటువంటి ఉద్యమాలలో పాల్గొనేవారి సంఖ్య చాల తక్కువని మేము విన్నాము.

ప్రభుత్వ ఉద్యోగాలు చేయకతప్పదని తెలిసినప్పుడు మాలో చాలమంది విద్యార్థులు గవర్నమెంటులోనే తమకు అనువైన ఉద్యోగాలని వెదకటం ప్రారంభించారు. పైగా కొత్తగ పెళ్ళయినవాళ్ళు, పెళ్ళి చేసుకుందామని నిశ్చయించుకున్నవాళ్ళు, దంపతులు ఉభయులు ఒక ఊళ్లో ఉండగలమో లేదో అని భయపడుతున్నారు. వీళ్ళకంటెకూడ వీళ్ళకి ఉద్యోగాలిచ్చేవాళ్ళుకూడ యిన్ని యిబ్బందులు పడుతున్నారు. "మాకు మనుషులు కావలసినమాట నిజమే. మీరు అన్ని పనులకు తగినవారే కాని గవర్నమెంటు దగ్గరనుండి ఉత్తరువు రానిది మేము ఏమిచేయలేము."

యూనివర్శిటీలో కమ్యూనిస్టు విద్యార్థులు మా స్వార్థ వాంఛలనీ అభిలాషలనీ మనసునుండి వైదొలగించి పార్టీకి సేవచేయమని ఉపన్యాసము లిస్తుండేవాళ్ళు "కామ్రేడ్స్! మన మంతా ప్రజల శ్రమవల్ల ఈనాడు విద్యావంతులము కాగలిగాము. వారికి మనము కృతజ్ఞత చూపించవలసి యుంటుంది. దీన్ని ఎవరు కాదనిఅనరు. కాలేజీ చదువు అనంతరం మీరంతా సంతోషంతో ప్రజలతో కలిసి ప్రజలకోసం సేవచేస్తారని ఆశిస్తున్నాను. విప్లవంలో ప్రజలందరికి అగ్రగాములమైన మనము ఈ రోజున ప్రజలతో కలిసి సేవచేయటానికి ఎంత ఆనందిస్తున్నామో నేను చెప్పవలసిన అవసరం లేదు. కాని మనలో కొందరు సోదరులు కాలేజీ చదువుని తమ వ్యక్తిగత స్వార్థాన్ని వాంఛల్ని అధికంచేసి తమకు పేరు ప్రఖ్యాతులు సంపాదించి పెట్టే ఉద్యోగాల కోసమని ఉపయోగించాలనే పురాతనపు ఆలోచననుంచి విముక్తి పొందలేకుండా ఉన్నారు. తమ పదవులతో తమ విద్యతో సామాన్య ప్రజానీకముపై అధికారము చెలాయిద్దామనుకుంటున్నారు. అటువంటి కామ్రేడ్సుకు నా దొకటే సలహా. ఈ ఉద్దేశాలన్నీ మరచిపొండి. ఆ ఊహాలు ఆలోచనలు ఈనాటివికావు. ఈనూతన జీవితానికి అవివత్తాసు నివ్వలేవు. మాలో కలవడానికి వెనుకంజ వేసేవారికి ఒకటే మాట చెప్తున్నాను. పార్టీ మీకెప్పుడూ స్వాగతం యిస్తుంది. మాతో కలిసి ఒక నూతన రాజ్యాన్ని నిర్మించడానికి సహాయపడండి. మీ సంశయాలని సందేహాలని నిర్మూలించడానికి మీకు అండగా మేము ఉన్నాము."

ఈ "అండ" అనే మాటకు అర్థం తరువాత తెలిసింది. తమ భవిష్యత్తును గురించి స్థిరమైన భావాలు ఏర్పడక సందేహాలతో సంశయాలతో బాధపడే విద్యార్థుల మనసు మార్చి వారిని సక్రమమైన పంథాలోనికి మరల్చడమే వారి ఆశయం. ఇటువంటివారికి పార్టీ ఇచ్చే సలహా ఏమిటో మేము ముందుగానే గ్రహించ గలిగాము. కాలేజి చదువు అనంతరం విద్యార్థులకు సలహానిచ్చే ఈ సమావేశాలలో జరిగే కార్యక్రమం ప్రకారం ఈ విద్యార్థులను ఒకచోట సమావేశ పరచారు. వారిని వారు ఆత్మవిమర్శన చేయుట, పార్టీనాయకులు యువజన సంఘ సభ్యులు ఇచ్చే సలహాలను పాటించి గవర్నమెంటువారు నిర్ణయించిన ఉద్యోగాలను స్వీకరించటము. ఈ సమావేశాలవల్ల మాకు చాలా లాభాలు కలిగాయి. పార్టీనాయకులిచ్చే సూచనలు గ్రహించటం వారి ముఖ కవళికలను బట్టి వారి ఉద్దేశ్యాలు గ్రహించటం, ఎంత కోపం వచ్చినాసరే సాంతంగా ఉండటం. అన్నిటికంటె కూడ ముఖ్యంగ నేర్చుకున్న విషయం వాళ్ళు ఏది చెప్పినాకూడా మాట్లాడకుండ ఉండటం; లేదా కొద్దిగ మాట్లాడటం. మేము మాట్లాడవలసి వచ్చినపుడు సాధ్యమైనంత తక్కువ నిజం చెప్పటం మంచిది. నిజం చెప్పటంకంటెకూడ వీలయినంత వరకు అబద్ధమాడుట ఉత్తమము.

ఇలా ఒక నెల నెలాపదిహేనురోజులు గడిచేసరికి మేము పాత పద్ధతులు మాని నూతన మార్గంలోనికి వచ్చామని పార్టీ నాయకులకు నమ్మకం చిక్కినది. ప్రతి విద్యార్థిని నాలుగు దరఖాస్తు ఫారములు పూర్తిచేయమన్నారు. ఒక కాపీ యూని

వర్సిటీ దగ్గర ఉంటుంది. రెండు గవర్నమెంటుదగ్గర ఉంటాయి. నాలుగవది విద్యార్థిదగ్గర ఉంటుంది. పై అధికారులు తమ ఉద్దేశ్యాలను జోడించిన తరువాత సీలువేసిన కవర్లలో విద్యార్థి తను పనిచేయబోయే సంస్థ యజమానికి వాటిని అందజేస్తాడు. అతను ఒకవేళ ఉద్యోగం మానేస్తే ఈ కంపెనీ యజమాని తన ఉద్దేశ్యాలని కూడ ఈ అప్లికేషన్ ఫారం మీాద వ్రాసి కవరులో పెట్టి సీలువేసి అతనికిస్తాడు. తను క్రొత్తగ చేరబోయే ఉద్యోగంలో ఈ ఫారం వారికి చూపిస్తే ఇతనిని గురించిన భోగట్టా అంతా వాళ్ళు తెలుసుకోగలుగుతారు. కాని దాంట్లో ఎవరు వమి వ్రాశారో చదువుకునే అధికారం మాత్రం ఇతనికి లేదు. ఈ అప్లికేషన్ ఫారములో రాయవలసిన విషయాలను గురించి చూస్తుంటే నాకు చాల ఆశ్చర్యంవేసింది. మొట్టమొదట్లో మామూలుగ పూర్తిపేరు, వయసు, పురుషుడా, స్త్రీయా, పుట్టిన ఊరిపేరు, ఆరోగ్యము లాంటి విషయాలుండేవి.

ఆరోగ్యమనేది చాల ముఖ్యమైన విషయం. పగలు 8 గంటలు పనిచేసి తరువాత 2, 3 గంటలసేపు పార్టీ కార్యక్రమంలో ఎవరైనా పనిచేయగలిగితే పార్టీకి చాలాలాభం. అటువంటివాళ్ళని పార్టీమెంబరుగ పార్టీ నాయకులు తీసుకునే వాళ్ళు. గవర్నమెంటులో పనిచేసే వ్యక్తులలో ఎవరైన వ్యక్తికి క్షయవ్యాధి వచ్చినట్లయితే అతనికి ప్రత్యేకమైన ఎలవెన్సు ఇచ్చేవారు. ఇలాగే మిగత జబ్బులకుకూడ "ఆరోగ్య రక్షక వేతనం" క్రింద కొంత అదనంగ ఇచ్చేవారు. కనుక ఒక వ్యక్తి జీవితంలో ఆరోగ్యం ఎంత ప్రముఖస్థానాన్ని వహి

స్తుందో మనము ఇట్టె గ్రహింపవచ్చు. ఆరోగ్యాన్ని గురించి అధికంగ వ్రాయటానికి అప్లికేషన్ ఫారంలో స్థలంలేదు. "మామూలుగానే వుంది "లేదా" T. B. అని వ్రాయాలి. ఆరోగ్యం లాగానే మనుష్యులలోని ప్రత్యేకతని అలవాట్లని తెలియ బరచటానికి అట్టే అవకాశం యివ్వలేదు. బహుశః ప్రజలలోని అభిలాషలు అభిరుచులు కూడ పార్టీ సిద్ధాంతాలకు ఆనుగుణ్యంగ ఉండాలని వాళ్ళ ఉద్దేశ్యం కాబోలు. తరువాత ప్రశ్న విద్యార్థికి తెలిసిన చైనాభాషలు, మిగత విదేశ భాషలను గురించి రష్యన్, ఇంగ్లీషు, హునాన్‌లాంటి భాషలు వచ్చిన వాళ్ళకి మామూలు పనులకు వినియోగించకుండ మంచి ఆరోగ్యం దొరికే అవకాశం ఉంది. మిగత ప్రశ్నలన్నీ వ్యక్తిగతమైనవి. నీకు వివాహమైందా, లేదా. ఈ రెండు సందర్భాలలో కూడ భర్తపేరుగాని లేకపోతే ప్రియునిపేరుగాని స్త్రీలు తెలియబరచవలసియుంటుంది. అట్లాగే పురుషులుకూడ వివాహితులైతే తమ భార్యపేరు బ్రహ్మచారులైతే తాము వివాహమాడ బోయే చిన్నదానిపేరు చెప్పవలసియుంటుంది. తరువాత నీ కాబోయే భర్త ఎడ్రసు, అతని వృత్తి అతని రాజకీయ అభిప్రాయాలగురించి చెప్పవలసి యుంటుంది. తరువాత తల్లిదండ్రులు, వారి చిరునామా. కమ్యూనిస్టులకి ఒక విషయం బాగా తెలుసు. ఆపదలు వచ్చినప్పుడు ఒక వ్యక్తి తన బంధువులచే వదిలిపెట్టబడవచ్చును. కాని అతని స్నేహితులు, ప్రేమించినవాళ్ళు అంత సులభముగ వదలలేరు. కమ్యూనిస్టుని ప్రేమించిన వ్యక్తి ఒకవేళ కమ్యూనిస్టు కాకపోయినా కనీసం అభ్యుదయకరమైన అభిప్రాయాలు కలిగిన

వారై ఉంటారు. ఈ ప్రశ్నలు అయిన తరువాత విద్యార్థి యొక్క బంధువులు, వారు చేసే ఉద్యోగాలకు సంబంధించిన ప్రశ్న వస్తుంది. వారి వృత్తులు వారి రాజకీయ అభిప్రాయములు గురించి చెప్పవలసి యుంటుంది. ఈ చదువుకునే వాళ్ళలో చాలమంది తల్లిదండ్రులు పురాతన పంథాకు చెందిన వాళ్ళే. కాని ఈ విషయాన్ని అప్లికేషన్ ఫారాల్లో చెబితే చాల చిక్కులు పడవలసి వస్తుంది. మా తల్లి దండ్రులు చాలమందికి ముఖ్యంగా ఆడవాళ్ళకు రాజకీయములగురించి స్పష్టమైన అభిప్రాయములు లేవు. వాళ్ళకి ఏ ప్రభుత్వ మైనా ఏమి ఫరవా లేదు. వాళ్ళకి ప్రస్తుతము ఉన్న ఇబ్బందులు తీరితే చాలు. అసలు నిజం చెప్పాలంటే వాళ్ళ అభిప్రాయాన్ని గురించి మాకు తెలియదు. అని రాయడం మంచిది. కాని అలా రాసినట్ట యితే వారు, నూతన సిద్ధాంతాలకు వ్యతిరేకులేమో అని అనుమానము కూడ కలుగవచ్చు. ఇలాగే తోడబుట్టిన వారి రాజకీయ అభిప్రాయాల్ని గూర్చి చెప్పడం చాలా కష్టం. అందరు పార్టీ మెంబర్లయినా కాకపోయినా కష్టమే. తరువాత మన స్నేహితులు మన పరిచయస్థులను గురించి. మన స్నేహ వర్గంలో ఎవరైనా గొప్పవాళ్ళున్నట్లయితే వాళ్ళని గురించి తప్పక వ్రాయాలి. ఎవరైనా కమ్యూనిస్టుపార్టీ అంటే యిష్టం లేని వాళ్ళునట్లయితే ఆ విషయం చెప్పకుండ ఉండటం ఉత్తమం. ఒకవేళ ఎవరేనా అడిగితే వాళ్ళకి మాకు ఎటు వంటి సంబంధం లేదని చెప్పటం చాల మంచిది. తరువాత నీ వ్యక్తిగత జీవితమునుగురించిన వివరణ. ఏవి స్కూళ్ళలో చదివావు, ఏవి కార్య క్రమాలలో పాల్గొనే వానివి; ఏవ

సంస్థలలో మెంబరుగ ఉండేదానివి, వాటిలో ముఖ్యమైనపదవి ఏదయిన నిర్వహించేదానివా – ఇటువంటి ప్రశ్నలు అనేకం. చిట్టచివరకు నీకు ఏ ఉద్యోగం యిష్టం, ఏ ప్రాంతంలో పని చేద్దామని కోరుకున్నావు, ఎందుకల్ల, ఏ సంస్థలలో సభ్యుడుగ ఉండదలచుకున్నావు ?

ఈ ప్రశ్నలకు ఇచ్చే సమాధానం లోనే భవిష్యత్తు అంతా ఆధార పడి ఉంది.

ఈ ప్రశ్నలన్నింటి తరువాత, "క్లాసు జడ్జిమెంటు కాలం" వుంది. విద్యార్థి గుణగణాలు, అతని యోగ్యతలు, అతను ఎటువంటి పనిలో రాణిస్తాడు వగైరా విషయాలని గురించివుంటుంది. ఎంత తెలివితక్కువవాడైనా ఒక్క విషయం ఇట్టే గ్రహించగలుగుతాడు. "డిపార్టుమెంటువారి ఉద్దేశ్యాలు గురించి తెలుపవలసినప్పుడు, ఆ శాఖ అధికారి, గవర్నమెంటు వారి అభిరుచులకి అనుగుణంగానే ప్రవర్తిస్తాడు.

దీని తరువాత మా క్లాసు నాయకుల ఉద్దేశ్యంకోసం నిర్దేశింపబడిన 'కాలం' ఉంది. దానిమీద 'రిమార్కులు' అని మాత్రం వ్రాసివుంటుంది.

మా శాయశక్తులా యీ అప్లికేషన్ ఫారాలు పూర్తి చేసి అధికారుల కందజేశాం. మా సహాధ్యాయుల సమావేశం కోసం అహోరాత్రులు కనిపెట్టుకుని వున్నాం. ఈసమావేశానికి, ఎప్పుడు పిలుస్తారా ! మా ఆశయాలు అభిలాషల ఫలితం ఏవిధంగా వుంటుందా అనేదే ప్రతివ్యక్తిని పీడిస్తున్న చింత. ఈ సమావేశాల ఫలితాలు, ఒకొక్కనిది మితవాదంగాను, ఒకొక్కనిది అతివాదంగా ఉండేవి: ఒకొక్కసారి మా క్లాసు

నాయకులు మమ్మల్ని అడిగే ప్రశ్నలు, చాలా దారుణంగాను క్రూరంగాను వుండేవి. భరించలేక మాలోని నిర్భయస్తులు, తమ స్నేహితుల తరఫున నోరు చేసుకోవలసివచ్చేది. ఈ సూచన గ్రహించి నాయకులు, సభ వెంటనే వాయిదా వేసే వారు. విద్యార్థులమీద విధించిన కఠిన శిక్షలు తగ్గించేవాళ్ళు.

కొంతకాలం గడచినతరువాత యీ "విమర్శనా సమావేశాలు" మళ్ళీ ప్రారంభించేవాళ్ళు. అప్పుడు అతివాదులు మితవాదులు హోరాహోరి ఘర్షణపడ్డ తరువాత విద్యార్థులను గురించి తమ తమ 'అభిప్రాయాలని' వెల్లడించేవాళ్ళు. ఈ అభిప్రాయాలు పూర్వపుటంత, నిర్కర్షగాను, కష్టం కలిగించేవిగాను వుండకుండా సౌమ్యంగాను, సరసంగాను ఉండేవి.

"సంఘంలో కష్టపడి పనిచేస్తాడు." "చదువులోకూడా చాలా శ్రద్ధ చూపిస్తుంది." "ప్రజలలో కలసి మెలసి తిరుగుతుంది." యిలాటి సర్టిఫికేట్లు యిచ్చేవారు. మా అభిప్రాయాలలో మేము సరసంగానే వుండేవాళ్ళం. ఎందుకంటే, మాచేత విచారింపబడేవాళ్ళే కొంచెంసేపట్లో మమ్మల్ని విచారణ చేస్తారు. పెద్దపెద్ద లోపాలని గురించి బహిరంగంగా చెప్పే వాళ్ళం కాదు. ఏదైనా చెప్పవలసి వస్తే ఊరికే సూచించే వాళ్ళము. "పార్టీ కార్యక్రమాలలో యింకా ఎక్కువగా పాల్గొంటారని ఆశిస్తున్నాం. నువ్వు యింకా బాగా కమ్యూనిస్టు సిద్ధాంతాలని గురించి తెలుసుకుంటావని కామ్రేడ్స్ అంతా ఆశిస్తున్నారు...నీలోని సోమరితనాన్ని, భోగలాలసతను పారద్రోలేందుకు కృషిచేస్తావని నీ మిత్రులు తలపోస్తున్నారు..."

ఈ అభిప్రాయాలు, ఉద్దేశ్యాలూ చాలా సరసంగా కనిపిస్తున్నా చాలామంది విద్యార్థులు మొట్టమొదట్లో తాము కోరిన ఉద్యోగాలు వదిలి, పార్టీవాళ్ళు ఏర్పాటు చేసిన ఉద్యోగాలనే స్వీకరించవలసి వచ్చేది. నూతన ప్రభుత్వంలో కుక్క గొడుగుల్లాగా అనేక ఆఫీసులు ఉద్భవించాయి. వాటిని నిర్వహించడానికి చాలామంది విద్యావంతులు అవసరం. ప్రభుత్వ నౌకరీలని కాలదన్ని ప్రైవేట్ సంస్థలలో ఉద్యోగాలను ఆశించేవాళ్ళని, యింకా కాలేజీలో పై చదువులు చదువుకుందామని ఉబలాటపడేవాళ్ళని పార్టీవాళ్ళు-బూర్జువాలని, స్వార్థపరులనీ నిందించేవారు. ప్రజలనుండి గ్రహించిన సొమ్మును తిరిగి ప్రజలకు యివ్వడానికి నిరాకరించే లోభులని నిందించేవారు. కాని ఎవరైనా మొండివాళ్ళు ససేమిరా అని వాళ్ళు పట్టిన పట్టు విడవకపోతే పార్టీ శాయశక్తులా వాళ్ళ మనస్సుని మార్చడానికి ప్రయత్నం చేసేది. ఈ ప్రయత్నంలో ఎంతెంత వాళ్ళయినా సరే తల ఒగ్గక తప్పేదికాదు. కొంత మందిమాత్రం యీ అగ్ని పరీక్షలన్నీ నెగ్గి తమ కోరిక నెరవేర్చుకొని, గర్వంతో తిరుగుతూ ఉండేవాళ్ళు.

ఇంత గందరగోళం, గొడవ జరిగిన తరువాత, పార్టీ నాయకులు బోధించిన ప్రజాస్వామిక తత్వాలు, వారిచ్చిన అభిప్రాయాలూ, అందరికీ అనుగుణ్యంగానే ఉంటాయని అంతా అనుకుంటారు. పార్టీనాయకుల వడవడిక, వ్యవహారం చూచి మాలోని తెలివితక్కువ వాళ్ళు యీ విచారణకు పూర్వం హాయిగా అదమరచి నిద్దరపోతూ ఉండేవాళ్ళు.

మరి నా సంగతి ఏమిటి? నేనుకూడా వాళ్ళవలెనే హాయిగా నిద్దుర పోగలనా? నే నప్పుడే వ్రాసిన పరీక్షపేపర్ల వంక చూస్తూ కూర్చున్నాను. నేను స్కూలు టీచరుగా, రచయిత్రిగా నా జీవితాన్ని గడుపుతానంటే పార్టీ ఎంత రగడ చేసింది. "మిస్. యెన్, నీ వుద్దేశ్యాలని, అభిప్రాయాలని గురించి నీవు మరొక్కసారి ఆలోచించాలని కామ్రేడ్స్ అంతా కోరుతున్నారు. నీ తరహా చూస్తూఉంటే యిక వ్యక్తిగతమైన వాంఛలకు, అభిప్రాయాలకు ఎక్కువ ప్రాముఖ్యం యిస్తున్నట్లు తోస్తున్నది. ఇవి వెనుకటి రోజులలాంటివి కావు. మన ఉద్దేశ్యాలని, వాంఛలని పార్టీయొక్క యోగక్షేమాలకు వినియోగించటం చాలా అవుసరం ... మా అందరినీ కోరినట్లుగానే ప్రజలు నీ సహాయాన్ని కూడా కోరుతున్నారు."

క్లాసురూములో కూర్చుని యీ విషయమే ఆలోచించడం మొదలుపెట్టాను. నా సహాయం ఎవరికి కావాలి? ప్రభుత్వానికా - మిలిటరీని నిర్వహించే వారికా? ప్రజలకా? స్వాతంత్ర్యానికి పూర్వం సామాన్య ప్రజానీకానికి బాసచేసిన నూతన జీవితపంథా యిదేనా? ఇదేనా మేమంతా కలలుగన్న స్వాతంత్ర్యం. ఇదేనని నమ్మడానికి చాలా ప్రయత్నం చేస్తున్నాం. మా నాయకులు పెట్టే అగచాట్లని, ఆరడులని చూస్తూకూడా నమ్మగలమా? ఈ ప్రశ్నకి సమాధానం నా మనస్సుకి తెలుసును. కాని ఆ ప్రకారం ఆచరించే ధైర్యం నాకు ఉన్నదా?

కాని యీ ప్రశ్నకు సమాధానమే, నాకు నమ్మడానికి శక్యం కాకుండా వుంది. 'యదార్థం' నాలోని విశ్వాసాన్ని

నాశనం చేసింది. బహుశః నాలో ఏ విశ్వాసం వుండి వుండక పోవచ్చు. కమ్యూనిస్టులు చేసిన వాగ్దానాలు నిజమవుత వేమో ననే ఆశతో యింతకాలం ఎదురుచూస్తూ వుండి వుండవచ్చు. వచ్చిన చిక్కల్లా యిదే. మేము ఎటువంటి మార్పుని సహించే వయస్సులో లేము. పెద్దవాళ్ళమై సంసారబాధ్యతలు, నెత్తిన వడి, సంఘంలో మా స్థానం, మా పిల్లల బాగోగులనిగురించి చింతపడవలసి వుంటే, యిదంతా మన మంచికే అనే నమ్మకంతో ఉండగలిగేవాళ్ళం. లేదా చిన్నపిల్లలమయితే స్కూల్లో యీ క్రొత్త విషయాలే నేర్చుకుని యివన్నీ నిజమని నమ్మగలిగే వాళ్ళము. మా చిన్న తమ్ముళ్ళు, చెల్లెళ్ళు - పార్టీ నాయకులు, నమ్మమన్న విషయాలే నమ్ముతారు. నాయకులు చేసిన వాగ్దానాలన్నీ నిజమేనని వాళ్ళు నమ్మవచ్చు. ఈ నమ్మకంవల్ల వాళ్ళకి ఆనందం కలగవచ్చు.

కాని, కమ్యూనిస్టులు స్వాతంత్ర్యాన్ని, శాంతిని, సుఖాన్ని తీసుకువస్తారనే మా ఆశలు. అన్నికూడా, వారు చెప్పిన సిద్ధాంతాలవల్లనే మేము ఆశించలేదు. యీనాటి మా నాయకులు, కమ్యూనిస్టు సిద్ధాంతాలకి, ఆదర్శాలకి తమకు నచ్చిన వ్యాఖ్యానాలు చేస్తున్నారు. మేము మా నాయకులకి అండగా వుండవచ్చు. కాని, నాయకులు మమ్మల్ని తమకు నచ్చినరీతిగా మార్చుకపోతే, మేమంతా ఎదురుతిరిగి వారిని ప్రతిఘటించే భయంకర వ్యక్తులుగా మారవచ్చు.

బహుశః యిది మామీద మాకు జాలి కావచ్చు. ఒకటి రెండు సంవత్సరాలక్రితం మాకు అందుబాటులో కన బడిన సుఖానికి, శాంతికి మా తరంవాళ్ళు నోచుకోలేదని

రూఢిగా తెలిసింది. ఈ నూతన రాజ్యాంగంలో పనికివచ్చే ట్టుగా మాకు శిక్షణ యివ్వవచ్చు. "విమోచన"కు పూర్వం మేము నేర్చుకున్న సిద్ధాంతాలతో మేము 'సమాధాన' పడ వచ్చు! ఇప్పటికే మాదృష్టిలో మేము చిన్నవాళ్ళమయ్యాము. ప్రతిసారి, కమ్యూనిస్టు సిద్ధాంతాలని పొగుడుతూ మేము వ్యాసాలు రాసినప్పుడు, మీటింగులకి వెళ్ళినప్పుడు, పార్టీ నాయకులు చెప్పిన మాటలు చిలక పలుకుల్లాగా అప్పచెప్పి నప్పడు, మేము చెయ్యని నేరాలు ఒప్పుకుంటూ, మా స్నేహితు లని, వాళ్ళ అభిప్రాయాలని నిందించినప్పుడే మేము మా స్వాతంత్ర్యాన్ని కోల్పోయాము.

నేను నా వ్యక్తి స్వాతంత్ర్యాన్ని పూర్తిగా కోల్పో యానా? పార్టీ యిష్టానిష్టాలకి తల ఒగ్గడంకంటే నేను చెయ్య గలిగింది ఏమీ లేదా? ఆత్మాభిమానం చంపుకొని జీవచ్ఛవం లాగా పార్టీ చేతుల్లో కీలుబొమ్మలాగా బ్రతకవలసిందేనా? అని నిరుత్సాహ పడిపోయేదాన్ని. నన్ను నా సహాధ్యాయు లని పార్టీ యింత తేలికగా ఓడించగలిగిందా? అని ఆశ్చర్య పడుతూ వుండేదాన్ని.

పార్టీపంథా సరియైనది కాకపోతే?—పార్టీ నాయకు లకి తమ పార్టీ సిద్ధాంతాలు అంటే ఎంత విశ్వాసం! తమ మీద ఎంత నమ్మకం. ఈ సిద్ధాంతాలు ఈ తరంవాళ్ళల్లో కొంతమంది మీదనైనా రుద్ది, వాళ్ళని పార్టీకి బానిసలుగా చేసుకోగలరు. నేను మొండిగా పట్టుబట్టి, పార్టీలో చేరడానికి నిరాకరిస్తే! పార్టీకి వచ్చేనష్టం శూన్యం. కాని నాకు, యింకా కొందరు స్నేహితులకు దానివల్ల వచ్చేలాభం అపారం. ఈ

నూతన సిద్ధాంతాలయందు వారికి నూటికి నూరుపాళ్ళు ఇంకా నమ్మకం చిక్కలేదని తెలుస్తోంది. ఎక్కడో యింతకంటె మంచిజోతు, స్వతంత్రంగా, స్వేచ్ఛగా బ్రతుకుదామని అనుకోవటం నా స్వార్థపరత్వం కావచ్చు. ఎవ్వరికి లెక్కలేకపోయినా నాలోని ఆత్మగౌరవం యింకా నశించలేదు.

"నిజానికి యిక్కడనుంచి పారిపోయే ధైర్యం యింకా నాలో వుందేమో. నిజానికిది పారిపోవడమేనని ఒప్పుకోక తప్పదు. కాని పారిపోవటానికి అవకాశం లభిస్తుందా? తప్పించుకు పారిపోవటం మునుపటంత సులభంకాదు. కాని ఆ తరుణంకోసం వేచియుండమని నా మనస్సు చెబుతోంది. పారిపోవటానికి తగిన ధైర్యం నాలో ఉందో లేదో, ప్రయత్నం చేసి చూస్తేగాని తెలియదు. నేను పారిపోవటానికి ప్రయత్నం చేసి చూసి విఫలం చెందితేనేగాని యీ జీవితానికి అలవాటు పడలేను.

నేను వ్రాసిన వ్యాసం చివరి పేజీ నా ఎదురుగావుంది. కమ్యూనిష్టులవల్ల వచ్చిన లాభాలు, చైర్మెన్ మావో, ధైర్యాన్ని వర్ణిస్తూ రాశాను. అది నేనే రాశానా? ఎవరైనా రాశారా? అనే సందేహం నాకు వచ్చింది. పరీక్ష పేపర్లు సూపరెండెంటుకు యిచ్చి హాలుబయటకు వచ్చాను. బయటకు వస్తే ఎంతో నిరుత్సాహంగా నిర్జీవంగా వుంది. నా సామానులు సర్దుకుని ఇంటికి వెళ్ళిపోయాను.

సెలవల్లో పార్టీమిత్రులు యింటికివచ్చి మీటింగులకు రమ్మని పిలిచేవారు. నాకు ఆరోగ్యం బాగా లేదని సాకుచెప్పి తప్పించుకునేదాన్ని. నావంక ఒక్కసారి చూడగానే వాళ్ళకి

పరిస్థితి తెలిసి నన్ను బలవంతపెట్టలేదు. వేసవి కార్యక్రమాలలో పాల్గొనటానికి ఆహ్వానాలొచ్చాయి. గవర్నమెంటు నిర్ణయించిన ఉద్యోగాలలో చేరటానికి వెళ్ళేముందు యీ కార్యక్రమాలలో పాల్గొనటం జనానికి పరిపాటి. నేను మళ్ళీ యిదే సాకు చెప్పాను. "నా ఆరోగ్యం సరిగా లేదు." నేనేదో విషయం గురించిన దిగులుతో బాధపడుతున్నానని నా స్నేహితుడు 'చాంగ' కనిపెట్టి-

"ఏం కామ్రేడ్! యీమధ్య ఏదో దిగులుపడుతున్నట్టున్నావు. ఏం నీకు గవర్నమెంటు యిచ్చే పని నచ్చదేమోనని భయపడుతున్నావా?" అని అడిగాడు.

"లేదు. దానికి నేను సిద్ధంగానే వున్నాను." అన్నాను.

"గవర్నమెంటు నీకు తగిన పని యివ్వదని అనుకుంటున్నావా? అంత భయపడవలసిన పనేంలేదు. రెండు వారాలలో మనకు ఎలాంటి ఉద్యోగాలిచ్చారో తెలుస్తుంది. నీ పనితో నీవు తృప్తిచెందుతావని అనుకుంటాను. ఆ పని చెయ్యనని అనవు. కాదా" అని చనువుగా అన్నాడు.

"ఆరు నెలలక్రితం నా స్నేహితుడు వాంగ్ నన్ను 'యువజన సమితి'లో సభ్యురాలినిగా చేర్చటానికి ప్రయత్నిస్తూ ఏమన్నాడో తెలుసా! 'ఆరు నెలలలో నీ కాలేజీ చదువు పూర్తి అవుతుంది. చదువు అయిన తరువాత మాతో కలసి పని చెయ్యవా! బూర్జువా స్త్రీలాగా యింటి దగ్గర కూర్చొని, ఎవరొచ్చి వివాహమాడతారా అని ఎదురు చూస్తూ కూర్చోక, మాతో కలసి పనిచేస్తావని ఆశిస్తున్నాను. నిజం చెప్పాలంటే గవర్నమెంటులో చేరకపోతే నీ కెటువంటి పని కావాలో ఎన్నో

తెలుస్తుంది.' అని అన్నాడు. ఆనాడే నేను ఒక నిర్ణయానికి వచ్చాను" అని అన్నాను.

నాతో మాట్లాడుతున్న కుర్రవాడు "అభ్యుదయ భావాలు" కలవాడు. పార్టీ, యువజన సమితీ, అంటే అంధ విశ్వాస మున్నప్పటికీ, అప్పుడప్పుడు తనకు తాను స్వయంగా ఆలోచిస్తూ ఉండేవాడు. అందువల్ల అతనితో మాట్లాడే టప్పుడు నేను భయపడవలసిన అవసరం లేదు, కాని అతనితో కూడా నా నిర్ణయం గురించి ఎక్కువగా చెప్పానేమోనని అనుకున్నాను.

నేను చెప్పినదంతా విన్న తరువాత—

"నువ్వు చివరికి ఏమి నిర్ణయించావు?" అని అడిగాడు.

పార్టీతో పోట్లాడి నాకు వచ్చిన వుద్యోగమే తీసుకోవ డానికి నిర్ణయం చేసుకున్నానని చెప్పలేదు. అందుకు "అన్ని విషయాలకోసం గవర్నమెంటు మీదనే ఆధారపడి వుండ దలుచుకోలేదు. నా అంతట నేనే ఏదైనా వుద్యోగం సంపా దించి, దానిద్వారా ప్రజలకు సేవ చెయ్యటం ఉత్తమ అని నిర్ణయించుకున్నాను."

అతను నా మాటలకు నవ్వి "నీకు చాలా గర్వం." వెంటనే సీరియస్‌గా మారి "నువ్వు పూర్వంలాగా లేవు, నీ ఉద్దేశ్యాలు, పద్ధతులు మార్చుకోక పోతే, నువ్వు యింకా అహం భావంతోను, బూర్జువా పద్ధతుల్లోనూ వున్నావని ప్రజ లంతా అనుకుంటారు. నీకు యింకా వ్యక్తిగత స్వార్థంమీద అభిలాషవుందని, గవర్నమెంటు పాలసీ అంటే నీకు యిష్టం లేదనీ, సర్కారువారి ఉద్దేశ్యాలని నువ్వు గ్రహించలేక పోతు

న్నావని అంటారు. నవ్వు అసలు యింకొక తరహా......"
అని అర్థోక్తిలోనే ఆపి యిల్లా అన్నాడు. "ప్రజలకి సేవచెయ్యడం నీకు యిష్టమేననుకుంటా. నీలో నాకు నమ్మకం ఉంది. కనుకనే యిల్లా మాట్లాడ గలుగుతున్నా. కాని నీకు గవర్నమెంటులో నమ్మకంలేదు. నీలో చాలా మొండితనం వుంది." అని అన్నాడు.

అతనితో వాదించడానికి నేను సిద్ధంగానే వున్నాను. మేము యిద్దరం వాదించుకోవటం చూచి అతని ప్రియురాలు మా సంభాషణ మార్చి ఏవేవో మామూలు కబుర్లు చెప్పటం మొదలెట్టింది. సాయంత్రం యింటికి వచ్చేముందర నాతో ఇలా అన్నాడు. "పార్టీలో వుండే నమ్మకాన్ని పోగొట్టుకో వద్దు. పార్టీ భవిష్యత్తంతా యువజనుల మీదనే ఆధారపడి వుంది. మనం చేయకల్గిందల్లా ఒక్కటే—మనకంటె అనుభవజ్ఞులైన వ్యక్తుల ఆదేశం ప్రకారం నడవడమే."

జులై 12 తేదీన గవర్నమెంటు ఉద్యోగుల జాబితా ప్రకటించారు. అందులోని వ్యక్తులంతా యువజన సమితిలోని సభ్యులు. వాళ్ళందరిని ఎడ్యుకేషన్ డిపార్టుమెంటు తరుఫున ట్రైనింగ్ కోసం తూర్పుయూరపు పంపిస్తారట. మొదట గ్రూపులో వాళ్ళకి మొదటిరకం ఉద్యోగాలిచ్చినప్పుడు రెండో లిస్టులో వాళ్ళ కికనీసం రెండోరకం ఉద్యోగాలు వస్తాయని మేమంతా ఆశించాం. గవర్నమెంటు యెడల నమ్మకంలేని వాళ్ళు చేసిన గందరగోళం పార్టీ పెద్దల చెవినిబడ్డది. ఇలా చెయ్యడంవల్ల విద్యార్థులలో కలవరం బయలుదేరుతుందని కనిపెట్టి అందరి ఉద్యోగాలసంగతి ఒక్కసారే ప్రకటించారు.

జూలై 29 న అంతా కలసి కాలేజీలో సమావేశ మయాము. ఎవరెవరికి ఏ పనులు నిర్ణయించారో ఆ రోజున ప్రకటించారు. అందరికి రకరకాల పనులు నిర్దేశింపబడ్డాయి. మనకేం ఫరవాలేదు. గవర్నమెంటు మనకు మంచి ఉద్యోగం ఇస్తుంది అని ఆశపడ్డవాళ్ళందరికీ వాళ్ళందరి ఆశకి విరుద్ధంగా జరిగింది. చివరకు నా ఫలితం ఏమవుతుందో అని చాలా భయపడుతూ కూర్చున్నాను. నన్ను లా కమిటీలో వేసినట్టుగ తెలిసింది. ఇది చాల ఆశ్చర్యం కలిగించింది. గవర్నమెంటు ఇచ్చేపని నాకు నచ్చదేమో అని భయపడి వారి నిర్ణయాన్ని ప్రతిఘటిద్దామని అనుకున్నాను. నన్ను గురించి నాకంటె వాళ్ళకే ఎక్కువ తెలుసుండాలి. అందుకని నాకు నచ్చిన పని ఇచ్చారు.

ఈ ప్రకటన లయిన తరువాత ఒకే గ్రూపులో పనిచేసే వాళ్ళందరినీ ఒకచోట సమావేశపరచి తమ తమ వర్గాలనుంచి ఒక్కొక్క ప్రతినిధిని ఎన్నుకోమని ఆదేశించారు. ఇతని ద్వారా ఎవరెవరు ఏఏ ఊళ్ళల్లో ఉద్యోగం చేయాలో ఆ విషయాలన్నీ పార్టీ తెలియబరుస్తుంది. ఇపుడిక ఎవరు చేయ గలిగింది ఏమీలేదు. గవర్నమెంటు ఇచ్చిన ఉద్యోగాల్లో ప్రవేశించడమే. ఉద్యోగాలు రానివాళ్ళంతా ఆనాడే పార్టీలో ఎందుకు చేరలేదా అని వాళ్ళని వాళ్ళు ప్రశ్నించుకుని మధన పడుతున్నారు. వీళ్ళబాధకి తగిన కారణంకూడ ఉన్నది. కాలేజీలో బాగా చదివినా చదవకపోయినా కమ్యూనిస్టు పార్టీ మెంబరుకు యువజన సంఘ సభ్యులకు వాళ్ళకు నచ్చిన ఉద్యోగాలు లభించాయి. పార్టీ అంటే అంత లక్ష్యం లేనివాళ్ళకి

పార్టీలో చేరనివాళ్ళకి ఉన్న పనులలో కష్టమైన వాట్ని నిచ్చారు. ఇటువంటి వాళ్ళలో చాలా మంచి విద్యార్థులున్నారు. చదువు ధ్యాసతో పార్టీ పనియందు వీళ్ళు తగినంత శ్రద్ధ చూపించలేకపోయారు. అందువల్లనే ఇటువంటి మొండి వాళ్ళకి మూర్ఖులకి కమ్యూనిస్టు పార్టీ దిట్టమైన పనులనిచ్చింది. ఈ సంఘటన జరిగిన 3 రోజుల అనంతరం చాంగ్ నన్ను చూడ్డానికి వచ్చాడు. గవర్నమెంటు ఇచ్చిన పని స్వీకరించమని అది మానవద్దని చెప్పడానికి వచ్చియుంటాడు. అతని కంటె ముందుగ నేనే చెప్పాను. "నా అంతట నేనే ఇంకొక ఉద్యోగము సంపాదించుకున్నాను. దాని నిమిత్తమై పెకింగ్ వదలి వెళుతున్నాను." అన్న నా మాట విని అతడు నిరుత్సాహపడ్డట్టున్నాడు. "గవర్నమెంటు ఇచ్చిన ఉద్యోగము స్వీకరించడమనేది మన ఇష్టా నిష్టముల మీద ఆధారపడి ఉంటుంది. అది ఎవరు కాదనరు. కాని నీ అంతట నువ్వు సంపాదించిన ఉద్యోగంలో జేరేముందు రాష్ట్ర నిర్వాహకసమితి సలహాతీసుకోవడం మంచిదేమో" అని అన్నాడు.

"నాకు అదంతా తెలుసు. నిజానికి నాకు రెండు ఉద్యోగాలొచ్చాయి. దక్షిణాదిని ఒక ప్రైవేటు మిడిల్ స్కూలులో టీచరువని. ప్రైవేటు స్కూలులో చేరడానికి గవర్నమెంటు అనుమతితో అవసరం లేదనుకుంటాను." ఈ కల్పనను గురించి అధికంగా ప్రశ్నించి నన్ను ఇబ్బందిలో పెడ్తాడేమో అనే భయంకొద్దీ నేనే అతనిని ప్రశ్నలు వేయడం మొదలుపెట్టాను. "మరి నీసంగతేమో చెప్పావుగాదేం. ఉద్యోగంలో ఎప్పుడు చేర్తావు. ఆ ఉద్యోగం ఎక్కడ చేయాలి."

"సరిగ్గా ఎప్పుడో తెలియదు. తొందరలోనే అని అను కుంటాను. కాని నుపుమాత్రం నిశ్చయానికి వచ్చేముందు జాగ్రత్తగా ఆలోచించడం మంచిది. యువజనులను గవర్నమెంటు తప్పక గౌరవిస్తుంది. వారి వాంఛలనీ ఆదర్శాలనీ అలక్ష్యం చేయదు. మనకిచ్చిన ఉద్యోగాలు మన తత్వాలకు అనుగుణంగానే ఉంటాయనుకుంటాను." అతనేదో చెప్పుకు పోతున్నాడుగాని నేను వినలేదు. అంతా విన్నతరువాత ఇలా అన్నాను. "నా నిశ్చయాన్ని గురించి నీకు చెప్పాను. అను క్షణము నా మనసు నేను మార్చుకోలేను." అప్పటికే నామనసు నిశ్చయానికి వచ్చింది. భవిష్యత్తులో ఏంచేయాలో నిశ్చయించుకోలేదు. కాని పార్టీకోసం గవర్నమెంటుకోసం వీటికి సంబంధించిన వాటిల్లో దేనిలోనైనా సరే ఎంత పెద్ద ఉద్యోగ మయినాసరే చిన్న ఉద్యోగమయినాసరే చేయదలచుకోలేదు. అయితే ఏం చేయాలి? అనే విషయంమీాద ఆలోచిస్తూ యింటిదగ్గర 3 వారాలు గడిపాను. నా వాలకం చూసేసరికి మా వాళ్ళకి భయంవేసినట్టుంది. 'ఎప్పుడూ ఇంట్లోకూర్చోడమేనా ఎక్కడికేనా వెళ్ళు' అని ఒత్తిడి చేయడం మొదలు పెట్టారు. చాంగ్‌ను చూద్దామని వెళ్ళాను. అతను ఊరికి వెళ్ళేప్పుడు అతనికి సరైన వీడ్కోలు ఇవ్వలేదు. ఏమనుకున్నాడో ఏమో! అతను ఏంచేస్తున్నాడో? ఎక్కడున్నాడో కనుక్కుందామని వాళ్ళింటికి వెళ్ళాను. వాళ్ళింట్లో అడుగుపెట్టగానే మొట్టమొదట కనుపించినది చాంగ్. వాళ్ళ అమ్మకు బదులు అతని కాబోయేభార్య కనుపించింది. మనిషి పెద్ద దిగులుపడ్తున్న దానిలాగాఉంది. అందుకని ఆ పిల్లతో నేను "చాంగ్‌నుగురించి

చాలా బాధపడుతున్నట్టున్నావే! అతడునిన్నుతప్పకచూడ్డాని వస్తాడులే. మన జిల్లాలోనే ఉన్నాడా ?" అని అడిగాను. ఆ పిల్ల ప్రయత్నంమీాద నవ్వి "ఆయన ఇక్కడే ఉన్నారు పిలుస్తాను ఉండు" అన్నది. చాంగ్ బయటకు వచ్చాడు. గడ్డంమాసీ మనిషి నలిగి చాల జబ్బుపడ్డవాడిలాగ ఉన్నాడు. నన్నుచూసి నవ్వడానికి ప్రయత్నించాడు. "ఊరు ఎపుడు వెడతావు?" అని అడిగాడు. అతడు అడిగిన ప్రశ్నకు సమాధానం చెప్పాలనిపించలేదు. అతని ఉద్యోగం గురించి తెలుసుకోవాలని "చాలా ఆదుర్దాగా ఉన్నావనుకుంటాను. కాని మనిషివి ఇట్లా అయిపోయావేం" అని అడిగాను. అతను సమాధానం చెప్పేలోపల అతని కాబోయేభార్య సమాధానం చెప్పింది. "ఆయనఉద్యోగం మానేసి వచ్చారు. ఆయనమళ్ళీ వెళ్ళడం నాకుఇష్టంలేదు." అని చెప్పింది. "ఏంజరిగింది" అని అడిగాను. కొంతసేపటివరకు అతనేమీా మాటాడలేదు. బహుశః నా ప్రశ్నకు ఏమని సమాధానం ఇవ్వాలో అని ఆలోచిస్తూ ఉండి ఉంటాడు. తరువాత యిలా అన్నాడు. "కొన్ని వారాలక్రితం మన కామ్రేడ్స్ అందరితో పార్టీయందు విశ్వాసముంచమని పార్టీని నమ్మమని సలహానిచ్చి నవ్వుల పాలయ్యాననుకుంటాను. నా సలహాని నేనే ధిక్కరించేటంత తెలివితేటలు నాకులేవు. మేమంతా ఉద్యోగాలకోసం బయలు దేరి వెళ్ళినపుడు ఒక గొఱ్ఱెలమందలాగ కనబడి ఉండాలి. పోనీలే ఈనాటికైనా తెలిసివచ్చింది." నేను అతని ప్రక్కనున్న పిల్లవంక చూశాను. ఈ కథంతా ఆపిల్ల అపుడే చాలసార్లు విన్నది. అతన్ని వదలి వెళ్ళడం యిష్టంలేదు. ఆ కథ మళ్ళీ

వినడానికీ యిష్టంలేదు. ఈ పరిస్థితిలో పడి సతమాతమవుతున్నది. అతను చెప్పుకు పోతున్నాడు. "రెండు వారాల క్రితం మా అందరికీ పిలుపు వచ్చింది. మా సామానులన్నీ తీసుకొని మర్నాటి ఉదయం కాలేజీలో సమావేశమవని మమ్మల్నందరినీ ఒక పెద్ద కారులో మేము పని చేయవలసిన భవనానికి తీసుకు వెడతారని విన్నాము. ఉద్యోగంలో చేరడానికి వెడుతుంటే మా కందరికి చాల సరదాగా ఉంది. మేము కారులో ఎక్కిన తరువాతగాని పార్టీ మెంబర్లు మాతో అసలువిషయం చెప్పలేదు. మా ఉద్యోగాలలో కొద్దిగ మార్పులు వచ్చాయి. మేము పనిచేయడానికి ఊళ్ళో ఉన్న పెద్దభవనం దగ్గరకు వెళ్ళడంలేదు. ఊరు బయట ఏదో ప్రదేశానికి వెడుతున్నాము." "మీరంతా ఒప్పుకున్నారా?" అనినేను అడిగాను. నేనే అక్కడ వుంటే నాకు చాలా కోపం వచ్చేది. "జై జై నాదాలతో మాకు మాకు ఘనమైన వీడ్కోలు యిస్తుంటే ఆ కారులోంచి ఊరికే పారిపోవడం ఎవరికి సాధ్యం?" "తరువాత ఏం జరిగింది? మీరంతా ఎక్కడకు వెళ్ళారు?" అని అడిగాను. ఈ ప్రశ్నతో చాంగ్ కు కోపంవచ్చింది. "ఎక్కడకు వెళ్ళామో మాకేం తెలుసు? చెట్లు పుట్టలు అనేకందాటి ఊరుబయట ఒక పొడుగాటి ఇంటిదగ్గర ఆగాము. అక్కడప్రతివ్యక్తి యూనిఫారంలో ఉన్నాడు. నే నాశ్చర్యంతో 'మిమ్మల్నెవర్నీ మిలిటరీలోనికి తీసుకోలేదుగా? మీ ఆఫీసులో మిలిటరీ వాళ్ళెందుకున్నారు.' అని అడిగాను.? 'నువ్వే వెళ్ళి అడుగు' అని ఒక పెద్ద పొలికేక పెట్టాడు.

"నేనేవెళ్ళి అడగనా ? పార్టీ మనల్ని ఎంతగానో ప్రేమిస్తుందని, ఎప్పుడు మోసపుచ్చదని నువ్వేగా చెప్పింది" అని అన్నాను. అన్న వెంటనే అతన్ని చూసి జాలికూడా వేసింది. మేము కొద్దిక్షణాలు ఏమీ మాట్లాడలేదు. అతను నావంక చూసి నవ్వి మళ్ళీ చెప్పడం మొదలుపెట్టాడు. "మాకు ఇదేం నచ్చలేదని అక్కడున్న వాళ్ళు వెంటనే కనిపెట్టారు. మాలో కొందరు కొంచెం కోపం ఎక్కువున్నవాళ్ళు మమ్మల్ని కల్లిబొల్లి మాటలు చెప్పి ఇక్కడకు తీసుకువచ్చారని సణగటం మొదలుపెట్టారు. అక్కడ వున్నవాళ్ళ నాయకులు గవర్నమెంటు ఆర్డరులోని మార్పును ఆ క్రితం రోజునే మాకు తెలియబరచి ఉండవలసినదనీ యిల్లా ఎందుకు జరిగిందో విచారణ జరిగే లోపల భోజనంచేసి విశ్రాంతి తీసుకోమని మమ్మల్ని మిగతా వ్యక్తులు ఆహ్వానించారు. అటువంటి పరిస్థితిలో ఎవరికి తినాలనిపిస్తుంది. కొంతమంది యువజన సభ్యులు పార్టీ మెంబర్లని అక్కడే నోటికొచ్చిన మాటలన్ని అన్నారు..."నాకు చాలా ఆశ్చర్యం వేసింది. "సమితిమెంబర్లు పార్టీలోవాళ్ళని తిట్టారా?" అని నేనడిగాను. సమితిలో వాళ్ళకి చాలా మంచి ఉద్యోగాలొచ్చాయని మేమను కున్నాము. వాళ్ళ పరిస్థితే యిలా ఉంటే ఇంకా మిగతావాళ్ళ సంగతేంగాను. "నువ్వు పార్టీలో లేకపోయినట్లైతే నీ ఉద్యోగాన్ని ఇష్టం వచ్చినట్టుగ మార్చగలిగేవారు. కాని పార్టీ మెంబర్ల పరిస్థితే ఇలా ఉంటే మిగతావాళ్ళగతి ఎట్లా?" అని ఏమి తెలియనిదానిలా అడిగాను.

"నన్ను చెప్పనీ. మధ్యలో అడ్డంరాకు. మాలో చాలా మంది యువజన సమితి మెంబర్లు ఆ మిలిటరీ ఆఫీసరును చుట్టు ముట్టి మేమంతా యూనివర్శిటీకి వెళ్ళి యీ వ్యవహారం ఏమిటో తేల్చుకుంటామని అన్నారు. "ఆ ఆఫీసరు యిదంతా విని 'మీరంతా చిన్నవాళ్ళు, ఇంతగొడవ చేస్తే దానివల్ల వచ్చే ఫలితం మీకు యింకా తెలిసినట్టులేదు' అని అన్నాడు. దీని వల్ల మేము భయపడలేదు. మా స్వేచ్ఛనైనా వదులుకుని, తిరిగి యూనివర్సిటికి వెళ్ళిపోవడానికి నిశ్చయం చేసుకున్నాము."

"దీన్ని గురించి ఇంత గొడవ దేనికి మీరంతా నడిచి యూనివర్సిటీకి వెళ్ళి పోవచ్చుగా" అని నేను అడిగాను.

"చెయ్యడంకంటె చెప్పడం తేలిక. కారులోనే మాకు అక్కడకు చేరడానికి మూడు గంటలు పట్టింది. అక్కడికి వచ్చిన దెవరో మాకు తెలియదు. ఒకవేళ తెలిసినా, పట్టణంబయట తలుపులు మూసేలోపల అక్కడికి తిరిగి చేర లేము. ఏమైనా సరే యిక్కడ వుండటం మా కెవ్వరికీ యిష్టం లేదు. రేపు కారు మమ్మల్ని యిక్కడినుంచి యింతకంటే దూరం తీసుకుపోవచ్చు. ఇహ మా సామానుల సంగతి. అవి కారులోనే వున్నాయి. పై ఆఫీసరు పర్మిషను లేనిదే ఎవ్వరూ సామానులు తెచ్చుకోవటానికి వీలు లేదు."

"సామానులకంటే గూడా ముఖ్యమైనది పోయేట్టుగా వున్నప్పుడు మీరు సామానులు వదిలి వచ్చేయ వలసింది" అని అన్నాను.

"నువ్వనుకున్నంత తెలివితక్కువవాడిని కాదు. ఏమీ సంకోచం లేకుండా సామానులు వదిలి నిర్భయంగా తిరిగి

వచ్చేవాడినే, కాని యీ పూరుకు దోవ తెలుసుకోవడం ఎల్లా? కళ్ళు మూసుకుని సరాసరి నడుస్తే ఈ వూరు చేరుతామనుకున్నావా?" అని గట్టిగా అన్నాడు.

అతనికి యింకా కోపం తెప్పించడం నాకు యిష్టంలేదు. "సరే జరగవలసిందేదో జరిగింది. ఇహముందు నీ కార్యక్రమమేమిటి?" అని అడిగాను.

"నాకేం తెలియదు. నా పనినిగురించి మళ్ళీ యింకోకసారి ఆలోచించి సరైనపని యివ్వవలసిందిగా గవర్న మెంటును అడుగుదామనుకుంటున్నాను" అని అన్నాడు.

"నిన్ను మళ్ళీ మోసం చెయ్యరని నమ్మకమేమిటి? ఒకసారి మోసపోవటం చాలదా?" అని అడిగాను.

నా మాటలకి చిరునవ్వు నవ్వాడు...

"ఒకసారికాదు అనేకసార్లు మోసపొయ్యాం. మేమంతా తిరిగి వెళ్ళిపోతామని గొడవచేస్తూంటే అక్కడి మిలటరీ ఆఫీసరు మా అందరిని తను చెప్పే రెండుముక్కలు వినవలసిందని ప్రార్థించాడు. ఈ రెండుముక్కలూ చెప్పడానికి మూడుగంటలు పట్టింది. అతనుచెప్పినదాంట్లో ఎక్కడా సబబూ సందర్భంలేదు. కొంతసేపు బెదిరించాడు. కొంతసేపు లాలించాడు. మేము గవర్న మెంటు యిచ్చిన యీ ఉద్యోగాలు స్వీకరించి, కష్టపడి పనిచేస్తే, మా అందరి భవిష్యత్తు బాగుంటుంది. త్వరలోనే మంచి పదవులలోకి వెళ్ళవచ్చు—అని యింకా ఏమేమో చెప్పుకుపోతున్నాడు. ఇంతలో మేము వచ్చిన కారువచ్చింది. మేమంతా ఎప్పుడు వెళ్ళి కారులో పడతామా అని ఆదుర్దాగా వున్నాము. కాని అతని ఉపన్యాసం పూర్తికాలేదు. పూర్తి

కాగానే, మేమంతా 'పెకింగ్'కు తిరిగి వెళ్ళిపోతామని గొడవ చేశాం. కారువచ్చిందో లేదో చూడటానికి అతను బయటకు వెళ్ళి తిరిగివచ్చాడు. "కారువచ్చి వెళ్ళిపోయింది. ఆర్డర్లో ఏదో పొరపాటు జరిగివుంటుంది. రేపు ఉదయం వెళ్ళవచ్చు" అని అన్నాడు.

మాకు వెర్రికోపం వచ్చింది. మేమంతా పెద్దపెట్టున గొడవచేశాం. మాలో ఒక్క వ్యక్తికి మమ్మల్నందర్నీ నిశ్శబ్దంగా ఉండి, అసలువిషయంగురించి ఆలోచించమన్నాడు. "అసలు విషయమల్లా యిక్కడ నుంచి బయటపడటమే" అని మేమంతా అరిచాం. మరునాడు వుదయం మా అందరి ప్రవర్తనా వాళ్ళకి ఎంత నిరుత్సాహం కలిగించిందో, మళ్ళీ మూడు గంటలసేపు ఉపన్యాసం యిచ్చి, మమ్మల్ని యీ వూరు పంపివేశారు."

"అయితే గవర్నమెంటు మీ విషయం ఆలోచించి, మళ్ళీ మంచి ఉద్యోగాలు యిస్తారని నమ్ముతున్నావా?" అని అడిగాను.

"బహుశః యింతకంటే మంచిఉద్యోగం యిస్తారని నేననుకోవటం లేదు. కాని ఒక్క విషయం మాత్రం గుర్తుంచుకో! మన నాయకులయందు నాకు యింకా విశ్వాసం నశించలేదు. మనం విన్నివిషయాలన్నీ అబద్ధాలని నమ్మలేకుండా వున్నాను. ప్రజలు, వారి అభిమతంమీద నిర్మితమైన యీ ప్రభుత్వం యింత త్వరగా పతనం అవ్వటం ఎంత ఘోరం! ఏ నిర్ణయానికైనా వచ్చేముందు కొన్నిరోజులు ఆగి, పరిస్థితిని కలియజూద్దామని వుంది. బహుశః మనమే కొన్ని పొరపాటు అభిప్రాయా

లని మనస్సులో కలగజేసుకుని, పార్టీని, పార్టీపంథాని సరిగా అర్థంచేసుకోలేక పోతున్నామేమోనని అనుకుంటున్నాను. ఈ ప్రజాసామ్యపుసిద్ధాంతాలలో మనం అంగీకరించకపోతే, మనం వీటిని వ్యతిరేకించినట్లే. కష్టపడే కూలీనాలీజనం పక్షంలో వుంటామని అనుకుంటున్నాను. చూస్తూ చూస్తూ మనం, సామ్రాజ్యవాదులకి అవకాశవాదులకి బానిసలం కాలేము" అని అన్నాడు.

అతనిని మా పక్షంలో చేరమని అడుగుదామని అయిదునిముషాల క్రితం వరకూ అనుకున్నా కాని, యీ మాటలు విన్నతరువాత ఆ ప్రయత్నం మానుకోవలసివచ్చింది. "నువ్వు చెపుతున్న మాటలు, ఆ మిలిటరీ ఆఫీసరు ఉపన్యాసంలో భాగంలావుందే. నువ్వే చూశావుగా, ఇన్ని కబుర్లు చెప్పి వాళ్ళు నిన్ను మోసంచేశారు" అని అన్నాను.

"ఇది గవర్నమెంటు యొక్క పూర్తి స్వరూపం కాకపోవచ్చు, దాంట్లో ఒక చిన్నభాగం, ఒక అపశ్రుతి కావచ్చు"

"అపశ్రుతి అర్థంకానిమాట – నువ్వు బహుశః మరిచిపోయి వుండవచ్చు. ఆ మిలటరీ ఆఫీసరును నువ్వు ఎందుకు ద్వేషిస్తున్నావు. యీ తప్పంతా అతనిదేనని ఎందుకనుకుంటు న్నావు. నాకు ఆ మిలటరీ ఆఫీసరంటే ద్వేషం లేదు" అని కోపంతో నేను బల్లమీద గుద్ది, "నా ఉద్దేశ్యమేమిటో నేను చెబుతా విను, గవర్నమెంటు ఆశయం మనల్నందరినికూడా మిలిటరీలో చేర్పించి, మనంకూడా, చెప్పినట్టు పలికే రామ చిలుకలు అయిన తరువాత, మనసహాయంతో యితరులని మోసగించవచ్చు..."

అతను మాటమధ్యలో అందుకుని "ఎందుకు అంత కోపం ... కొంచం తమాయించుకో ... "అని అన్నాడు. "ఆ మిలటరీ ఆఫీసరుకూడా మీతో యిదే అన్నాడా"? అని అడిగాను. "అది కాదు...నాకు అర్థం కావటంలేదు." అని అంతటితో ఆగి కొద్దిక్షణాల తరువాత "ఇహచాలు ఈ విషయం గురించి మాట్లాడటం నాకు యిష్టంలేదు" అని అన్నాడు.

అతనిమీద అంత కోపం వచ్చినందుకు, నాకు చాలా కష్టం వేసింది. ఇంతకాలం యీ సిద్ధాంతాలని, ఆశయాలని నమ్మడానికి గట్టి ప్రయత్నంచేస్తూ వచ్చాడు. అతని నమ్మకం నిజమయ్యే అవకాశం వుందా? అటువంటి అవకాశం ఏమాత్రం లేదని నా మట్టుకు నాకు, గట్టిగా తెలుసు. గడచిన పద్ధెనిమిది మాసాల నుంచి జరుగుతున్న కాండ అంతా నేను చూస్తూనే వున్నాను. అందరు చెప్పిన విషయాలకి తల వూచడం, ఎవ రేదన్నా సరేనని ఒప్పుకున్నట్టు నటించడం యివన్నీ మాకు, అణువణువునా జీర్ణించుకుపోయాయి. కాని అతన్ని మాత్రం నేను మార్చలేను. అతన్ని అతనే మార్చుకోవాలి. బహుశః కొంతకాలం వరకూ యిల్లా, పార్టీ సిద్ధాంతాలు, ఆశయాలు అనే భ్రమలోపడి కొట్టుకుంటూ వుండవచ్చు. చివరకి ఇవన్నీ వదలి, అతను తన మార్గాన్ని వెళ్ళవలసి వుంటుంది. నేను ఎల్లాగో నాత్రోవనె నేను నడవాలి. అతని మనస్సు నేను బాగా గాయపరిచానా? నా మీద పార్టీకి రిపోర్టు యిస్తాడా? బహుశః చాంగ్ యింకా ఆ విద్యలో ప్రవీణుడైనట్టు లేదు.

సాధ్యమైనంత తొందరగా అక్కడనుంచి బయట పడ్డాను. వచ్చేసేటప్పుడు అతని చేతిని నా చేతిలోకి తీసుకుని, "నీ మనస్సుని బాగా బాధకలిగించాననుకుంటా. నువ్వు నిరుత్సాహంతో, చికాకుతో, డీలా అయిపోయావు. విశ్రాంతి తీసుకో. మళ్ళీ వచ్చి కలుసుకుంటా". అని అతని చేతిని నా చేతితో తట్టి, ఒక్క క్షణం అతనివంక చూశాను! అతని కోపం అంతా మాయమైంది.

అతన్ని మళ్ళీ చూడటానికి రానని, మేము ఇద్దరమూ ఆఖరిసారిగా కలుసుకుంటున్నామనీ నాకు తెలుసును. అందుకనే అతనితో చివరకు సౌమ్యంగా రెండుముక్కలు మాట్లాడి యింటి ముఖం పట్టాను.



16

# నిర్ణయం

అది 1949వ సంవత్సరం. శీతాకాలపు రోజులు. ఇంకా ఆరు నెలల్లో మేము పట్టభద్రులము కాబోతున్నాము. దక్షిణాదిన నవప్రభుత్వం జైత్రయాత్రలు సాగిస్తున్నది. ఈతరుణంలో కళాశాల ఆవరణలో ఒక చిత్రమైన సంఘటన జరిగింది. మా పాఠశాల విద్యార్థులిద్దరు ఆకస్మికంగా మూటాముల్లె సర్దుకొని ఎవరికంటా పడకుండా రైలెక్కి "టియన్‌ట్‌సిన్"కు జేరుకున్నారు. అక్కడినుంచి హాంగ్‌కాంగ్‌కుచేరుకున్నారు. ఈ పలాయనం చాలా కట్టుదిట్టంగా ఏర్పాటు చేసుకున్నారు. ఆఖరికి వారిదగ్గరి స్నేహితులుకూడా యీ విషయాన్ని పసికట్టలేదు. ఆ క్రితంరోజు కూడా వారు రాజకీయసభకు హాజరయ్యారు.

ఇలా పారిపోయినవారిలో ఒకని పేరు హీ-యో. తత్వశాస్త్రం చదువుతున్నాడు. అతడు చాలా తెలివైనవాడు. 85, 90 మార్కులు సగటుగా అతనికి వస్తూండేవి. మామూలుగా 75 మార్కులు వస్తేనే ఆ విద్యార్థి తెలివైనవాడుగా పరిగణింపబడేవాడు. క్రితం సంవత్సరం ఆ కళాశాల మొత్తం మీద అతడే ప్రథముడుగా వచ్చాడు. అతను అందరితోటీ కలిసిమెలిసి ఉండనిమాట వాస్తవమే. కాని అతనిశక్తి సామర్థ్యాలను అందరూ గౌరవించేవారు.

అతని సహచరుడైన 'హు' పాశ్చాత్య సాహిత్యవిద్యార్థి. హీ-యో లాగానే యితడుకూడా ప్రథమశ్రేణికి చెందినవాడే. తారీఖులు అంకెలు యితనికి అంతగా గుర్తుండకపోవటంవల్ల హీ-యోకి వచ్చినన్ని మార్కులు పరీక్షల్లో 'హు'కి వచ్చేవి కావు. కాని, 'హు'కు స్వతస్సిద్ధమైన యోచనాశక్తి, సాహితీ పటిమా ఉన్నాయి. ఆచార్యులందరికీ ఇతనిమీద వాత్సల్యం ఉండేది. అతనికి ప్రత్యేకంగా చదువుచెప్పాలని కొందరు ఉబలాట పడేవారు.

ఇంకా ఆరునెలలలో పట్టభద్రులు కావడానికి సిద్ధంగా వున్న యీ యిద్దరు విద్యార్థులు పారిపోవటం పైటాలో చాలా సంచలనం కలిగించింది. వీరిద్దరూ రియాక్షనరీలు అనే విషయం తాము మొదటనుంచీ గమనిస్తునే వున్నట్టు యువజనసమితి ప్రకటించింది. "విమోచనోద్యమానికి దూరంగా వాళ్ళు ఎక్కడికి పారిపోతారు?" అంటూ వ్యాఖ్యానించాడు ఒక విద్యార్థి నాయకుడు. మానాయకుల అభీష్టానుసారం మేమందరంకూడా వాళ్ళను నోరారా తిట్టిపోశాము. కాని మనస్సులో వారి పలాయనానికి ఎంతమంది సంతోషించారో!

1948 వ సంవత్సరంలో విద్యార్థులు యిలాగే విమోచన ప్రాంతంలోకి కదిలి పోయినప్పుడు యిది ప్రభుత్వ పతనానికి చిహ్నమంటూ ఒక ప్రొఫెసర్ వ్యాఖ్యానించాడు. ఇప్పుడు పరిస్థితి మారింది. ఆ ప్రొఫెసర్‌గారు తాను లోగడ చేసిన వ్యాఖ్యానంతో నేటి పరిస్థితిని పోల్చుకో దలుచుకుంటే అది తనలో తాను తేల్చుకోవలసిందేగాని పైకి "ఇది చాలా ఆశ్చర్యకరంగా ఉంది" అని మాత్రం అనగలడు.

ఏదో నాలాంటి యిద్దరు ముగ్గురు విద్యార్థులు పారి పోయినంత మాత్రంచేత, అఖండమైన సైనికబలం కలిగి, అసంఖ్యాకులైన పార్టీ భక్తులుగల కమ్యూనిస్టు ప్రభుత్వం పతన మౌతుందని నేను చెప్పటంలేదు. నేను చెప్పేదల్లా కొత్తప్రభుత్వం ఏదో చేస్తుందని కలలుకని, నిరాశచెంది, ఏమీచేయలేక, ఎదురుతిరిగి పోరాడలేక, అసంతృప్తి చెందిన అనేకమంది యువకులను అక్కడేవదలి వారు పారిపోయారని మాత్రమే.

ఈసంఘటన జరిగిన ఆరునెలలకిగాని నేనుగూడా ఇంటిని, తల్లి తండ్రులని, మిత్రులనీ వదిలి మాతృ దేశంనుండి పారిపోయి, ఆకర్షణలేని అస్థిరమైన విదేశజీవితం కావాలని కోరుకోలేదు. నిజానికి పరిస్థితులు ఏదోవిధంగా అభివృద్ధిచెందక పోతాయా అనే ఆశాకిరణం అందరు కమ్యూనిస్టులకీ ఉన్నట్లే నాలోనూ మెరుస్తూ ఉండేది. విమోచన జరిగేక 18 నెలల పాటు మాకు వారు ఆమాటే చెప్పేవారు. మాకు వాగ్దానం చేసిన పరిస్థితులు కల్పించబడలేదు. కొత్త ప్రభుత్వానికి అనేక క్లిష్టపరిస్థితులు సమస్యలు ఉన్నమాట నిజం. కాని మా సమస్యలను సమన్వయం చేసుకొని సమాధానాలు వెతుక్కోవటం మాలో ప్రతి ఒక్కరికి ఒక్కొక్క క్లిష్ట సమస్యగా తయారయింది. మా ఆశలు, దేశ భవిష్యత్తు, కుటుంబ బంధాలు, యీ నాలుగేళ్ళ నవచైనా నిర్మించడానికి, యీ ప్రాంగణములో మేము చేసిన కృషి, వీటికి అర్థం దొరకటం లేదు. మా చదువులు వదిలి కార్యరంగంలోకి దూకి నవ చైనాను నిర్మించడానికి కంకణాలు ధరిస్తాం. కాని ఆనవ చైనా రూపురేఖలు నాయకులు ఏ విధంగా తీర్చి దిద్దుతున్నారుకి

కొత్తప్రభుత్వం చేసిన ప్రతి తప్పిదానికీ సమాధానం చెప్పకో వచ్చును. అన్నింటికంటె పెద్దసమాధానం—ఇది ప్రజాప్రభుత్వం. కాని యిది దారుణమైన నిరంకుశత్వంగా పరిణమించింది. క్రమశిక్షణ పేరుతో ప్రభుత్వం చేస్తున్న పనులన్నింటికీ తల వంచి, వారిచ్చిన ఉద్యోగమేదో, నోరు మెదపకుండా చేసుకోవడం—మనుగడకు మార్గమైంది. అంతకు మించిన ఆశ నిష్ప్రయోజనం. ఇప్పటికీ యిక్కడనుంచి పారిపోయి మినుకు మినుకు మంటున్న ఆశాజ్యోతిని వెలిగించుకునే అవకాశం లేకపోలేదు. ముందు ముందు యిదికూడా సాధ్యంకాకపోవచ్చును. పోలీసులు ప్రయాణీకులపై యిక ముందెన్నడూ కనీ వినీ ఎరుగనంతనిఘా ఉంచుతున్నారు. విదేశీయులు నగరందాటి పోవాలంటే ప్యాసు పొందాలి. ఇంకొంత కాలానికి యిందుకు దేశీయులకుగూడా ప్యాసులు అవసరం కావచ్చును.

ఈ పరిస్థితులవల్ల పలాయనం చిత్తగించడానికి సమయం ఆసన్నమైనదని అనిపించింది. ఇందుకు కావలసిన పథకం తయారు చేయడానికి వారంరోజులు పట్టింది. పెకింగ్ గనుక దాటగల్గితే, అక్కడ మిడిల్‌స్కూల్‌లో ఉపాధ్యాయవృత్తి లభించిందని చెప్పి కేంటన్‌కు జేరిపోవచ్చును. బ్రిటిష్‌వలసగా వున్న హాంగ్‌కాంగ్‌కు కేంటన్ ఎనభైమైళ్ళ దూరంలోనే ఉన్నది. కాని యీ మిషపెట్టుకు పోవటంవల్ల ప్రయోజనం ఎంతవరకుంటుందో తెలియదు. అక్కడ కేంటన్‌లో పరిస్థితులేమిటో నాకు తెలియదు. ఏమైనా నా అదృష్టాన్ని పరీక్షించుకోవాలి. మిస్టర్ సూ అనే స్నేహితుడితో ఈ విషయం మాట్లాడి కేంటన్‌లో గల మిసెస్ లోహాకు సిఫారసు ఉత్తరం

తీసుకున్నాను. ఆ తర్వాత యీ విషయాన్ని చెప్పటానికి ఇంటికి బయలు దేరాను.

కేంటన్, నా ప్రయాణంలో ఒక మజిలీ మాత్రమేనని నేను ఇంట్లో చెప్పలేదు. కేంటన్‌కు వెళ్ళటం మా తండ్రికి యిష్టం లేకపోయింది. కాని నేను పట్టినపట్టు విడవకపోవడంతో మా అమ్మ మెత్తపడింది. చివరకు మా నాన్నగూడా నా ప్రయాణానికి అభ్యంతరం చెప్పలేదు.

ఈ గండం గడవటంతో, నా చిరునామా కేంటన్‌కు మార్చుకుందామని పోలీస్ స్టేషన్‌కు బయలు దేరాను. నా అదృష్టం బాగుంది. ఆ పోలీసు ఉద్యోగి విసుగ్గాడు-డి. ఎక్కువ ప్రశ్నలు వేయకుండానే, నాకు కావలసినపని పూర్తిచేసి పంపించి వేశాడు. తేలికైన హృదయంతో బయటపడి, అక్కడనుంచి చెయిన్ మెన్ స్టేషన్‌కు టిక్కెట్టు సంపాదించటానికి వెళ్ళాను. నా స్నేహితుల దగ్గర సెలవు తీసుకోడానికి బయలుదేరాను. మొదట ప్రొఫెసర్ చే, ప్రొఫెసర్ పెంగ్‌లను చూశాను. "మీరు నాకు యిన్నేళ్ళూ చేసిన సహాయానికి చాలా కృతజ్ఞు రాల్ని. అది చెప్పటానికే వచ్చాను. బహుశః యిదే చివరి సారి కనిపించడం కావచ్చును" అన్నాను.

"అదేమిటి ? ఏమిటి నీ అభిప్రాయం. నువ్వు పెకింగ్ లోనే పనిచేయటానికి ఒప్పుకున్నావు కదా. ఇట్లారా... ఆ విషయం గురించి మాట్లాడుకుందాం" అన్నారు వారు.

నా అభిమానులైన పెద్దల్ని మోసగించటం నా అభిప్రాయంకాదు. కాని నిజంచెప్పలేకపోయాను. "అదికాదు...

మళ్ళీ ఒకసారి వస్తాను...మీ కాలం వృథా చెయ్యటం భావ్యం కాదు." అన్నాను.

"మరోచోట పని చెయ్యటానికి మాట యిచ్చావా?" అన్నాడు ప్రొఫెసర్ చే.

"పోనీ అసలు జరిగిందేమిటో చెప్పు" అని మళ్ళా అడిగాడు.

ఇట్లా అడగటంతో తిరిగి లోపలికి వెళ్ళి కూర్చోక తప్పిందికాదు. "నేను ప్రజలకోసం ఏ పనినైనా చెయ్యడానికి సిద్ధంగానే ఉన్నాను. ఇక్కడ మాత్రం కాదు. నాకు తగినపని కావాలి. నేను స్వార్థపరురాలనని మీరు అనుకో వచ్చును. కాని యిక్కడ నేను ఒక్కక్షణంగూడా ఉండలేను." అన్నాను.

"ప్రభుత్వం నీకు ఏ ఉద్యోగాన్ని కేటాయించింది?" అని ప్రశ్నించాడు ప్రొఫెసర్ పెంగ్.

"రాజకీయ చట్ట సంఘంలో" అని జవాబు చెప్పాను.

"కళాశాలలో ప్రథమ శ్రేణియందు ఉత్తీర్ణురాలవైన నీవంటి దానికి యీ ఉద్యోగం తగిన దని నేను అనను. కాని నా దేశానికి సేవచేయడానికి యిది ఒక మహావకాశం. అవునా? ఇప్పుడేమంటావో చెప్పు? నువ్వు యువజనసమితిలో సభ్యురాలివేనా?" అన్నాడు పెంగ్.

"కాదు"

"ఎందుకు జేరలేదు?"

ప్రభుత్వాన్ని నిందించాలనే అభిప్రాయం నాకు లేదు. ప్రభుత్వం నాఎడల మంచిగానే ఉంది. నాతోటివారికి కొంద

రికిగూడా యివే ఉద్యోగాలు నిర్ణయించింది. వారందరూ అందుకు గర్విస్తున్నారు. కాని నా అభ్యంతరమల్లా నేను ఏపనిని చేయగలనో ఏది చేయలేనో ప్రభుత్వం గుర్తించినట్లు లేదు.”

ఈ సమాధానంతో ఆశాభంగం చెందిన ప్రొఫెసర్ చే “ఇంతకుముందు అయితే, ప్రభుత్వంయెడ భక్తితో వారు చెప్పింది చెయ్యామని సలహాఇచ్చిఉండేవాణ్ణి. కాని యిప్పుడా విషయం మాట్లాడను.” అంటూ నా ముఖంలోకి చూస్తూ “నువ్వు కోరుకొనినది రానంతమాత్రాన యింతగా నిరాశ చెందనవసరంలేదు. నవచైనా నిర్మించటమనే మహత్తర కార్యంలో మనమందరం భాగస్వాములమయే అవకాశం లభించింది. జారవిడుచుకోవటం మంచిదికాదు.” అంటూ అతి బరువుగా అన్నాడు. అట్లాగే ప్రొఫెసర్ పెంగ్‌కూడా పితృ వాత్సల్యంతో నన్ను వారించటానికి ప్రయత్నించాడు. కాని నేను నా నిర్ణయాన్ని మార్చుకోదలచుకోలేదు. వారి దయకు నా మనస్సు లర్పించాను. తిరిగి వచ్చివేశాను.

ఆ పిమ్మట మరొక అభిమాన పాత్రుడైన ప్రొఫెసర్ దగ్గరకు వెళ్ళి నా నిర్ణయంగురించి చెప్పాను. ఆయన విని చాలాసేపు నిశ్శబ్దంగా ఉండి “నీకు సరిపోయినపనే చేస్తున్నావు. నాకుగూడా నీలాగే చేయాలని ఉంది. కాని అది అసంభవం. లాభంలేదు” అన్నాడు.

ఆ తర్వాత నేను రైలుఎక్కి ఏకాంతంగా నా స్థానంలో కూర్చునేరోజు వచ్చింది. రైల్లో కూర్చుని, నా సామానులనూ, ప్లాట్‌ఫారంమీద ప్రయాణీకులను చూడగానే నాలో ఏదో దుఃఖం పొంగివచ్చింది. రైలు కూతపెట్టి బయలుదేరింది.

ఇంతటితో చిరపరిచితమైన ప్రాంతాలకూ, వ్యక్తులకూ సెలవు. దుఃఖం ఆపుకోలేకపోయాను. నా చుట్టూ ఉన్నవాళ్ళు వింతగా నాకేసి చూడసాగారు. మేం పెద్దవాళ్ళమైపోయాం. బిడ్డలను వదిలి ఉండలేమన్నారు తల్లిదండ్రులు. నన్ను యీ వృద్ధ ప్రపంచంలో ఎవరూ ప్రేమించనంతగా. ప్రాణానికి ప్రాణంగా ప్రేమించిన రెండు హృదయాలనూ నేను ఎందుకు మోసం చెయ్యాలి? నా తల్లిదండ్రులను ఎందువల్ల ఏకాకులను చేశాను? కళ్ళు మూసుకున్నాను. నిద్రపట్టింది, ఒక రాత్రి వేళ మెలుకువవచ్చింది. ఆకలివేసింది. బయటకు చూశాను. గాఢాంధకారం. లోపల చెదిరిపోయిన సైన్యం తాలూకు మృతకళేబరాలవలె తోటి ప్రయాణీకులు నిద్రపోతున్నారు. నా జీవితంలో మొట్టమొదటి సారిగా ఒంటరితనంయొక్క భయంకరత్వాన్ని చవిచూశాను. నిద్రపట్టింది. ప్రభాతభానుని అరుణకిరణాలు నన్ను మేల్కొలిపాయి. పచ్చని మైదానాలతో వెనక్కు పరుగిడిపోతున్న చైనా కనిపించింది. నా కళ్ళు రాత్రంత దీనంగా లేవు. నా గురించి ఎవరన్నా ప్రశ్నిస్తే చెప్పవలసిన కథను అల్లుకుంటున్నాను.

మర్నాడు రైలు ఆగగానే యిద్దరు సాయుధులైన సైనికులు వచ్చి, సామానులు తనిఖీ చెయ్యటం ప్రారంభించారు.

నా పెట్టె తెరిచి చూపించాను. బట్టలూ పుస్తకాలు, తిరగవేసి తనిఖీచేశారు. ఒకడు నాకేసి చూస్తూ —

"నువ్వు చదువుకుంటున్నావా?" అన్నాడు.

"అవును. రాజధానినుంచి వస్తున్నాను."

"ఎక్కడికి వెడుతున్నావు?"

"కేంటన్‌కి"

"ఎందుకు ?"

నేను యింతసేపటినుంచి పదేపదే మననం చేసుకుంటూ ఉన్న జవాబును వెతుక్కుంటున్నాను. కాని అంతలో మరొక సైనికుడు యితగాడి భుజం మీద తట్టి "రారా ! మనకి ఇంత కంటె జరుగురు పనులు చాలా ఉన్నాయి. ఈపిల్ల చాంగ్-కై షేక్‌ను జేబులో వేసుకు వెళుతోందను కుంటున్నావా ?" అంటూ లాక్కుని పోయాడు.

నేను నిశ్చింతగా ఊపిరి పీల్చుకున్నాను. వారు మరి కొందరు ప్రయాణీకుల్ని తనిఖీ చేస్తూండగా, నేను ఒక పుస్తకం తీసి పేజీలు తిరగవేస్తున్నాను.

"అమ్మాయ్" అంటూ ఒక పురుషకంఠం వినిపించింది.

తలతిప్పి చూడటానికి నాకు భయం వేసింది.

"అమ్మాయ్ !"

ఎంత మొరటుమనిషి ? అసలు అతనివేపు చూడనే గూడదు అనుకున్నాను. నా పుస్తకం నేను చదువు కుంటున్నాను.

"ఇదుగో, నీతో ఒకమాట చెప్పవచ్చా ?"

నేను కదలలేదు. మళ్ళీ "నీతో మాట్లాడాలి. నువ్వా నన్నెరుగుదువు" అన్నాడు. ఈ మాటు తలఎత్తాను. ఔను ! అతడు నాకు తెలుసును. అది నా చిరపరిచితమైన ముఖమే. కాని అతణ్ణి బాగా గుర్తించలేకపోయాను. అతడు నవ్వి, మర్యాదగానే నాకు ఎదురుగా కూర్చున్నాడు. నా మొదడుకి

చురుగ్గా పని కల్పించి, అతడెవరో పోల్చుకుంటానికి ప్రయత్నిస్తూ ఉన్నాను.

"మూడువారాల క్రితమే నువ్వు డిగ్రీపుచ్చుకున్నావు కదూ. నువ్వు నాకు బాగా గుర్తు. క్లాసుకు వెళ్ళటం రావటం రోజూ చూసేవాణ్ణి సరాసరి వచ్చి ఆకస్మికంగా యిలా మాట్లాడుతున్నందుకు ఏమీ అనుకోకు. ఇక్కడిలా కూర్చుని మాట్లాడటం నీకేమన్నా అభ్యంతరమా ?" అన్నాడు.

అతను మరొక సైటా విద్యార్థి. అతడూ కేంటన్‌కే వెడుతున్నాడేమో ! అతనితోపాటు దిగవలసివస్తే ఏం చెయ్యాలి ? అతడు నా మౌనాన్ని అంగీకారంగా భావించి ఏమేమో చెప్పుకుపోతున్నాడు. నేను వినటంలేదు.

"చూడు. వయస్సులో ఉన్నావు. ఒక్కదానివీ ప్రయాణంచేయడం మంచిదికాదు. నేను నీ వెంట ఉండనా ?" అన్నాడు.

"అబ్బే వద్దు...నాకు ఒంటరిగా ప్రయాణం చేయడం అలవాటే."

"ఫరవాలేదు. నీ కళ్ళు చూసుకో ఎంత యిదిగా ఉన్నాయో. నీ సంరక్షణభారం నాకు అప్పగించు."

ఈ మాటకు నవ్వాలో ఏడవాలో ఆగ్రహించాలో నాకు తెలియలేదు.

"చూడండి. నేను కేంటన్‌లో దిగగానే నన్ను ఆహ్వానించటానికి నా ప్రియుడు ఎదురుచూస్తూ ఉంటాడు...అందుకని..." అన్నాను.

"అలా అయితే మంచిదే - చాలా సంతోషం - చాలా..." అంటూ చేతులు వెనక్కి తీసుకున్నాడు.

కొంతసేపు అయినతర్వాత, నా ఎదుటగల జాగాలో లెనిన్ దుస్తులు ధరించిన నలభై ఏళ్ళ పెద్దమనిషి ఒకడు కూర్చున్నాడు. అతడు మందహాసంచేస్తూ "కామ్రేడ్! నిద్రలేచావా? పాపం యింతదూరం ప్రయాణంచేస్తున్నావు, నిన్న బాగా దీనంగా కనిపించావు. ఇవ్వాళ కొంచెం ఫరవాలేదనుకుంటాను" అన్నాడు.

నేను నవ్వుతూ "నాకు అలవాటేనండీ. ఒంటరిగా ప్రయాణం చేయటం కొత్తకాదు" అన్నాను.

"నువ్వు విద్యార్థినివిలా ఉన్నావ్-ఎక్కడికి వెడుతున్నావ్?"

"కేంటన్"

"కేంటన్! చాలా బాగుంది. నేనూ అక్కడికే వెడుతున్నాను. నీకు కేంటనీస్ భాష వచ్చునా?"

"నేను అక్కడ చదువుకోడానికి వెళ్ళటం లేదు. అటువంటప్పుడు భాష రాకపోయినా ప్రమాదం లేదు."

"మరెందుకు వెడుతున్నావ్?"

"నా ప్రియుణ్ణి చూడటానికి"

"అతడు ఏం చేస్తున్నాడు"

"ఒక స్కూల్లో..."

"ఏ స్కూలు?" పెద్ద గొంతుకతో అడిగాడు.

ఆ వివరాలు చెప్పడం చిక్కుల్లో పడటమే అవుతుంది. అతను సన్‌యెట్‌సెన్ విశ్వ విద్యాలయంలో పని చేసేవాడు

అతనికిప్పుడు వొంట్లో బాగుండలేదు. టీ.బి. యేమో అనుకుంటాను. చూడటానికి వెడుతున్నాను." అన్నాను.

అతను నవ్వుతూ "సరి సరి! అదా! నిన్నటి రోజున నువ్వు కళ్ళనీళ్ళు పెట్టుకోవడం యితగాడికోసమే నన్నమాట" అని అన్నాడు.

ఇక నేనే అతనిమీద ప్రశ్నలవర్షం కురిపించడం ప్రారంభించాను. "ఎక్కడనుంచి వస్తున్నారు? ఏం చేస్తున్నారు?..." అతడు మాంచి హుషారుగా అడ్డూ అవధీ లేకుండా చెప్పుకు పోతున్నాడు. మధ్యలో ఆకస్మికంగా ఆగి చేతిగడియారం వంక చూసుకుని–"కామ్రేడ్! వస్తా! భోజనం వేళఅయింది. మళ్ళీ కలుసుకుందాం" అంటూ వెళ్ళిపోయాడు.

ఇతనుగాని, యింకెవరైనాగాని యిలాగే ప్రశ్నలువేసి విసిగిస్తే ప్రమాదం ఉండనే ఉంటుంది. అందుచేత రైలు కండక్టరు దగ్గరకువెళ్ళి ఒక బెర్తు కావాలనీ, వంట్లో బావుండ లేదనీ చెప్పాను. అతడు చాలా మర్యాదగా "ఒక కంపార్టు మెంటులో ఒకటే బెర్తు ఉన్నది. కాని అందులో ఉన్న ముగ్గురూ పురుషులే. అది మీకు అంత అనుకూలంగా ఉండ దనుకుంటాను" అన్నాడు.

"చాలా కృతజ్ఞురాలిని. ఆడతోడు లేకుండా కష్టమే. కనీసం ఒక భార్యాభర్తలు ఉన్నాసరే, అటువంటిచోట బెర్తు ఉంటే చూడండి దయయుంచి. ఈ డబ్బు తీసుకోండి"

"ఖాళీ ఉంటే తప్పక చెబుతాను. ముందే యిలా డబ్బు తీసుకుంటే ఎవరన్నా లంచం అనుకుంటారు. మీ వద్దనే ఉంచండి." అన్నాడు.

చివరికి భోజనానికి ముందు క్రింద బెర్తు ఒకటి నాకు దొరికింది. తక్కిన కంపార్టుమెంట్ అంతా ఖాళీగానే ఉన్నది. పై బెర్తుమీద ఎవరో భార్యాభర్తలు ఉన్నారు. అందులో రెండురోజులు ప్రయాణం చేసినతర్వాత రైలు కేంటన్ రైల్వే స్టేషన్ చేరింది.

బయట అర్థంకాని భాషలో రణగొణధ్వని వినిపిస్తూ ఉంది. అంతా క్రొత్త, అంతా రొద. భయంవేసింది. ఒక పోర్టరువచ్చి నా సామాను అందిపుచ్చుకున్నాడు. చకచక అంగలువేస్తూ పరుగెత్తుకు పోతున్నాడు. అదృశ్యమై పోతాడేమోనని భయం వేసింది. అతనికి రావలసిన దానికంటె రెండురెట్లు కూలి యిచ్చాను. కాని అతడు తనకేదో ఘోర అన్యాయం జరిగినట్లు గుంజుకున్నాడు. మరి కాసినిడబ్బులు యిచ్చాను. కృతజ్ఞతన్నా చెప్పకుండా మరొక దురదృష్ట వంతుణ్ణి వెతుక్కుంటూ పరుగెత్తాడు.

బండి కుదుర్చుకుని, అడ్రెస్ చూపించి బయలు దేరాను. ఒక యింటిదగ్గర ఆగి బెల్ మ్రోగించాను. ఒక చిన్న పిల్లవచ్చి తలుపు తెరిచింది. "మిసెస్ లోహ్ ఉన్నారా?" అని అడిగాను. ఆ పిల్ల నన్ను ఎగాదిగా చూసి "అమ్మ యింట్లో లేదు. రాత్రికి మళ్ళీ రండి" అంది.

నాకు చికాకు అనిపించింది. "నేను పెకింగ్‌నుండి వస్తున్నాను. ఈ వూళ్ళో ఎవ్వరూ నాకు తెలియదు. మీ అమ్మ స్నేహితుని దగ్గరనుంచి ఉత్తరం తెచ్చాను. కాసేపు యిక్కడే విశ్రాంతి తీసుకోకూడదా?" అన్నాను.

ఆమె మాట్లాడకుండా ముందుగది చూపించి కాస్త టీ యిచ్చి వెళ్ళిపోయింది. నేను మిసెస్ లోహ్ కోసం ఎదురు చూస్తూ కూర్చున్నాను. సాయంత్రానికి ఆమె వచ్చింది. నలభైఏళ్ళు ఉంటాయి. "ఎవరు మీరు? యిక్కడికి ఎందుకు వచ్చారు?" అని ప్రశ్నించింది.

నేను ఉత్తరం యిచ్చాను. "ప్రొఫెసర్ నియూ పంపించాడా-చాలా బాగుంది. అతడు చాలాకాలంగా నామిత్రుడు. పదేళ్ళయింది అతని చూసి. ఈ గొడవల్లో ఎట్లా ఉన్నాడు?" అంది నవ్వుతూ.

ఆయన యింకా ఉపాధ్యాయ వృత్తిలోనే ఉన్నాడని చెప్పాను. ఆయనగురించి చెప్పిన విషయాలన్నీ ఆమె శ్రద్ధగా విన్నది. "మిస్టర్ నియూ స్నేహితురాలు నాకూ స్నేహితురాలే. నీకు ఏం సహాయం కావాలో చెప్పు చేస్తాను" అంది.

"నాకు రెండు సహాయాలు కావాలి. మొదటిది మీ యింట్లో నాలుగురోజులపాటు ఉండనివ్వాలి. రెండవది నన్ను ఎట్లాగైనా మీరు హాంగ్‌కాంగ్ చేర్చాలి" అన్నాను.

ఈ మాటలు ఆమెకు రవ్వంతగూడా ఆశ్చర్యం కలిగించకపోవటం చూస్తే నాకు చాలా వింత అనిపించింది. ఆమె ప్రశాంతంగా యిట్లా అన్నది.

"ఔను! నీలాంటి పడుచుపిల్ల ఒంటరిగా హోటల్లో గది తీసుకుని ఉండటం మంచిదికాదు. మాయిల్లు అంత సౌకర్యంగా ఉండదు. అయినా అదే అలవాటు అవుతుంది. ఇక హాంగ్‌కాంగ్ వెళ్ళటం విషయం: నువ్వు రవ్వంత జాగ్రత్తగా ఉంటే అది అంత కష్టమైన విషయం కాదు."

"హాంగ్‌కాంగ్ చేరటం చాలా కష్టమని విన్నానే. ముందిక్కడ కమ్యూనిస్టు పోలీసుల కళ్ళబడకుండా, ఆతర్వాత బ్రిటిష్ పోలీసులను నమ్మించి వెళ్ళటంచాలా కిష్టమైన వ్యవహారమని పెకింగ్‌లో అనుకోవటం విన్నాను" అని నేను అన్నాను.

"ఇప్పుడంత కష్టంలేదు. నువ్వు మామూలుగా వర్తకం చేసే మనిషిలాగా కనిపించాలి. అట్లా అయితే పోలీసులు అంతగా పట్టుపట్టరు."

"హాంకాంగ్‌లో పోలీసుల మాటేమిటి ?"

"హాంకాంగ్ పోలీసులకు పర్మిట్లు చూపనవసరంలేదు. మనం అనుమానాస్పదంగా కనిపించకుండా ఉంటే చాలును."

"మరి నేను కాంటనీస్‌ను కాదాయెను. కాంటనీస్ భాష మాట్లాడలేనాయె."

"పరవాలేదు. కొద్దిగా యీభాష నేర్చుకో. ఈవేషం వేసుకో. నీవు అదృష్టవంతురాలవైతే అంతా సవ్యంగా జరిగి పోతుంది."

ఇది ఆమె చెప్పినంత తేలిక విషయమని నాకు యిప్పటికీ నమ్మకం చిక్కలేదు. "ఏవో నాలుగుమాటలు చిలుకకు మల్లే వల్లెవేస్తాననుకోండి. నేర్చుకోని ప్రశ్న వేస్తే ఏం సమాధానం చెప్పగలను. నవ్వు ఆపుకోలేక విరగబడితే, కథ అంతటితో సమాప్తమైపోతుందని నా భయం" అన్నాను.

"వాళ్ళు అందరినీ ఒకే రకంగా ప్రశ్నిస్తారు. నువ్వు చెప్పవలసిన జవాబుల్ని ముందు బాగా మననం చేసుకో. ఒకవేళ బయటపడితే యీ అవకాశం పోయినట్లే. మళ్ళీ ఒక నెలన్నా ఆగవలసి యుంటుంది. అయినా దీనికింత కంగారు

పడవలసిన అవసరంలేదు. ఒకవేళ పోలీసులు పట్టుకుని నిన్ను వెనక్కు పంపివేసినా, హాంగ్‌కాంగ్‌కు పోవడానికి మరొక మార్గం వుంది. 'వచ్చువిద్దుల ముఠా'కు డబ్బు పారవేస్తే నిన్ను ఎవరికంటా పడకుండా ఆవలిగట్టుకు జేర్చగలరు. కాని వారి మార్గం చాలా క్లిష్టంగా ఉంటుంది. కొండలు, కోనలూ దాటుతూ వాళ్ళతో వెళ్ళటం వయస్సులో వున్న నీలాంటి పిల్లకు చాలా ఇబ్బందే." నాకు ఒక అనుమానం వచ్చింది. హాంగ్‌కాంగ్ ప్రభుత్వంవారు కేంటనీస్‌ని మాత్రం యిలా ధారాళంగా రానిస్తూ తక్కిన చైనీయుల్ని ఎందుకు రానీయటం లేదని అడిగాను. చైనీయులందరినీ రానిస్తే హాంగ్‌కాంగ్ జనాభా పెరిగిపోతుందని వారిభయమనీ, కేంటనీస్‌వారు హాంగ్‌కాంగ్‌కు కావలసిన ఆహారపదార్థాలు తీసుకుపోవటంవల్ల వారినిమాత్రం రానిస్తున్నదనీ ఆమె చెప్పింది.

"మరో విషయం నన్ను కలవరపెడుతూ వున్నది. ఇక్కడ పోలీస్ స్టేషనులో నా పేరు రిజిష్టర్ చేసుకోవటం ఎట్లా?" అన్నాను.

"అదేం పెద్ద బాధలేదు. ఒక్క నిముషం ఆగు, నేను ఒక చీటీ రాసి మా అమ్మాయికిచ్చి పంపుతాను." అంటూ నాకళ్ళలోకి చూసి "నీ పేరేమిటి? నీ ఊరేమిటి? —యీ కాగితంమీద వ్రాయి" అంది.

ఏమీ అనుమానించకుండా దొంగపేరు, దొంగ చిరునామా వ్రాశాను.

ఆమె టీ త్రాగుతూ "హాంగ్‌కాంగ్ వెళ్ళటం ఎందుకు? ఎవరికోసమన్నా నా? ఏదన్నా ఉద్యోగం కోసమా?" అని ప్రశ్నలు వేసింది.

"మొదట ఒకర్ని చూడాలి. ఆ తర్వాత ఉద్యోగం చూసుకోవాలి. నా ప్రియుడు హాంకాంగ్‌లో ఉన్నాడు. ఒక విదేశీయ ఎగుమతి సంస్థలో పనిచేస్తున్నాడు. అతడు నాకు ఉద్యోగం చూపగలడనుకుంటాను."

"నీకు ఇంగ్లీషు భాష బాగా వచ్చుననుకుంటాను. మరి నీకు టైపురైటింగ్, షార్ట్‌హాండ్ వచ్చునా? హాంగ్‌కాంగ్‌లో వేలాది నీలాంటి ఆడపిల్లలు ఉద్యోగాలు లేక అల్లాడుతున్నారు" అంటూ నా బట్టలకేసి పరీక్షగా చూసి "కాస్త ముచ్చటగా బట్టలు వేసుకుని అందంగా ముస్తాబు చేసుకుంటూ ఉండు. ఎవరో ఒకరు దోవ చూపించకపోరు." అంది.

"దానికీ దీనికీ సంబంధం ఏమిటి? నేను వేగంగా టైపు చేయగల్గి, షార్ట్‌హాండ్ వ్రాయగల్గితే చాలదా?"

"ముచ్చటగా బట్టలు వేసుకోవటంలో తప్పు ఏమిటి? తమ కార్యాలయంలో అందరూ శుభ్రంగా ఉండాలనుకోవటంలో అనౌచిత్యమేమీ లేదే?"

"ఒక అమ్మాయి ఉందనుకోండి. ఆమెకు టైపు, షార్టుహాండ్ రావు. కాని చాలా అందంగా ఉంటుంది. మరి ఆమెకుఉద్యోగం దొరుకుతుందా?"

"అంతమాత్రంచేత దొరకదు. హాంగ్‌కాంగ్‌లో అందమైన అమ్మాయిలు ఎందరో ఉద్యోగాలు లేకుండా ఉన్నారు."

ఇంతలో వాళ్ళ చిన్న అమ్మాయివచ్చి, నా ఉచ్చారణ విని ఆశ్చర్యంగా చూచింది. మిసెస్ లోహ్ ఆమెను ముద్దాడి "ఏవమ్మా హోంవర్కు చేశావా?" అంది.

ఆ పిల్ల కేంటనీస్‌లోనే సమాధానం చెప్పింది. ఇంకా ఏదో తల్లిని అడిగింది. ఆమె ఏదో చెప్పింది. నాకు అర్థం కాలేదు. ఆ పిల్లకు పాఠశాలలో విమోచనగీతాలు నేర్పుతున్నారట.

నేను దిగాలుపడి ఉండటంచూసి మిసెస్ లోహ్ "నీకు పెద్దకష్టం ఏమీ ఉండదనుకుంటాను. అదీగాక హాంగ్‌కాంగ్‌లో నీ ప్రియుడు ఉండనే ఉన్నాడాయె. ఇక దిగులెందుకు? ఆఁ...నా తెలివి తెల్లవారినట్లే ఉంది. పాపం యింతదూరం ప్రయాణంచేసి వచ్చావు. కాస్తన్నా విశ్రాంతి యివ్వకుండా మాట్లాడుతున్నాను. భోజనాలు అయింతర్వాత స్నానంచేసి హాయిగా పడుకో. ఈ గొడవలన్నీ రేపు చూసుకోవచ్చును" అంది.

మళ్ళీ నా కళ్ళలో నీళ్ళు తిరిగాయి. ఆ తరువాత హృదయం బరువుతగ్గింది. మర్నాడు ఉదయం కేంటన్‌లోని విశేషాలు చూపించి, నాకు ఉల్లాసం కలిగించాలని బయలు దేరింది. హాంగ్‌కాంగ్ చేరటం ఎప్పుడా అని ఉబలాటంలో ఉండటంవల్ల కేంటనీస్ వేషభాషల్ని త్వరగా అలవరచుకోవాలని ఉబలాటపడుతున్నాను. ఆమె నన్ను బజారుతీసుకువెళ్ళి కేంటనీస్ దుస్తులు కొనిపెట్టింది.

షుమ్‌చున్ వంతెనదాటి బ్రిటిష్ భూభాగంలోకి వెళ్ళింతర్వాత, ఎక్కడికి వెడుతున్నావని ఎవరన్నా ప్రశ్నిస్తే

ఊసాంగ్ వీధిలో 6 వ నెంబరు యింట్లో మొదటి అంతస్తు అని చెప్పాలని చెప్పింది. మిసెస్ లోహ్ నా చేత యీ మాటలు ఒకటికి పదిసార్లు చెప్పించింది. భోజనం చేస్తున్నా, చదువుకుంటున్నా, ఏ పనిచేస్తున్నా యీ మాటలనూ ఉచ్చారణనూ మననం చేయటం మొదలుపెట్టాను.

మర్నాడు తెల్లవారుతూ ఉండగా మిసెస్ లోహ్ నన్ను పిలిచింది. నేను పక్కమీద నుండి క్రిందకు దూకి తొందర తొందరగా ముఖం కడుక్కున్నాను. ఆ తర్వాత తలకు చారెడు నూనె పట్టించి, దువ్వుకున్నాను. స్నానాల గదిలోని అద్దంలో చూసుకుంటే ముమ్మూర్తులా కేంటనీస్ పిల్లలానేఉన్నా! నా పెదవులపై చిరునవ్వు మెరిసింది. కేంటన్ వచ్చేక అదే తొలకరి.

మిసెస్ లోహ్కూడా నాతో బయలుదేరింది. ఇద్దరం తలొక రెండుచుట్టలతో క్యాబేజి, బట్టలమూట పట్టుకున్నాము. అవి నా బట్టలుకావు. వాటిని అక్కడే వదిలిపెట్టవలసివచ్చింది. ఇంకా సూర్యోదయం కాలేదు. ఇంట్లో ఎవరినీ లేపకుండా, బయటికి వచ్చి, బండి కుదుర్చుకుని, స్టేషన్కి జేరాము. ఒక అరగంటపాటు లైనులో నిలబడి మూడవతరగతి టిక్కెట్లు సంపాదించాము.

వ్యాపారం చేసుకుంటూ పొట్టపోసుకునే స్త్రీలు పై తరగతులు భరించలేరు. మేం మళ్ళీ వరుసగా నిలబడ్డాము. సాయుధ సైనికులు మమ్మల్ని తనిఖీ చేస్తున్నారు. వారుగాక సరిహద్దులో పరీక్ష చేయటానికి మరొక జట్టువారు ఉన్నారు.

కోచ్‌లో ఎక్కినతర్వాత చుట్టూ కలియజూసి విరగ బడి నవ్వడం మొదలుపెట్టాను. బండిలోని వారందరూ నిజంగా వ్యాపారస్థులే. హాంగ్‌కాంగ్‌లో హెచ్చుధర పలికే గుడ్లు, పళ్ళూ, క్యాబేజీ, తదితర ఆహారపదార్థాలూ వారు తీసుకు వస్తున్నారు. అందరూ కేంటనీస్ దుస్తులు, చదునైన పాదరక్షలూ ధరించారు. నేనుగనుక ఇంకా పూర్వపు దుస్తుల్లోనే ఉన్నట్లయితే, యీ పాటికి పోలీస్ స్టేషన్‌లో ఉండేదాన్ని.

మేము భోజనం చెయ్యలేదు. మిసెస్ లోహ్‌తో మాత్రం నాకు ఆకలిగా లేదని చెప్పాను. నేను ఆ మాట మర్యాదకోసం అన్నానని ఆమెకు తెలుసును. ఆవిడ భోజనం తెచ్చింది. నేను తినలేక పోయాను. మళ్ళీ ఏదో భయం సందేహాలు నా హృదయంలో మెదులుతున్నాయి.

రెండు గంటల తర్వాత కోచ్ సరిహద్దులో ఆగింది. హాంగ్‌కాంగ్ వెళ్ళవలసినవారు అక్కడ దిగి, ఒక వంతెనదాటి ఆవల మళ్ళీ మరొక బండి ఎక్కాలి. అందరూ ఒక్కసారి క్రిందకు దిగాలని ఒకరి తలలమీద ఒకరు కసరత్తు చేయ సాగారు.

సూర్యుడు తీక్షణ రూపం ధరిస్తున్నాడు. ఆ ప్రయాణీకుల ప్రవాహంలో మేం కూడా, వంతెన దగ్గరకు నడుస్తున్నాము.

వారం రోజులనుంచి నాకు ఒక్కరోజుకూడా పూర్తిగా విశ్రాంతి లభించలేదు. ఇప్పుడు నాకు ఆకలి, దాహం ఎక్కువ అయింది. వళ్ళు వేడిగా ఉంది. నేను తూలిపోతున్నాను.

నా కాళ్ళు తేలిపోతున్నాయి. ఊపిరి సలపడంకూడా కష్టమై పోయింది. నా తల తిరిగిపోతోంది. కాని మూర్ఛపోవలసిన ప్రదేశం కాదది! ఇంతలో ఒకావిడ నాకేసి తిరిగి రుస రుస లాడుతూ, తిట్టడం మొదలు పెట్టింది. అంతటితో నాకు కాస్త తెలివివచ్చింది. మిసెస్ లోహ్ నన్ను వెనక్కి లాగి, నా తరు ఫున ఆమెను క్షమార్పణ చెప్పింది.

గమ్యస్థానం దగ్గర పడుతున్నది. అల్లంత దూరాన ఆకాశంలో బ్రిటిష్ పతాకం రెపరెపలాడుతున్నది. ఆ దృశ్యం నాలోని నిరుత్సాహాన్ని మటు మాయం చేసింది. ఏదో నూతన చైతన్యం నాలో మేల్కొంది.

ఒక కేంటనీస్ స్త్రీ రక్షకభటురాలు నన్ను తనిఖీ చేయడానికి వచ్చింది. నేను అమాయకంగా ఆమె కేసి చూశాను. "నిన్ను నమ్మవచ్చు... వెళ్ళు" అంది.

ఇంతటితో నాకు నిజంగా విమోచన కలిగింది.

మిసెస్ లోహ్‌తో వంతెనమీద నడుస్తున్నాను. భయం పోయింది. ఇంతలో ఒక పోలీసు ఎక్కడికి వెడుతున్నా వని అడిగాడు. నేను ఇన్నాళ్ళుగా మననం చేసుకుంటూన్న జవాబును చెప్పాను.

మరొక హాంగ్‌కాంగ్ పోలీసువచ్చి మాకు మసూచి టీకాలు వేయించటానికి వరుసలో నిలబెట్టాడు. ఆ తర్వాత మాకు సర్టిఫికెట్లు యిచ్చారు. మేం కేంటిన్‌కి బయలు దేరాము. ఇంతలో మా వెనుక ఏదో గందరగోళం వినిపించింది. మిసెస్ లోహ్‌ను ఏం జరిగిందని అడిగాను "మనము ఆగోడవ పట్టించు

కోగూడదు. ఇలాంటివి ఎప్పుడూ ఉండేవే. మనం ముందు యిక్కడనుంచి బయటపడాలి" అంది.

కేటూన్ స్టేషన్‌లో రైలుదిగాము. స్టేషన్ హార్బర్‌లోనే వున్నది. బయట అడుగు పెట్టగానే, బ్రిటిష్ సైనికులు, ఎర్రటి రెండంతస్తుల బస్సులు, చిన్న కారులు, ఆంగ్లస్త్రీలు, నల్ల ముఖాల ఇండియన్ ఇన్‌స్పెక్టర్లు కనిపించారు.

మిసెస్ లోహ్ నవ్వుతూ "చివరికి వచ్చాం ఇక్కడికి. నిన్ను చూసి నీ ప్రియుడు ఎంత సంతోషిస్తాడో, మీ పెళ్ళికి నాకు శుభలేఖ వ్రాస్తావా ?" అంది.

ఆమెకు యిప్పుడు నిజం చెప్పగలిగాను. "నా ప్రియుడు ఎవరో నాకే తెలియదు" అన్నాను.

మిసెస్ లోహ్‌కు యీ మాట అర్థం కాలేదు. నేను దాన్ని వివరించలేదు. "మంచిది. ఉత్తరం వ్రాయి" చివరకు ఆమె అన్న మాటలు నా చెవుల్లో ప్రతిధ్వనిస్తూ ఉన్నాయి.

నేను నిజంగా గమ్యం చేరానా? హాంగ్‌కాంగ్ వచ్చానా? పచ్చటి పర్వత శ్రేణులపై తొంగి చూస్తూవున్న నీలాలనింగి, సముద్రం, బ్రహ్మాండమైనఓడలు, తెల్లటి పడవలు, చేపలవేటలు, అంతా స్వప్నంలాగా–ఒక సినిమాచూస్తున్నట్లు అనిపించింది. నా కళ్ళను నేనే నమ్మలేకపోతున్నాను. నేను నిశ్చలంగా కూర్చుని ఈచిత్రాలను చూస్తున్నాను.

నాకు ఎటువంటి ఉద్రేకమూ కలగలేదు. ఆనందంగానూ లేదు. అయితే కోపంగాని, విషాదంగాని, భయంగాని నాలో లేవు.

నేను అనుభూతులన్నింటికీ తిలోదకము లిచ్చానని మీరు అనుకోవచ్చు.

గతంలో అలిసిపోయిన నా ఆశయాలూ, ఆశలు ప్రకాశవంతములైన యీ సూర్యకిరణాలలో చెదిరిపోయాయి. కాని తార్కికదృష్టి మళ్ళీ తలెత్తుతున్నది. ఆశ చావలేదని చెబుతూ ఉన్నది. రహస్యంగా, ప్రశాంతంగా నేను ప్రేమించిన దానిని అది అన్వేషిస్తూ ఉన్నది.



# 17

## తుది పలుకు

నా కిటికీలోంచి చూస్తే వరుసలుగా నిలచిఉన్న పూరి పాకలు కనిపిస్తున్నాయి. అనేకమంది కాందిశీకులు అక్కడ ఉంటున్నారు. పగలంతా రణగొణధ్వనిగా ఉంటుంది. పోట్లాటలు, వాదోపవాదాలు, పిల్లలఅల్లరి, భోజనంకోసం, పాత బట్టలకోసం కీచులాడుకోవటం – సందడి కలిగించే అంశాలలో కొన్ని. రాత్రిపూట ఈ గందరగోళం కొంత మాటుమణిగినా, దుర్గంధపూరితమై వీచేగాలి డోకువచ్చేలా ఉంటుంది. పైటాకూ, పుస్తకాల వాతావరణానికీ చాలాదూరంగా ఉన్నాను. ఇదే నిజమైన ప్రపంచం. ధూళి ధూసరితమైన ధరిత్రి. నా జీవితంలో ఎన్నడూ ఇటువంటి ప్రపంచంలో నివసించటానికి సిద్ధపడలేదు.

రాత్రిపూట కిరోసిన్ దీపం వెలిగించేదాన్ని. ఆ మసక వెలుతురులో నేను వ్రాసేకాగితంగాని చదివేపుస్తకం వచ్చగా కనిపించేవి. వత్తి కాలటంవల్ల వచ్చే వాసన, బయటిగాలి దుర్గంధంకంటె నయంగానే ఉంది. విషాదంతో, ఆధ్యాత్మిక భావపరంపరలతో నిండిన గీతమాలికలను వ్రాయాలనిపించేది. కాని నేనుచేపట్టిన కార్యం వేరు. నా కర్తవ్యం వేరు. అందువల్ల నా కలం కొంచెంచురుకుగానే నడిచేది.

సాయంత్రం వ్రాతఅయ్యాక, దీపం కొండెక్కించి, బట్టలు మార్చుకొని, దుప్పటిలో దాక్కునేవాన్ని. వ్రాతబల్ల ప్రక్కగా ఉండేది నా పక్క. నేను కదిలినప్పుడల్లా అది కిర్రు మనేది. అపరిచితమైన ఈ మహానగరంలో, ఈ మాత్రం స్నేహితులు, గది, వ్రాతబల్ల, పక్క దొరకటం అదృష్టమే అని పించింది. నా స్నేహితులుకూడా, నా స్థితిలోనే ఉన్నారు. కాని నాకు మాత్రం పెకింగ్‌లోని నా గది తరచుగా గుర్తుకు వస్తూండేది. చదువుకుంటానికి విద్యుద్దీపం, మెత్తటిపక్క, బట్టలు దాచుకుంటానికి కప్‌బోర్డు, మొదలైనసౌకర్యాలుండేవి. ఈ పోలికతో ప్రస్తుత పరిస్థితి ఒకోసారి బాధాకరంగా ఉండేది.

కాందిశీకుని జీవితం ఎలా ఉంటుందో నీకు తెలుసా? ఒక అపరిచిత మహానగరంలో జన సముద్రాన్ని ఈదుకుంటూ నీకు తెలిసిన ఒకే ఒక గమ్యానికి పోవటం - అది దూరపు బంధువు ఇల్లుకావచ్చు - అక్కడ నీలాటి దురదృష్టవంతులు ఈ వరకే చాలామంది చేరి ఉంటారు. ఆ యింటి యజమాని సాంఘిక మర్యాదకోసం నిన్నాహ్వానించక తప్పదు. ఆ ఇరుకు కొంపలో ఒకమూల గదిలో నీకు చోటు దొరుకుతుంది. ఆ యింట్లో బిగ్గరగా మాట్లాడే ధైర్యంకూడా నీ కుండదు. కుర్చీలో సమంగా కూర్చుంటానికిగాని, వ్రాతబల్ల ఉపయో గించి వ్రాసుకుంటానికి గానీ నీకు సాహసం ఉండదు. చీకటి పడితేగాని స్వేచ్ఛగా శ్వాస ఆడదు. లోకుల దయార్ద్ర దృష్టులనుంచి తప్పించుకోలేవు. కాని మళ్ళీ తెల్లవారుతుంది! మళ్ళీ నువ్వు కాందిశీకుడవు!! ఉద్యోగం కోసం వెతుక్కో వాలి. కేంటనీస్ ఏమాత్రం రాని నీ అవతారంచూసి, వెంటనే

ఎవరో ఉద్యోగం ఇస్తారనే ఆశతో కాదు. కాని ప్రయత్నం చేయటం నీ విధి. సాయంత్రం యింటికి వచ్చాక, ఉద్యోగం నీకు మళ్ళీ దూరమైపోతుంది. ఇక ఆ నీ దూరపుబంధువుల్ని ఎలా చూడగలవు ?

ఇక ఎటువంటి స్నేహితులూ, బంధువులూ లేనివారిని గురించి ఊహించటమెలాగు ? వారి చేతిలో డబ్బులేనప్పుడు వారి స్థితి ఏమిటి ? ఎక్కడ ఉంటారు ? ఎక్కడ నిద్రపోతారు ? వీధిలో పడుకోవచ్చు. కాని పోలీసులు తడవ తడవకు లేపి అవతలకు గెంటుతూంటారు.

అనేకమంది ఆరోగ్యవంతులైన యువకులున్నారు. కాని వారికి ఉద్యోగాలు లేవు. కొందరు తాము ఎన్నడూ జీవితంలో చేయవలసి వస్తుందని కలలోగూడా ఊహించని పనులు చేస్తున్నారు. పెళ్ళిళ్ళలో భజంత్రీలను సమకూర్చుకొని, బాజాలు వాయింపించి, నాలుగురాళ్ళు వడుపుకుంటున్నారు. నా స్నేహితుడొకడు ఈ మేళంలో జేరాడు. మాసిపోయిన చెమికీకోటు వేసుకొని, ఆ మందలోగలిసి, ఆ బ్యాండ్ వాద్యంలో తానూ ఏవో ధ్వనులు చేస్తున్నాడు.

ఇంతకీ ఇటువంటి బాజా భజంత్రీలకు అనవరతం పని కల్పించటానికి అంత తరచుగా హాంగ్‌కాంగ్‌లో వివాహాలూ, శార్థాలూ జరగవాయెను. కొందరు పత్తి ఫ్యాక్టరీలలో కూలీలుగా చేరారు. కొందరు అగ్గిపెట్టెలు చేసేవారు. మరి కొందరు చెప్పుల పనులు చేసేవారు. ఇవేవీ దొరకనివారు ఎంగిలిసిగరెట్లన్నీ ఏరి, చౌకరకపు సిగరెట్లను పునఃసృష్టించి పొట్ట పోసుకునేవారు.

ఈ కాందిశీక జీవితాన్ని సాధ్యమైనంత అంధకార బంధురంగా చిత్రించటం నా అభిప్రాయం కాదు. చాలామంది ఉన్నదానిలో ఉన్నంతగా ఆ యా పరిస్థితుల కనుకూలంగా జీవితాన్ని సుఖంగా గడపటానికి ప్రయత్నించి, స్థిరపడుతున్నారు. కొందరు కొంచం ముందుకుపోయి గుమాస్తాలుగానూ, ఉపాధ్యాయులు గానూ, ఉద్యోగాలు సంపాదించుకుంటున్నారు.

మరి మిగిలిన మాలాటివారిగతి? మాలాంటివారందరం క్రమంగా ఒకచోట జేరుతున్నాం. ఇంకా కాదిశీకులని పిలుపించుకోవటం మాకు యిష్టంలేదు. కమ్యూనిస్టులదగ్గర మేం ఏం నేర్చుకున్నా ఏం నేర్చుకోకపోయినా, అన్ని శక్తులను కేంద్రీకరించి, ఒక పని నిర్వహించటం ఎలాగో నేర్చుకున్నాం. మా మాదిరి ఆలోచనలు గలవారందరం ఒక సంఘంగా ఏర్పడ్డాము. అది నాడు బలంగా లేకపోయినా, నేడు శక్తిమంతమైంది. మేం రెండు ఆశయాలు పెట్టుకున్నాం, ఒకటి మా స్నేహితులకు కావలసిన సహాయం చేసుకోవటం. రెండు శక్తిమంతమైన ఒక కార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకొని, మాతృదేశంలోని పరిస్థితుల్ని మార్చటానికి యత్నించటం.

ఇంతవరకూ మేం అనేక పుస్తకాలు పత్రికలూ కరపత్రాలూ వ్రాసి ప్రకటించాము. ఇంకా సంఘంలోని తదితర వర్గాలతో పరిచయం సంపాదిస్తున్నాం. మేం ప్రాథమికదశ నుంచి మొదలుపెట్టిన ఈ కార్యక్రమం సక్రమమైనదనే మా నమ్మకం. చైనాలో జరుగుతున్న సంఘటనలనూ, మారుతున్న స్థితిగతులనూ, కమ్యూనిస్టులు నేటికీ ఏ విధంగా యింతమంది

సోదరులను నమ్మించి మోసం చేయగలుగుతున్నదీ, గ్రహించటం మా కార్యక్రమం.

కమ్యూనిస్టుల ప్రచారంలోని మూలసూత్రమేమిటి? దాని విజయంలోని మర్మమేమిటి? వారెలా అధికారంలోకి వస్తున్నారు? ఎలా నిలబెట్టుకుంటున్నారు? ఈ ప్రశ్నల్లో కొన్నింటికి సమాధానాలు వెంటనే స్ఫురిస్తాయి. కొన్నింటికి పరిశీలించాలి. ఈ పరిశీలనల తర్వాతగాని మా భావి కార్యక్రమం నిర్ణయంకాదు.

నేను ఈ సంఘంలో జేరిన నాటికే, ఈ పరిశీలనలు ప్రారంభమయాయి. నాగది ప్రక్కనే ఒక గదిలో ఒక అమ్మాయి ఉండేది. ఆమె గదిలో సగంభాగం వరకూ, చీనావార్తా పత్రికల పాత ప్రతులు పేర్చబడ్డాయి. మా ప్రాథమిక పరిశోధనా కేంద్రం ఇదే. ఆ వార్తా పత్రిక లాధారంగా కమ్యూనిస్టులు దేశంపేరిట చేసిన అమానుష కృత్యాలను 1,45,000 వరకూ ఏరి పెట్టాము. ఇంతకీ కమ్యూనిస్టులు చెప్పేదేమిటి? వారు చేసిన భూ సంస్కరణలను గురించి, వారు తెచ్చిన మానసిక చైతన్యం గురించి, వారు పరిమార్చిన విప్లవ విరోధులను గురించి! మరీ తప్పులు జరిగినప్పుడు, గోల జరిగినప్పుడు, క్రిందటి ఉద్యోగులను బాధ్యులని చెప్పి, చర్య తీసు తీసుకునేవారు. అంతటితో పెకింగ్‌లోనినాయకుల బాధ్యత తీరిపోయేది. కమ్యూనిస్టుల పాలనలో విద్యారంగంలో అసంఖ్యాకాలైన తప్పిదాలు జరిగాయి. చివరకు దేశంలోని విశ్వవిద్యాలయాల ప్రతి పత్రిలోనే మార్పు వచ్చింది. 15 వ అఖిలచైనా

విద్యార్థి ప్రతినిధి సంఘ సమావేశంలో ఒక తీర్మానం ఆమోదించబడింది. విద్యార్థులను ఉన్నతంగా, ధృఢంగా, కమ్యూనిస్టు మనస్తత్వం గలవారిగా తయారుచేయటం విశ్వ విద్యాలయాల కర్తవ్యమని, నిష్కర్షగా చెప్పబడింది. విశ్వవిద్యాలయాలలోని ప్రొఫెసర్లందరూ, మనుగడ సాగించటంకోసం తామిన్నాళ్ళుగా, ఇన్నేళ్ళుగా సాధించిన ఆలోచనలకూ, అనుభవాలకూ తిలోదకాలివ్వవలసి వచ్చింది. విమోచన జరిగిన మొదటి రెండు సంవత్సరాలలో, పాత పద్ధతులను పరిత్యజించి నూతన విధానాన్ని అంగీకరించటానికి ఉపాధ్యాయులు ముందుకు రాకపోవటం కమ్యూనిస్టు నాయకులకు ఆందోళన కలిగించింది. విద్యాశాఖ ఉపమంత్రి దీన్ని గురించి ఒక ప్రకటన కూడా చేశాడు.

"ఈ రెండు సంవత్సరాలలో ప్రొఫెసర్లలో మార్పు చాలా మందకొడిగా మాత్రమే జరుగుతున్నది. ఇందువల్ల విద్యావిధానంలో సంస్కరణలు ప్రవేశపెట్టటం సాధ్యంకాదు."

దీనిఫలితంగా అనేకమంది ప్రొఫెసర్లు క్రమంగా తమ వైఖరిని మార్చుకుని, పాతపద్ధతులకు సంస్థలకు వ్యతిరేకంగానూ విప్లవానికి అనుకూలంగానూ చేయవలసివచ్చింది.

ప్రభుత్వ విధానాలకు వ్యతిరేకంగా ప్రవర్తిస్తున్నట్లు పైటా ప్రొఫెసర్లమీదకూడా నేరారోపణలు చేయబడ్డాయి. ఫిజిక్స్ చదువుతున్న ఒక విద్యార్థిని సైనికశిక్షణ కళాశాలలో చేరమని ప్రభుత్వం ఆదేశించినపుడు–ఒక ప్రొఫెసర్ ఆ విద్యార్థితో "గణితశాస్త్రంలో నీకు ప్రజ్ఞ ఉందిగనుక, ఇంకా అందులోనే పైకి చదవటం మంచిది" అని సలహా చెప్పాడట.

ఇంకా అనేకమంది ప్రొఫెసర్లు తమ విద్యార్థులకు "మీరెలాగో చదువులో బాగా ప్రజ్ఞకలవారు, సైనికకళాశాలల్లో చేరకండి" అని సలహా యిచ్చారు. ఇంకా ధైర్యంకల మరొక ప్రొఫెసరు ఒక విద్యార్థితో "నిన్ను ప్రభుత్వం సైనిక కళాశాలకు ఎన్నుకోవటం చాలా దురదృష్టం" అని చెప్పాడు.

చైనాలోని ఒక అధికార పత్రిక, బాగా తెలివితేటలు గల విద్యార్థులకు శిక్షణ నివ్వటానికై తమశక్తియుక్తులను కేంద్రీకరించవలసిన అవసరం లేదని ప్రొఫెసర్లను హెచ్చరిస్తూ ఒకానొక ప్రొఫెసర్‌ను ఈవిధంగా విమర్శించింది. ఆప్రొఫెసర్ విశ్వవిద్యాలయ ద్వారానికి కావలసిన నమూనాను తయారు చేయుమని ఒక విద్యార్థిని కోరాడు. కాని అతడు తయారుచేసిన అనేక నమూనాలు ప్రొఫెసరునకు నచ్చలేదు. కారణం అవి నిరాడంబరంగానూ, సులభసాధ్యాలుగానూ ఉండటమే. వీటికి బదులుగా అతనికొక చిత్రం వచ్చింది. అది భావోద్బోధకంగా రచించినదట. విద్యార్థికి కావలసింది భావోద్బోధక శక్తి మాత్రమేనని ఆప్రొఫెసర్ ఇంకా భ్రమపడుతున్నాడేమో "ఈ భావనాశక్తి అనేది విద్యార్థిని తికమకపెట్టి, అసాధ్యమై, ఆచరణ సాధ్యంకాని పగటికలలతో నిండిన జీవితాన్ని గడిపేలా తయారుచేస్తుంది."

ఈ మానసిక సంస్కరణోద్యమం ప్రొఫెసర్లపై ఎలా పనిచేసిందో, నే నింకా వివరించలేదు. 1949 పతనంతో ఇది పెకింగ్‌లో ప్రారంభించబడింది. నగరంలోని విశ్వవిద్యాలయాలను తమఉద్యమానికి ప్రయోగశాలలుగా వారు భావించారు.

1951 సెప్టెంబరు 29 వ తేదీన ప్రధాని చౌ ఎన్‌లై పెకింగ్‌లోని విశ్వవిద్యాలయాల ప్రొఫెసర్లందరినీ సమావేశ పరచి అయిదుగంటలసేపు సుదీర్ఘమైన ఉపన్యాసంచేశాడు. పైటా అధ్యక్షుడు ఒక వ్యాసం వ్రాస్తూ ప్రధాని ఉపన్యాసం విసుగుకలిగించలేదని వివరించాడు. నవచైనా వార్తాసంస్థ అందించిన సమాచారంప్రకారం మూడువేలమంది ప్రొఫెసర్లు వెంటనే సమావేశమయ్యారు. నవంబరు 12 నాటికి వీరిసంఖ్య 6,188 వరకూ పెరిగింది. వీరి మొదటి కర్తవ్యం ప్రధాని ఉపన్యాసాన్ని పరిశీలించటం. (ఇది ఏ పత్రికలోనూ యింకా ప్రకటించబడ లేదు) రెండవది అందలి సమస్యలను పరిశీలించటం. ప్రొఫెసర్ల తరవాత కర్తవ్యం, (యిప్పుడు వారు విద్యార్థులే) యిప్పటి సమస్యలగురించి ప్రభుత్వోద్యోగుల రిపోర్టులను పరిశీలించటం, మార్క్సు, లెనిన్ సూత్రాలనూ, చైనా విప్లవాన్నిగురించి మావోసేటుంగ్ సిద్ధాంతాన్ని అవగాహనచేసుకోవటం; బూర్జువా సిద్ధాంతాలలోని తప్పిదాలను గ్రహించటం.

ఉపాధ్యాయు లిప్పుడు కొత్తగా నేర్చుకొనేది ఏమీ లేదు. చిలుకల్లా వాటిని పదేపదే వల్లెవేయటం, తోటివారు వల్లెవేస్తుంటే వినటం, అందరూకలసి కళాశాలల్లో మళ్ళీమళ్ళీ వెళ్ళగ్రక్కటం. ఇంతే, ఈ ఉద్యమంలో అయిదవ ఆత్మపరీక్ష. ప్రొఫెసర్లు తోటివారిముందు, విద్యార్థులముందు, తమకింత వరకూ గల తప్పుడు అభిప్రాయాలను అంగీకరించటం. ప్రొఫెసర్లను తలవంచునట్లు చేయటాని కిది తోడ్పడుతుంది. తోటివారి ముందాతడు, తను స్వార్థపరుడనని, కార్మికులపై గౌరవం లేక, పాశ్చాత్యరాజ్యాల సామ్రాజ్య తత్వాన్ని

ఆరాధించానని, విద్యార్థుల దేశభక్తిని అణచ యత్నించానని, ఘనమైన రష్యాను విమర్శించానని, విషతుల్యమైన బూర్జువా సిద్ధాంతాలతో తన మనస్సు కలుషితమై ఉన్నదని, అంగీకరించాలి. ఆ పిమ్మట అందరిముందూ తలవంచి, వినయంతో, తాను పశ్చాత్తాపుడైనట్లు, ఇకముందు పార్టీయందు వినయ విధేయతలు కలిగిఉంటానని ప్రమాణం చేయాలి. ఈ అవమానం అందరికీ జరిగింది. అనేకసార్లు జరిగింది. ఈ కర్మకాండతో, జీవితమంతా కష్టించి వారు స్థాపించుకున్న వ్యక్తిత్వం కూలిపోతుంది. ఇవి ఘాటుమాటలే కావచ్చును. కాని 1952 వేసవిలో, కమ్యూనిస్టు వార్తా పత్రికలలో, ఈ విధంగా పశ్చాత్తప్తులైనట్లు ప్రకటింపబడిన గౌరవనీయులైన ఉపాధ్యాయుల పేర్లు చూసినప్పుడు, ఏ విద్యార్థికైనా ఇదే అభి అభిప్రాయం కలుగుతుంది. ఏ మేధావులవల్ల, పైటా చరితార్థమైందో, వారియెడలనే వల్లమాలిన జాలి కలుతుంది! 1952 జూలై 1 వ తేదీనాటి కాంగ్ మింగ్ డైలీ న్యూస్ పత్రికలు లా కాలేజి ప్రొఫెసర్ డీన్ చిన్ టు ఆన్ హెంగ్ ఏం వ్రాశాడో చూడండి.

"కమ్యూనిస్టుపార్టీ నాకు జ్ఞానోదయం కలిగించింది. నేను ఇన్నాళ్ళూ మితిమీరిన అహంకారంతో ఉన్నాను. ఇప్పుడు కళ్ళుతెరచి, ప్రజాప్రభుత్వంలో ఆచార్యవృత్తిని స్వీకరిస్తున్నాను. చైర్మన్ మావో, కమ్యూనిస్టు పార్టీల ఆశీస్సులు అమోఘమైనవి. నా వ్యాధిని రూపుమాపి, నా ఆత్మను పునీతం చేసిన గౌరవం పార్టీకి, చైర్మన్ మావోకూ చెందుతుంది. నాకు జ్ఞానోదయం కలిగి ప్రజలకు సేవచేసే

మార్గం కనిపించింది. దీనికి ప్రతిగా నేను, మార్క్స్, లెనిన్, చైర్మన్ మావోల సిద్ధాంతాలు జాగరూకతతో పఠించి, కళా శాలలను సక్రమంగాసంస్కరించి, నా ఋణం తీర్చుకుంటాను. బ్రహ్మాండమైన, ఘనమైన, సక్రమమైన మన కమ్యూనిస్టు పార్టీ చిరకాలం వర్ధిల్లాలి.”

గౌరవనీయులైన ఈ మేధావులందరూ, ఇటువంటి ఆత్మ పరీక్షలను ఎందుకు చేసుకోవలసి వచ్చింది? వీరు కమ్యూనిస్టు పార్టీకి ఎలా తల వంచారు? 1952 మార్చి 24 నాటి, హాంకాంగ్ లోని చాంగ్‌చియాంగ్ డైలీ న్యూస్‌పత్రిక చూడండి. దక్షిణ మధ్య ప్రాంతంలోని ఉపాధ్యాయులకు కనువిప్పు కల్గించటానికి హ్యూనన్ విశ్వ విద్యాలయాధ్యక్షుడు, ఒక వ్యాసంలో, మనో భావ సంస్కరణోద్యమం రోజుల్లో పెకింగ్‌లో జరిగిన పోరాటాన్ని ఈ విధంగా వివరించాడు.

ఈ పోరాటంలో, జాతీయ నిర్మాణానికి, కొందరు ప్రముఖులైన ఉద్యోగులు, ఉపాధ్యాయులు, కంటకప్రాయు లైనారు. దీని ఫలితంగా వారు తమ పరువు ప్రతిష్టల సంగతి మర్చిపోయి ఆత్మ విమర్శ చేసుకోవలసివచ్చింది. చాలామంది అధ్యక్షులు, కళాశాలాధికారులూ, వివిధ శాఖాధిపతులు, ఉపన్యాసకులు, ప్రజల సమక్షంలో ఆత్మపరీక్షలు చేసుకున్నారు. తమ అహంకారాన్ని, బూర్జువాతత్వాన్ని ఖండించుకున్నారు. ప్రజలు వీరి ఆత్మపరీక్షలను అంగీకరించారు. కొందరు అనేక సార్లు ఇటువంటి ఆత్మపరీక్షలు చేసుకోవలసివచ్చింది.

మరోకథ వినండి. యన్‌చింగ్ విశ్వవిద్యాలయంలో జరిగింది. 1952 విశ్వవిద్యాలయాన్ని రద్దుచేశారు. ఇందులోని

అధ్యాపకులనూ, విద్యార్థులనూ ఇతర పాఠశాలల్లోకి తరలించారు. షంగాయ్‌లోని సెయింట్ జాన్ విశ్వవిద్యాలయం, కేంటర్‌లోని అంగాన్ విశ్వవిద్యాలయం, మొదలైన విదేశీ జోక్యం కల సంస్థలుకూడా నిర్మూలించబడ్డాయి. 'అవినీతి, దూబరా, బూర్జువాతత్వాలను నాశనం చేయటంకోసం,' ఒక ఉద్యమం లేవదీయబడింది. 1951 లో యాంచిగ్ విశ్వవిద్యాలయంలోకూడా ఈ ఉద్యమం వ్యాపించింది. పాఠశాల అధికారులు పరీక్షలను అప్పటికి రద్దుచేసి, విద్యార్థులు తీవ్రంగా ఉద్యమంలో పాల్గొనే అవకాశం కల్పించారు.

పాఠశాలలోని గుమాస్తాలు, చిన్నతరగతి ఉద్యోగులు ఈ ఉద్యమానికి ముందు బలిఅయూరు. ఇందు ప్రతి వ్యక్తి పాల్గొనాలి. తప్పించుకున్నవారికి కఠినమైన శిక్ష విధించబడుతుంది. ఈ లోగా నూతన నైతిక విలువలతో, దేశభక్తితో నిండిన విద్యార్థులను తయారుచేయటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఎక్కువ గౌరవ ప్రాభవాలుగల ప్రొఫెసర్లపై ముందుగా వారి దృష్టి ప్రసరించింది.

"అమెరికన్ సామ్రాజ్యవాదుల సారస్వత దురాక్రమణ" అనే పేరుతో, ఒక ప్రచారం అన్ని తరగతుల్లోనూ జరుపనారంభించారు. బూర్జువా వ్రాతలు వ్రాసినవారి పేర్లు వారి వ్రాతలూ ప్రదర్శింపబడుతున్నాయి. రక్షకభటులు ఈ ప్రదర్శనల దగ్గరకు విద్యార్థులను తీసుకుపోయి ఉద్రేకపూరితంగా ఉపన్యాసా లిచ్చేవారు. ప్రొఫెసర్ల వ్యక్తిగత లోపాలను గూడా బహిరంగ పరచేవారు. ఆ పిమ్మట నిందితులైన ఉపాధ్యాయులను ప్రదర్శనాలదగ్గరకు తీసుకువచ్చి

అవమానించేవారు. ప్రొఫెసర్ చాంగ్ టిన్ సన్ పదిసంవత్సరాల క్రితం "ఫాసిజమ్, కమ్యూనిజమ్‌ల మధ్య ఏది కావాలో కోరు కోమంటే, ఉరితీసి చంపటానికీ తుపాకీతో కాల్చి చంపటానికీ మధ్య ఎన్నికగా దాన్ని నేను భావిస్తాను" అని వ్రాశాడు. ఈ వ్రాత ప్రతి గోడకు వ్రేలాడకట్టారు. ప్రొఫెసర్ చాంగ్‌ను దానిక్రింద నిలబెట్టి కేకలు పెట్టించి అవమానించారు.

ప్రజా సమావేశాలంటూ ఏర్పాటుచేసి, బహిరంగంగా తమ తప్పిదాలను అంగీకరించమని, అధ్యాపకులను వత్తిడి చేయసాగారు. అంతర్విశ్వ విద్యాలయ సమావేశంలో ప్రొఫెసర్లు నిలబడేవారు. కొందరు ప్రగతిశీలురైన విద్యార్థులు వారిపై నేరారోపణలు చేసేవారు. అధ్యాపకులు వాటిని ప్రాథమికంగా అంగీకరించేవారు.

యంచింగ్ అధ్యక్షుడు డాక్టరు లూచీపీ – మొదట ఈ ఉద్యమాన్ని చూసి ఏమంత కలవరపడలేదు. కాని తన్ను కూడా పరీక్షకు పెట్టటానికి ప్రయత్నాలు జరుగుతున్నాయని ఒక మిత్రుడు ఆయనకు రహస్యంగా చెప్పాడు. తన ఆఫీసు కాగితాలన్నీ పంపమని వెంటనే గుమాస్తాకు ఫోనుచేశాడు. కాని, అప్పటికేవాటన్నింటినీ రక్షకభటులు స్వాధీనంచేసుకున్నారు. కాని కమ్యూనిస్టులు తన్ను మొదటనుంచీ గౌరవంగా చూడటం, పరీక్షలు జరుగుతున్నప్పుడు, తన్ను కమ్యూనిస్టులు వేదికమీద కూర్చోబెట్టటం, వీటన్నింటివల్ల అతడు ఎక్కువ కంగారు పడలేదు. యాంచింగ్‌లోని వేదిక అతనికి చిరకాలపరిచితమైనది. అదే తన ఉరికంబమౌతుందని ఆయన గ్రహించలేదు.

తనవంతురాగానే, కొంచెం హాస్యంతో, "నేను నా కొడుకు వివాహానికి రెండుప్రాలగుత్తులు తీసుకుని, తిరిగియివ్వటం మర్చిపోయిన మాట నిజమే. ఆ విధంగా నేను ప్రజల సొత్తును స్వంత వినియోగానికి ఉపయోగించుకున్నాను" అన్నాడు. ఈ మాట విద్యార్థులకు బాగానేఉంది గాని, డాక్టర్ లూకు ముప్పు తెచ్చిపెట్టింది. వెంటనే రక్షకభటులు, ఆతన్ని ఖండించి, దుయ్యనాడి రమ్మని కొంద రధ్యాపకులను వేదిక మీాదకు పంపించారు. డాక్టర్ లూ, అమెరికన్ల తొత్తుగా ఎలా ప్రవర్తించాడో, విద్యార్థులను నైతికంగా, మానసికంగా ఎలా హత్యచేశాడో వివరించారు. డాక్టర్ లూ, పాలిపోయాడు. నోట మాటరాలేదు. తనదగ్గర పనిచేస్తూ, తనకు విశ్వాసపాత్రులైన వారే ఈ విధంగా మాట్లాడటంతో, డాక్టర్ లూకు ఆత్మవిశ్వాసం పూర్తిగా నశించింది.

తన నేరాలను అంగీకరిస్తూ వాఙ్మూలం వ్రాయటం కోసం డాక్టర్ లూ ఏకాంతంగాని ఒక గదిలో ప్రవేశపెట్టారు. ఆయన కుమార్తె లూయాహోను, కమ్యూనిస్టులు వశపరచుకున్నారు. ఎలాగో, ఆమెచేతనే, తండ్రిమీాద నేరాలుచెప్పించటానికి ఒప్పించారు. ఆమె ఇందు కెలా అంగీకరించిందో తెలియదు. బహుశా, ఆమెకు రక్షణ కల్పిస్తామనీ రక్షకదళంలో జేర్చుకుంటామనీ, కమ్యూనిస్టులు వాగ్దానం చేసి ఉంటారు. బహిరంగంగా ప్రజలముందు, ఆమె నిలబడి తండ్రి కన్నుల్లోకి సూటిగా చూస్తూ "నువ్వు ప్రజాద్రోహివి." అంటూ నిందించింది. ఈ దెబ్బతో డాక్టర్ లూ పూర్తిగా లొంగిపోయాడు. నాలుగు పెద్ద సమావేశాల్లో తన, తప్పిదాలను అంగీక

రించాడు. ఆ తర్వాత అతన్ని ఉద్యోగంనుంచి తొలగించారు. మరెన్నడూ అతనెక్కడా ఎవరికీ కనిపించలేదు.

ప్రొఫెసర్లందరూ ఈ విధంగా సంస్కరించబడ్డారు. ఆ తర్వాత రక్షకభటులు విద్యార్థులతో "కామ్రేడ్స్! ప్రొఫెసర్లను సంస్కరించటంలో మీరు చాలా కట్టుదిట్టంగా పని చేశారు. మరి మీమాటేమిటి? మీరుకూడా సూటిగా ప్రవర్తించాలి గదా?" అన్నారు.

పన్నెండుగురు చొప్పున విద్యార్థులను గుంపులు గుంపులుగా చేశారు. ప్రతి విద్యార్థీ తన ప్రక్కనగల విద్యార్థిచేత తప్పిదాలను అంగీకరింప చేయాలి. ఇలా ఒక గొలుసులాగా ఈ తతంగం జరిగేటట్లు ఏర్పాటు చేయబడింది. తమ స్నేహితులూ, బంధువులూ, చేసిన ప్రజాద్రోహాలను కూడా ప్రతి విద్యార్థి వ్రాసియివ్వాలి.

ఈ ఉద్యమం చాలా నెలలు జరిగింది. ఉదయం 8 గం॥ల నుంచి, మధ్యాహ్నం 1 గం॥ వరకూ, 2 గం॥ నుంచి 6 గం॥ల వరకూ, మళ్ళీ, 6 గం॥ నుంచీ, రాత్రి 12 గం॥ల వరకూ జరిగే మూడు సమావేశాలకు విద్యార్థులు హాజరయేవారు. నా స్నేహితురాలికి వంట్లో బాగుండక సెలవుపెట్టింది. ఆ సెలవు దరఖాస్తు మొదట తమశాఖకు అధిపతిఅయిన విద్యార్థి చూడాలి, ఆనక అధ్యక్షుడైన విద్యార్థి చూడాలి. తరువాత విద్యార్థి నాయకుడు చూడాలి. చివరకు పాఠశాల ఆఫీసుకు అది చేరింది. వారు ఆమెకు మూడుగంటల సెలవు మంజూరు చేశారు. ఉద్యమం జరుగుతున్నదనే విషయం ఎవరూ మర్చిపోకూడదు. లౌడ్‌స్పీకర్లు పెట్టి, నేరారోపణలు – అంగీ

కారాలు – చెప్పుతూండేవారు. అనేకమంది విద్యార్థులు ఆత్మ హత్యలకు ప్రయత్నించ సాగారు. కొందరికి మతి స్థిమితం తప్పింది.

ఈ ఉద్యమపు చివరిరోజుల్లో, అంటే 1952 వసంతకాలం చివరిభాగంలో, గౌరవనీయులైన అతిథులు కొందరు యూంచింగ్ వచ్చారు. కోరియా యుద్ధంలో అమెరికన్లతో పోరి, గాయ పడిన వాలంటీర్లు వారు ఈ పీసులందరకు చక్కటి వసతి ఏర్పాటు చేశారు, పాయిఖానాలు, స్నానాగారాలు అన్నీ ఇచ్చారు. కాని వాళ్ళకివి అవసరం లేకపోయాయి. వారందరూ పల్లెలనుంచి వచ్చినవారు. దీని ఫలితంగా ఎక్కడపడితే అక్కడ మైలచేసి, శుభ్రంగా ఉంచవలసిన ప్రదేశాలనుకూడా ఖరాబు చేయడం మొదలుపెట్టారు. విదేశసాహిత్యం భాషలు చదువు తున్న చియాంగ్ అనే విద్యార్థి, తన స్నేహితురాలితో కలసి షికారులు బయలుదేరి, ఒక తోటలో ఆగి, ఒక బెంచి మీూద కూర్చున్నాడు. ఆమె కూర్చుంది. వళ్ళూ బట్టలూ ఖరాబు అయిపోయాయి అతనికి చిరాకుకలిగి, తీవ్రంగా ఇటు వంటి చర్యలను ఖండిస్తూ ఒక ప్రకటన చేశాడు. అందులో ఇందుకు ముగ్గురు కారకులు కావచ్చునని సూచించాడు. ఒకటి ఈ పని కుక్కలు చేసి ఉండవచ్చు కాని అందుకంత అవకాశం లేదంటూ; కుక్కల సంఖ్య ఆకస్మికంగా పెరగలేదనీ, ఉన్న కుక్కలైనా ఇప్పుడు కొత్తగా ఇటువంటిపనులు ప్రారంభించా యనటానికి వీలులేదనీ వాదించాడు రెండు: ఈపని నేషనలిష్టు ఏజంట్లు చేసిఉండవచ్చు. కాని వారు బాంబులు వదలాలని అనుకుంటారుగాని, ఇటువంటి ఖరాబులవల్ల ప్రయోజనం

ఉంటుందని అనుకోరు. మూడు: ఈ పని అతిథులు చేయా వచ్చు — ఈ మూడో విషయాన్ని సూచించటానికి అతడు కొంత తటపటాయించాడు.

ప్రజల కోసం ఇంతగా పోరాడిన అతిథులను నిందించటం ఎవరి అభిప్రాయమూ కాదనీ, వారు ముందు ముందు జాగ్రత్తగా ఉండటానికి మాత్రమేననీ చియాంగ్ వివరించాడు. ఈ ప్రకటనను రాత్రికి రాత్రి అందరికీ కనిపించటానికి వీలుగా ఒక గోడకు అంటించాడు. అతిథులీమాట విని మండిపడ్డారు. తమ నింతగా అవమానించినందుకు తక్షణం అక్కడనుంచి వెళ్ళిపోవాలని నిశ్చయించుకున్నారు. దీనికి కారకులైన వారందరినీ పట్టుకొని క్షమార్పణలు చెప్పించిచారు. వీరందరూ తమ తప్పిదాలను అంగీకరించి పశ్చాత్తప్తులైనట్లు ప్రకటించారు. అతిథులప్పటికి సంతృప్తిచెంది, అక్కడ మరో నాలుగురోజులుండటానికి అంగీకరించారు.

కాంగ్‌మింగ్ డైలీ న్యూస్ నుంచి మరొక ఉదంతం. 1952 జూలై 8వ తేదీన 1934- నుంచి పైటాలో ఉపాధ్యాయుడుగా వుంటూ, ప్రస్తుతం చైనా సైన్స్ అకాడమీకి చెందిన సంస్థలో అధ్యక్షుడుగా వుంటూ, దేశంలోని విఖ్యాత పురుషులైన పండితులలో ఒక్కరని పేరుగాంచిన డాక్టర్‌లో, తన తప్పిదాలను అంగీకరిస్తూ పశ్చాత్తాపాన్ని ప్రకటించాడు. తన స్వార్థాన్ని, అహంభావాన్ని, ఖండించుకుంటూ, వీటికి కారణం, పతనమైపోతున్న భూస్వామిక వర్గానికి చెందిన మంచూ కుటుంబంలో తను జన్మించటమూ, బూర్జువాసంఘంలో పెరగటమూ అంటూ వివరణ చెప్పుకున్నాడు.

ఆ పిమ్మట తాను చేసిన నేరాలనుగురించి వ్రాసుకున్నాడు. "భాష - సంస్కృతి" అనే విషయమై తాను వ్రాసిన గ్రంథం, బూర్జువాతత్వానికి చెందినదనీ, విదేశీయులు నిర్వహించిన సాహిత్యం - చారిత్రక సంఘ సమావేశాలకు తాను హాజరైనమాట నిజమేననీ, కొరియా సహాయ కార్య క్రమంలో పాల్గొనమని కోరినప్పుడు, 'మాపై ఎవరైనా దండయాత్ర చేస్తేగాని, వారిపై మేం దాడిచేయం' అంటూ మానోమాటలు ఉల్లేఖించి, అందు పాల్గొనటానికి తాను నిరాకరించినట్లు, విదేశీయులను తన వుపన్యాసాలు వినటానికి ఆహ్వానించినట్లూ - చెప్పుకున్నాడు డాక్టర్ లో.

నేను వచ్చేసింతరువాత చీనా విశ్వవిద్యాలయాలలో ఇంతవరకు జరిగిన సంఘటనల స్వరూపాన్ని వీలున్నంతవరకూ స్థూలంగా చిత్రించటానికి ప్రయత్నించాను. ఇవన్నీ వివరంగా వ్రాయా లంటే ఒక గ్రంథమౌతుంది. నేనిప్పుడు గ్రంథం ముగిస్తున్నానుగాని ప్రారంభించటంలేదు. ఇప్పటి ప్రశ్నల్లా మాకు సంభవించిన విపత్తును తొలగించటం ఎలా? అనేది.

ఈ ప్రశ్నకు సరైన చక్కటి సమాధానం ఇంతవరకూ మాకు దొరకలేదు. నాయకత్వం ఎవరు వహించాలి? అన్న ప్రాథమిక సమస్య ఉండనే ఉంది. మా యువతీయువకుల్లో గల ముఖ్యలోపం అనుభవంగల నాయకత్వం లేకపోవటమని మాకు తెలుసు. హాంగ్ కాంగ్ లో గల కమ్యూనిస్టు వ్యతిరేకులైన నాయకులను అనేకమందిని కలుసుకున్నాం. కాని వారిప్పుడు రాజకీయరంగంనుంచి విరమించుకున్నారు.

ఫార్మోజా-అందున్న జాతీయప్రభుత్వం మాట ఏమిటి? కమ్యూనిస్టులను నిర్మూలించదలచుకున్న చీనీయుడెవ్వరూ ఫార్మోజాను విస్మరించలేడు. గతాన్ని తల్చుకుంటూ జీవించటం మాకిష్టం లేదు. మేమింకా యౌవనంలో ఉన్నాం...ప్రజాస్వామ్యాన్ని వ్యక్తిస్వాతంత్ర్యాన్ని విమర్శను గౌరవించే నాయకత్వంకోసం మేం ఎదురుచూస్తున్నాం. విమర్శ అంటే 1947,48 సం॥లలోలో జరిగిన విషయాలనుగురించికాదు, 1953 ఆ పిమ్మట జరగవలసిన విషయాలను గురించినదై ఉండాలి.

ఫార్మోజాలో జాతీయ ప్రభుత్వం కొంత అభివృద్ధిని సాధించింది. కాని ఇంకా సాధించవలసింది ఎంతోవుంది. యువకులను బాగా ఆకర్షించి వారి అండదండలు సంపాదించటానికి, అవింకా ప్రయత్నాలు చేయాలి. కమ్యూనిస్టులకు చైనాపై అధికారం సంపాదించి, చెలాయింపజేస్తున్నది నావంటి యువతీయువకులే. గత నాలుగు సంవత్సరాలలోనూ కమ్యూనిస్టులు నిర్మించుకున్న అధికారాన్ని నిర్మూలించటం సులభసాధ్యంకాదు. కను చూపుమేరలోగల భవిష్యత్తులో మేం మాతృదేశం చేరలేము. కాని మా తరానికి చెందిన వారమే వారిపై పోరాటం సాగించాలి.

హాంకాంగ్‌లో ఉంటున్న పెద్దల్ని కొందర్ని నేను కలుసుకున్నాను. ఒక కుటుంబం విమోచనకు పూర్వమే షాంగాయ్‌నుంచి పారిపోయి, తగినంత డబ్బుతో, హాంకాంగ్ చేరుకుంది.

ఆ కుటుంబానికి చెందిన యువకుడొకడు మాసంఘంలో ఉన్నాడు. ఒకసారి అతన్ని కలుసుకుంటానికి వారింటికి వెళ్లాను.

అప్పుడే అతడు ఆటలాడి యింటికి వచ్చి స్నానం చేస్తున్నాడు. నన్ను అతని తండ్రి పరామర్శించాడు. మేం ఏం చేస్తున్నదీ ఎలా ఉంటున్నదీ అడిగాడు. నేను చెప్పాను. ఆయనకు కొంత ఆసక్తి కలిగింది. ఇంతలో నా స్నేహితుడు ఆలస్యానికి క్షమించమంటూ వచ్చాడు.

అతనితండ్రి "అది సరే! మీ స్నేహితురాలూ నేనూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటున్నాం. ఏదోఒకటిచేయాలని మీ యువకులంతా చాలాయత్నిస్తున్నారు. నిజానికి ఈ బాధ్యత మాతరానిది. కాని మేం చైనానుపోగొట్టుకున్నాం. మళ్ళీదాన్ని తిరిగి సంపాదించవలసిన బాధ్యతమాది. కాని మీరే ఈ కర్తవ్యమంతా నెత్తినవేసుకున్నారు." అన్నాడు.

ఆ మాటకు నా స్నేహితుడు "ఔనండీ! క్షమిస్తే, ఒక మాట నిజం. మీముసలివారి జవసత్వాలన్నీ ఉడిగిపోయాయి. ధైర్యసాహసాలూ లేవు" అన్నాడు

అతడు ఆ ప్రసంగాన్ని పొడిగిస్తూ "అంతేకాదు. ఇంకా అధ్వాన్నంగా వుంది. ముసలివారు కలసిమెలసి పని చేయలేరు. ప్రతివానికీ అహంభావం ఎక్కువ. ఆత్మ విశ్వాసం తక్కువ. అనుమానాలతో, తాను నాయకత్వం వహించాలే గాని, అనుచరుడుగా ఉండరాదనే దురభిమానం తో ఉంటారు" అన్నాడు.

నేను ఈ ఆరోపణలను సర్దటానికి యత్నిస్తూ "మాకు ఇప్పుడు కావలసింది అనుభవంగల నాయకత్వం. అదిలేకుండా మేం చేయగలిగిందేమీ లేదు" అన్నాను.

నా స్నేహితుని తండ్రి ఇందుకంగీకరిస్తూ "నిజమే. ఈ పనిలో అత్యంత క్లిష్టమైన బాధ్యతను యువకులే భరించాలి. ఎప్పుడో ఒకప్పుడు కమ్యూనిస్టులను మనం తరగద్రోయవచ్చు అనే నా నమ్మకం. కాని మావో సైన్యాన్ని, పోలీసులనూ జయించటం కంటె, కొత్త చైనాను నిర్మించటం కష్టతరమైన కర్తవ్యం. ఇది చాలా చాలా కాలం పట్టవచ్చు. ఇది సాధింప బడేదాక నేను జీవించకపోవచ్చు. మీరు దాన్ని చూడలేక పోవచ్చు. కాని మన కర్తవ్యం మనం నిర్వహించాలి." తను నిరాశాజనకంగా మాట్లాడుతున్నానని గ్రహించి, యింకా చైనా భవిష్యత్తు మీ భుజస్కంధాలమీద నిలచిఉంది. దిగ్విజ సాగండి" అంటూ తన కుమారునికేసి తిరిగి" మీరు మా వంటి వృద్ధుల సహకారాన్ని గూడా పొందితే మీరింకా విజయ యంగా ముందుకువంతంగా సాగవచ్చు. మరీ గర్వంతో ఉండ కండి. మీపై నిజమైన ఆదరాభిమానాలుగల పెద్దలు లేకపో లేదు. మిమ్మల్ని తమ స్వప్రయోజనాలకు పెట్టుబడిగా వినియో గించుకునే రాజకీయనాయకులు లేకపోలేదు. కాని యింకా వారి ఆటలు సాగుతాయనుకోను" అన్నాడు.

ఆ యింటిదగ్గరనుంచి బస్సుస్టాప్ దగ్గరకువస్తూ, కొత్తగ నిర్మింపబడుతున్న ఒక ఇంటిప్రక్కనుంచి వస్తున్నాను. ఒకచిన్న మట్టిముద్దవచ్చి నాకాళ్ళముందువడింది. తలయెత్తి చూశాను. కూలీలు పనిచేస్తున్నారు. మరో రోజైతే, ఎటువంటి శ్రద్ధా లేకుండా ఆ నూతనభవనాన్ని అధిగమించిపోయేదాన్ని. కాని ఇప్పుడు మాగురించి, మేం నిర్మించుకోవలసిన ఇంటినిగురించీ ఆలోచన నాలో రేకెత్తింది. అది నిర్మించటానికి మంచిపథ

కాలు, గొప్పసహాయము కావాలి. అది పూర్తయిన తరువాత, అందులో నివసించే అవకాశాలు మాకు లేవు. కాని అందుకు ప్రయత్నించటంకంటె మేం చేయగలిగిందేమీలేదు. ఈ బస్ట్రాప్ పెకింగ్‌కు చాలాదూరంలో ఉంది. నాలుగేళ్ళ క్రితం అక్కడ డార్మిటరీ దగ్గర, పెకింగ్‌కు విమోచనం కలిగించే కమ్యూనిస్టులకోసం నిరీక్షిస్తూ కూర్చున్నాం. ఇప్పుడు ఈ అరణ్యవాసంలో, హాంకాంగ్‌లో నిజపరిస్థితుల్ని తెలిసుకొని వున్నాం. కమ్యూనిస్టుల బారినుంచి బయటపడ్డ పెద్దలు తమ ఆశలను వదులుకున్నారు. అమెరికాగాని యూరప్ గాని వెళ్ళి, పరిస్థితులు మార్పుచెందే రోజుకోసం నిరీక్షించటం కన్నా వారు చేయగలిగిందేమీలేదు. కాని మేం అలా దూర తీరాలకు తరలిపోదల్చుకోలేదు. మా జీవితభవితవ్యాలకు మా మాతృదేశమే దేవాలయంకావాలి. అందుకే కమ్యూనిస్టుల విప్లవానికి దూరంగా పారిపోదల్చుకోలేదు. దాని స్వరూపం తెలుసుకోవాలని అక్కడ నిరీక్షించాము. దాన్ని తెలిసికొన్నాము. మేం మోసపోయామని గ్రహించాము. వంచన ప్రాయమైన కపటమైన ఆదర్శాలతో నమ్మించారు. కాని మాకు మరొకవిషయంకూడా తెలుసు. 'మమ్మల్ని వారు మళ్ళీ మోసగించటం కష్టసాధ్యమైన విషయం.'